# మగువ మనసు

[నవల]



రచన:

ధనికొండ హనుమంతరావు



ప్రచురణ:

జ్యోతి కార్యాలయం

మద్రాసు—17.

అన్యాయంచేశాడో, ఆ చిట్టిహృదయాన్ని అర్థంచేసుకోలేక, ఆమెకు సానుభూతి చూపక టలాయించి ఎంత ద్రోహంచేశాడో అర్థమైంది.

ఆమె తల్లికి తను వాగ్దానంచేశాడు—తను బతికివున్నంతకాలమూ యీ పాపకు ఏలోటూరానివ్వనని. పవిత్రమైన ఆ వాగ్దానాన్ని అతిక్రమించాలనే వాంఛ కానీ, నిర్లక్ష్యంచేయాలనే ప్రయత్నంకానీ తనలో ఎన్నడూ కలగలేదు. కాని తనకు తెలియకుండానే ఆవాగ్దానం తాలూకు మాటలు గాలిలో కలిసిపోతూన్న సంగతి ఇప్పుడే గ్రహించాడు.

తను అనుకునేవాడు: తనకు కావలసినంతవుంది. యీ చిన్నవిషయాల్లో తను తలబద్దలు కొట్టుకోనక్కర్లేదు. ఆమెనుదయగా-కాదు, తమయజమాని తాలూకు బిడ్డగానే గౌరవంగాచూస్తూ, అనుగులకు మడుగులొత్తేవాళ్లను నియమించటంలో తన బాధ్యత తీరిందనుకున్నాడు. కాని తీరాచూస్తే డబ్బుతో కొనగలిగేవాటి సంగతి అటుంచి, హృదయమిచ్చి ఆపాపను పలకరించేవాళ్లు కూడా యీ ఇంట్లో లేరన్న సత్యం తనకు సాక్షాత్కరించింది. దీనికి ఒకర్నని లాభంలేదు; దీని బాధ్య తంతా తనదే!

తనెప్పుడో ఇంటికి వొస్తాడు. రాగానే జయను పలకరిస్తాడు: ఒక వేళ తానామెసంగతి మరిచిపోతే నవ్వుతూ 'నాన్నా.' అని ఆమే పలకరిస్తుంది. దయగా, జాలిగా ఆమెబుగ్గగిల్లి ఏవో ఒకటిరెండు ప్రశ్నలడుగుతాడు. వాటి జవాబుల్ని గూర్చి ఏనాడు తను ఆలోచించలేదు; అసలు విన్నట్లుగా నటిస్తాడేకాని వినడు. ఆమె మరేమీఅనదు; నిష్కల్మషహృదయంతో తండ్రి తనను పలకరించాడనే తృప్తితోవుంటుంది. నిజంగా తనుచేసిన ద్రోహానికి ఆమె ఇన్నాళ్లూ క్షమించగలుగుతూనేవుందన్నమాట! ఆక్షమ రోజురోజుకూ పేరుకొని ఒక్కసారిగా పర్వత ప్రమాణంగా మారేప్పటికి దాన్ని భరించలేని అశక్తతను ఎదురొక్కవాల్సివొచ్చింది.

అసలే తల్లిలేనిబిడ్డ; దీన్ని తానే తల్లిగా, తండ్రిగా కంటికి రెప్పవలె కాపాడి ఉండాల్సింది. తాను కాపాడుకున్నవిధానం ఎంత నిస్సారమైనదో, నిరర్థకమైనదో, ఏదో మొక్కుతీర్చుకుంటున్నట్లు ఎంత యాంత్రికంగా సంవత్సరంపాటు జరిగిందో యీనాటిదృశ్యం ఒక్కసారిగా విప్పిచెప్పింది. తనక్రూరత, ఏపాపమూ ఎరుగని అమాయకురాలిపట్ల తాను చూపిన నిర్లక్ష్యత అతని మనస్సును కలిచివేసినవి.

ఒక్కసారిగా సానుభూతి, దయ, జాలి మొదలైనవన్నీ అతన్ని ముంచివేసినవి. ఆపిల్లకు అర్థంకాదు కాని, లేకుంటే వెంటనే దాని కాళ్లమీదపడి, కన్నీటితో, పశ్చాత్తాపంతో దాని పాదాల్ని కడిగి, క్షమాభిక్ష వేడుకున్నప్పటికీ, అది తనకు తృప్తినివ్వదు. కాని, ఆ దైవస్వరూపిణిని మోసపుచ్చేందుకు, లేదా కనీసం ఆమెను తృప్తిపరిచేందుకు ఇంత హంగామా అక్కర్లేదు. ఒక్కతియ్యని పలకరింపుకే ఆమె పులకరిస్తుంది. జాచినచేతుల్ని తాకుతే, తనను ఎత్తుకొని ప్రపంచమంతా తిప్పి

నంతగా ఆనందిస్తుంది. ఒక్కసారి ముద్దుపెట్టుకుంటే తన ఆత్మబంధువుల సేవలన్నీ తనవిగానే భావించగలుగుతుంది...

ఇన్నాళ్ళుగా పేరుకొన్న తనలోని రాక్షసత్వాన్ని విసిరివేయటం, మానవత్వాన్ని పునరుద్ధరించటం ఒక్కసారే జరిగాయి. రోజుల తరబడిగా బాకీపడిన ప్రేమ ఒక ప్రవాహమై పారేందుకు సిద్ధంగావుంది. ఒకమానవహృదయం భరించలేనంత ఆత్మీయతతో రాజారావు వొణికిపొయ్యాడు.

ఒకపక్క తనను తాను సంబాళించుకుంటూ, మరోపక్క తడైన కళ్లను అదుపులోకి తెచ్చుకునే వ్యర్థప్రయత్నంచేస్తూ, దారి సరిగా కనిపించకున్నా లెక్కచేయకుండానే జయవైపు పరుగెత్తాడు.

ఆమె తండ్రిని గమనించలేదు. మట్టిబొమ్మలకు ప్రాణాన్నిచ్చే ప్రయత్నంలో వుంది. రాజారావు మోకాళ్లమీద వొంగి "తల్లీ!" అన్నాడు దీనాతిదీనంగా.

ఆమె ఆశ్చర్యంతో రాజారావు వొంకచూసింది. అతని పరిస్థితికి వెంటనే జాలిపడింది. "నాన్నా!..." అంది. రాజారావు ఎంతో ఆపేక్షతో చేతులు జాపాడు. ప్రాణసమానమైన బొమ్మల్ని విడనాడి, జయ అతని చేతుల్లోకి వొచ్చింది.

"నాన్నా!...ఏడుస్తున్నావా?" అందామె, తన గౌనుతో అతని కళ్లు తుడుస్తూ.

జాలిచూపేందుకు వొచ్చి, ఆ జాలినే పొందాడు తను. ఇది అపజయమైనప్పటికీ, ఇప్పటికే అలివితప్పిన అతని శక్తులన్నీ మరింత కుంగిపోయినవి.

తనేమన్నా కష్టంకలిగించానేమోననే బాధతో జయ మళ్ళీ తన బొమ్మల దగ్గిరికే వెళ్లేప్రయత్నంలో వుంది. తనను విసిరి, కసరకపోయినప్పటికీ, ఒక్కసారే పలకరించే అలవాటున్న తండ్రినుంచి ఆమె చిన్ని హృదయం వేరేమీ ఆశించలేదు; ఆశించదగింది వున్నదనే జ్ఞానమన్నా ఆమెకులేదు. ఇంతేకాబోలుననే ధోరణిలో యీ రకం ప్రవర్తనకే ఆమె చాలా రోజులుగా అలవాటైంది. అందుకనే ఆమె రాజారావును ఎన్నడూ వేధించలేదు. ఎవరి లోకాల్లో వారు విహరిస్తూ ఎప్పుడో, ఎక్కడో అకాత్తుగా కలుసుకొని నిర్లక్ష్యంగా 'ఓహో,' అంటే 'ఓహో' అన్నధోరణిలో పలకరించుకోటం మాత్రమే ఆమెకు తెలుసు.

కాని యీనాటి రాజారావు అవతారమే మారింది. అదిరాక్షసత్వపు హద్దుల్ని దాటి, మానవత్వానికి రావటమేకాదు; దైవత్వానికి వాయువేగమనోవేగాల్తో ప్రయాణాన్ని సాగిస్తోంది. ఆసంగతి జయకు ఎలాతెలుస్తుంది? ఎలాతెలియచెప్పాలి?

తనచేతుల్లోనుంచి తప్పించుకునేందుకు వీల్లేకుండా జయను దగ్గిరికి లాక్కున్నాడు. అపిల్ల ఒకపక్క ఆశ్చర్యపడింది; మరోపక్క ఎన్నాళ్లనుంచో తనకు

తెలియనిలోటును యీక్షణంలో తెలుసుకోవటమూ, వెనువెంటనే దాన్ని పొంద టమూ జరిగినంత ఆనందంతో పరవశత్వాన్ని పొందింది.

"నాన్నా!...నాన్నా!" అంటూనే రాజారావు కౌగలిలో కరిగిపోయింది.

ఎంతతేలిగ్గా క్షమించింది తనను! యీదయామయి, ధర్మదేవత తనకు నిజంగా ఇలవేల్పు!

"తల్లీ!...తల్లీ!" అంటూనే దాన్ని ఎత్తుకున్నాడు.

యావత్ప్రపంచమూ తన కాళ్లముందు మోకరించినంత గర్వంగా, జీవి తంలో మరికోరదగినదే లేదన్నంత తృప్తిగా, గోముగా అతని భుజాలమీద వాలిం దామె. ఎన్నడూ ఎత్తుకొని తిప్పని రాజారావు యీనాడు యీమెను కాలుకింద పెట్ట నీకుండానే మేడమీదికి ఎత్తుకొనివెళ్లాడు.

"జయా," అన్నాడు మెల్లిగా.

"ఆఁ." అందామె; దాని కంఠస్వరంలోకూడ చెప్పలేని బాధలు గంతులు వేస్తూ, ఏడిపించేందుకు సిద్ధింగావున్నవి.

"ఆడుకుంటావా?"

"ఉహుఁ...నాన్నా! అమ్మసంగతి ఏమన్నా తెలిసిందా?"

అమ్మసంగతి అర్థమయేటట్లుగా ఆమెకు చేప్పేశక్తిలేదు—సుప్రసిద్ధకథకుడు రాజారావుకు! ఎన్నోపాత్రల్ని సృష్టించిన తను, వాటి మనస్తత్వాల తాలూకు కళ్లాల్నిపట్టుకొని 'భేష్! భేష్!' అనేట్లు నడిపించగలిగిన తను, సంభాషణాల్ని అతి సహజంగా, తేలిగ్గా, హాయిగా రాయగలిగినతను, యీక్షణంలో యీ బాలిక దగ్గిర ఒక నిస్సహాయస్థితిలోపడ్డాడు; తన సంభాషణనే సాగించలేని అసమర్థతతో తను చెప్పదలుచుకున్న దానికి మాటలే కరువైన కొట్టుమిట్టా డాల్సివొచ్చింది.

అమ్మ! ఏమని చెప్పగలడామె సంగతి?

"వొస్తుందిలేతల్లీ! నేను ఉన్నానుగా! మనిద్దరం ఆడుకుందామా?"

"ఉహుఁ. వొద్దు...మరి..." ఆతరువాత ఏం చెప్పదల్చుకుందో తెలియ లేదు. మళ్ళీకదలిస్తే అమ్మసంగతి ఎత్తుకుంటేమోననే భయంతో రాజారావు ఆమెను అలాగే ఎత్తుకొని తిప్పసాగాడు. అతనిస్థితిని చూసిన సేవకుడొచ్చి, పిల్లనివ్వ మన్నట్లుగా చేతులు జాపాడు; కాని రాజారావు తీక్షణంగా, అసహ్యంగా, కోపంగా చూడటంవల్ల సేవకుడు వెంటనే నిష్క్రమించాడు.

అలాగే ఆమెను ఎత్తుకొని తిప్పుతున్నాడు; యీతిప్పటం కేవలం తన విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చటమేకాని వేరొకటి కాదనిపించింది; ఋణబాధలాటిది తీరు తున్నప్పుడు కలిగే ఆనందంలాటిది అతని మనోభారాన్ని తగ్గించసాగింది.

పదినిమిషాల్లోనే పిల్ల చేతిపట్టుతప్పింది. బహుశా నిద్రపోయివుంటుంది. తన భుజంమీద దానికంత సుఖంగావుండదు. మెల్లిగా తనమంచం దగ్గిరికి తీసికొని వెళ్లి పడుకోబెట్టాడు.

నిజంగానే ఆమె నిద్రపోతోంది. ఎంత తేలిగ్గా హాయిగా తన చరిత్రను, సమస్యల్ని మరిచిపోగలిగిందీమె! నిద్రిస్తూన్నా, చిరునవ్వు చిందులాడే పెదాలు, ఇప్పుడే వికసించిన తామరపువులాటిముఖంమీద, తుమ్మెదలల్లే వాలిన ముంగురులు, బహుశా మధురస్వప్నంతాలూకు అనుభూతిని ప్రకటించే కనురెప్పల దగ్గరిచెమ్మ, ఇవన్నీ చూస్తూంటే రాజారావుకు ఇన్నాళ్లు గమనించని ఇలవేల్పుల్ని ఇప్పుడే చూసినట్లయింది.

ఐతే ఇన్నాళ్ళూ యీమెను తనెందుకు నిర్లక్ష్యంచేశాడు? అనాకారనా? కాదు...అచ్ఛగా ఆమెతల్లిపోలిక! ఐనా ఆకారానికి యీ బాలిక బాధ్యతఏమిటి? అనాథనా? నిజంగా అనాథే కనుక యీమెపట్ల ఇంకెంతో జాలి చూపిఉండవలసింది; ఆ జాలిని చూపేందుకు తను డబ్బు ఖర్చుపెట్టటం మినహాగా మరేమీ చేయలేదు...ఒక్కనాడన్నా ఆమెతో ఆడుకున్నాడా? మనసారా మాట్లాడాడా? యీనాడు మాట్లాడితే, ఆమె 'నాన్నా!' అని పిలుస్తే, ఆ మాధుర్యం, సంగీతం తన హృదయపు లోతుల్లో సుడిగుండాల్ని తిప్పింది. చిన్నపిల్లల మాటల్ని వినని బడుద్ధాయి ఎవడో సంగీతం కర్ణోపేతమైనదని అని వుంటాడనిపించింది. ఆ మాటల్లోని అమాయకత్వంలోనే కవిత్వంవుంది; కంఠస్వరంలోనే నాదబ్రహ్మలు ఇమిడివున్నారు' సంగీత సాహిత్యాల మేళవింపు ప్రపంచంలో చిన్నారి పొన్నారులు మాటల్లోతప్ప ఇంకెక్కడో వున్నదనుకోవటం, అన్వేషించటం, ఉయ్యాల్లోవున్న బిడ్డకోసం వూరంతా వెతకటంగాక మరేమిటి?

మరి ఇలాటి జయనుగూర్చి తానెన్నడూ ఎందుకు ఆలోచించలేదు? ఇప్పుడు ఆలోచిస్తే, తానుచూపిన నిర్దయకు కారకురాలు యీమె తల్లేనేమోననిపిస్తోంది. ఒకవేళ యీమెతల్లి కారకురాలైనప్పటికీ, ఆ తల్లికి కూతురైన యీబిడ్డపట్ల నిరాదరణకు, అర్థమున్నదా? తల్లిచేసిన తప్పుకు యీమెకా శిక్ష?

'ఛీ-ఛీ! ఎంతమూర్ఖుణ్ని! పాఠకులకు నీతులుచెపుతూ, వాళ్లలో పరివర్తన తేగలిగే రచనలు సాగించిననేనే యీ చీకట్లో పడ్డానంటే హాస్యాస్పదం! ఐందేమోఐంది- యీ క్షణంనుంచన్నా, యీ బిడ్డకు అర్హతవున్న నా ఆపేక్షను హృదయపూర్వకంగా అర్పిస్తాను. ఇది మానవధర్మంగా, మృత్యుశయ్య పక్కనే మోకరించి, ఆత్మసాక్షిగా ఆమె తల్లికిచేసిన ప్రమాణాన్ని అతిక్రమించకుండా, నాకు నేనుగా పతనం కాకుండా వుండేందుకు ఇప్పుడే దీక్ష పూనుతున్నాను" అనుకున్నాడు మనస్సాక్షితో.

బిడ్డల్ని పెంచటంలో తనకు నేర్పరితనంలేదు; అసలు పిల్లలంటేనే చీద

రించుకునే స్వభావం తనది. ఐతేనేం, బిడ్డల్ని కన్నవారందరికీ, వారిని పెంచే నేర్పరితనాన్ని, ఆబిడ్డలే అలవరిచారుకదా! బిడ్డలు తను అధికారాల్ని, తమ హక్కుల్ని ఏడ్చి, ముద్దుగా తీర్చుకుంటునే వున్నారుకదా! కాని యీబిడ్డ ఆముద్దు ముచ్చట్లనుకానీ, హక్కుల్ని, అధికారాల్నికానీ ఎన్నడూ తలిచివుండలేను. కొంత వరకూ ఆతల్లేకారణం! మిగతాది తను!

తనబాధ్యత యీనాడు రెండింతలు తానుతండ్రిగానే కాకుండా, తల్లిగా కూడా యీమెను ఆదరించాలి. దానికి బాధ నికి? అది కష్టసాధ్య మనిపించేందుకు వీల్లేదు. జన్మలోచేయవలసిన పనుల్ని చేసేందుకు బద్ధకించేవాడు జన్మకేఅర్హుడుకాదని తనకు తెలుసు. ఇక మిగిలిందల్లా యీబిడ్డసేవచేసుకుంటూ, అది నవ్వితే, ఆనందిస్తే యీప్రపంచలో తనకూ-డా కొంతనవ్వూ, ఆనందమూ మిగిలివున్నవని తెలుసుకో గలుగుతాడు. అంటే యీబిడ్డే దయదలచి, తనకు కొంత ఆనందాన్ని పంచి ఇవ్వ గలదు...ఇన్నాళ్లూ నిరాదరించి నందుకు యీబాలిక చూపే కృతజ్ఞతన్నమాట!

## 2

రాజారావు దీర్ఘాలోచనలో పడ్డాడు. జయ ఇంట్లో ఎలా బతుకుతోంది? ఏదో చిత్రమైన లోకంలోని విచిత్రవ్యక్తులమధ్య కాలం వెళ్ళబుచ్చుటమేనా—లేక, ఆనందంగా అందరిపిల్లల్లాగే హాయిగా వుంటుందో తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది.

గదిలోనుంచి బైటికివొచ్చి ఆ జయ సంరక్షణా బాధ్యతల్ని అప్పగించిన ఆయాను పిలిపించాడు.

"ఆపిల్ల సంగతి మీ ఎవరికీ పట్టలేదు. మీజీతాలు మీకు సక్రమంగా ముట్టు తున్నప్పటికీ, దానిపెంపకంలో ఏలాటిశ్రద్ధా వుండటంలేదు...ఏమంటావ్?" అన్నాడు.

"మేము సాయశక్తులా ప్రయత్నించాం బాబుగారూ! నేనూ పిల్లలుగలదాన్ని; పిల్లల్ని పెంచడమంటే ఏమిటో నాకు తెలియకపోలేదు...కాని యీపిల్ల ఒక పెద్దసమస్య!" అందాముసలిది.

సమస్య! యీమె అందరిపిల్లల్లాటిది కాదనే ధ్వనించిది. ఎందుకుకాదు? ఎట్లాకాదు?

"ఏం అల్లరి చేస్తుందా?" అన్నాడు.

"అల్లరిచేస్తే అందరిపిల్లల్లాటిదే అయేది. అది పిల్లల ఆరోగ్యలక్షణం కూడాను"

"మరి?"

"ఏం చెప్పమంటారు? ఎలాచెప్పేది? ఆమె ఎవరితోనూ మాట్లాడదు. ఆమెకు ఏంకావాలో తెలుసుకోగలిగేందుకు మానవమాత్రులకు శక్తిచాలదు. చివరకు సకాలంలో భోజనం రాకున్నప్పటికీ ఆమె పట్టించుకోదు; తన ఆకలి కూడా తెలుసుకోలేనంత దీనంగావుంటుంది—"

"అలాటి దీనురాల్ని నిర్లక్ష్యం చేస్తున్నారన్నమాట?" అన్నాడు రాజా రావు "పిల్లలపట్ల చూపవలసిన సానుభూతిని గూర్చికూడా ఆలోచించకుండా, ఆమె బాధల్ని ఆమెకు వొదిలేశారన్నమాట...అర్థమైంది!"

"కాదు...కాదు..." అందా ముసలిది "ఎంతబతిమాలినా, భంగపడినా ఆమె మొండికేస్తుంది; జవాబన్నా చెప్పదు. మనసులోని మాటచెప్పలేని అశక్తతతో బాధపడుతుంది. ఇక మనకు మనం వూహించి ఏమైనాచెయ్యాల్సిందే!

"అంటే అమాగదాన్ని విధికి వొదిలేశారు."

"నేనంత కఠినురాలిననుకుంటున్నారా—బాబుగారూ! పిల్లలంటే నాకు ప్రాణం! వాళ్లతో ఆడుకుంటూ ఎన్నాళ్లన్నా హాయిగా గడపగలను. అలాటి నాకు యీమె ఒక కొరకరాని కొయ్య ఐంది!..."

రాజారావు అడ్డు తగలాలనుకున్నాడు. కాని ఆయా చెప్పుకుపోసాగింది: "మీకు అనేక ఉదాహరణలు చెప్పగలను. రాత్రి మీరురావటం ఆలస్యమైతే భోంచెయ్యదు. మీతోపాటే తినాలని ఆమెపట్టుదల. ఆమెకు ఆకలైనప్పటికీ దాన్ని భరిస్తుంది; ఎంతబతిమాలినా మాటవినదు. చివరకు అలాగే పడినిద్రపోతుంది—తీరా మీరువొచ్చాక, భోజనానికి లేపుతే, లేవదు. ఏడుస్తుంది... తెల్లారాక..."

"నాకోసమే దాన్ని పస్తులకూడా అలవాటు చేశారన్నమాట?... యీ విషయాలు నాతో ఇదివరకే ఎందుకుచెప్పలేదు?" అన్నాడు కోపంతో.

"చెప్పేందుకు అవకాశం కలగలేదు. మీరెప్పుడూ పనితొందరలో వుంటా రాయె! తీరిగ్గావున్నట్లు కనిపించనందువల్ల చెప్పలేకపోయ్యాను. ఐనా ఆమె బాధ్యత తీసుకున్నాక, ఆమెననుగూర్చిన ఫిర్యాదులు మీతో చెప్పటం భావ్యం కాదనుకున్నాను. ఏదోవిధంగా సర్దుకుపోవాల్సిందే కాని ఎవరూ దీనికి విరుగుడు చెప్పలేరు..."

రాజారావు మండిపడ్డాడు. ఒకకొత్త సత్యాన్ని తెలుసుకొని, దాన్నిగూర్చిన బాధతో ఉక్కిరిబిక్కిరవుతున్నాడు. ఆయా మాట్లాడేదాంట్లో అర్థమేలేదనిపించింది. ఏవో కుంటి, గుడ్డి సాకులు చెపుతోంది. ఏమైతేనేం దీనికంతకూ తనేకారకుడు! ఆయామీద చాలా అసహ్యం కలిగింది.

"ఛీ...ఛీ... ముందు నాఎదుటినుంచివెళ్లు. చేసిన అన్యాయానికి, అక్ర

మానికి ఒకమూలకూర్చొని పశ్చాత్తాపపడు; ఏడ్చిఏడ్చి నిష్కల్మష హృదయంతో తప్పుమళ్ళీనాఎదుట పడొద్దు" అన్నాడు.

ఆమె మాట్లాడబోయింది.

"బుద్ధిలేదానీకు ? వెళ్లమంటే ఇంకా సైతాన్‌వలె నాఎదుట వేళ్లాడుతావ్ దేనికి ?" అని కసిరాడు. యజమాని అంతకటువుగా మాట్లాడగలుగుతాడని ఆమె ఎన్నడూ వూహించలేదు. ఇక యీ పరిస్థితుల్లో తను తప్పుకోవటమే మంచిదని నిశ్చయించింది.

యీచిన్నారి తనకొరకు కనిపెట్టుకొనివుండి, భోజనంకూడామాని, తనపట్ల చూపిన ఆపేక్షలకు, గౌరవానికి ప్రతిఫలంగా తానేమిచ్చాడు ? దానితల్లే బతికి వున్నట్లయితే యీపిల్ల ఎంతహాయిగా వుండేది ! దానిసంగతి పట్టించుకునే వాళ్లు లేనందువల్ల, ఆమె హృదంతరాళంలో ఏర్పడిన నిరాశ, ఆమెను ఎంతకుంగదీసి, దీనాతిదీనంగా తయారుచేసిందో, ఎంత అమాయకంగా అనవసరపు బాధల్నికోరి వరిస్తోందో బాగా అర్థమైంది.

ఆమె అనాథ ! తనుకూడా ఒక అనాథే ! ఆమెకు యీప్రపంచంలో ఎవ్వరూలేరు; ఏదీ తనదికాదు; ఎవరైనా దయదలచి ఆదరిస్తేసరి; లేకుంటే అవిచారంకూడా కలగనిస్థితికి ఇంత చిన్నవయస్సులోనే అలవడింది. తనుఅంతే ! అలాటి ఇద్దరు అనాథలు, ఒకరిపట్ల వేరొకరు చూపుకోవాల్సిన అనురాగాన్ని విస్మరించి ఎవరి లోకాల్లో వారే కుంగిపోతున్నారు. తన ఏకాకితనాన్ని అర్థం చేసుకోగలడు; కాని ఎదుటివ్యక్తి ఒంటరిపాటును గూర్చి క్షణమైనా ఆలోచించిన పాపానపోలేదు. నిజానికి తనకన్న నిశితంగా, స్పష్టంగా జయను అర్థంచేసుకో గలిగిన వ్యక్తులు యీప్రపంచంలో ఉండేందుకుల్లేదు; ఎందుకంటే తనకుజీవితంలో ఏ ఆత్మీయత చిక్కకుండా, ఏ ఆధారమూలేకుండానే జీవితప్రవాహంలో కొట్టుకొని పోతూ బాధపడుతున్నాడో, దాన్నిభరించటం ఎంతకష్టమో, ఎంతవ్యధాభరితమో తెలిసివుండికూడా, అలాటిపరిస్థితుల్లో నేవున్న వేరొక పసిహృదయాన్ని తాను చూడలేకపోవటం అంధత్వంగాక మరేమిటి ? తాను ఆమెపట్ల విధిగా చూపవలసిన సానుభూతిని విస్మరించటమంటే, తనకు తానే సానుభూతి చూపలేకుండటంగాక మరేమిటి ? మానవరూపంలోనే తాను మానవత్వాన్ని విడనాడి, స్వజాతివ్యక్తినే భక్షించటం తనకు తెలియకుండానే ఇన్నాళ్లూజరిగింది. ఇంతకన్నఘోర తమ నేరాన్ని తానింతకుముందు ఊహించలేకుకూడాను.

బహుశా ఆమెకూ తెలుసేమో—తనను 'నాన్నా !' అని పిలిచినప్పటికీ, ఆమాటలు హృదయపులోతుల్లోవి కావు; నాలుకచివరనుంచే వెలువడుతున్నవని. తనకు ఆత్మీయుడుగా సంబోధించినప్పటికీ, ఆ ఆత్మీయత ఏ కదలికలోనూ కనిపించ నందువల్ల, ఇదికేవలం కృత్రిమమైనదనే తెలుసుకొని, అంతవరకే దక్కుదలనే

తృప్తిని పొందుతోందా ? ఇదే నిజమైతే గాయపడిన ఆమె చిన్నారి హృదయానికి తను జీవితాంతమూ అంకితుడైనా, ఆ అపచారం తీరదు.

ఇవాళ ఆత్మపరీక్ష చేసుకుంటూంటేనే కాని యీసత్యాలన్నీ బైటపడ లేదు. ఆయీను నిందించిలాభంలేదు; ఇదివరకు ఏనాడన్నా తనంతటతాను కను క్కున్నాడు కనుకనా? ఇక అనాధను పెంచటంమాటకొస్తే ఇవాళ తనున్నస్థితిలో ఇలాటి అనాధనలను వందమందినన్నా తేలిగ్గా పోషించగలడు; ఏ అనాధశరణా లయానికి చందాఇచ్చినా వాళ్లే తనకు తృప్తికరంగా పెంచేవాళ్లు. కాని యీమెను కన్నకూతురల్లే పెంచుతానని వాగ్దానంచేసిన ఘట్టానికి సరైనవిలువ, ఆమాటల నిజమైన అర్థం ఎలాఉండాలో అతనిమనసులో ఒక విశిష్టరూపం ఏర్పడసాగింది.

ఇంకొనయం—ఇవాళ ప్రమాదవశాత్తూ బిడ్డనుచూశాడు కనుక, యీమెను గూర్చి దీర్ఘంగా, నిశితంగా, విమర్శనా పూర్వకంగా ఆలోచించగలిగాడు కనుక, ఇదంతా బైటపడింది. అలాకాకుండా ఇదివరకల్లేనే మరికొన్నినెలలు గడిచినట్లయితే జయ నిజంగానే మూగదయ్యేది. తనుజీవితంలో తిరిగి బాగుచేయలేనంతగా, ఆమె సున్నితహృదయంలో మానని గాయాన్ని కలిగించి ఉండేవాడు.

ఇక జరగవలసిందికూడా ఆలోచించేందుకు ఎక్కువశ్రమ అక్కర్లేదు. ముందునడవవలసినదారి స్పష్టంగా కనిపిస్తూనేవుంది. మాటల్లోనేకాకుండా చేతల్లో కూడా ఆమెకు తాను కంటికి రెప్పవలెనే ఉండాలి. తనకు ఆమెగా, ఆమెకు తానుగానే ప్రవర్తించాలి. ఇందువల్ల తను సుఖపడి, ఆమెను సుఖపెట్టగలుగుతాడు. నిజంగానే తనకొక తోడునీడ, తననుగూర్చి హృదయపూర్వకంగా సానుభూతి చూప గలిగే ఒకప్రాణిని గుర్తించినట్టవుతుంది. అందుకనే యీక్షణంనుంచే తనను తాను ఆత్మసహితంగా ఆమెకు అర్పించుకునేందుకు నిర్ణయించుకున్నాడు.

ఆమెకు ఎప్పుడు మెలకువవొస్తుందోనని, ఆమె సేవకు కాచుకొని అపక్కనే కూర్చున్నాడు. ఆమె ముఖంచూస్తూంటే యీనాడు మధురస్వప్నాల్ని అనుభ విస్తోందా అనిపించింది. ఇదంతా తానుచూపిన అనురాగఫలితమే ఐవుండాలి. ఇక తాను చూపబోయ్యే అనురాగాన్ని భరించేందుకు ఆమె సంసిద్ధనుచూపాలి; ఆమె సంగతి ఎలావున్నప్పటికీ, తానుమాత్రం హృదయంలో ఆకరుణను మరి దాయ లేడు...అంతే !

పసివాళ్లతో ఆడుకుంటూ, తానుకూడా ఆ చిన్నవయస్సుకు రాగలుగుతే, ప్రపంచంలో తనకొరకు ఆనందమే లేదనుకోవటం ఒక మిథ్యగానే పరిణమించ వొచ్చు. కళ్లఎదుట యీ ఆనందమయిని వుంచుకొని కూడా తాను ఎంతకాలం వృథాగా గడుపుతూ బాధపడుతున్నాడో అర్థమైంది.

గొప్ప అదృష్టానికి ఎదురుచూస్తూ స్వాగతమిచ్చేందుకు సిద్ధంగావున్న నిర్భాగ్యునివలె, రాజారావు ఆమె మేల్కోవటానికి ఎదురుచూడసాగాడు. దాదాపు గంటదాటాక ఆమె అటూ ఇటూ కదిలింది. మెలుకూరాగానే ఎత్తుకునేందుకు సిద్ధంగా వున్నట్లు రాజారావు ఆమెమీదకి చేతులు జాపివుంచాడు.

ఆమె మెల్లిగా కళ్లు తెరిచింది. యెదురుగుండా తనను ఆహ్వానిస్తూన్న చేతుల్లోకి కరిగిపోయింది. ఇంతవరకూ రాజారావు హృదయంలో జరుగుతున్న సంఘర్షణా, పరిణామాలూ, నిశ్చయాలూ, మొదలైనవన్నీ తనకు అర్థమైనట్లే, యీకొత్తవాతావరణం తను ఏనాడో ఊహించిందే ఐనట్లుగా ఆమె నవ్వింది. ఆమెకు అర్థమయేట్లు చెప్పవలసిన శ్రమకూడా లేకపోవటం రాజారావుకు యెంతో రిలీఫ్‌గావుంది.

ఆమెను యెత్తుకున్నాడు; ముద్దుగా తల నిమిరాడు; గోముగా బుగ్గగిల్లాడు, నవ్వులో కిలకిలమన్నదా చిన్నతల్లి! సుఖనిద్రనుంచి పూర్తిగా మేల్కొన్నప్పటికీ, బరువుగా కనురెప్పల్ని తెరిచి, 'నాన్నా!' అంది.

'ఏం తల్లీ?'

ఏదో చెప్పాలనుకుందికాని, చెప్పలేకపోయింది. యీమె తత్వం ఏవిధంగా మారివుంటుందో ఆయానుంచి తెలుసుకున్నాడు. అందుకని పిల్లలుకోరదగినవన్నీ తనేఅడుగుతూ, ఆమెకు కావాల్సింది మిటో కనుక్కొని సంతోషపెట్టాల్సిన బాధ్యత గుర్తొచ్చింది.

'జయా! మనం బొమ్మలు తెచ్చుకుందామా?' అన్నాడు.

'చెట్టుకింద వున్నయ్‌గా!'

'అబ్బే! అవి కాదు. వాటిని ముట్టుకుంటే మురికి అవుతుంది...అందుకని మంచి బొమ్మలు, ఆడేబొమ్మలు, గంతులేసే బొమ్మలు తెద్దాం'

'ఇప్పుడా?'

'ఇప్పుడే!'

జయ సంతోషానికి మేరలేదు. నాన్న ఇంత దయగా వుంటాడని ఆమె యెన్నడూ అనుకోలేదు. ఆమె ఆనందాన్ని బాహువుల్లో ఇముడ్చుకోలేక, తప్పనిసరిగా రాజారావు ఆమెను కిందికి దించవలసి వొచ్చింది. ఆమె దాదాపు నాట్యం చేసి తన ఆనందాన్ని ప్రకటించింది.

'చూడుతల్లీ! ఆయా దగ్గిరికి వెళ్ళి, జడవేయించుకొని, నీళ్లుపోసుకొని, కొత్తగౌను తొడుక్కొనిరా...మనం బజారు వెళ్దాం!'

'బజార్లో ఏముంటయ్ నాన్నా?'

'చూస్తావుగా...అన్నీ వుంటయ్. నీకు కావలసినవన్నీ కొనితెచ్చుకుం దాం...'

ఏమీ ప్రశ్నించకుండానే ఆమె ఆయాను వెతికేందుకు పరుగెత్తింది. 'ఎంత అల్పసంతోషి! ఆమె ఆధిక్యం, నా అల్పత్వం ఇప్పుడే అర్థమైంది!' అను కున్నాడు, రాజారావు.

## 3

మరో గంట గడిచేప్పటికి రాజారావు జయ చెయ్యిపట్టుకొని మూర్ మార్కెట్ లోని బొమ్మల కొట్టుదగ్గిరికి చేరాడు. అన్ని బొమ్మలు అసలీ ప్రపంచంలో వుంట య్యనే ఆ చిట్టి పాపఎన్నడూ తలచలేదు. ఎప్పుడన్నా కలలో తల్లికనిపించి ఒకటి రెండు తాటాకు బొమ్మలో, కొబ్బరాకు బూరానో చేసి ఇవ్వటం మాత్రం ఎరుగు... కాని ఇక్కడో—గుర్రాలు, హంసలు, రైళ్లు, కార్లు—ఇంకా తనకు పేర్లు తెలి యని అనేక బొమ్మలున్నవి.

ఆమె పట్టరాని ఆనందంతో తన్మయత్వంలో పడిపోయింది. గుడ్లప్పగించి ఆశ్చర్యంతో మూగవోయింది.

'జయా!' అన్నాడు రాజారావు.

ఆమె పలకలేదు; స్వప్నంలోవలెనే చూస్తూ, మాట్లాడుతే, మేలుకుంటే యీ సుందర దృశ్యం మాయమౌతుందేమో నన్నంత భయంతో నిలబడిపోయింది.

రాజారావు ఆమె స్థితి గ్రహించాడు; మెల్లిగా ఎత్తుకొని బుగ్గగిల్లి 'తల్లీ! చూచావా బొమ్మలు?' అన్నాడు.

ఆమె మేలుకోక తప్పలేదు. మేలుకున్నా ఆ బొమ్మలు మాయం కానందుకు ఎంతో సంతోషించింది.

'వీటిల్లో ఏంకావాలో తీసుకో' అన్నాడు.

వీటినిచూస్తేనే ఇంత తృప్తికలిగిందే, తనకి ఇస్తే...ఇంకేం కావాలి? ఐతే ఏది తీసుకోలో, ఏది అక్కర్లేదో తెలియటం లేదు.

'అన్నీ కావాలి...' అంది.

'అలాగే...చూడు యీ గుర్రం...దీనిమీద ఎక్కి ఊగవొచ్చు...ఏం?... యీ రైలుచూశావా? కీయిచ్చి వొదులుతే పట్టాలమీద పరుగెత్తుతుంది...యీ దొర సానులు, యీ దొరలు...యీ......'

కొట్టువాడు ఒకొక్కక్కటే వివరంగా చెప్పటం సాగించాక, రాజారావు కూడా మాట్లాడటం మాని, వినసాగాడు. చూపిన బొమ్మలన్నీ జయకు నచ్చుతూనే వున్నవి. కొనమన్నట్లు రాజారావువైపు దీనంగా చూడసాగింది...కొన్నాడు...ఎన్ని బొమ్మలో లెక్కలేదు. ఎన్నిరకాలో వివరాలు చెప్పలేం...

అన్నీ కారులో పెట్టించాడు...ఆ పిల్లకు యీ బాహ్య ప్రపంచాన్ని పరిచయం చెయ్యటం ఇదే మొదలు. మార్కెట్ అంతా తిప్పసాగాడు. ప్రతి షాపులోనూ ఏదో వొకటి కొంటూనే వున్నాడు. బిస్కట్లు, ఛాక్లెట్లు, జోళ్లు, పౌడర్లు, అద్దాలు, బట్టలు-ఒక టేమిటి అవసరమైనవీ, అనవసరమైనవికూడా కొనేస్తున్నాడు. ఇంతధారాళంగా, యోచనా రహితంగా ఏనాడు తను డబ్బు ఖర్చుపెట్టలేదు; నిజానికి అలాటి అవసరం కలగలేదు. ఎందుకంటే తను ఎంత సంపాయించి నప్పటికీ, జీవితపు స్థాయిని సంపాదనకు తగినట్లు అతను పెంచలేదు. అవసరాలనే వాటి జాబితాకు విలాసాలను ఏనాడూ జేర్చలేదు. ధన సంపాదన ఒక కళ దాన్ని అనుభవించటం వేరొక కళ ఐతే కావొచ్చుకాని, యీ రెండో కళకు తనలాటివాడు అయోగ్యుడనేసంగతి అతను ఏనాడో గ్రహించాడు...అలాటి తను యోగ్యతవున్న వేరొక వ్యక్తికోసం యీనాడు డబ్బు లెక్కపెట్టకుండా వాడగలిగాడు; ఇందువల్ల ఆమె సంతోషంగా వుంటుందనీ, ఆ సంతోషాన్నే తన మనః ఫలకంమీద ప్రతిబింబింప చేయగలుగుతుందనీ నమ్మాడు. దీర్ఘంగా ఆలోచిస్తే తన ఆనందంకోసమై ఖర్చుపెట్టవలసిన అవసరాన్ని గుర్తించి, అందుకు పైకం వెచ్చించాడు—అంతే!

అన్నిషాపులూ అయాక, చివరకు పుస్తకాల షాపుల వొంతువొచ్చింది. ఆ షాపుల్లో వెతికి కొనుక్కోవాల్సిన పుస్తకాలు ఉన్నప్పటికీ, ఆ ఓపిక తనకులేదు; ఇక పిల్లకూడా యీ షాపుల్నిచూసి, ఇవ్వసలు ఎవరికోసమై వున్నవనే సందేహానికి గురైంది.

మెల్లిగా నడుస్తూన్న రాజారావు ఒకషాపు దగ్గర నిలబడిపొయ్యాడు. అతని దృష్టి లోపల వరసాగ్గా పేర్చబడిన పెద్దపెద్ద బైండ్లమీదికి మళ్లింది. వాటి వాలకం చూస్తే వాటి జీవితం కనీసం ఒక దశాబ్దమన్నా వుండి వుంటుందనిపిస్తుంది. వాటిల్లో మధ్యగావున్న ఎర్రబైండు అతన్ని విశేషంగా ఆకర్షించింది.

దూరానికి ఆపుస్తకం పేరును, మాసిపోయిన సువర్ణాక్షరాలు చెపుతూనేవున్నవి. ఆపుస్తకం తను గొప్పగ్రంధాలని తలిచిన జాబితాలోదే! నిజానికి ఆపుస్తకం ఒకప్పుడు తనది...అందుకనే అది తనదృష్టిని అంతగా ఆకర్షించింది. ఇలాటిపుస్తకమే ఇంకా ఇతర్లదగ్గరకూడా ఉండివుండొచ్చు...కాని ఇది తన పుస్తకమేనని నమ్మకంగా తోస్తోంది.

వేలుతో చూపుతూ, పుస్తకంపేరు చెప్పగానే షాపువాడి ముఖంవికసించింది. బీరువాలోంచి దాన్నిలాగి, గుడ్డతో దుమ్ముదులిపి రాజారావుచేతికి అందించాడు. అట్టతెరవగానే తనపేరు రాసివుంది. తనపుస్తకాన్నే గుర్తుపట్టగలగటంలో పొరబడలేదు.

'ఎంత ?' అన్నాడు.

ఎంతైనప్పటికీ దీన్ని కొనితీరాలనే ధృఢనిశ్చయం ఏర్పడింది. ఇది ఇంకెవరి చేతుల్లోనైనాపడితే, తనలాంటి ప్రసిద్ధరచయిత, లక్షాధికారి పుస్తకాల్ని సెకండ్ హ్యాండ్ పుస్తకాలవాళ్లకు అమ్ముకున్నాడని వెల్లడవుతుందనే భయం ఒకపక్కా, ఒకప్పుడు ప్రాణపదంగా భద్రంగా దాచుకొని పఠించినగ్రంథమన్న తలపుతాలూకు ఆవేశం మరోపక్కా, ఆరోజుల్లో కడుపుమాడ్చుకొని కష్టపడి కొనుక్కున్న పుస్తకమన్న అభిమానం వేరొకపక్కా, యీనాటి ఆపురాతన వస్తుసామాగ్రిమీది మమత ఇంకోపక్కా అతన్నివొత్తిడి చేసినయ్.

'ఐదురూపాయలు!' అన్నాడు షాపువాడు; వాడిమొహంలో ఎంతో ఆతృత స్పష్టంగా కనిపిస్తోంది. బహుశా ఏళ్లతరబడిగా తనకు వొదలని యీఉద్గ్రంధాన్ని వొదిలించుకోగలిగిన స్థితివొచ్చినందుకు వాడు తొందరపడుతున్నాడు!

కాని రాజారావుకు బేరమాడ బుద్ధిపుట్టలేదు. మాట్లాడకుండా ఐదురూపాయిలకాగితం విసిరివేసి పుస్తకం చంకనపెట్టాడు.

'నాన్నా!' అంది జయ.

'ఏమమ్మా?'

'అది బొమ్మలపుస్తకమా?'

'కాదు...ఇక వెళ్దామా?'

'ఊఁ. వెళ్దాం' అందామె.

పుస్తకాలషాపుల్నిచూడాలని రాజారావుకు ఇంటరెస్ట్లేదు. మరికొన్ని పుస్తకాలు తనవి ఉండొచ్చు. వాటినిగూర్చి తలబద్దలు కొట్టుకోవటం అనవసరం.

జయనుఎత్తుకొని, చకచకా కారువైపునడిచాడు రాజారావు. ఇంటికి వొచ్చేవరకూ జయకానీ, రాజారావుకానీ మాట్లాడలేదు. పుస్తకంతాలూకు పురాతన చరిత్ర అతనిలోనూ, కారునిండావున్న బొమ్మలతాలూకు సమకాలికచరిత్ర ఆమెతోనూ పనిచేయసాగినవి.

## 4

ప్రియ వరండాలో బొమ్మల కొలువుపెట్టింది. ఆ బొమ్మ లన్నిటికీ సమాధానాలు చెప్పే హడావిడిలో ఆమె అవస్థపడుతోంది. వాటిని సర్దటంలో ఆమెకు వూపి రాడటంలేదు. ఆయా కూడా సహాయంచేస్తోంది. ఐనా ఆమెకు మాట్లాడే తీరిక కూడాలేదు. ఒక కొత్తప్రపంచంలోకి వొచ్చినప్పుడు అంతాగాబరాగా వుంటుంది; కొత్తదనానికి అలవాటవటం అతాత్తుగా జరగేందుకు వీల్లేదు. ఇప్పుడామె పరిస్థితి అంతే!

ఆమెలో ఎంత ఉత్సాహం అణిగివుందో రాజారావుకు అర్థమైంది. నిర్జీవ ప్రతిమకు తాను ప్రాణాన్ని ఇవ్వగలిగిన ఆనందం, ప్రపంచంలో ఒక గొప్ప

సత్కార్యాన్ని చేసినప్పుడు కలిగేగర్వం, తనవల్ల సుఖపడే ఆత్మీయుల్నిచూసినప్పుడు కలిగేతృప్తి మొదలైన వివిధానుభూతులు అతన్ని ముంచి ఎత్తినవి. కొన్నేపు నిలబడి ఆమెగంతులు, కేరింతాలు చూశాడు. ఆమె రాజారావును గమనించేస్థితిలో లేదు. ముందు యీసంసారాన్ని చక్కబెట్టుకోవటమే ఆమెను వేధించే సమస్య!

రాజారావు నవ్వుకున్నాడు. ఎంతతేలిగ్గా, మృదువుగా యీ చిన్నారి హృదయం ఎటుపడితేఅటు తిరగగలదో అర్థమైంది. ఆమెను ఆబొమ్మరింటికి వొదిలేసి అవతలిగదిలోని పడకకుర్చీలో కూలబడ్డాడు. ఒక్కసారి నిట్టూర్చి, తను కొన్నపుస్తకాన్ని తెరిచాడు.

యీ పుస్తకంచూడగానే అతని వూహాలు పన్నెండేళ్లు వెనక్కువెళ్లినవి. ఆనాటి బీదరికబాధ, వ్యథతో, ప్రతిదీ తక్కువైన అసంతృప్తితో, లేమితో చితికిపోయిన రోజులవి. కనపడని కన్నీరు మున్నీరుగా విడుస్తూనే, అర్థంలేకుండానే బతికేందుకు విశ్వప్రయత్నాలుచేసిన దినాలవి. చదువుకోవాలనివున్నా, ఎంతకష్టపడి, నానా అవస్థలూపడి చదువుసాగించినప్పటికీ, ఇదంతా ఎందుకనే మీమాంసతో వేగిపోతూనే గడిపిన రోజులవి...వాటిని అంతతేలిగ్గా ఎవరు మరిచిపోగలరు? కాని పూర్తిగా మారిన యీరోజులు, ఆనాటి తనజీవితాన్ని తాత్కాలికంగా మరిపించినవి. ఉత్తరధృవానికి, దక్షిణధృవం దూరమైన న్యాయసూత్రంప్రకారం గడచిన కాలాన్నిగూర్చి అతను ఆలోచించలేదు; ఆ ఆలోచనలు చాలా బాధకలిగిస్తవని! ఇక ఇప్పుడీ పుస్తకాన్ని చేతపట్టుకోగానే ఆరోజులు చాలాస్పష్టంగా గుర్తుకొచ్చినవి.

నవ్వుకున్నాడు—వెగటుగా, నిర్లక్ష్యంగా. తీరిగ్గా పేజీలు తిరగేయసాగాడు. యీపుస్తకమంటే తనకెంతో ఇష్టం...ఏపరిస్థితుల్లో తానీపుస్తకాన్ని కొనుక్కోగలిగాడో బాగాజ్ఞాపకంవుంది. రెండునెలపాటు కడుపుమాడ్చుకొంటేనే కాని ఇది తనదికాలేదు! ఏపరిస్థితుల్లో తానీపుస్తకాన్ని, దీంతోపాటు మరికొన్నిటినీ నిర్దయతో అతిస్వల్పవెలకు సెకండ్‌హ్యాండ్ పుస్తకాల వ్యాపారస్థులకు అమ్మాడోకూడా తనింకా మరిచిపోలేదు.

పేజీలు చాలాపాతబడినవి; చాలాచోట్ల చిమ్మటలు రంధ్రాలు చేసినవి; బహుశా ఎవ్వరూ తెరిచిచూడని కారణాన, పేజీలలో ఇరుక్కున్న మురికి, పేజీలను కలిపివుంచింది...ఇంతగొప్ప పుస్తకంమీద ఎవరికన్నూ పడకుండా, ఆబీరువాలోనే మూలుగుతూ, మళ్లీ తనపూర్వపు యజమానికోసమే యీపుస్తకం తపస్సుచేసి, చివరకు తపఃఫలితంగా వరాన్నిపొందిందనిపించింది.

యాదాలాపంగా పేజీలు తిప్పుతున్నాడు; సగం దాటాక కళ్ళముందు మెరుపుమెరిసినట్లయింది. ఆ మెరుపు ఏమిటనేప్రశ్న బయలుదేరక ముందే మరో రెండుపేజీలు తిరిగినవి. వెంటనే వెనక్కుతిప్పాడు.

రాజారావు క్షణంసేపు అచేతనుడయ్యాడు. గుండె ఆగినట్లయింది. ఎలాగో నిలవతొక్కుకొని, విషయాన్ని అర్థంచేసుకునేందుకు ప్రయత్నించాడు...శరీరం లోని రక్తప్రవాహం అధికమై వణికిస్తోంది. కళ్ళు నిలకడగా లేవు. మొత్తం మనిషే తూలిపోతూన్నట్లు, ఏదో మైకంతో వాలిపోతూన్నట్లు తోచింది.

కళ్లు గట్టిగా మూసుకున్నాడు; ఆ అంధకారంలోనుంచి తిరిగి బైటపడాలనే తొందర బాధించింది. కాని మతిపోయి బైట పడాల్సి వొస్తుందనే భయంతో అలాగే ఒకటి, రెండునిమిషాలు గడిపాడు. చెల్లాచెదరైన శక్తులన్నిటినీ బలవంతాన కూడదీసుకుంటూ, తనను ఎదుర్కొనబొయ్యే 'షాక్'ను తట్టుకునేందుకు సిద్ధమయ్యాననే ధైర్యంతో మెల్లిగా కళ్ళు తెరిచాడు. ఒకవేళ తను చూసింది కేవలం భ్రమే ఐవుంటుందేమోనన్న అనుమానం అబద్ధమే! ఇదంతా కళ్లముందున్న సత్యం! కనుకనే దీన్ని ఎదుర్కోవటం కష్టమైంది.

తను ఏం చూస్తున్నాడు? వందరూపాయిల కాగితం! పేజీలు కలిసేచోట, యీనోటు తొంగి చూస్తోంది. ఎవరో కావాలనే యీనోటును అక్కడపెట్టి, దాని రక్షణార్థం పేజీలను కొస్త అంటించారు. పుస్తకం తెరవటంలో ఆ పేజీలు విడిపడి నోటు దర్శనమిచ్చింది...దీనివయస్సు కనీసం ఒక పుష్కరమన్నా వుంటుంది. కొత్త కాగితం కావటంవల్ల మడతల్లో విరగలేదు. దాన్నివిప్పి, చేతితో తాకి, రెపరెప లాడించాకకూడా నమ్మకుండా ఉండటం ఎలా?

ఇది ఇక్కడికెందుకు వొచ్చింది. ఎలా వొచ్చింది? ఇది తనదిమాత్రంకాదు. ఆనాడు యీ కాగితం తన దగ్గిర వున్నట్లయితే, అసలీ పుస్తకాల్ని అమ్ముకోవాల్సిన దుర్గతి పట్టేదికాదు. ఇంకెవరిదో ఐవుండాలి. బహుశా తను అమ్మాక, దీన్నిమరెవరో కొనుక్కొని పొరపాటున దీన్ని ఇందులోనేవుంచి, తిరిగి అమ్మేసివుండొచ్చు. యీ బేరంలో ఎంతో లాభం కలిగిందనికాదు కాని, ఆపుస్తకానికి, తనే మొదటి యజమానిగా వున్నప్పుడు, ఈ నోటు కనిపించి ఉన్నట్లయితే, తన జీవిత గమనమే మరోక విధంగా మారి వుండేదేమో! యీనాటి రెండులక్షల ఆస్తీ, ఆనాటి యీ ఒక్కనోటుకూ సమానమయ్యేదికాదు...కాని యీనాడు ఇలాంటి అదృష్టాలెన్నిటినో తనకు వొద్దన్నా వినకుండానే, విధి తనకాళ్ళముందు పడేసింది. ఇందువల్ల నిజంగా కలగలపిన ఆనందాలక్కూడా తాను అతీతుడవటంలో ఆశ్చర్యంలేదు. నిర్లక్ష్యంగానవ్వి ఆ నోటును నేలమీద పడేశాడు.

యీ పుస్తకంమీద ఇప్పుడు కొత్త ఇంటరెస్ట్ కలిగింది. పేజీ తర్వాత పేజీని జాగ్రత్తగా తిప్పుకు పోతున్నాడు. మరి కొన్ని పేజీలు గడిచాక మడిచిన తెల్లకాగితం—దాని తెలుపు తగ్గి, మడతలుగానే వుంది. దాన్ని తీసి మడతలు విప్పాడు. కాగితం పాతదైనప్పటికీ అక్షరాలు చాలా స్పష్టంగా ఉన్నవి.

అదివొక ఉత్తరమని చూడగానే అర్థమౌతోంది. కింద 'లలిత' అని చేవ్రాలు

చూడగానే రాజారావు అదరిపోయ్యాడు. పైనచూడగానే తనను సంబోధించే వుంది...ఇది లలిత తనకురాసిన ఉత్తరం! దీన్ని తానెన్నడూ చూడలేదు!!

చాలా ఆతృతతో వొణికిపోతూ అతనా వుత్తరాన్ని చదవసాగాడు; అక్షరాలన్నీ అలుక్కుపోయినట్లున్నవి. అర్థంకావటంలేదు. కూడబలుక్కొని చదువుకున్నప్పటికీ, అతనికంతా అగమ్యగోచరంగా వున్నట్లుంది. రెండుమూడు సార్లు చదువుకున్నాక, అతను ఆవుత్తరంలోని విషయాన్ని యీ విధంగా చదివినట్లు నిశ్చయించుకున్నాడు:

"రాజా!

చాలారోజుల్నుంచీ నీతో ఒక ముఖ్యవిషయాన్నిగూర్చి చెప్పాలను కుంటున్నాను; ఎంతప్రయత్నించినా, అవకాశం దొరకకా, దొరికిన అవకాశాన్ని వినియోగించుకోలేకా కాలం గడిచింది...కాని ఆవిషయాన్ని నీతో చెప్పకుండా నేను ఒక్కతెనూ భరించటం అసంభమనితోచింది. ఇది మనిద్దరి జీవితాలకూ సంబంధించింది కనుక, నీవు వినేందుకు తప్పక కుతూహలపడతావని నానమ్మకం.

నీపైన నాకు కలిగిన అభిమానమంతా ప్రేమగా మారిందని తెలుసుకునేందుకు ఎక్కువకాలం పట్టలేదు. మొదట్లో యీప్రణయానికి నేనంత ప్రాముఖ్యతను ఇవ్వనిమాట నిజమేకాని, అది యీనాడు చిలువలు పలవలుగా వర్ధిల్లి, నామనశ్శాంతిని హరించింది. స్పష్టమైన దాని విశ్వరూపాన్ని హృదయంలో దాయటం నావల్ల కావటంలేదు. యీనాడు నేను నిన్ను ప్రేమించానని చెప్పేందుకు వెనుకాడనంత ధైర్యంవొచ్చింది...కాని ఎలాచెప్పాలి? ఎప్పుడు చెప్పాలి? చెప్పాక నీవు దాన్ని అంగీకరిస్తావో, నిరాకరిస్తావో? ఇలాటి సమస్యలు నన్ను వేధిస్తున్నవి. యీ అశాంతిని భరించటంకన్న ఏదోవొకటి తెల్చుకోవటమే మనిద్దరికీ క్షేమకరమవగలదని తోచింది. కాని స్త్రీ సహజమైన సిగ్గుకారణంగా, మనిద్దరిమధ్యా ఎంతపరిచయం, ఎంతస్నేహం, ఎంతస్వేచ్ఛవున్నప్పటికీ ఇన్నాళ్లూ చెప్పలేక పొయ్యాను. ఇవాళ తప్పక చెప్పేద్దామని ధృఢనిశ్చయంతో నీ దగ్గిరికి వొచ్చినప్పుడు, నీముఖంలో ఎప్పుడూవెల్లాడే అశాంతి, బాధలతాలూకు సీరియస్‌నెస్, యీప్రపంచంలో నీకెవ్వరూలేరనే నిర్లక్ష్యం, మరీ నన్నుచూసి అత్తిపత్తాకల్లే ముడుచుకొనిపోవటం— మొదలైన లక్షణాలకు నేను భయపడి చెప్పలేక పోతూ వొచ్చాను.

ఇక యీ చెప్పటమనేది కుదరదనే నమ్మకం కలిగాక, నా యీప్రణయాన్ని యీ లేఖద్వారా నీపాదాలముందు అర్పిస్తున్నాను. దీన్ని అంగీకరించటమో, నిరాకరించటమో నీ వొంతు. అంగీకరించే పక్షంలో ఎల్లుండి గురువారం నాటి సాయంత్రం ఐదుగంటలకు మెరీనా బీచ్‌లో నీ కొరకు ఎదురుచూసే నాకు దర్శనమివ్వు. మిగతావిషయాలు మనం అక్కడ మాట్లాడుకోవొచ్చు.

నీ ఆర్థిక దుస్థితి నాకు తెలియదనుకోకు. ప్రణయానికి యీమిగతావన్నీ చాలా అల్పవిషయాలు. యీ పుస్తకంలో నీకోసమై వేరొకచోట వందరూపాయల కాగితం పెడుతూన్నందుకు అన్యథా భావించకు. అది నీకు తప్పక ఉపయోగిస్తుందని నమ్ముతున్నాను.

నీ నిరాకరణను ఎదుర్కోవటం కష్టమే అవగలదేమో? నిరాకరణే జవాబయ్యే పక్షంలో, బీచిలో నన్ను కలుసుకోకుండటమే జవాబుగా స్వీకరిస్తాను. అదృష్టానికో దురదృష్టానికో సముద్రపు టంచుమీద ఎదురు చూస్తూంటాను.

లలిత."

తనెంత దురదృష్టవంతుడో యీ క్షణాన అర్థమైంది. తన జీవితపు విలువలన్నీ నీ కడుపులో పెట్టుకున్న యీ ఉత్తరం పన్నెండేళ్ళ తర్వాత కాని తనకు చిక్కలేదు! కాని యీనాడు దాని విలువ శూన్యమే! చివరకు యీ ఉత్తరాన్ని రాసిన స్త్రీ కూడా యీ ప్రపంచంలో లేదు.

ఇవాళ వారమేమిటి?.. ఆఁ గురువారం! ఇలాంటి గురువారం సాయంత్రమే బీచికిరమ్మని ఆమె తనను ఆహ్వానించింది; ఇదే వేళ. కాని మధ్యలో కొన్నివందల గురువారాలూ, ఆ సాయంత్రాలూ గడిచిపోయినవి; ఇక ముందు జీవితంలో కూడా మరికొన్ని వందల గురువారపు సాయం సమయాల్ని తాను చూడగలడేమో? కాని ఆ గురువారం సాయంత్రానికే ఆ విలువ! మిగతా సాయంత్రాలు ఏవారానికి సంబంధించినా, ఎన్నిసార్లు వొచ్చినా ఒకటే!

ఆ గురువారపు సాయంత్రం! ఆ ఒక్క సమయంమీదనే తన జీవితపు సౌఖ్యం తాలూకు బరువు భారాలన్నీ మోపబడిన సంగతి ఏళ్లు గడిచాక తెలుసుకోవాల్సి వొచ్చింది; ఆ పర్వతాగ్రంవంటి సమయంలోనే, తనకు తెలియకుండానే జీవితం తల్లక్రిందులై, నేలవాలి, తిరిగి అతుకుపడేందుకు వీల్లేకుండా భిన్నాభిన్నమైంది. బహుశా యీ సంగతి, యీ నాడు యీ ఉత్తరాన్ని చూడనట్లయితే, జీవితాంతం వరకూ తెలుసుకునేవాడుకాదు. ఎంతగొప్ప జీవితరహస్యం, మూర్ మార్కెట్ లోని సెకండ్ హ్యాండ్ పుస్తకాలషాపులో సమాధిచేయబడివుందో, అది తనకే సంబంధించినదైనప్పటికీ, ఎవరిచేతుల్లోపడేందుకైనా సరే సిద్ధంగా వేచిఉన్నదో, అదృష్టమో దురదృష్టమో తన్నుకొని రావటంవల్ల, కేవలం ప్రమాదవశాత్తూ అది తనను జేరిందో, ఎంతస్వల్ప విషయంమీద యీ మానవజీవితం ఆధారపడివుందో ఆలోచిస్తూంటే మతి పోతూన్నట్లయింది.

ఆ గడిచిన జీవితంలోని సంఘటనల రంగే మారినట్లు తోచింది; ఆనాడు తాను పడిన పొరపాట్లు, అర్థంచేసుకున్నాననుకున్న ఘట్టాల తాలూకు అర్థాలు,

తాను ఎంత తేలిగ్గా మోసపోయిందీ అదంతా ఇప్పుడు తెలిసి వొస్తోంది. యీ ఉత్తరం ఆ గడిచిన చరిత్రమీద ప్రసరించిన కాంతిలో స్పష్టంగా నిజస్వరూపాల్ని చూడగలుగుతున్నాడు.

ఎక్కడో కాశీమజిలీకథల్లో రాక్షసునిప్రాణం సప్తసముద్రాలవతలి దీవిలో, ఘోర సర్పాల రక్షణలో మర్రిచెట్టు తొర్రలోని పంజరంలోని పక్షిలో దాచివుంచినరీతిగా, తనజీవితపుటాశలు, సౌఖ్యం, ఆనందం మొదలైన వన్నిటినీ—యీ పుస్తకంలోని లేఖరూపంలో దాచబడినవని ఇప్పుడే తెలిసింది!... ఏ నైరాశ్యమైతే ఇన్నాళ్ళూ తనను పీడించిందో, అదెలా ఏర్పడిందో కారణాన్ని తెలుసుకోగలిగాడీ నాడు! ఇది ప్రక్రియ కాకున్నప్పటికీ తెలుసుకున్నందువల్ల ఆ గధంతా తిరిగి మనః ఫలకంలో ప్రతిఫలించసాగింది.

ఆ జీవితంలోని ప్రతిఘట్టమూ తనకు గుర్తుంది; అదంతా నిన్న మొన్న జరిగినంత స్పష్టంగా జ్ఞాపకం...వాటినీనాడు నెమరువేసుకోకుండా ఉండటం అసంభవం! అది విషాదగాథే ఐనప్పటికీ, తనకు మిగిలింది, తనకు అందింది, తనకు జరిగిన అన్యాయాలు, అక్రమాలు, తాను పడిన బాధలు—ఇంకా ఎన్నో ఇమిడివున్న ఆ కథను తలుచుకోసాగాడు. పడకకుర్చీలో అశక్తునివలె, దుర్బలునివలె వాలిపోయి కళ్ళు మూసుకున్నప్పటికీ, అతనికి కనిపించింది చీకటికాదు; తన జీవిత చరిత్రతాలూకు కొన్ని ముఖ్య ఘట్టాలు:

## 5

చిన్నతనం నుంచీ తను కష్టాలేపడ్డాడు; సుఖమనేది ప్రపంచంలో వుండి, తన కళ్ళెదుట సౌఖ్యపడుతూన్న వారు ఉండటంవల్ల, తన కది కరువైందన్నబాధ వుండేది. ఐతే ఆ సుఖాన్ని పొందటం ఎలాగో, పొందిన వారి గొప్పతనం, ఆధిక్యత ఏమిటో ఎంత ఆలోచించినా తనకు అర్థమయ్యేదికాదు. చివరకు తన గతి ఇంతేననీ, దీన్నిగూర్చి ఖిన్నుడవటం కంటె ఉన్నంతలోనే కాలం వెళ్ళబుచ్చటం తప్ప మరో దారి లేదనే నమ్మకంలో కలిగిన మొండి ధైర్యంతో జీవితాన్ని ఎదుర్కొన్నాడు. నిజానికి తానాస్థితిలో దిగజారిపోయి ఉండవలసింది; కాని చిన్న దెబ్బలతో హృదయం బండబారి, కఠినంగా తయారై ఎంతో ధైర్యాన్ని పుంజుకుంది. యీ ప్రాపంచిక విషయాలు చాలా వరకు తనను చలింపచేయకుండా, ఒక అతీతునివలెనే రోజులు గడిపేందుకు తగిన శక్తి సామర్థ్యాలను పొందగలిగాడు.

తనకు పదేళ్లు రాకపూర్వమే తండ్రి చనిపొయ్యాడు. అందుకు నిజంగానే తను విచారపడలేదు. తండ్రి బతికి వుండగా ఒక్కనాడన్నా తన ముద్దు మురిపాల విషయం ఆలోచించలేదు. తను నిద్రలేవక ముందే వెళ్ళిపొయ్యేవాడు; మళ్ళీ తను నిద్రపోతూన్నప్పు డెప్పుడో వొచ్చేవాడు. ఒకోనాడు అర్థరాత్రి తనకు నిద్రాభంగమయ్యేది. ఆ దృశ్యాన్ని మాస్తే కథల్లో తను విన్న నరకమే కళ్ళముందు ప్రత్యక్షమయ్యేది.

తన తల్లిని దూషించటం, కఠినంగా మాట్లాడటం, ఒక్కోసారి కొట్టటంకూడా జరిగేది. ఆమె ఒకమూల కూర్చొని పమిటచాటున ఏడుస్తూంటే, ఆమెను ఓదార్చ వలసిన బాధ్యతను విడనాడి, ఆమెను బాధపెట్టే కఠినాత్ముడైన తన తండ్రి ఉగ్ర రూపం కనిపించేది...తనకే బలంవుంటే, తగినంత ధైర్యంవుంటే, యీ అన్యాయాన్ని అరికట్టగలిగేవాడు; ఆ తండ్రిని చావబాది బుద్ధి చెప్పేవాడు; ఇవేమీ చేతకానప్పుడు తను చూస్తూ అశాంతితో, బాధతో తనలో తానే మూలుగుతూ, కళ్లు మూసుకున్నా నిద్రపట్టకుండానే మిగతా రాత్రి గడిపేవాడు.

తల్లి చేసిన నేరమేమిటో, తండ్రి ఎందుకామెను శిక్షిస్తాడో చాలా రోజుల వరకూ తనకు తెలియలేదు. మర్నాటి ఉదయం—రాత్రేమీ జరగకుండానే శాంతి యుతంగా గడిచిపోయినట్లు, ఏవో సుఖస్వప్నాల్ని అనుభవించి వాటి తాలూకు అను భూతుల్ని నెమరువేసుకుంటూన్నట్లు ఆ తల్లి ఉత్సాహంగా, ప్రశాంతంగా, హాయిగా వున్నట్లు కనిపించగానే, బహుశా తాను రాత్రి చూసిన దృశ్యం స్వప్నమేమోననే అనుమానం కలిగేది. అందుకనే కారణాలు తెలుసుకోవాలనే అతని కుతూహలం మాయమయ్యేది.

—కాని, ఇలా జరగటం ఒకరాత్రి కాదు; రెండు రాత్రులుకాదు...ఎన్నో సార్లు జరిగింది. ప్రతిసారీ ఒకే రకం కలరాదనేజ్ఞానం, నమ్మకం కలిగింది; అసలిది ప్రతిరాత్రీ జరుగుతూనే ఉండిఉండొచ్చు; తన కొక్కొకరాత్రి మెలుకూ రానందు వల్ల తెలియటంలేదేమో? ఇంత తెలుసుకున్నాక, తల్లిపట్లఎంతో జాలికలిగేది. ఐతే ఆమె యీ ఇంటిలో ఎందుకిన్ని బాధలుపడుతూ, ఆ తండ్రి దగ్గర అవమానించ బడు తోందో తెలుసుకోవాలి.

కాని తన యీ ప్రశ్నలకు ఎవరు జవాబులు చెప్తారు? ఎవర్ని అడిగేట్లు? అన్నిటికీ తనకా తల్లేవుంది. ప్రపంచంలో తనకు మరెవ్వరూ లేరనే జ్ఞానం ఏనాడో కలిగింది. ఇంత ఆదరంగాచూసే తల్లినే అడగాలి.

అడిగాడు—ఎన్నోరకాలుగా. కాని ఆమె నవ్వుతూ మాట తప్పించేది; తను చూసిందంతా స్వప్నమే నన్నట్లు ధైర్యంచెప్పేది. కాని తనకు నమ్మకంలేదు. తల్లి కూడా తనను మోసంచేస్తోంది. ఏదో చెప్పరాని సంగతిని తననుంచి రహస్యంగా కాపాడుతోంది...కాని తను తెలుసుకొని తీరాలి. వీలుంటే ఏమైనాసరే-తల్లిని ఆ బాధలనుంచి రక్షించాలి. కాని ఎలా తెలుసుకోవటం?

ఒకనాడు అకాత్తుగా తెలుసుకున్నాడు. వీధిలోని పిల్లల్తో ఆడుకుంటూండగా ఒక ఇల్లాలు, మరో ఇల్లాలితో తనెవరో అడిగింది.

‘ఆ తాగుబోతు రామనాథం కొడుకు!’

అర్థమైంది తనకు-తనతండ్రి ఎందుకంత కఠినంగా ప్రవర్తిస్తాడో! వీధి పిల్లలు

కూడా ఇన్నాళ్ళూ మాట్లాడే సూటీపోటీ మాటల నిగూఢభావాలుకూడా స్పష్టంగా తెలిసివొచ్చినవి. అందరిమీదా, తనను నిష్కారణంగా నీచపరిచే యీ మానవులందరిపట్లా ఎంతో ద్వేషం, అసహ్యం కలిగినవి. కాని తనెలాగూ వీళ్ళనెవర్నీ సాధించలేడు. వాళ్ళతో తన అసహ్యాన్ని ప్రకటించేందుకు మిగిలిన ఒక్కదారి— తను వాళ్ళతో కలవకుండటమే!

ఖిన్నుడై ఇంటికి వొచ్చాడు. అసలు వాళ్ళందరిమీదా అలగటంకూడా అర్థం లేనిది; అందరి తండ్రులవలెనే, తన తండ్రికూడా తాగి తందనాలాడకుండా వుంటే, తనను ఎవ్వరూ ఏమీ అనగలిగేవాళ్లు కాదుకదా!...తల్లిని ఊరడించటం ఎలాగో కూడా తనకు తెలియలేదు. ఉన్న బాధలకు తన బాధనుకూడా కలపకుండా, ఆమె చూడకుండానే ఏడ్చేవాడు.

అలా రోజులు గడుస్తుండగా ఒకనాడు అకాస్తుగా తండ్రి చనిపొయ్యాడు; అందరు తాగుబోతులవలెనే గుండె ఆగి మరణించాడని విన్నాడు ... ఒక విధంగా ఎంతో 'రిలీఫ్' కలిగింది తనకు. తల్లికికూడా ఆ రిలీఫ్ కలుగుతుందనుకున్నాడు; కాని తమ మళ్ళీ ఇంకోసారి పొరబడ్డట్లు తెలుసుకున్నాడు.

ఆమె ఏంతో దుఃఖించింది. ఆమెకు తన తండ్రి అంటే ఇష్టమేనేమో? ఆ బాధలు పడటమే ఆమెకు ఆనందమేమో? యీ సంగతి ముందుగా తెలివుంటే తండ్రి చావుకు తనూ దుఃఖబడేవాడుకదా! తండ్రి మరణాన్ని తాన్నెప్పుడూ వాంఛించకుండా ఉండేవాడే! తన తపఃఫలమే ఇదనే పిచ్చిభ్రమ కలిగింది.

ఏమైతేనేం జీవితంలోకి కొత్తబాధలు దిగుమతివినవి. ఇగి వరకు భోజనానికి పడని ఇబ్బంది ఆరంభమైంది. ఏదో తను స్కూలుకువెళ్ళి చదువుకుంటున్నప్పటికీ, అందరి పిల్లలల్లే సంతోషంగా ఉండలేడు. ఇంటిదగ్గిర తనను కనిపెట్టుకొని కూర్చున్న నిత్యజీవిత సమస్యలే అతనికి బంధుమిత్రులు! మరీ తన తల్లి దుఃఖపూరిత నయనాల్ని చూస్తేనే మనస్సు తరుగుకొని పొయ్యేది. ఆమెను సంతోష పెట్టాలని ఎంత కష్టపడి చదివేవాడు తను! క్లాసులో తనకన్న బాగా చదివేవాళ్లులేరనిపించుకున్నాడు. తల్లి విని ఆనందించాల్సినంతగా, ఆనంద పడలేదని తెలుసుకున్నాడు. మరి ఏం చేస్తే ఆమె సంతోషిస్తుంది?

సమస్యలు ఎటూ తేలకుండానే కాలం గడుస్తోంది.

ఇంట్లోవున్న వస్తువులు అమ్మకానికి పోతూన్నవి. వెండి బంగారాలు ఎన్నో రోజులు రాలేదు. మిగతా సామాన్లు ఒక లెక్కలోవేకావు. ఉన్నది అమ్ముకునన్నా తినాలి; సంపాయించన్నా తినాలి. తండ్రి బాధ్యతైన సంపాదన తల్లినెత్తిన పడింది. ఆమె నిస్సహాయ స్థితిలో ఆత్మవిశ్వాసం ఒక్కటే ఆధారంగా సంపాయించి తనను పోషించేందుకు నడుం కట్టింది.

ఆమె వంటలుచేసి సంపాయించి తనను చదివిస్తోంది. శక్తికి మించిన బరువులు లాగటంవల్ల ఆమె ఆరోగ్యం చెడింది; చెడిన ఆరోగ్యాన్ని బాగుచేసుకునే తాహతు లేదు; ఆరోగ్యం చెడినట్లు కనిపించకుండా నటించటం ఒక్కటే ఆమె చేయగలిగింది.

తండ్రి ఆస్తియేమీ సంపాయించలేదు; పేరు ప్రతిష్ఠలూ లేవు. సామాజికంగా హీనస్థితిలోవున్న కుటుంబం! ఆ తండ్రికి కొడుకైన సంగుకు ఆయన తాలూకు ఆస్తి పాస్తులేమీ రాకున్నా, పరువుమర్యాదలు మాత్రం తనకు సంక్రమించినవి. చివరకు ఆ తండ్రి చనిపోయినా, ఆయన ప్రతిబింబమైన తనపట్ల ప్రజల అభిప్రాయం మారలేదు.

ప్రతిచిన్న విషయంలోనూ తోటివారుచూపే యీ చిన్నచూపు తనకు స్పష్టమౌతూనేవుంది. తాహతాలేదు; డబ్బు దస్కాలూ లేవు; అంగబలంకానీ, అర్థబలంకానీ లేవు. మరి ఏవిధంగా సాటివారిలో తను కలవగలడు? ఆ అర్హతలు లేని తనను వారు దూరానవుంచేవారు; అసలు తనే వాళ్లకు దూరంగా జరిగేవాడు.

పండగల్లో మిగతా పిల్లలందరూ కొత్తబట్టలు తొడుక్కొని సంతోషంగా, సరదాగావుంటే తను సిగ్గుచచ్చి, ఇంటిమూలల్లో కుంచుకొని పొయ్యేవాడు. మిగతా సద్గుణాలు ఎన్ని వున్నప్పటికీ, డబ్బులేదు కనుక, విలువ లేకుండా పోయింది. యీ విధంగా తనలో 'ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్' మొదటినుంచీ గాఢంగా పనిచేయ సాగింది.

అందుకనే తను ఎవరిపొత్తుకూ పొయ్యేవాడు కాదు. ప్రపంచంలోవున్నా, ప్రపంచానికి దూరంగానే వున్నట్లు ప్రవర్తించేవాడు. తన జీవితం ఎంతో రహస్యంగా, అజ్ఞాతవాసంలో వున్నట్లే గడిపేవాడు. యీతత్వమే తనకు బాగా అలవడి పోయింది.

కాలేజి చదువునుకూడా ఆమె నిరుత్సాహపరచలేదు. ఉన్నంతలోనే ఆమె తనకు ఏలోటూ లేకుండా చేసేందుకు విశ్వప్రయత్నం చేస్తోంది. తన జీతం ఇరవై రూపాయిలూ ప్రతినెలా కొడుక్కు ఇస్తుందామె. కాని యీ మొత్తంతో కాలేజీ చదువు సాగుతుందా?

ఛీ...ఛీ...ఎందుకొచ్చిన చదువనిపించేది. తల్లిని సుఖపెట్టలేని తన బతుకు నిరర్థకమని అనిపించేది. కాని పెద్ద చదువులుచదువుతే పెద్ద ఉద్యోగాలు దొరుకుతవనే ఆశ పీడించబట్టే యీ కష్టాల్ని భరించటం జరిగింది.

మొదటినుంచీ సగం జీతంతోనే చదువు సాగించాడు; కాలేజీలో అదికూడా లేకుండా చేసుకునేందుకు నానా అవస్థలూ పడ్డాడు. చివరకు నాలుగోవొంతు జీతం మీద అధికారులు చదువు చెప్పేందుకు ఒప్పుకున్నారు. ఇది గుడ్డిలో మెల్లగా కనిపించింది.

ఇంతతో సమస్యలన్నీ తీరినట్లు కాదు. పుస్తకాలు, బట్టలు, భోజనం, ఉండేందుకింత పంచ — ఇవన్నీ ఎట్లా? తల్లి పంపేది ఏ మూలకు? ఆమెను వేధించి లాభం లేదు; అంతకన్న ఆమెకు శక్తిలేదు. తనే ఏదోవిధంగా సరిపెట్టుకోవాలి.

పట్టుదలా, సహనశక్తీ వుంటే సాధించటం అంతకష్టం కాదనే విషయాన్ని తన జీవితారంభంనుంచీ గమనిస్తునేవున్నాడు. తన తల్లిలో యీగుణాల్ని స్పష్టంగా చూస్తున్నాడు. చెమటోడ్చి, ఐశ్వర్యవంతుల ఇంట నానాచాకిరీచేసి, ఖిన్నవదనంతో వున్న తల్లిని తలుచుకొని, దానినుంచే ఆవేశాన్నిపొంది, శరీరాన్ని తృణప్రాయంగా కష్టింపచెయ్యాలనే నిశ్చయాన్ని పొందేవాడు. అందుకనే రెండు ట్యూషన్లు ఏర్పరుచుకొని పధ్నాలుగు రూపాయిలు సంపాయించగలిగాడు.

ఉదయం ఒక ట్యూషన్ కాగానే, గదికివొచ్చి, ఇంత అన్నంవొండుకొని ఏ పచ్చడో వేసుకొని తిని, కాలేజికి మూడుమైళ్లూ నడిచివెళ్ళేవాడు. బస్సు ఎక్కితే డబ్బు చాలదు; ఐనా అలాటివి జీవితావసరాలుగా కనిపించలేదు; అవి భోగాలు; తనలాటివారివైపు కన్నెత్తిచూడవు. తిరిగి సాయంత్రం కాలేజి వొదలగానే రెండో ట్యూషన్ ముగించుకొని గదికి వొచ్చేప్పటికి బాగా చీకటిపడేది. మసిబారిన లాంతరు వెలిగించుకొని, పొద్దుటి అన్నమే తినేవాడు; ఆ తరువాలికొని తన చదువు సాగేది కాదు. స్వతహాగా బాగా తెలివిగలవాడు కనుక, ఏమాత్రం కష్టించి చదివినాచాలు; అసలీ చదువంతా ఏనాడో తాను నేర్చిందనే భావంవుండేది. చదువునుగూర్చిన చింతలేదు...కాని జీవితమంటే ఏమిటి! జీవితంలో సుఖమెప్పుడు! దాన్ని సాధించటంఎట్లా? తన సంగతి ఎలావున్నా తన ముసలితల్లి మాటేమిటి! ఆమెకు ముక్తి ఎప్పుడు? యీ సమస్యలే తనచుట్టూ పిడుగులల్లే వేళ్ళాడుతూ వేధిస్తుండేవి.

## 6

పన్నెండేళ్ళనాటిమాట — కాలేజిలో చదువుకునే ఆరోజుల్లో జరిగిన గాథ తాలూకు నాయకే యీ లలిత. ఆమెతో జరిగిన పరిచయంకూడా చాలా విచిత్రంగానే వుంది.

తనకీ లోకంలో ఎవ్వరూ లేరని తెలుసుకున్నప్పటి నుంచీ, ఒంటరిగానే తాను జీవించగలిగేవాడు. చివరకు సానుభూతి చూపేవారుకూడా కరువైనందువల్ల, ఏకాకిగా, తన బాధల్ని తానే భరిస్తూ నెలకు మూడురూపాయిల అద్దె ఇస్తూ ఆ గదే లోకంగా కాలం గడిపేవాడు. ఆ గదిలోనే ఒకమూల వంట, మరో మూల చింకి చాపమీద, శిథిలావస్థలోవున్న పక్క-బట్టలూను. రోజూ ఒక్క-సారి ఓపిక చేసుకొని వూడ్చుకుంటూండేవాడు. ఉన్న ఒక్క-కిటికీ తీస్తే తన యీ సంసారమంతా బజార్లోకి కనిపిస్తూనే వుంటుంది; కొంత కాంతితోపాటు, బజారుగోల, దుమ్ముకూడా లోనికి ప్రవేశిస్తవి. నిద్రపోదల్చుకున్నప్పుడు తప్ప యీ కిటికీని మూసి బతకటం కష్టం.

ఎవరన్నా స్నేహితుల్ని సంపాయించుకునే ప్రయత్నం తానెన్నడూ చేయలేదు. కాస్త గౌరవమర్యాదలున్న ఏ స్నేహితుడు, కాస్తోకూస్తో చదువు సంస్కారాలున్న ఏ మిత్రుడు యీ మురికి సందులోకి, యీ పందుల కొట్టాంలోకి వొస్తాడు? అసలు ఇదంతా తన జీవిత రహస్యం. దీన్ని ఇతరులకు తెలియనీయకుండా కాపాడుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది. అందుకనే తనతోడి స్నేహానికి ఎవరైనా ప్రయత్నించినా, తాను వొదిలించుకునేందుకే ప్రయత్నం చేసేవాడు.

తనకున్నవన్నీ నాలుగు జతలబట్టలు; రెండుజతలు ఇస్త్రీకివేస్తే, మిగిలిన రెండు జతల్లోనూ,ఒకటి కట్టుకోవటం, మరోటి ఉతికి, ఆ గదిలోని దణ్ణంమీదనే ఆరవేసుకోవటం దినచర్య. యీ ముతక బట్టల్తో కాలేజికివెళ్ళి, చదుతూన్నా ఎవ్వరూ తనను కాలేజి విద్యార్థిగాకూడా గుర్తించటంలేదు. రత్నాలమధ్య రాయిలాగు, ఒక మూల వొదిగి కూర్చునేవాడు. వారి ఆధిక్యతను తాను గ్రహించక పోలేదు; తన అల్పత్వమూ తనకు కొత్తకాదు; దీన్ని భరించగలగటానికి ఎన్నో రోజులుగా అలవడే వున్నాడాయె!

ఎన్నడూ కన్నెత్తి ఎవర్నీ తేరి పారజూచే ధైర్యం అతనికిలేదు. ఎటు కదుల్తే ఏం అపచారమౌతుందోననే భయం అతన్ని వేధిస్తూవుండేది. తలవొంచుకొని, తలపుల భారంతో ఆయాసపడుతూ నడిచి వెళ్లేవాడు. తనపట్ల జాలిచూపేవాళ్లు లేనందుకు అతను విచారించలేదు; కాని తన యీ స్థితి ఇతర్లకు నవ్వులాటగా వుండటానికి మాత్రం తను చాలా గాయపడేవాడు.

దీనంగా, అణిగిమణిగివుండి, ఏదో విఘ్నంగా జీవితాన్ని గడుపుతూన్న తను మిగతా విద్యార్థుల కన్నెర్రకు గురయ్యాడు. నిజానికి తనుచేసిన అపచారం ఏమీలేదు. తనకు, తనలాటి బీదవాడికి, అనాథకు, అన్నీ కష్టుమార్కులు రావటమే తననేరం! కార్లలో వొచ్చివెళ్లే విలాస పురుషులకు చదువు అంటకుండటం తనతప్పు! ఎన్నో సూటీపోటీమాటలు పడుతూనే, వాటన్నిటినీ దులుపుకుంటూ బతకాల్సి వొచ్చింది.

ఒకళ్లిద్దరు సహృదయులు తన తెలివితేటల్ని అభినందిస్తూ స్నేహితులయ్యే ప్రయత్నాలుచేశారు. కాని తాను వాళ్ళను ప్రోత్సహించకపోగా, నిరుత్సాహ పరిచాడు. అనుకున్నాడు; తనకు ఎవ్వరూ అక్కర్లేదు; ఎవరుమాత్రం ఏం చేయగలరు? ఆ విధికే తనపట్ల దయలేదు; ఇక యీ మానవ మాత్రులతో తనకేం లెక్క? ఏ నేరమూ చేయకుండానే, తన బతుకు తాను బతుకుతూన్నందుకు తనపట్ల యీర్ష్య ప్రదర్శించే మానవుల్ని మానవులుగా గుర్తించి తాను కాపిలించుకోగలడా? వారి అంతస్తు వేరు; తన అంతస్తువేరు. వారు పిలిచినా తాను వారి అంతస్తుకు వెళ్తే, ఒకనాడు అంత ఎత్తునుంచి పడటం తప్పదు; అప్పుడు తను భిన్నా భిన్నాలుగా, తిరిగి కలేసే అవకాశం లేకుండా చితికిపోతాడు. అందుకనే తను అందరికీ దూరంగా జరిగి కూర్చున్నాడు.

తనకు ఉన్నదల్లా ఒక్కటే ఆత్మబంధువు—తల్లి! వారానికో సారో, పది రోజుల కొకసారో ఆమె పనిచేసే ధనవంతుల ఇంటికి, మైలాపూర్ వెళ్ళివొస్తాడు. ఆమెకు కాస్త తీరికవుంటే దొడ్డి గుమ్మందగ్గిర కలుసుకొని కావిలించుకొని బావురు మంటుంది. తనామెకు ఎంతో ధైర్యం చెపుతాడు. ఆమెను నవ్విస్తాడు. ముందొచ్చే రోజులు కలిసివొస్తవని నమ్మిస్తాడు. ఆమె అమాయకంగా అంతానిజమేననుకుంటుంది; ఆ కాస్సేపూ తాను వూహించిన కలను తనుకూడా అనుభవిస్తాడు...ఆ తరువాత ఆమెదగ్గిర సెలవుపుచ్చుకొని బరువైన హృదయంతో కాళ్ళీడ్చుకుంటూ నడక సాగిస్తాడు; మైకంవొదిలి మళ్ళీ మామూలు వాతావరణంలో పడతాడు.

ఇంతకుమించి తనకు సజీవ వ్యక్తులస్నేహం లేదు; దాన్ని తను ఆశించనూ లేదు. ఐతే తనకూ వేరొక ప్రపంచం వుంది; ఆ ప్రపంచంలోని వ్యక్తుల్ని తానె న్నడూ చూడలేదు. వారితో తనెప్పుడూ మాట్లాడలేదు. కాని వారు మాట్లాడేది మాత్రం తనకు వినిపిస్తుంది; తన చేత ఆలోచింపజేస్తుంది. వారి మాటల వెనుక దాగిన నిత్యజీవిత సత్యాలనేకం తనను కదిల్చి వేసినవి. అంధకారంలో దారి తెలియక చేతుల్తో తడువుకునే స్థితిలో ఆ ఆత్మీయుల వాక్కులే ఎంతో కాంతిని ప్రసరింప జేసినవి; గుడ్డివానికి దృష్టిరావటం లాటి అనుభూతిని పొందాడు. ఇప్పుడు తానొక విశిష్టకూటంలో ప్రాపంచిక విషయాలనేకం, కొత్తపంథాలో నిశితంగా, నగ్నంగా, యధాతథంగా చూసి అర్థం చేసుకోగలుగుతున్నాడు.

యీ బంధువర్గం ఎంతమంది వున్నప్పటికీ తనకొాగదేచాలు. వారు ఎప్పుడూ తన కొరకు కనిపెట్టుకొని వుంటారు. వారికి తృప్తినిచ్చే భోజనమూ అక్కర్లేదు; పొగ డ్తలతో వాళ్ళు పులకరింప చేయువలసిన పనిలేదు. అసలు వారిని పలకరించుకున్నా వారేమీ పట్టించుకోరు; కాని వారిని పరామర్శిస్తే మాత్రం, వారు చెప్పే మాటల విలువల్ని గ్రహించితీరవలసే వుంటుంది. తనకువారే గురువులు; బోధకులు; మొహ మాటం లేకుండా విమర్శించగల సమర్థులు. వారిపట్ల తనకు ఎంతో గౌరవంవుంది... వారే చరిత్ర ప్రసిద్ధమైన సాహిత్యాన్ని సృష్టించిన మహారచయితలు. వారి ఆరాధన లోనే తను మైమరచిన ఆనందాన్ని పొందుతూ, భావాల పర్వతాగ్రాలకు నడిచి, రెండు కళ్ళూ చాలనంత దృశ్యాల్ని చూడగలుగుతున్నాడు.

ఆలోచనలు, భావాలు, ఆదర్శాలు, అభిప్రాయాలు మొదలైనవి కొత్తరంగులు పూసుకున్నవి. ఒక వినూత్న దృక్పథం అలవడ్డాక, ప్రపంచమనే చిక్కు దారా నికి ఒకకొస చేతికందినట్లనిపించింది. జీవితంలో తనకు బాసగా, తోడుగా, నీడగా తన మనస్సే నిలబడి వుంది; మహారచనల ఆకు రాతిమీద పదును పెట్టబడిన తన మెద డుకు నిత్యజీవిత సమస్యలనేకం నల్లేరుమీది బండి నడకగానే ఉన్నవి.

జీవితాన్ని అనుభవిస్తూ అర్థంచేసుకోవాలి; లేదా అనుభవజ్ఞులనుంచి జీవిత సారాన్ని తెలుసుకోవాలి. మొదటిది చుట్టుతోవే కాకుండా, ప్రమాదకరమైనది కూడాను. కాని యీ రెండోది అడ్డతోవ. రచయితలనుంచి తాను తెలుసుకోగలిగిన

అనేక లోకోత్తర సత్యాలు, సాహిత్యంద్వారా తనకు పరిచయమైన అనేకమంది వ్యక్తులు, వారి తత్వాలు, ప్రపంచం పోకడ, సామాజిక జీవనం మొదలైన అనేక విషయాలు అర్థమైనవి. ఇంత చిన్న వయస్సులోనే ఎంతో అనుభవాన్ని సంపాయించి నట్లయింది.

దీంతోపాటే ఒకరకం వేదాంతంకూడా బోధపడింది. ఇన్నాళ్లూ తనకు అది లేదు, ఇది లేదనే బాధవుండేది. ఇప్పుడది చాలావరకు తగ్గింది. ఉన్నతాశయాలు, దృక్పథంలో పెరిగిన ఎత్తులనుంచి చూస్తే, తాను ఎరిగిన కొన్ని వ్యక్తిత్వాల దృష్టి నుంచి గమనిస్తే ప్రాపంచిక విషయాలు ఎంత అల్పమైనవో ననిపించేది. సాహిత్యంలో లోతులకు పొయ్యే కొద్దీ మనోవికాసం కలగటంవల్ల తానొక అసామాన్యుడుగా, అతీతుడుగా రూపొందగలుగుతున్నాడు.

కోర్కెలను తృప్తిపరిచేందుకు రెండు మార్గాలున్నవి. ఒకటి—కోర్కెను తీర్చుకోవటం. రెండు: కోర్కెను ఎదుర్కొని జయించటం. తనలాటి బీదవాడికి యీ రెండో పద్ధతే ఉత్తమమైనది. ఇది అన్ని సందర్భాల్లోనూ సాధ్యమయ్యేది కాదు కాని, స్వానుభవంద్వారా, ఉపాసనద్వారా చాలావరకు కోర్కెల వొత్తిడి నుంచి తప్పించుకోగలుగుతున్నాడు.

యీ కారణంగానే తాను తన చుట్టూవున్న వారి స్నేహాన్ని తృణీకరించినప్పటికీ, ఒక ప్రత్యేక ప్రపంచాన్ని సృష్టించుకొని, ప్రత్యేక వ్యక్తిత్వాన్ని రూపొందించుకోగలిగాడు. జీవితం తాను అనుకునేటంత దుఃఖమయంకాదనీ, జాగర్తగా ఆలోచించినట్లయితే అంతక్లిష్టమయిందికూడా కాదని తోచేది. అందుకనే బీదరిక బాధలోకూడా ఒక రకం ఉత్సాహంతోనే బతకటాన్ని నేర్చాడు. ఐతే ఇది సమస్యను ఎదుర్కోకుండా పక్కతోవల వెళ్లడం కాదా అనిపించేది...కావొచ్చేమో ? తగిన శక్తి సామర్థ్యాల్ని పొందే వరకూ తప్పించుకోక మరి చేసే మిటి ?

కొద్ది రోజులు గడిచాక, తను మాత్రం ఎందుకు సాహిత్యాన్ని సృష్టించ రాదనిపించింది; కాని తన అభిమాన రచయితల్ని తలుచుకుంటే, రాయటానికి సిగ్గేసింది. అందుకని తన అభిప్రాయాలను హృదయంలోనే దాచుకోసాగాడు. ఎన్ని కష్టాలకు ఓర్చుయినా సరే, చివరకు భోజనం మానుకొనికూడా పుస్తకాలుకొంటూనే వున్నాడు; చదువుతూనే వున్నాడు. ఆ పుస్తకాలిచ్చే ఆనందం ప్రపంచంలో మరెక్కడా తనలాటి నిర్భాగ్యుడికి దొరకదు !

అనేకరచనలు జీర్ణమై వంటబట్టినవి. ఇదివరకల్లే వాటిని మనస్సులో దాచుకునేందుకు మరి చోటులేదు. ఆలోచించినకొద్దీ అశాంతి ప్రబలుతోంది; ఆలోచనను ఆపేందుకు, మెదడును ఆగమనేందుకు వీల్లేదు. ఫలితంగా తనూ రాయసాగాడు.

ఒకరాత్రి కథరాశాడు; తీరా చదువుతే అనుకున్న దాంట్లో పదోవొంతు కూడా కాగితంమీదికి రాలేదనిపించింది. ఐతే తను నిరుత్సాహపడలేదు. మర్నాటి

రాత్రి మరో కథరాశాడు. యీ సారి రాసిందాన్ని చదివేందుకు భయపడ్డాడు. తనకు ఎలావుంటేనేం—ఇతర్లకు ఎలా వుంటుందో చూడాలనిపించింది; ఎందుకంటే ఆ రాసుకుంది తనకోసం కాదుగా!

ఐతే ఎవరికిచూపేట్లు? బాహ్యప్రపంచంలో తన మేలుకోరే వారెవ్వరూ లేరు గామరి! ముఖాముఖీగా ఎవరితోనూ నిలిచిమాట్లాడలేడాయె! ఎందుకైనా మంచిదని ఏదో మారుపేరుతో ఒక వారపత్రికకు పంపాడు. పంపిన నాటిరాత్రిమాత్రం ఏమౌతుందోనని తర్కించుకున్నాడు...దాని సంగతి ఎలావున్నా చేతుల దురద మాత్రం తీరలేదు. మళ్ళీ ఆరాత్రికూడా రాశాడు.

ఆ తరువాత దాదాపు రోజూ రాస్తూనేవున్నాడు. పత్రికకు పంపిన రచన సంగతే మరిచిపోయ్యాడు. ఒకనాటిరాత్రి గదికి రాగానే కాళ్ళకేదో తగిలి ఎగిరి గంతేశాడు. అగ్గిపుల్ల వెలిగించిచూస్తే పత్రిక! అప్పుడు గుర్తొచ్చింది-బహుశా తన కథ అచ్చయి వుంటుందని. ఎంతో ఆతృతతో లాంతరు వెలిగించి చకచకా పత్రిక పేజీలు తిప్పాడు. తన కథ అచ్చయింది...ఎంత ముద్దులు మూటగడుతూ వుందా అచ్చు! నిజంగానే తన కథ ఎంత అందంగా వుంది!

చదవసాగాడు...చాలా బాగుంది! రాస్తున్నప్పుడు, రాశాక అంతబాగా లేదనిపించింది. తీరా అచ్చయ్యాక ఎంతో బాగుంది! ఆ సంపాదకునికూడా బాగుండే ఉండాలి; లేకుంటే ఎందుకు ప్రచురిస్తాడు?

ఒక మేరుపర్వతమే ఎక్కినట్లయింది. ఎంతో ఉత్సాహం, ఒక కొత్తశక్తి తనలో ప్రవేశించింది. పదిహేనురోజులుగా రాసిన ఏడెనిమిది కథల్నీ యీ నాడు తిరిగి చదివే ధైర్యం కలిగింది. పత్రికలోని మిగతా కథల్నికూడా చదివిచూశాడు. ఏ కథాకూడా తన ప్రచురిత రచనతో కానీ, రాతలోనే వున్నవాటితో కానీ సమానంగాలేదు...కనుక తాను మంచి రచయితగా పేరుపొందటం చాలా తేలికే నని పించింది.

యీసారి రెండు కథల్ని ఆ వారపత్రికకూ, మరోరెంటిని ఇంకో వారపత్రికకూ పంపాడు. ఎవరో వీపుతట్టినట్లనిపించి, ఇన్నాళ్లుగా తాను వూహించిన అనేక కథలకు రూపాన్నిచ్చేందుకు తనను పురిగొల్పినట్లే భావించాడు. రచయితలో ఆనిష్టూకణం పడాలి కాని, మెదడు దగ్ధమవుతూ, ఊహా పరంపరలనే పొగను విరజిమ్ముతుందనే సత్యం తనపట్ల రుజూఐంది.

రెండు మూడు నెలలు గడిచినవి; రచనలన్నీకూడా కలం పేరులోనే అచ్చవుతూన్నవి. కాగితం చెడగొట్టకుండా తాను మనసులోనే ఒక విశిష్టరూపాన్నివ్వగలిగిన భావాలను తేలిగ్గా, వాడిగా రాయగలుగుతున్నాడు. కొన్ని పత్రికల వాళ్లు కొద్ది ప్రతిఫలంకూడా పంపారు. ఇది అతని ఉత్సాహాన్ని రెట్టించింది. కేవలం వినోదం

కోసమే గాకుండా, కొద్దిగా ధనసంపాదనకూడా ఇది సాధనమని తెలుసుకోగానే దీన్ని నమ్ముకొని తన ఆర్థిక దుస్థితిని కొంతవరకూ చక్కబెట్టుకోవొచ్చనీ, తనకొక దారి దొరికిందనీ సంతోషించాడు.

ఐతే తన యీ సాహిత్యసేవనుగూర్చి ఎవ్వరికీ చెప్పలేదు. ప్రజలు ఏమనుకుంటున్నారో వినాలనివుంది; కాని ఆ అవకాశాన్ని కల్పించటం ఎలా?...అతాత్తుగా ఒకనాడు ఇద్దరు విద్యార్థుల సంభాషణ విన్నాడు. వారు తనురాసిన కథనుగూర్చే చర్చిస్తున్నారు. వారి మాటల ధోరణిని చూస్తే ఉత్తమసాహిత్యమనే వారి అభిప్రాయాన్ని గ్రహించగలిగాడు. మాంచి ధైర్యం కలిగింది. చాలు — ఇలాగే పాఠకులు అనుకున్నంత కాలం, సాహిత్యసేవలో తను వెనుకంజ వేయక్కర్లేదు.

తన అభిప్రాయాలనేకం సాహిత్యంద్వారా దేశం మూలమూలకూ ప్రసారమౌతూన్నవి. పత్రికల్లో ప్రచురించబడే సంపాదక లేఖల్లో తన రచనల ప్రాశస్త్యాన్ని గూర్చికూడా చదువుతూనే వున్నాడు. తనకు గర్వం కలిగినమాట నిజమే కాని, అందువల్ల మూర్ఛపోలేదు. అది ఒక రకం ఆత్మవిశ్వాసాన్ని నెలకొల్పింది; ఫలితంగా తను నవలా రచనకుకూడా దిగాడు.

ఇలా వుంటూండగా తనకొక సాయింత్రం లలితతో పచరియమైంది.

# 7

ఆ సాయంత్రం పద్మనాభంగారి మేడలోని గదిలో సెకండ్ ఫారం చదివే ఆయన కుమార్తెకు ట్యూషన్ చెపుతున్నాడు. అవతలి గదిలో ఎవరో చుట్టాలో, స్నేహితురాండ్రో వొచ్చిన హడావిడి స్పష్టంగా వినిపిస్తోంది. శిష్యురాలు త్వరగా తనను వొదిలించుకొని వెళ్లే ప్రయత్నంలో వుంది; కాని, తనే పట్టుదలతో ఆమెకు పాఠం చెపుతున్నాడు. ఆమె అన్యమనస్కంగా ఉండటంవల్ల, కోపంవొచ్చింది; అంతకన్న అవతలి గదిలోని నవ్వులూ, పరాచికాలూ, వాటిని తమకు ఎగుమతిచేసే వ్యక్తులూ తన క్రోధానికి కారకులయ్యారు.

ఏం చేయటమో తోచక నా నా అవస్థపడే సమయంలో 'చిట్టీ!...చిట్టీ!' అంటూ లలిత నవ్వుకుంటూ ప్రవేశించింది. ఇక చిట్టి యీమెను చూడగానే, తన చదువూ, మాష్టరూ, యీ ప్రపంచమే మరిచిపోయి లలిత దగ్గిరికి పరుగెత్తింది.

కాని లలిత పరిస్థితంతా క్షణంలో మారిపోయింది. నవ్వుతో కలకలలాడే ఆమె ముఖాన్ని కారుమేఘం కమ్మివేసినట్లయింది. చేయరాని పొరపాటు చేసినట్లు, చూడక ఎవరికో హానిచేసినట్లు, దాని తాలూకు పశ్చాత్తాపంతో వేగిపోతున్నట్లు బాధపడింది.

ఎదురొచ్చి కావిలించుకునేందుకు సిద్ధంగావున్న చిట్టినికూడా గమనించకుండానే "సారీ! మీ చదువు పాడుచేశాను!" అందామె.

ఆమె ఆనందాన్ని పాడుచేసిన తనే తిమార్పణ వేడటం ధనికులింట ఆచార మేమోనని బాధతో ఉక్కిరిబిక్కిరవుతూన్న తనకు, వూపిరి పీల్చుకునే సావకాశం కలిగింది. తనపట్ల ఇంతదయగా మాట్లాడే వారుంటారని తనెన్నడూ తలచలేదు.

"ఫర్వాలేదు..." అని తలవొంచుకున్నాడు.

యీ లలితను చూడటం తనకిది మొదటిసారి కాదు; ఆమె తనకు క్లాసు మేటు కూడాను. క్లాసులో వున్న ఐదారుగురు ఆడపిల్లల్లోనూ యీమె అన్నింటా మిన్న. ఒకటి రెండుసార్లు తనతో మాట్లాడాలని ప్రయత్నించింది కాని, తనే దులుపుకొని పారి పొయ్యాడు. అదంతా తనకు గుర్తుంది; ఇంతకుపూర్వం ఆ జరిగిన చిల్లర సంఘటనల్ని గూర్చి ఎన్నడూ ఆలోచించలేదు... ఇక ఇప్పుడు జరిగిన యీ సంఘటన ఒక విధంగా తనకు కొత్త సమస్యల్ని తెచ్చిపెట్టింది:

మొదటిది: ఆమె పరిచయం చేసుకోవాలనుకున్నా తను పారిపోయి పరాభ వించటం; రెండోది: తన జీవిత రహస్యం—ట్యూషన్లు చెప్పుకొని నానా అవస్థలూ పడుతూన్న సంగతి యీమెకు తెలియటం! విద్యార్థులెవ్వరికీ తెలియకుండా, అతి మెలకువగా తను చేస్తున్న ప్రయత్నానికి యీనాడు భంగం వాటిల్లింది. ఇక యీమె యీ పెద్దింటికి ఆత్మీయురాలే ఐవుండొచ్చు; కనుక తనను గూర్చి చెడుగా చెప్పినా చెప్పవొచ్చు. ఏమైనా తను యీ ఇల్లు మానుకోవటం ఉత్తమం.

ఇంతలో ఇల్లాలు రమణమ్మగారు వొచ్చింది. నిశ్చేష్టులై నిలబడ్డ లలితనూ, తననూ, చిట్టినీచూస్తే ఆమెకేమీ అర్థమవలేదు.

"లలితా! ఆయన అమ్మాయి ట్యూటర్... రాజారావుగారు" అని పరిచయం చేసింది ఆమె.

"ఆయన నాకు తెలుసు... నాకు క్లాస్‌మేట్ కూడాను. నేను ఆయనకు తెలియ దనుకుంటాను" అని కొంతాగి "నమస్కారం మాష్టారూ!... కాదు... నమస్కారం కవిగారూ!" అని నమస్కరించింది.

తన పరిస్థితి ఘోరంగా తయారైంది. యీమె హృదయ పూర్వక నమస్కా రాన్నే చేసిందో, లేక ఎగతాళిగా చేసిందో అర్థంకాలేదు. ఆమె తనను నిందించినా, హేళనచేసినా, అవమానించినా భరించలేక కాదు... అన్నిటికన్నా 'కవిగారూ!' అని ఎందుకన్నదో అసలే అర్థంకాలేదు... ఎలాగో సంబాళించుకొని, కొంత ఆలస్యమైనా ప్రతినమస్కారం చేశాడు.

'విచిత్రంగా వుందే... ఆయన నీకు తెలియటం, క్లాసుమేటువై వుండీ, ఆయ నకు నీవు తెలియక పోవట మేమిటి?' అందా ఇల్లాలు.

లలిత జవాబు చెప్పకుండానే చిలిపిగా తనవైపు చూసి నవ్వింది. ఆ అనుమానం అలాగే వుండగా 'కవిగారూ! అంటావేమిటీ?' అంది రమణమ్మగారు.

'నీకు తెలియదా పిన్నీ! వీరు 'రాజు' అనే మారుపేరుతో కథలు రాస్తూంటారు' అంది లలిత.

తన సంగతి ఎవ్వరికీ తెలియదనుకున్న తను దిగ్భ్రాంతుడయ్యాడు. మాట్లాడేందుకు తనకేమీ మిగలలేదు. తప్పించుకునేందుకు మరోదారిలేదు.

'అట్లాగా?...కొన్ని కథలు నేనూ చదివాను...ఏమండీ! మాష్టారూ! ఎప్పుడూ మాటమాత్రమైనా అన్నారు కారేం?' అంది రమణమ్మగారు.

'ఆఁ...ఏదోలెండి...'అని చప్పరించాడు తను.

'బాగా రాస్తారు పిన్నీ! అచ్చయిన వారి కథలన్నీ నా దగ్గర వున్నాయ్... పంపుతాను చూడు' అంది లలిత, మాట్లాడేది పిన్నితోఐనా, ఆ మాటలు తనను ఉద్దేశించే.

'పంపవే తల్లీ! మధ్యాహ్నం మరీ తోచక ఛస్తున్నాను...' అందామె.

తనకు వల్లమాలిన సిగ్గయింది. ఇంకే సందర్భంలోనన్నా ఐతే యీ పొగడ్తను వేరొకవిధంగా ఆనందించగలిగేవాడు...కాని ఇక్కడ, తను కుంచుకుపోవాలిసి వొచ్చింది.

"ఏమే చిట్టీ! బాగా చదువుకుంటున్నావా?" ఇంత సేపటికి కాని తనను పలకరించనందుకు చిట్టికి కోపం వొచ్చింది; కాని వీరి సంభాషణనుబట్టి మాష్టారు సామాన్యులు కారని తెలుసుకొని, వారి శిష్యరికం లభించినందుకు గర్వంకలిగిందామెకు; ఆ పొగడ్తల్లో తనకు కూడా భాగమున్నంత తృప్తి కలిగింది. కనుకనే లలిత పలకరించగానే ముడుచుకొనిపోయిన ఆమెముఖం వెంటనే వికసించింది.

"చదువుతున్నా నక్కాయ్!...నువ్వు బాగా చదువుకుంటున్నావా?" అంది చిట్టి. తనపట్ల చూపిన మర్యాదనే లలితక్కాయ్ పట్లకూడా చూపవలసిన బాధ్యత వున్నదని దాని అంచనా.

"ఏదో చదువుతున్నాను. మనిద్దరి చదువులసంగతీ మీ మాష్టారికి బాగా తెలుసు" అంది లలిత నవ్వుతూ.

మాష్టారిపని నీళ్లల్లో మునిగిపోతూన్నట్లు తయారైంది. తన ఆధిక్యతను వారు స్పష్టంగా గుర్తిస్తూన్నప్పటికీ తనకు 'వెగటుగా' వికారంగా తోచింది. ఎంతత్వరగా యీనాటికి ఇక్కణ్ణుంచి బైటపడటమా అనే ఆలోచనలో పడ్డాడు.

"సరే నేను వొస్తానుపిన్నీ—"

"పత్రికలు పంపటం మరిచిపోవొక"

"తప్పకుండా పంపుతాగా!...వొస్తానే చిట్టీ! ఆదివారంనాడొచ్చి నిన్ను మా ఇంటికి తీసుకెళ్తాను...వొస్తాను మాష్టారూ!" అని చిలిపిగా నవ్వుతూ, తిరిగి నమస్కరించింది. ఇప్పటికే మతిపోయిన మాష్టారు జవాబు చెప్పలేక పొయ్యారు. పిన్నితోపాటు, లలితకూడా నిష్క్రమించింది. గాలివాన వెలిసినట్లయి, తను మళ్ళీ యీ ప్రపంచంలోకి పడ్డాడు.

"మాష్టారూ!" అంది చిట్టి.

"ఆఁ" అని మూలిగాడు.

"మా లలితక్కయ్యకుకూడా మీరు ట్యూషన్ చెపుతున్నారా?" అంది; తన చదువుసంగతి మాష్టారికే తెలుసని లలిత అనటానికి చిట్టితీసిన అర్థమది!

"లేదు ... లేదు ... మీ లలితక్కయ్య కాలేజిలో చదువుతోందికదూ! నే చదివేక్లాసే!" అన్నాడు.

చిట్టికి అర్థమైంది. తర్వాతి కార్యక్రమంకోసం ఆమె వేచివుంది.

కాని మాష్టారికి అంతా అగమ్యగోచరంగా తయారైంది. ఇక్కడ తనను ఎదుర్కొన్నది అభిమానమో, అవమానమో తేల్చుకోలేకుండావున్నాడు. మరి చదువు చెప్ప బుద్ధికాలేదు.

"చూడు చిట్టీ! నాకు తలనొప్పిగావుంది కాని..."

తనమాట పూర్తికాక మునుపే "మాఇంట్లో తలనొప్పికి మంచిమందువుంది .. తెస్తాను" అని లేచింది.

కాని చెయ్యిపట్టుకొని బలవంతాన కూర్చోపెడుతూ "మందేమీ అక్కర్లేదు. కాస్సేపు కళ్ళుమూసుకొని పడుకుంటే అదే పోతుంది...చూడు రేపటికి యీ పేజీ లోని లెక్కలన్నీ చేసిచూపు. కాపీరాయి. ఇంగ్లీషుపాఠం చెప్పాను కదా...ఇక నేను వెళ్తాను" అని లేచి నిలబడ్డాడు తను.

యీ వెళ్ళటం పదినిమిషాల ముందైతే, తను కాస్సేపు లలితాక్కయ్యతో ఆడుకునేది కదా అని చిట్టి విచారించివుంటుంది. ఏమైతేనేం—చదువు ఆపటమే యంలో మంచిదిగా తోచింది. తను మాట్లాడకుండా బైటపడ్డాడు.

వరండాలో కుర్చీలలో కూర్చొని రవణమ్మగారూ, లలితా బాతాఖానీ వేస్తు న్నారు. తీరా అక్కడికి వొచ్చాక కాని ఈ సంగతి తెలియలేదు. లలిత వెళ్లిపోయి వుంటుందని తను పొరబడ్డాడు. ఇక చేసేదిలేక, తలవొంచుకొని అక్కడ ఎవరూ లేనట్లుగానే, అటు చూడటం భయమైనట్లు చకచకా నడిచివెళ్ళాడు. గేటు తెరుచు

కొని, రోడ్డుమీద కాలుపెట్టాక, గేటు వేసేందుకు వెనక్కు తిరగాల్సివొచ్చింది. ఎదురుగుండా కుర్చీలో లలిత పమిట చెరుగు వేలికిచుట్టుకుంటూ మెరిసేకళ్ళతో తన వైపే చూస్తోంది...ఆ చూపుల తీవ్రతకు భయపడి వేగంగా, బరువుగా కాళ్ళీడ్చు కుంటూ రోడ్డుకు అడ్డంపడ్డాడు.

## 8

ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. సాయంత్రం జరిగిన దృశ్యమంతా, యథాతథంగా ప్రతి కదలికతోనూ, సంభాషణలోని ప్రతి అక్షరంతోనూ అతని మనస్సులో తిరగసాగింది. దానిమీద పరామర్శ ఎంతకూ తెగటంలేదు.

తన రచనలు బాగుంటవని లలిత అన్నది; మొహమాటాని కన్నదో, ఎగతాళిగా అన్నదో, నిజంగానే అన్నదో ఎంత తర్కించుకున్నా అర్థం కాలేదు. అసలు లలి తను కానీ, తన క్లాసులో చదివే ఎవర్నికానీ కలుసుకోవటం తనకు ఇష్టంలేదు. ఒకప్పుడు లలిత తనను పలకరించినా తను దులుపుకు పోవటం, ఆమెతో మాట్లాడ కుండటంతో, ఆమె యీ విధంగా దొరికిన అవకాశాన్ని వృధాచేయకుండా తనమీద కసితీర్చుకుంటోందేమో ?

ఎంతగా ఆలోచించినా లలితమాటల్లో కాఠిన్యం తనకు కనిపించలేదు. ఎందు కనో కాని ఆమె అభిమానాన్నే చూపిందనే నమ్మకం కలిగింది. ఆమె ఉద్దేశం ఏమిటో, తనపట్ల ఆమె అభిప్రాయం ఏమిటో తను వొచ్చేశాక, ఆ ఇంట్లో తప్పక మారుమోగివుంటుంది. దాని ఫలితాన్ని మర్నాడు సాయంత్రం తను తేలిగ్గా తెలుసు కో గలుగుతాడు.

ఒకవేళ ఇంటి వారికి తనపట్ల దురభిప్రాయమే కలిగేట్లయితే, రేపు ఒకటో తారీకు కనుక, తన జీతం ఎనిమిది రూపాయిలూ ఇచ్చి మాన్పిస్తారు; అంతకన్న వారేం చేయలేరు. తన యీ సంపాదన పోతుంది. మరోట్యూషన్ వెతుక్కోవాలి... దొరక్కపోయినా ప్రమాదంలేదు. సాయంత్రం పూటకూడా రచనలు సాగిస్తే ఆ ఎనిమిది రూపాయిలూ గిట్టకపోవు. కనుక ఇదో పెద్దసమస్యగా తనకు తోచలేదు.

. . . అప్పుడే లలితను రెండు కోర్కెలు కోరుదామనుకున్నాడు. ఒకటి : తను రచ యితన్న సంగతి ఎవరికీ చెప్పవొద్దని. రెండు : తన జీవిత రహస్యాలు ఆమెకు తెలిసి నంత వరకూ హృదయంలోనే వుంచుకోమని. ఇవి చాలా అల్పమైనకోర్కెలే ! లలితలాంటి సహృదయ తనలాంటి బీదవానిపట్ల యీ మాత్రం జాలిదలచగలదని నమ్మ కం...కాని ఆ సమయంలో అడగలేక పొయ్యాడు. మళ్ళీ సమయం దొరుకుతుందనే నమ్మకంలేదు. తనంటతానుగా ఆమెను కాలేజిలో పలకరించలేదు; ఆమె మాట్లా డేందుకు ప్రయత్నించినా, తను అచేతనుడవుతాడు. మరి ఏం చెయ్యాలో తోచలేదు.

అసలీమెకు తను కథలురాస్తాడని ఎలా తెలిసిందో? ప్రచ్ఛన్నంగా వుండి, యీ మారుమూలనుంచి తనేదో సాహిత్యసేవచేస్తున్నాడు; ఒక్క-సంపాదకులకుతప్ప తన సంగతి, తన చిరునామా ఎవ్వరికీ తెలియదు. యీమె ఎలాపట్టుకో గలిగిందో?... దీనికి సమాధానం ఆమె చెప్పాల్సిందే కాని, తను ఎంత గింజుకున్నా తేల్చుకోలేడు.

ఐనా యీ లలితతో తనకు లెక్కేమిటి? ఒక వ్యక్తినిగూర్చి అనేక అభిప్రాయాలు ప్రజల్లో ఉంటవి. వాటన్నినీ తనుపట్టించుకోలేడు. ఇది వరకు వలెనే యీ ప్రపంచంలో తామరాకు మీది నీటి బొట్టువలె, అంటీ అంటకుండా జీవయాత్ర సాగిస్తే బాధఉండదు. పోతే ఆ జరగబొయ్యేది ప్రమాదంగానే తోచదు. ఒక వేళ అది దుర్ఘటన ఐనప్పటికీ, దాన్ని జయించగల అస్త్రాన్ని సిద్ధంచేసుకున్నాడు కనుక, భయపడాల్సిన పనిలేదు. ఇలా ధైర్యం చెప్పుకున్నాక మనశ్శాంతి లభించింది. ఆత్రుత చాలావరకు తగ్గించుకున్నాక, ఏ తెల్లవారు జామునో కాస్త కునుకు పట్టింది.

మర్నాడు కాలేజిలో ఎన్నడూలేంది లలితను కనిపెట్టాలనే గాఢవాంఛను అరికట్టలేక పొయ్యాడు. ఆమెను సాధ్యమైనంత తెలివిగా, చాటుగా చూస్తూనే వున్నాడు. కంటి చివర్లనుంచి చూసినప్పటికీ, ఆమెకూడా తనకన్న తక్కు- ఆసక్తితో తనను కనిపెట్టటం లేదనే సంగతి గ్రహించగలిగాడు...బహుశా యీమె యీ పని చాలా కాలంగా చేస్తూ ఉండి ఉండొచ్చు; తనెప్పుడూ పట్టించుకోలేదు కనుక తనకు తెలిసివుండదు. ఏమైనా ఆమె చూపుల్లో తనకేమీ అర్థంకాలేదు. అభిమానమే ఇమిడి వుందనుకోవటం భయపెట్టింది; యీ అభిమానాలను తానీనాడు భరించగలిగే స్థితిలోలేడు. ఎంతకూ యీ ప్రపంచమంతా ముక్కూ మొహం తెలియని మనుషుల్తో నిండి వుందనే అభిప్రాయమే తనకు ప్రశాంతినిస్తుంది.

గత సాయంత్రపు పరిచయాన్ని పురస్కరించుకొని లలిత తనను పలకరిస్తుందేమోననే భయంవేసింది. యీసారి ఆమె పలకరిస్తే తప్పుకోనేందుకు వీల్లేదు; అంత నిర్మోహమాటంగా ప్రవర్తించలేడు. పోతే అలాటి అవకాశమే కలగకుండా తప్పించుకొని తిరగటం ఒక్కటే తనకు క్షేమకరమైన దారివలె తోచింది.

కాలేజి విడిచి పెట్టగానే తొందర తొందరగా బైటపడ్డాడు. ఆమె ఎక్కడ వెంట పడుతుందోనని తనభయం. ఇది భ్రమే ఐనప్పటికీ, పొరపాటున నిజమైనదంటే లేనిపోని రొంపిలోకి దిగవలసివుంటుంది. అందుకనే అడ్డతోవల్ని పడి చకచకా నడవ సాగాడు. కొంత దూరం వెళ్ళాక వెనక్కు తిరిగి చూసి, తననెవరూ వెంబడించటం లేదని తెలుసుకొని, ఆత్రుత తగ్గించుకొని, మెల్లిగా నడుస్తూ బడలికను తీర్చుకో సాగాడు.

తీరా పద్మనాభంగారి ఇంటిలో ప్రవేశిస్తూండగా హాలులో లలితగొంతు వినిపించింది. యీమె కారులో తనకన్న ముందుగానే ఇక్కడికి ప్రత్యక్షమైంది. లోపల

వున్న వ్యక్తి కంఠస్వరాన్నిబట్టి, ఎవరో తెలుసుకున్నాక, యీ రోజుకు నాగాపెట్టి వెనక్కు వెళ్ళిపోదామా అనిపించింది. కాని వెంటనే ఎంతో ధైర్యంగా వుండవలసిన తను ఏ నేరమూ చేయని తను ఎందుకు భయపడాలో, కేవలం తన నీడకు తాను భయపడ్డంత హాస్యాస్పదంగా ఎందుకు ప్రవర్తించాలో అర్థంకాలేదు. యీ పిచ్చి వూహాలు తనను బెదరగొడుతూన్నందుకు, తనను తాను దూషించుకున్నాడు. ఇప్పుడు వెనక్కు మళ్లటంలో అర్థంలేదు. యీ ఇంటికి తను వచ్చిన పనివేరు; ఆమె వొచ్చిన పనివేరు. ఒకరికొకరు సంబంధంలేదు. అదీగాక ఇవ్వాళ జీతమిచ్చే రోజు. ఇది వసూలు కానిదే తను ఇంటి అద్దె ఇవ్వలేడు. కనుక డబ్బు అవసరం తనను వెనక్కు వెళ్ళనివ్వదు.

క్షణంలో తనకు తాను ధైర్యం చెప్పుకొని, సరాసరి చిట్టి గదిలోకి వెళ్ళాడు. తను సావిట్లోంచి వెళ్లటం రవణమ్మగారూ, లలితా, చిట్టీకూడా చూశారు. అతాత్తుగా వాళ్లు మాట్లాడటం మానేశారు; దీన్నిబట్టి వాళ్ళు తన విషయమే మాట్లాడుతూండి ఉండొచ్చని తోచింది. ఏం మాట్లాడుతున్నారోననే ఆతృత కలిగింది. ఇదివరకల్లే నిర్లక్ష్యంగా వుండే లక్షణం మాయమైంది; దానిస్థానే ఒక గొప్ప ఆదుర్దా వేధించ సాగింది.

గదిలోకివెళ్ళి తివాసీమీద కూర్చున్నాడు. చిట్టి వొచ్చినా బాగుండేది; వెంటనే పాఠం గొడవలోనన్నా పడేవాడు. హాలులోమాత్రం సంభాషణ సాగుతూనే వుంది. ఐతే పూర్వంవలె కాకుండా, చాలా తక్కువస్థాయిలో మాటలు వెలువడుతూండటంవల్ల, సన్నని రొదతప్ప, చెవులు ఎంతరిక్కించివిన్నా, ఒక్కమాటకూడా వినిపించటంలేదు. ఇదంతా తననుగూర్చే ననేందుకు ఎలాటి సందేహమూ లేదు.

ఐదునిమిషాల ఒంటరితనాన్ని భరించలేనిస్థితిలో చిట్టి నవ్వుకుంటూ కాఫీగ్లాసుతో వొచ్చింది. ఇంతకుముందొకసారి, చిట్టిపుట్టినరోజు పండుగకుమాత్రమే ఇలాటి మర్యాద తనకు జరిగింది. ఇవాళ అంతా కొత్తగా కనిపించింది.

'వొద్దు...చిట్టీ! నాకు కాఫీ అలవాటులేదని నీకు తెలియదా?'అన్నాడు.

'ఐతే పాలు తెమ్మంటారా?'

'ఏమీవొద్దు...తీసుకెళ్ళి, నీ పుస్తకాలు తెచ్చుకో.'

'మెల్లిగా మాట్లాడండి. అమ్మవింటే కోప్పడుతుంది. మీరు తాగకుంటే అమ్మవూరుకోదు.' అంది చిట్టి.

యీ బలాత్కారం అర్థంకాలేదు. విశదీకరించమని అడగటానికీ వీల్లేదు; ఐనా చిన్నపిల్ల చిట్టి ఏం చెప్పగలదు? వాళ్లఅమ్మ జారీచేసిన హుకుంను అమలు జరపటమే

అది చేయగలిగింది...ఇక తప్పనిసరిగా పెదవులు కొరుక్కుంటూ కాఫీగ్లాసును ఖాళీ చేశాడు.

వాతావరణంలో పెద్ద మార్పు ఆరంభమైంది. ఇది ఇప్పటికి చాలా అనుకూలంగా తోస్తున్నప్పటికీ, దీనివల్ల ముందు ముందు ఏం ప్రమాదాలు వాటిల్లుతవో నని భయం అంకురించేందుకు కారణభూతమైంది...ఏదో ఆలోచిస్తూండగా హాలులో నుంచి సన్నగా, కిలకిలా నవ్వులు వినిపించినవి. ఒక కంఠస్వరం చిట్టిది: మరోటి లలిత దని గ్రహించాడు. తననే ఎగతాళి పట్టించి నవ్వి ఆనందిస్తున్నారనిపించింది. ఇదే నిజమైతే-! ఎన్నడూలేనిది మనస్సులో భగభగలు, భుగభుగలు ఆరంభమైనవి. ఎవరిబతుకు వాళ్ళు బతుకుతూండగా, ఒకళ్లనుచూసి వేరొకరు హేళన చేయవలసిన అవసరం ఏమిటి ?...ఐనా తను పొరబడుతున్నాడేమో ? వాళ్లు ఎందుకు నవ్వుతున్నారో తెలుసుకోకుండా తను వూహించటంలో అర్థంలేదు. ఏమైతేనేం తనపని చేసుకొని చేతులు దులుపుకొని పోతే సరిపోతుంది. యీ ఇంటికి లలిత రానీ, మొత్తం కాలేజి లోని జనాభా అంతా రానీ-తనకేం ? తను పట్టించుకోకుండటమే తనకు రక్ష !

మూడు నిమిషాలు గడిచాక చిట్టి వొచ్చింది. యీసారి పుస్తకాల సంచితో రావటంతో తన మనస్సు తేలికయింది. ఎంతో పట్టుదలతో గమ్యస్థానం లేకుండా పరిపరి విధాల పరువులెత్తే మనస్సును స్వాధీనంలోకి తెచ్చుకున్నాడు. బలవంతాన చిట్టి చదువుమీదికి శక్తినంతటినీ కేంద్రీకరించుకున్నాడు.

ఆమె చేసిన లెక్కలు చూశాడు. రెండు తప్పినవి. ఎక్కడ తప్పులైనవో చూపి మళ్లీ చేయమన్నాడు. కొత్త లెక్కలు చేయవలసిన విధానం చెపుతూ, చేయవలసినవి గుర్తులు పెట్టాడు.

తర్వాత ఇంగ్లీషు పాఠం అప్పగించుకున్నాడు. యీ పిల్లతో తనకెప్పుడూ బాధలేదు. వినయంగా, శ్రద్ధగా చదువుతుంది. సామాన్యంగా తనకు విసుగు కలగ నీదు. అసలే సాయంత్రం దాకా, ఒకపక్క ఆకలి బాధకు తట్టుకుంటూ కాలేజీలో శ్రమపడి, సాయంత్రం ట్యూషన్ చెప్పటమంటే చాలా బాధగా వుంటుంది...కాని యీ ఇంట్లో ట్యూషన్‌లో ఆ బాధంతా మరిచి పోగలడు. కనుకనే, ఇది తనకు సుఖంగానే వుంది.

ఐతే యీనాడు రోజూలేని తొందరొకటి అతన్ని నిలవనీయటంలేదు. పాఠాలు చకచకా చెప్పుకొని పోతున్నాడు. ఆమెకు అర్థమౌతోందా లేదా అని అగటంలేదు; అసలామె మొహమే చూడటంలేదు. ఇది కొంచం ఇబ్బందిగానే తోచటంవల్ల చిట్టి 'మాస్టారూ ! ఇంగ్లీషు పాఠం నాకు అర్థమవలేదు' అంది.

ఇందాకటి నుంచీ తన కంఠశోషేనన్నమాట ! కోపం వొచ్చింది కాని, వెంటనే తనను తాను సంబాళించుకున్నాడు. తను చాలా అన్యమనస్కంగా వుండి,

ఒక పక్క తన చెవుల్ని హాలువైపు తిప్పి ఆలోచిస్తూ, ఏదో యాంత్రికంగా వాడు తూన్న పొరపాటును గ్రహించాడు. సిగ్గుపడి, వెంటనే తనను తాను స్వాధీనంలోకి తెచ్చుకొని, పూర్వంవలెనే ఆమెకు అర్థమయేట్లుగా నెమ్మదిగా చెప్పసాగాడు.

ఎందుకనోకాని ఇవాళ చిట్టి రోజూకన్న ఎక్కువ ఉత్సాహంగావుంది. ఏదో సంతోషమైన వార్తవిని, దాన్నిక హృదయంలో దాచుకోలేక, ఉరకలు వేస్తున్న లక్షణాలు స్ఫుటంగా కనిపిస్తున్నవి. ఇందాకటినుంచీ తానా సంగతి కనిపెట్టలేదు.

మొత్తంమీద ఆరయ్యేప్పటికి మామూలు ప్రకారమే ట్యూషన్ పూర్తయింది. చిట్టి పుస్తకాలు సర్దుకుంటూ, 'మాస్టారూ! మీరు కథలు రాస్తారటగా?' అంది.

తనకు తత్తరపుట్టింది: యీ ప్రచారం తన శిష్యురాలిదాకా వొచ్చినందుకు నొచ్చుకున్నాడు. కాని ఎలాగో జవాబుచెప్పి తప్పించుకోవటమే ఉచితంగా తోచింది.

'ఏవో రాశాను—ఎవరు చెప్పారు?'

'మా లలితక్కయ్ చెప్పింది. మీ కథలన్నీ కలేసి బైండుచేయించిన పుస్తకం తీసుకొచ్చి ఇందాక అమ్మకు ఇచ్చింది—'

'ఊహుఁ.' అన్నాడు నిర్లక్ష్యంగా.

'మాస్టారూ!'

తను మొహం పైకెత్తి ఆమె మొహంలోకి సూటిగా చూశాడు.

'యీ వెధవ పాఠాలు మానేసి నాకు కథలు చెప్పరాదటండీ?' ఆమె అమాయకంగా, మనసులోనిమాటను దాయకుండా చెప్పినందుకు సంతోషించాల్సిందే కాని, యీ మాట రవణమ్మగారు వింటే ఇంకేమన్నావుందా? ఐనా తను చదువు చెప్పేందుకే నియమించబడ్డాడని పాపం ఆమెకు తెలియదు.

'తప్పు! అలా అనకూడదు. కథలు చెప్పటమేమిటీ! నీకు చదువొచ్చాక— చదువుకో' అన్నాడు. ఆమెకీ జవాబు నచ్చలేదు; చేసేది లేక అయిష్టంగానే తల ఆడించింది.

ఇవాళ జీతమిచ్చేరోజు-డబ్బు చాలా అవసరంగాకూడావుంది. కాని యీ యింట్లో తనెప్పుడూ జీతం అడుగడు. వెళ్తూవెళ్తూ ఒక్కసారి రవణమ్మగారి వొంక చూస్తాడు. ఆమె గ్రహించుకొని తనను పిలిచి ఎనిమిది రూపాయలూ ఇచ్చేస్తుంది. అసలామెకు ఇలాటివి చాలా గుర్తుకూడాను.

కాని యీనాటి పరిస్థితి వేరుగావున్నట్లు తోచింది. హాలులో కులాసాగా లలితతో కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్న రవణమ్మగార్ని చూపుల్తోనైనా అర్థించటం ఎలా? ఆ కబుర్లలో తనమాట జ్ఞాపకం లేకుండటం సహజమే...తనేమైనా తొందర

పడితే ఆమె నొచ్చుకోగలదు. మరీ లలిత వొకతె ఆమెను అంటిపెట్టుకొని ఉండటం చాలా ఇబ్బందిగాకూడా వుంది; సాటి వ్యక్తి దగ్గిర కావాలని అవమానాన్ని వరించి నట్లవుతుంది.

పిల్లి నడకలు సాగిస్తూ మెల్లిగా సావిట్లోకి ప్రవేశించాడు. రవణమ్మగారు లలితవైపు తిరిగి మెల్లిగా మాట్లాడుతోంది...తనరాకను లలిత చూసిందికాని, రవణమ్మగారు గమనించలేదు. లలిత నవ్వుతూ పలకరిస్తున్నట్లుచూసి, తగిన జవాబు రానందువల్ల మొహంముడుచుకొని దృష్టిని పిన్నమ్మవైపు తిప్పుకుంది.

ఇక ఇవాళకు లాభంలేదని మెట్లుదిగాడు...నిరాశతో బాధతో కుంగిపోతూ మెల్లిగా అడుగులు వేయసాగాడు. గేటుదగ్గిరికి వెళ్ళాక వెనుకనుంచి చిట్టి 'మాష్టారూ! మాష్టారూ!' అని కేకవేసింది. వెనక్కి తిరగి చూడగానే 'అమ్మ పిలుస్తోంది... రండి' అని చెయ్యి వూగించింది చిట్టి.

ఆ పిలుపు తన అదృష్టదేవత ఆహ్వానమేననిపించింది. సంతోషంతో చకచకా నడిచాడు. హాలులోకి రాగానే రవణమ్మగారు 'ఏంబాబూ! జీతం తీసుకోకుండానే వెళ్ళి పోతున్నావేం?' అన్నది.

జవాబు చెప్పకుండా నిలబడి పొయ్యాడు తను.

'కూర్చోండి మాష్టారూ!' అంది లలిత.

'కూర్చోనాయనా!' అంది రవణమ్మగారు.

తను కూర్చొని తలవొంచుకొని ఆలోచిస్తున్నాడు. ఎందుకు తనకీ మర్యాద? మరీ లలిత తన మీదికి వొంటికాలిమీద వొస్తూన్నట్లుంది. ఆమె వూహాలో అది గౌరవమే ఐనా, దానికి తను అర్హుడుకాదని ఆమె గ్రహించటంలేదు. తను ఎంతగా తప్పుకు తిరగాలని ప్రయత్నించినా, ఆమె వూసుకు తిరగాలని ప్రయత్నిస్తూన్నట్లు తోచింది.

రవణమ్మగారు పైకం తెచ్చేందుకు లోపలికి వెళ్ళింది. తను ఒక్కసారి లలిత వైపు చూశాడు; ఆమె కుర్చీలో ముడుచుకొని కూర్చొని, ముంగురులు మెలేస్తూ తన వొంకే చూస్తోంది. తానామెను చూడగానే, బుంగమూతిపెట్టి నేలచూపులు చూడ సాగింది; తనూ తల వొంచేసుకున్నాడు.

రవణమ్మగారు కొత్త పదిరూపాయల కాగితాన్ని తీసుకొచ్చి ఇచ్చింది. సిగ్గు పడుతూనే 'నా దగ్గిర చిల్లరలేదండీ!' అన్నాడు వినపడీ వినపడకుండా.

'ఉంచుబాబూ!...యీనెలనుంచీ పది రూపాయిలు ఇస్తాను' అందామె ఎంతో దయగా!

ట్యూషన్ కుదుర్చుకునేందుకు వొచ్చిననాడు తను పది రూపాయిలడుగుతే, ఆమె ఐదుదగ్గిర మొదలుపెట్టి గీకి గీకి బేరమాడి, చివరకు ఎనిమిదికి వొప్పుకునేప్పటికి

తాతలు దిగివొచ్చిన ఘట్టాన్ని తానింకా మరిచిపోలేదు. అలాంటి రవణమ్మగారు, ఇవాళ ఇలా జావల్లే విపోయి, ఇంత కరుణతో మాట్లాడటం ఆశ్చర్యమే ఐంది.

మాట్లాడకుండా పది రూపాయిల కాగితాన్ని మడిచి జేబులో పెట్టుకొని 'వొస్తానండీ!' అని ఆమెకు నమస్కరించి, ఒక్కసారి లలితవైపు దొంగచూపు సారించి, పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ బైటపడ్డాడు.

యీనాటి సంఘటనలన్నీ అతని మనస్సులో తిరుగుతూనే ఉన్నవి. నడుస్తూ ఆలోచించసాగాడు...బహుశా లలిత రికమన్ డేషన్ వల్ల, లేదా తననుగూర్చి ఆమె జాలిగానో, గొప్పగానో చెప్పి ఉండటంవల్లనే తను అడక్కుండానే యీ ఇంక్రిమెంట్ వొచ్చిపడివుంటుంది. లలిత తన మేలుకోరే నని పిస్తూన్నప్పటికీ, ఆమెకానీ ఇతరులుకానీ తనకు బాహాటంగా సానుభూతి చూపేందుకు తనెన్నడూ అనుమతించలేదు. కేవలం సమర్థతమీద, కష్టంమీదనే బతకాలని తన ఆశయం. అందుకనే తనెవ్వర్నీ లెక్కచెయ్యకుండా, తన ప్రపంచంలో తాను బతకగలుగుతున్నాడు.

ఐనేమో ఐంది; యీ లలిత తనకు ప్రతి సాయంత్రమూ పద్మనాభంగారింట్లో ఎదురవకుండావుంటే అదే పదివేలు. గత నాలుగునెల్లలోనూ లలిత ఎన్నడూ యీ ఇంట్లో కనిపించలేదు; బహుశా ఒకటి రెండుసార్లు వొచ్చినప్పటికీ, తా నామె కళ్ళ పడలేదు. నిన్ననే మొదటిసారి ఆ కప్పుకింద కలిసింది. మళ్ళీ ఇవ్వాళ పనికట్టుకొని రావటంలో తనను వెన్నాడుతోందనే నమ్మకం కుదిరింది...కాదు.. నిన్న పిన్నమ్మకు తన కథలు ఇస్తానంది...అందుకని వొచ్చివుంటుందని సరిపెట్టుకోవాలనుకున్నాడు. కాని యీ కారణం అతికినట్లు తోచలేదు.

ఆమె తనతో మాట్లాడాలని విశ్వప్రయత్నం చేస్తూన్న సంగతీ, అవకాశాల్ని కల్పిస్తూన్న సంగతీ గ్రహించలేకపోలేదు. కాని ఆ పరిచయాలు, అందులోనూ ఆడపిల్లల్తో, విశేషించి కలయింటి పడుచుల్తో—తనకు బొత్తిగా ఇష్టంలేదు. ధనికవర్గమంటే ఉండే ద్వేషంవల్లకాదుకాని, తన అంతస్థుకు తగనిపని అని తోచటంవల్ల.

—కాని తనపట్ల, తన రచనలపట్ల ఆమె నిజమైన అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలనే వాంఛ యీనాడు తీవ్రరూపం దాల్చింది. ఇంతవరకూ తనెవర్నీ అడగలేదు. బహుశా యీమెనుకూడా అడగలేదు; అడిగినట్లయితే వొచ్చే జవాబు మొహమాటంతోకూడి వుంటుందని తన నమ్మకం. కాని ఆమె ధోరణిచూస్తే, తను అడక్కుండానే ఆమె తన అభిప్రాయాల్ని చెప్పేట్లుగావుంది...అంతకన్నా ఆమెను బాధిస్తూన్న ఏవో అనుమానాలను, తాను చేయదల్చుకున్న ఏదో విమర్శను విప్పి చెప్పాలని ప్రయత్నిస్తోందా అనే అనుమానం కలిగింది. ఇదే నిజమైతే, తాను సంతోషపూర్వకంగా ఆమెతో మాట్లాడుతాడు. ఆమె సందేహాలకు సమాధానాలు

చెపుతాడు; ఇందువల్ల తనుకూడా కొంత ఆత్మవిమర్శన చేసుకోవటం, రచనల్లోవున్న లోపాలను, తనకు తెలియనివాటిని తెలుసుకోవటం, యీసారి అలాటి పొరపాట్లు జరక్కుండా చూసుకోవటం నిజానికి తనమేలుకే! ఐతే ఆమె అభిప్రాయం అదేనని నమ్మకం ఏమిటి?

## 9

అనుకున్నంతా ఐంది. ప్రతి సాయంత్రమూ లలిత తనకన్న ముందుగానే పద్మనాభంగారింట ప్రత్యక్షమౌతూనే వుంది. ఐతే తను చూసీచూడనట్లుగా తన ట్యూషన్ చెప్పుకొని పోతూనేవున్నాడు. కాని యీమె నీడవలె వెంటాడుతోందని హృదయం కలుక్కుమంటూనే వుంది. ఏమైనా యీమెను తప్పించుకునే మార్గం లేదు.

అక్కడికీ సాయంత్రం కన్న, ఉదయమే యీ ట్యూషన్ ఎత్తుకుంటే బాగుంటుందేమోననే వూహ రాకపోలేదు. ఉదయం ఇంటి దగ్గర్నుంచి ఇక్కడికి నడవటం, తిరిగి ట్యూషన్ పూర్తయాక, గదికివెళ్ళి వంట చేసుకొని, తిని కాలేజికి వెళ్లటం కుదరదు. మొదట్లో రవణమ్మగారు సాయంత్రంపూట పిల్ల ఆడుకునే సమయం కనుక, ఉదయమే ట్యూషన్‌కు రమ్మని బలవంత పెట్టారు. తనకది కుదరదనీ, సాయంత్రమైతే కాలేజికి దగ్గరగావున్న యీ ఇంటికి వెళ్లటం సులభమనీ, వారిని ఒప్పించాడు. కనుక మిగిలిందల్లా లలిత ఉనికిని ఎదుర్కొగలగటమే!

రెండుమూడు రోజులుగా ఆమె సరిగ్గా తన వంకన్నా చూడకుండా పిన్నమ్మతో ఇష్టాగోష్టి జరుపుతోంది. ఒక రకంగా ఇది బాధ అనిపించింది కాని, మరో విధంగాచూస్తే ఆమె ప్రవర్తన లాటిదాన్నే తానుకోరాడనే మాట జ్ఞాపకంవొచ్చి తృప్తిపడ్డాడు.

ఒకనాడు సాయంత్రం తను తలవొంచుకొని వెళ్తూండగా, పోర్టికోలోకుర్చీలు వేసుకొని బాతాఖానీ వేస్తూన్న రవణమ్మగారు పిలిచింది. ఆమె ఎదుట తలివొంచుకొని నిలబడగానే 'కూర్చోబాబూ!' అంది కుర్చీచూపుతూ. ఆ కుర్చీ సరిగ్గా రవణమ్మగారికీ లలితకూ మధ్యగా వుండటం చాలా ఇబ్బందిగావుంది. అనుమానిస్తూనే కూర్చున్నాడు.

'తొందరగా వెళ్లాలా?' అందా ఇల్లాలు.

'తొందరేం లేదండీ...'

'ఏంలేదు...నీ కథలు చాలా చదివాను. బాగున్నాయ్...' అందామె. యీ పొగడ్తకు తను ఉక్కిరి బిక్కిరై, సిగ్గుతెరల్ని బలవంతాన తొక్కిపట్టుకున్నాడు.

'ఎందుకు బాగున్నయ్ పిన్నీ?' అంది లలిత, పిన్నమ్మను ఎదుర్కొంటూన్నట్లు. కాని యీ ఎదుర్కోవటం తనకే ఆనేజ్ఞానం వున్నప్పటికీ, సమర్థించుకు నేందుకు, అంటే ఆత్మస్తోత్రానికి తావులేక, మెదలకుండా వూరుకున్నాడు.

'ఎందుకు బాగుండటమేమిటే లలితా? బాగున్నయ్ కనుక బాగున్నయ్... అంతే...మీ చిన్నాయనకూడా చదివి మెచ్చుకున్నారు. 'ఇత నింతవాడా?'అని ఆశ్చర్యపడ్డారు కూడాను', అందామె.

'చిన్నాయన ఇక్కడలేరు కనుక, ఆయన సంగతి వొదిలెయ్. నీకు ఎందుకు బాగున్నయ్యో చెప్పు.'

'ఏమోనమ్మా! నేను చెప్పలేను. ఐనా బాగుండేందుకు కారణాలేమిటే?'

'బాగుండనందుకు కారణాలున్నట్లే, బాగున్నందుకూ ఉండాలికదా!'

లలిత ఇంత తెలివిగా మాట్లాడుతుందని తను అనుకోలేదు. తనొక్క క్షణం దిమ్మెరపొయ్యాడు. ఏమైనా ఆ కారణాలు చెప్పాల్సింది రవణమ్మగారు కాని తను కాదు.

'ఏమోనమ్మా! యీ కాలపు పిల్లల్తో మేమేం మాట్లాడగలం? నేనైతే కారణాలు చెప్పలేననుకో; నీకూ బాగున్నయ్‌గా—పోనీ నీవు చెప్పు ఆ కారణాలేమిటో-చూద్దాం' అంది రవణమ్మగారు. తనకు వేసిన ప్రశ్నను, యధాతధంగా లలితకు అప్పగిస్తూ. మనసులో రవణమ్మగార్ని తను మెచ్చుకున్నాడు; తన గౌరవాన్ని ఆమె కాపాడింది మరి!

'బాగున్నయ్యని నేను చెప్పానా?' అంది లలిత, సందేహాన్ని ధ్వనింపజేస్తూ.

'అబద్ధంకూడానా? నీవు బాగున్నవని తెచ్చిఇస్తే కాదుటే నేను చదివింది? బాగుండకపోతే, అవన్నీ పోగుచేసి బైండుచేయించావ్—దేనికీ?' తనూ తెలివిగా మాట్లాడగలననే ధీమాతో, 'ఎలావుంది సవాల్?' అన్నట్లు గర్వంగా తనవైపు చూసించి. తను కేవలం ప్రేక్షకుడుగా మాత్రమే ఉండవలసిన పరిస్థితి కావటంవల్ల నిర్లిప్తంగా వూరుకున్నాడు.

లలిత ఇప్పుడు ఇబ్బందిలో పడింది. వాదనకోసమైనా సరే నిలబడక తప్పలేదామెకు.

'బాగుండటమంటే...దేనికన్న అనేది వొస్తుందికదా?'

'అదేమిటి?' అంది రవణమ్మగారు, ఏదో సరికొత్త సంగతి వింటూన్నట్లు.

'అవును పిన్నీ! జాగర్తగా ఆలోచించు. 'బంగారంవిలువైనది' అన్నామనుకో. దేనికన్న? రాగికన్న, లేదా ఇత్తడికన్న, లేదా ఇనుముకన్న; ఇలాగే 'బంగారం

ప్లాటినమ్‌కన్న కానీ, రేడియంకన్నా కానీ విలువైనది కాదు కదా ! ఆభావం ఇమిడి వుందాలేదా—చెప్పు?'

రవణమ్మగారికి అర్థమయీ కాకుండావుంది. ఇంత లోతులకు వెళ్ళటం ఆమె వల్లకాలేదు. నిజానికి తనకు కోపం రావాల్సిందే కాని, తెలివిని మెచ్చుకోగల తెలివి, ఉండటంవల్ల తట్టుకోగలిగాడు. లలిత ఇంత నిశితబుద్ధిగలదని ఎన్నడూ అనుకోలేదు. అందరు భాగ్యవంతులవలెనే బద్ధకంగా, సోమరిగా, సగం తెలివితో బతుకుతోం దేమోననే పొరపాటును ఆమె ఒక్కసారే పటాపంచలు చేసేసింది.

రవణమ్మగారు మాట్లాడలేక పోవటంతో సంభాషణ ఆగిపోవాల్సి వొచ్చింది. తను తేలిగ్గా లలిత చెప్పేదాన్ని అనుసరించగలుగుతున్నాడు; కనుక ఇప్పుడు మాట్లాడక తప్పలేదు. 'మన పక్షం దిగజారుతూం టే చూస్తావేమిటి?' అన్నట్లు రవణమ్మగారు కళ్ళతోనే తన సహాయాన్ని అర్థిస్తోంది. అన్నిటికన్నా తన రచనల్నిగూర్చి తెలుసుకోవాలి; యీ లలితనుంచి నేర్చుకోవాల్సిన కొత్త విషయాలు, ఆలోచనల్ని రేపే నగ్నసత్యాలు చాలా ఉండివుంటవనే నమ్మకంకూడా కుదిరింది.

'అంటే మీరు మన సాహిత్యాన్ని విశ్వసాహిత్యంతో పోలుస్తున్నారా ?' అన్నాడు తను.

'మరి సాహిత్యమంటే ఇదే అనుకోవటం కూపస్థమండూకస్థితి అవదా ? విశ్వసాహిత్యంతో మీకూ పరిచయం వుందనుకుంటాను ..దాంతో పోల్చుకుంటే-'

'అది కొన్ని శతాబ్దాల కృషి అనే సంగతి మీరు మరిచిపోతున్నారు. కొలతలకు పనికి వొచ్చేదే కాని, దాంతో సమానమైన సాహిత్యాన్ని సృష్టించేవరకూ, అసలు సాహిత్యమే ఉండకూడదని మీ అభిప్రాయమా ?' అన్నాడు తను.

'నా అభిప్రాయం అదికాదు. మన స్టాండర్డ్ ఇంకా పెరగాలని. అసలు స్టాండర్డ్ పెరగటమంటూ లేదనుకోకుండా, మధ్యమధ్య మనను బెదరగొట్టినా, ఉత్తమ సాహిత్యం మనకొక మార్గదర్శిగా ఉండాలని...'

'ఒప్పుకుంటాను...మీరు నా రచనల్లో ఏవో కొన్ని లోపాల్ని గమనించారు. వాటిని సూటిగా బైటపెట్టేందుకు యీ చుట్టుతోవ పట్టారు.'

రవణమ్మగారు ఇంత తెలివిగా మాట్లాడలేదు కాని, మాట్లాడుతూంటే ఆమెకు అర్థమౌతూనేవుంది. యీ కాలం పిల్లలు ఎంత తెలివిగలవాళ్ళోనని ఆమె ఆశ్చర్యపడుతూన్నట్లుంది. యీ సంభాషణ ఆమెకు ఎంలో 'ఇంటరెస్ట్' కలిగించింది. కోర్టులో గొప్పగా వాదించే ప్లీడర్లనుచూస్తూ, సంతోషిస్తూ, న్యాయాన్ని ఉభయపక్షాలవైపూ తిప్పుతూ, గర్వంగా కూర్చునే న్యాయాధికారివలెనే ఆమె హాయిగా కూర్చొని వినసాగింది.

'మీరు సరిగ్గా గ్రహించినందుకు సంతోషం. కాని నాకు తోచిన లోపాల్ని చెప్పటంవల్ల మీకు కష్టం కలగవొచ్చు!'

తను నవ్వాడు: 'అలా కొక్కాదు. ఉన్నలోపాల్ని తెలుసుకొని సవరించుకోవటం తప్పుకాదుకదా! జీవితమే ఎక్స్పెరిమెంట్ల మయమైతే, సాహిత్యం అలాటిదే కావటంలో వింతేముంది?'

రమణమ్మగారు ఆ లోపాలేమిటాఅనీ, తనకు ఎందుకు కనిపించలేదా అనీ ఆలోచిస్తున్నట్లుంది. బియ్యంలో రాళ్ళూ రప్పలూ ఏరే ఓపికేలేని తనకు, సాహిత్యంలోని పొరపాట్లను గుర్తించటం ఎంత కష్టమోనని ఆశ్చర్యపడుతూండి ఉండొచ్చు.

ఒక నిమిషంసేపు నిశ్శబ్దంగా గడిచింది. లలిత ఏం చెపుతుందోనని మిగతా ఇద్దరూ ఆతురతతో వేచివున్నారు.

లలిత కొంచెం ఆలోచించుకొని 'మీ కధల్లో వెరైటీలేదు. ఒకే ధోరణి. ఒక్కొక్కళ్లు ఒకో ధోరణిలో బాగా రాయగలుగుతారనుకోండి. కాని జీవితానికి ఒకో రచయిత ఒకోరంగువేసి చూపుతే, చివరకు సాహిత్యమంతా చదివినా, జీవితమంటే ఏమిటో తెలియకుండా పోతుంది' అంది.

'జీవితాన్ని అనుభవిస్తూ సాహిత్యం చదువుతారు కాని, సాహిత్యం చదివి జీవితాన్ని అనుభవించరుగా!'

'నిజమే! అదీ ఒక మేలే! కాని సాహిత్యం జీవిత సమస్యలపట్ల చూపే పలుకుబడులవల్ల, రచయిత తన అభిప్రాయాలను శక్తివంతంగా పఠితలమీద రుద్దుతాడు. ఇందువల్ల జీవితంలో జరిగే పొరపాట్లకు తోడుగా, రచనలద్వారా బుర్రలోకి ప్రవేశించి, వేధించే మరికొన్ని పొరపాట్లుకూడా తోడవుతవి కదా!'

'సాహిత్యం జోలికే పోకుండా వుంటే యీ ప్రమాదం తప్పుతుందంటారు-అంతేనా?'

'కాదు...సాహిత్యం నిర్లిప్తంగావుండి, పాఠకుల్ని ఆలోచింప చేయాలంటాను. సమస్యను విడదీసి పెట్టవలసిందే కాని, దాన్ని పరిష్కరించటం రచయిత వొంతు కాదు. అలా పరిష్కరించటం ప్రచారంగా మారి, కళాభాగాన్నికూడా దిగమింగుతుంది; కనుక ఆ సాహిత్యం నిలవదు. ఏ సాహిత్యమైతే జీవితాన్ని వివిధ దృక్కోణాల్లో ప్రస్ఫుటంగా చూపగలదో అదే నిలుస్తుంది.'

రమణమ్మగారికి అర్థంకాలేదు; వింటూ ఊనికిపాట్లుపడుతూ తన ఆలోచనల్లో మునిగిపోయింది. ఇక తన సంగతి వేరే చెప్పక్కర్లేదు: ఒక మంచి విమర్శ రచనను తను తలక్రిందులు చెయ్యటమంటే ఏమిటో మొట్టమొదటిసారి తెలుసుకోగలిగాడు,

'నాకు తెలిసింది...ఇన్నాళ్లూ తెలుసుకోలేదు కాని, యీనాడు నా రచన ల్లోని లోపాల్ని తెలుసుకున్నాను. వాటిని సరిజేసుకుంటూను కూడాను. మీకు ధన్య వాదాలు' అని నమస్కరించాడు. మొట్టమొదటిసారిగా, లలితను తేరిపారజూడటం కూడా జరిగింది. ఆమె వ్యక్తిత్వంలోని గొప్పతనాన్ని గుర్తించాక, ఆమెను చూడటం కొంత వరకూ భయంగా వున్నప్పటికీ, చూడాలనే కుతూహలాన్ని చంపుకోలేక పొయ్యాడు.

ఇదివరకెప్పుడూ గమనించలేదుకాని సౌందర్యం అనేది కొంతమంది సొత్తే ననే సంగతి యీనాడు తెలుసుకున్నాడు. ఆమెను వర్ణించటం తనతరం కాకపో వొచ్చు; వర్ణనకు పూనుకోవటం ఆమెకు అన్యాయం చేయటమే అవుతుందనే బెరు కువుంది...కాని తన స్వప్నసుందరి రక్తమాంసాలతో ప్రత్యక్షమై నట్లయింది. యీ సౌందర్య రాశివల్లనే కాలేజిలో కుర్రాళ్లు యీమె అంటే పడిచావటం తనకు తెలుసు. ఐతే తానెన్నడూ కుతూహలంతోకూడా యీమెను తేరిపారచూడలేదు. తనవిరోధినికూడా, ఆత్మబంధువును పరికించినట్లే పరికించాల్సిన అవసరం ఆపని చేయించింది...ఇంతకన్న అందమైనది వేరెవరన్నావుండి, తనకళ్ళపడేదాకా, సౌం దర్యమంటే తన అభిప్రాయం మారేందుకు వీలుండదు.

ఇది వరకు తాను రచయితగా గొప్పవాడుగా భావిస్తూ, తన పతిత లలిత అల్పత్వాన్ని మాత్రమే గుర్తించాడు; ఇక ఇప్పుడు విమర్శకురాలిగా ఆమె ఆధిక్యత ముందు, రచయితగా తన అల్పత్వం బైటపడింది. ఒక విధంగా యీమె తనను సరైన మార్గంలోకి పెట్టి, కొత్త కాంతిని ప్రసరింపజేసింది. క్షణంలో ఆమెపట్ల గౌరవం పెంపొంది, ఆమెను భక్తుడు దేవతను మూసే భక్తితో చూడగలిగాడు.

ఇదే సమయంలో ఇది వరకు తాను ఎరగని స్త్రీమూర్తి ఆకర్షణనుకూడా పొం దాడు. యీ తేరి పారచూడటంలో తను ఆమె బాహ్యసౌందర్యాన్నికూడా మొట్ట మొదటిసారి చూడటం, మతిపోయినట్లయి, తనలో తాను తల్లడిల్లటం జరిగింది. ఆమె మాత్రం విలాసంగా, ఠీవిగా, గర్వంగా, విజయసూచికంగా కూర్చొని తనను మెచ్చు కునే వారి పొగడ్తల్ని హరించుకునేందుకు సిద్ధంగావున్న దేవతల్లే తోచింది ..ఒక్క క్షణంకూడా తానక్కడ ఉండలేని అశక్తత ఆవరించింది.

'సెలవు-' అని లలితకు నమస్కరించి, పగటి కలలుకనే రవణమ్మగార్ని ఆ కుర్చీకే వొదిలేసి గదికి నడిచాడు.

## 10

గది జేరేప్పటికి బాగా చీకటిపడింది. లైటు వెలిగించే ఓపికకూడా లేకుండా పక్కమీద వాలాడు. గదంతా చీకటిగా వున్నప్పటికీ, తన హృదయం ఏదో వెలుగులోనే పయనం చేస్తున్నట్లు తోచింది.

యీ సాయంత్రం జరిగిన సంఘటన తన జీవితదృక్పథాన్నీ, గమనాన్నీ మార్చి వేయగలిగినంత శక్తివంతంగావుంది. ఒంటరితనంలో తాను చేసే పొరపాట్లను తెలుసుకునే అవకాశం ఏర్పడింది. తనూ తెలివిగలవాడనీ, మంచి రచయిత అనే గర్వాన్ని లలిత అణగదొక్కేసింది. తాను గ్రహించకుండానే, తనలో దాగిన అల్పత్వాన్ని ఆమె ఎత్తిచూపింది. తనకన్న తెలివిగలవాళ్ళూ, తానుకూడా నేర్చుకోదగిన విషయాల్ని మాట్లాడగలిగేవాళ్ళూ యీ ప్రపంచంలో వున్నారనే సంగతి, వారెక్కడో కొండశిఖరాలమీద లేరనీ, తనచుట్టూ వున్నారనే సత్యం బైటపడింది. ఇన్నాళ్ళూ తానీ సంగతి గ్రహించకుండటం తనతప్పే! ఇంకానయం—యీనాటికన్నా తెలుసుకోగలిగాడు.

లలిత మాట్లాడిన ప్రతి అక్షరమూ తనచెవుల్లో గింగురుమంటూనేవుంది. ఒక విధంగా ఆమె తనను కఠినంగానే విమర్శించింది; అది దయారహితమైన న్యాయమే ఐనప్పటికీ, దాన్ని భరించగల మనోనిబ్బరం తనకువుందా?

'సాహిత్యాన్ని సృష్టించటం కష్టం; విమర్శించటం చాలా తేలిక' అనే సిద్ధాంతాన్ని గుర్తుతెచ్చుకున్నాడు. ఐతే యీ సిద్ధాంతం లలితపట్ల ప్రయోగించేందుకు మనసొప్పలేదు; నిజంగా ప్రయోగించగలిగినట్లయితే, అది తప్పకుండా ఆత్మద్రోహమై, తన పతనానికి కారణమై తీరేది.

ఆమె చెప్పినమాటలు భావశూన్యాలుగానూ, అర్థరహితాలుగానూ, కేవలం వాదనకోసమై ఉద్దేశించబడినవిగానూ తనకు తోచటంలేదు. ఎంతో తెలివిగా కాచి వడబోసిన సారాన్ని స్పష్టంగా చూడగలిగాక, వేరొక రూపంలో తనకు అనుకూలంగా వుండేట్లు తలచటానికి అవకాశం కనిపించలేదు.

ఆమె తన ఉద్దేశ్యాల్ని బైటపెట్టింది; నిర్మొహమాటంగా, హృదయంలోని మాటల్ని ధైర్యంగా చెప్పగలిగింది. తమాషా—యీ మాటలే ఎంత సిన్సియర్‌గా మరెవరన్నప్పటికీ తను పట్టించుకునేవాడుకాదు. ఆమెతోడి పరిచయం కొద్దిరోజులదే ఐనప్పటికీ, ఆమె తన మేలుకోరే వ్యక్తిగానూ, ఆమె సలహాలు తను అవశ్యం పాటించతగ్గవిగానూ తోచినవి.

చాలాసేపటిదాకా ఆలోచిస్తూ పడుకున్నాడు. ఎంత ప్రయత్నించినా లలిత చెప్పింది అసందర్భంగా వున్నదనిపించలేదు; ఒకవిధంగా నిరుత్సాహంకూడా కలిగింది. బుర్రలో పనిచేస్తూన్న అనేక కథలు పేలవంగా కనిపించినవి. ఇంతలో ఇంతగా దిగజారిపొయ్యానేమిటా అని ఆలోచించాడు. నిజమో కాదో తేల్చుకోవాలనిపించింది.

వెంటనే లాంతరు వెలిగించాడు. తను రాసిన కథల్లో కొన్నిటిని నిర్లిప్తంగా చదవసాగాడు. కాని లలిత మాట్లాడిన మాటలు మరిచిపోలేకుండా వుండటంవల్ల,

అడుగడుగునా ఆ కథలు చాలా సామాన్య రచనలుగా కనిపించినవి...మిగతావి చదవవలసిన అవసరం కనిపించలేదు. ఇంతవరకూ తనుచేసిన కృషి అంతా వృధా అనిపించింది. ఈ రచనల్ని పట్టుకొని వేళ్ళాడటంలో అర్థంలేదు. చివరకు వాటిమీద కసితీరేందుకు, అప్పటి కప్పుడే వాటిని కాల్చివేశాడు.

మనస్సు కాస్త తేలికైంది; తనను పట్టుకున్న పీడ వొదిలింది...ఇప్పటికికాని ఆకలి తెలియలేదు. చుట్టూవున్న నిశ్శబ్దాన్నిబట్టి అర్థరాత్రయి వుంటుందనుకున్నాడు; ఆ చద్ది భోజనమే తిన్నాడు; కాని అంతగా సయించలేదు; మొత్తంమీద ఆకలి తీరినట్లే తోచింది.

ఇప్పటికే చాలా అలసిపోయి వుండటంవల్ల పక్కమీద వాలాడు; నిద్ర అత్యావసరమని తోచినప్పటికీ, ఎటుదొర్లినా సుఖంగా లేదు. మెదడు ఆలోచిస్తూన్నంత సేపూ శరీరానికి విశ్రాంతి ఉండదు. కాని మెదడు తన అధీనంలోలేకుండానే ఆలోచనల్ని సాగిస్తోంది...

ఇక తను రాయడు; రాయలేడు; అందువల్ల మునిగిపొయ్యేదేమీలేదు. రాస్తే అద్భుతంగా రాయాలి; లేకుంటే మానెయ్యాలి. గొప్ప రచయితలకూడా విమర్శకులుంటారని తనకు తెలియకపోలేదు. కాని తన గొప్పతనం అంతదూరం పోలేదని స్పష్టంగా తెలుస్తోంది. కనీసం యీ రాతలు మానటంవల్లనన్నా మనశ్శాంతి వుండగలదు.

అజీర్ణవ్యాధికి ఆముదం తాగినట్లయింది. కథల్నిగూర్చిన భావాలన్నీ బలవంతంగా బుర్రలోంచి తోసివేయబడినవి. ఇదంతా లలిత మాటల ఫలితమే!

బుర్ర వేరొకమార్గానికి దారితీసింది...ఆలోచనలు లలిత వ్యక్తిత్వం మీదికి తిరిగినవి. లలిత బాహ్యసౌందర్యానికి తను ముగ్ధుడయ్యాడు. సాయంత్రం ఆమె మాట్లాడుతూన్నంతసేపూ ఆమె ప్రతికదలికనూ గమనిస్తూనే వున్నాడు; అప్పుడంతగా చలించలేదుకాని, ఇప్పుడు తలుచుకుంటే స్త్రీ మూర్తిలోని అందచందాలు ఆకర్షణ మొందలైనవి తన హృదయాన్ని కలిచివేస్తున్నట్లు తోచినవి.

ఊహామాత్రాన లలిత కళ్ళముందు ప్రత్యక్షమైనట్లయింది. ఆమె నాజూకుతనం, వయ్యారం, ఠీవి, యవ్వనపుపొంగు తాలూకు అందచందాలు, సహజ సౌందర్యపు ఆకర్షణాశక్తి, మధురమైన కీచు కంఠస్వరం, తెలివితో మెరిసేకన్నులు కురిసే వెన్నల, అందంగావొణికే ఎర్రనిపెదాలు, చెంపల్ని కప్పే కురులు...నవ్వినప్పుడు జలతరంగాలల్లే గలగలమనే మృదుమధురగీతికాలాపన...ఒకటేమిటి ఆమెలోని ప్రతి కదలికా అద్భుతంగానే తోచింది. అసలు స్త్రీలు పురుషుల్ని ఆకర్షించటమనేది తాను చదివిఉన్నాడేకాని, ఇంతవరకూ అనుభవంలోకి రాలేదు; బహుశా అలాటిది అసంభవమనీ, అబద్ధమనీ కాదుకాని, తానెప్పుడూ గమనించలేదు. యీ నాడు గమనించటం, తలక్రిందులుగా పడిపోవటంకూడా ఒక్కసారే జరిగినవి.

యవ్వనపు తొలి అనుభూతులు ఆవరించినవి. మన్మథుడు యీ మురికి సందులోకి, విశేషించి తన గదిలోకూడా ప్రవేశించినట్లు తెలుసుకునేందుకు ఎక్కువసేపు పట్టలేదు. వాడు-ఆ మకరధ్వజుడు, ప్రవేశించరాని స్థలమంటూ ప్రపంచంలో లేదేమో?

లలితను తాను ప్రేమిస్తున్నాడా అనే అనుమానం కలగగానే, గొప్ప అసంతృప్తి, ముందుగానే వూహించగలిగిన గొప్ప ప్రమాదం కళ్ళకు కట్టినట్లయింది. ప్రేమించటం స్వభావసిద్ధమైనదే కాని, అదొక నేరం, తప్పు, పాపం కాదని తెలియకపోలేదు. కాని తాహతు, అంతస్థు మొదలైనవి తనకూ లలితకూ పర్వతాగ్రానికీ, లోయకూవున్న ఎత్తుపల్లాల్ని కళ్ళకు కడుతూన్నవి.

ఛా...ఛా...తనెంత మూఢుడవుతున్నాడు! తనేమిటి...లలితను . ఐశ్వర్యవంతుల ఆడబడుచును ప్రేమించటమేమిటి?...అర్థముందా? ఇదేదో తన బుర్రలో మెరిసిన మెరుపు కనుక, సరిపోయింది; యీ రహస్యం తన మనసును దాటి బాహ్య ప్రపంచంలోకి వెళ్లనంతవరకూ ప్రమాదం లేదు; అలా వెళ్తే సమాజపు తీక్షణ వీక్షణాలకు తను భస్మీపటలమవుతాడు. ఇది తన తలపే కనుక, దాన్ని ప్రయత్నం మీదనైనా తుడిచివేయగలడు.

ప్రేమించటమనేది జీవితంలో ఏనాడో తప్పక జరిగేదనీ, దాన్నుంచి తప్పించుకోవటం తనలాటి సామాన్యులకు సాధ్యం కానిదనీ, కనుక దానికి లొంగిపోవటమే మంచిదనీ తనకు తెలియక కాదు; కాని—తనేమిటి ప్రేమించటమేమిటి! తనలాటి బీదవాడికి, అనాధకు కాదు ప్రణయమనేది! అది విలాసవస్తువే కాని, తన నిత్యజీవితానికి అవసరమైనది కాదు; ఎందుకంటే పూటకూటికి గడవని తనకు అది అందని ద్రాక్షపండే! అసలు ప్రణయాన్ని గూర్చి తలిచే అర్హతన్నా లేని తను దూరంగా వుండటమే శ్రేయస్కరం.

జీవితంలో మొట్టమొదటిసారి తనతల్లి గాక, మరో స్త్రీకి హృదయంలో స్థానమివ్వటం, తనకు తెలియకుండానే జరుగుతోందని గ్రహించగానే వెగటేసింది. ఆ వికారంతో వాంతి పర్యంతమైంది. అంతకన్న తాను చేయగల దారుణం, తల్లిపట్ల చూపగల కృతఘ్నత మరేమైనా వుంటుందా? ఇప్పటికివున్న సమస్యలుగాక, తనకు ఏమీకాని యీ లలితనుగూర్చి బుర్ర బద్దలు కొట్టుకుంటే, తన భావిజీవితం ఇంకెంత అంధకారమవగలదో, తను, తనకూ, తనతల్లికీ చేయగల న్యాయం ఎంతదూరమవగలదో స్పష్టంగా చూడగలుగుతున్నాడు.

తల్లిని తలుచుకోగానే లలిత మాయమైంది. ఇక జీవితంలో తల్లినుంచి పొందే ఆవేశబలంతోనైనా లలితను దూరతీరాలకు తరిమెయ్య గలననే ధైర్యం వొచ్చింది. ఒకవిధంగా లలితపట్ల ద్వేషాన్ని పెంచుకోవటంకూడా ఒక దారిగా తోచింది.

ఇక ఆరాత్రి లలితలోని అవగుణాల్ని • సృష్టించుకోసాగాడు. మొదటిది— ఆమె పెద్దింటిపడుచు. రూపాయలుకూడబెట్టి, చుట్టూవున్న బాధిత మానవ ప్రపంచాన్నిగూర్చి తలచకుండానే స్వార్థంతో, ఆనందంగా, విలాసంగా జీవితాన్ని గడపటం మాత్రమే నేర్చుకున్నజాతి తాలూకుస్త్రీ ఆమె! రూపాయల లోహంకన్న, కఠినమైన లోహంతో తయారైన వారి హృదయాల్లో మానవత్వం ఉండదు కనుక, వాటికి దూరంగా వుండితీరాలి.

ఆమె అందమైనదే కావచ్చు; ఐతే ప్రపంచంలో అందగత్తెలందర్నీ ప్రేమించటం, వాళ్ళకోసం తపించటం ఎంత ఆత్మద్రోహమో తనకు తెలుసు...యీనాడు కొత్తగా తన జీవితంలోకి ప్రవేశించి యీమె ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించుకునేందుకు ప్రయత్నించటాన్ని తానెలా భరించగలడు?...ఇంతా ఏమున్నా తనలో కలిగిన యీ అలజడి వొట్టి భ్రాంతేనేమోననిపించింది. ఎందుకంటే లలితలాటి వ్యక్తి, తనలాటి నిర్భాగ్యుణ్ణి, నిరాధారుణ్ని ప్రేమించేటంత తెలివి తక్కువదికాదు. తనేమంత అందగాడు? సరైన పోషణాన్నా లేక కృశించిన శరీరంతో, జీవితపు గుండు దెబ్బలతో అలసిపోయిన తననుగూర్చి ఆమె తలచనైనా తలచదు. ఇదే నిజమైతే, తను అనుకునే ప్రమాదం కనుచూపు మేరలో ఉండదు; దీన్నిగూర్చి ఆలోచించటం మూఢ్యం. ఆమె ప్రేమించకుండానే తను ప్రేమించాననుకోవటం ఎంత పొరపాటు!

యీ వాదన బాగుంది. తను లలితకు దూరంగా జరగక్కర్లేదు; ఆమే తనను వెలివేస్తుంది; అది ఇద్దరికీ క్షేమకరం. ఇక తనను వేధించేది ఏముంది కనుక-తన భ్రమ తప్ప?

ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు; ఉదయం తొమ్మిదయ్యేకాని మెలుకువ రాలేదు. జీవితంలో ఇంత పొద్దెక్కి లేవటానికి ఇదే మొదలు. జీవిత విధానాలలోనే ఏదో గొప్ప మార్పు, తన అనుమతిలేకుండానే ప్రవేశించిందని గ్రహించాడు. ఆత్మబలాన్ని కూడగట్టుకొని, యీ మార్పును పోరాడేందుకు సిద్ధపడాలి. మొదటి పోరాటంగా, ఆ రోజు భోజనం చేయకుండానే, తనను తాను నిందించుకుంటూ కాలేజికి బయలుదేరాడు.

## 11

క్లాసు జరుగుతూండగా చాలా అన్యమనస్కంగా వున్నాడా రోజు. దీనికితోడు రాత్రి పొందిన కొద్ది గంటల విశ్రాంతీ చాలలేదు; ఆవలింతలతో బడలికతో మగతగావుండి, బలవంతాన కళ్లుతెరిచి ఉంచగలిగాడు. సూర్యుడు ఆకాశాన ఎగబాకుతూన్నకొద్దీ, ఆకలిబాధ అధికమవసాగింది. దాదాపు శోషవొచ్చేంత పర్యంతమైంది.

ఎంత కూడదనుకున్నా లలితను చూడకుండా ఉండలేకపోయ్యాడు. ఆమెను చూసినప్పుడల్లా, తనలోని రచయితను నిర్దయగా, క్రూరంగా తుదిముట్టించిన శత్రువనే

విషయాన్ని స్ఫురణకు తెచ్చుకుంటూ, ఆమెపట్ల ద్వేషాన్ని ప్రజ్వరిల్ల చేసుకుంటూ న్నాడు. ఐతే యీ ద్వేషం తనను బాధపెట్టేందుకు మారుగా 'తీయనిబాధ' లాటి దాన్ని, బెణికితే గట్టిగా తోమినప్పుడు కలిగే అనుభూతిని కలగజేసింది. అపూటంతా యీ లలితతోనూ, ఆకలిబాధతోనూ, అలసటతోనూ సరిపోయింది.

ఇంటర్వల్లో ఇక తట్టుకోలేక, కాఫీహోటల్లో ఆకలి తీర్చుకున్నాడు. ఆ తరువాత ఇక క్లాసుకువెళ్ళ బుద్ధిపుట్టలేదు. ఉదయం ట్యూషన్ ఎలాగూ నాగా పడింది; సాయంత్రం ట్యూషన్కుకూడా అదేగతి పట్టించి, సరాసరి గదికివెళ్ళి, ముసుగుతన్ని పడుకున్నాడు. త్వరలోనే నిద్రపట్టింది.

మెలుకూ వొచ్చేసరికి గదంతా చీకటిమయం. అగ్గిపెట్టకోసం దేవుళ్ళాడి-లాంతరు వెలిగించాడు. ఆవలింతలు వొదలకపోయినా, శరీరం తగినంత విశ్రాంతిని పొందటంవల్ల ప్రాణానికి కాస్త హాయిగావుంది. బహుశా రాత్రి ఎనిమిది గంటలై ఉండొచ్చనిపించింది. బద్ధకం వొదిలేందుకు చన్నీళ్లతో మొహం కడుక్కున్నాడు. అన్నం వొండుకునే ఓపికలేదు; ఆకలి దహించుకొని పోతోంది. మరి దారిలేక దగ్గర్లోనేవున్న హోటల్కువెళ్ళి ఆపూటకు భోజనంచేసి గదికి వొచ్చాడు.

ఏమన్నా చదువుకుందామనుకున్నాడు కాని, చదవబుద్ధి కాలేదు. పుస్తకం తెరవటం, వెంటనే మడిచి అవతల పెట్టెయ్యటం జరిగింది...యీనాడు తను ఎంత విచిత్రంగా మారిపోయ్యాడు! తనలో ఉత్సాహమే లేదు; ఇంతకన్న గడ్డుగాగడిచిన రోజుల్లోకూడా తానెన్నడూ ఇలా దిగజారలేదు. తన విధుల్ని నిర్వర్తించటంలో ఇంత నిర్లక్ష్యతను చూపలేదు. మనశ్శాంతి ఎన్నడూ ఇంతగా భగ్నమవలేదు...ఏమిటో అంతా కొత్తగా వుంది. దీనికి కారకులు ఎవరనే సంగతి కాదు తాను ఆలోచించింది, తాను ఇరుక్కున్న యీ వలలోనుంచి ఎంత తేలిగ్గా, త్వరగా బైటపడగలనా అని! ఒకపక్క తన బాధలు తనకుండగా, కాలుజారానా అనే సందేహమొకటి పీడించ సాగింది. ఇది తన పతనానికి మొదటిమెట్టయే పక్షంలో, నిలవ తొక్కుకునేందుకు వెంటనే మేలుకోవాలి. ఆ తర్వాత మిగిలేది పశ్చాత్తాపమే అవగలదు.

యీ రకమైన ఆలోచనల్తో అర్ధరాత్రివరకూ మేలుకొన్నాడు. మర్నాడు కాలేజికి సెలవు—ఏదో పండుగ! యీ పండుగలకు, సెలవులే లేకుంటే అవి తన లాటి వాడికి గుర్తుండవు కూడాను; ఎందుకంటే చేసుకోగలవారికి, అనుభవించేందుకు తగినంత ఉన్నవారికి పండుగలు కాని, తనలాటి నిర్భాగ్య దామోదరులకు దండగలే!

తల్లినిచూసి ఐదురోజులే ఐనప్పటికీ, చాలా కాలమైనట్లు తోచింది. యీ కష్ట సమయంలో ఆమె దగ్గిరికి వెళ్తే మనస్సు కాస్త తేలికవుతుందేమో?. ఆమె ఓదార్పు మాటలు విని, ఆమెపడే బాధల్ని తెలుసుకుంటే, తను తిరిగి సక్రమ మార్గంలోకి రావాలనే పట్టుదలన్నా అధికమవుతుంది. ఒకర్ని కావలించుకొని మరొకరు తమ

విషాదచరిత్రల వెనుక దాగిన దుఃఖభారాన్ని కన్నీటిరూపాన వొదిలించుకోగలుగు తారు. తల్లిని తలచుకుంటూ కన్నుమూశాడు.

మర్నాడు మైలాపూర్ వెళ్ళాడు. మధ్యాహ్నం ఒంటిగంటైనప్పటికీ, తల్లిని కలుసుకునేందుకు అరగంటసేపు దొడ్లో బాదంచెట్టు నీడలో నిలబడవలసి వొచ్చింది. ఇంట్లో పిల్లలు ఆనందంగా, గగ్గోలుగా అరుస్తూ ఆడుకుంటున్నారు. మరోపక్క గ్రామఫోన్ రికార్డులు మోగుతూన్నవి. పెద్దవాళ్లుకూడా నాట్యం చేసేందుకు సిద్ధంగావున్నట్లు తను ప్రతి కదలికలోనూ సంతోషాన్ని వెలిబుచ్చుతూ హడా విడిగా తిరుగుతున్నారు. యీ విశేషమంతా పండుగ తాలూకునని గ్రహించాడు.

యీ మేడలో ఇంత ఆనందం ప్రతిధ్వనిస్తూన్నప్పటికీ, ఒకజీవి తనపాదాల కింద నలిగిపోతోందనే తలపన్నా ఎవ్వరికీ కలగటంలేదు! వారెన్నడూ, ఎంత తీరిక సమయాల్లోకూడా తన తల్లినిగూర్చి తలచివుండరు. బాధల్లో వుండే వాళ్ళనే యీ తలపులు బాధిస్తవి కాని, అనుభవించే వాళ్లకు బాధపెట్టే ఆలోచనలతో ఏం పని?

కోడికూతతో మేల్కొని అర్ధరాత్రి వరకూ పనిచేయవలసిన తల్లి కష్టాన్ని తాను దుర్వినియోగపరుస్తున్నాననిపించింది. ఆమెపట్లఎవ్వరికీసానుభూతన్నాలేదు. ఎంత వొళ్లొంచి పనిచేసినా, ఆ కొంపలోని పిల్లలదగ్గర్నుంచీ ఆమెమీద అధికారాన్ని చలాయిస్తూనే వుంటారు. అన్నిటికీసహించి, కొద్దికాలంలోనే తనీ బాధలనుంచి విముక్తురాలవుతాననే ధైర్యంతో, తనమీద కొండంత ఆశతో వున్నదాతల్లి!

తనకు కాస్తదూరంలో చేతులు పడిపొయ్యేట్లుగా అంట్లు తోముతూన్న పని మనిషిని చూశాడు; అవెక్కడి గిన్నెలు! ఎన్నని! తన తల్లి ఎంతమందికి వొండి, వార్చి, వొడ్డించి వుంటుందో యీ అంట్లనుబట్టే తేలిగ్గా గ్రహించవొచ్చు: యీ బాధలన్నీ ఆమె పడేది తనకోసమే కదా!

ఇద్దరు యువతులు దొడ్లోకివొచ్చారు. ఒకామె ప్రశ్నార్థకంగా రెండో ఆమె వైపు చూసింది.

“ఎవరూ?” అందొకగొంతు రహస్యంగా.

“ఆఁ. మన వంటలక్క కొడుకులే” అన్నది రెండో గొంతు నిర్లక్ష్యంగా.

ఐతే యీ రహస్య సంభాషణ తనకు వినిపిస్తూనే వుంది: ఆరాధిస్తున్నామను కునే సభ్యతకు ఇది తార్కాణం! అసలు తను వినాలనే నీచభావంతోనే వారలా మాట్లాడుకొని ఉంటారు! ఒక వ్యక్తిపడే బాధల్ని చూసి, అలాంటి బాధలేమీ తమకు లేవని ఆనందాన్ని పొందటమే వారి అభిలాష ఐనా కావొచ్చు. తనను ఎంత తేలిగ్గా హీనంగా మాట్లాడారో! తనబోటి బీదలనుంచే వారు సుఖపడుతూన్నప్పటికీ,

ఆ బీదల్నే నీచపరచటం, తమ సుఖసౌఖ్యాల్ని తక్కువచేసుకోవటమనే జ్ఞానమన్నా లేని మనుషులు!

అరగంటసేపు నిలబడి యీ రకం తలపుల తాకిడికి కుంగిపోతూండగా తల్లి వొచ్చింది. రావటంతోనే "ఏం రాజా! అలావున్నావేమిటి?...వొంట్లో బాగా లేదా?" అని అడిగింది.

తనలో గమనించదగ్గంత మార్పువొచ్చివుంటుందని తను అనుకోలేదు. తన మనోవేదనంతా తల్లికి చెప్పుకోవటం ఎలాగో కూడా తోచలేదు. ఐనా తనకన్న ఎక్కువ కష్టపడుతూ, బాధలు పడుతూన్న ఆమెకు ఇదంతా చెప్పి మరీ బాధపెట్టటంలో అర్థంలేదు.

'ఏంలేదు...రాత్రి ఎక్కువసేపు మేల్కొన్నాను...అంతే!' అన్నాడు.

'అంత కష్టపడి చదవొద్దు నాయనా! ఆరోగ్యాన్ని కాపాడుకో. ఏదన్నా వొస్తే మనకు చేసేవాళ్ళెరి? యీ డాక్టర్లకు మందుఖర్చుకూడా ఇచ్చుకోలేంకదా!' అందామె.

తల్లిని తేరిపారజూచాడు; ఆమెలోకూడా ఎంతమార్పు! ప్రపంచంలో కొంతమంది కష్టపడేందుకే పుడతారు; వారు కలలోకూడా సుఖపడరు. ఐనప్పటికీ వారెన్నడూ కుంగిపోతూ, తాము సుఖపడటం లేదనే బాధపడరు. వారు ఎవరికోసమై కష్టపడుతున్నారో వారు సుఖపడటాన్నే కోరుతారు; ఆ సుఖమే తమసుఖమనుకుంటారు. ఇలాటిజీవే తన తల్లి!

తను స్పష్టంగా ఆమె ముఖంలో అలసటను చూడగలిగినా, ఆమె కలాటిదేమీ తోచనట్లు, పైపెచ్చు తను కొంచం హాయిగానే కాలాన్ని గడుపుతూన్నట్లు కనిపించేందుకు ప్రయత్నం చేస్తోంది. మరీ తనను చూడగానే ఆమెకు ఎంతో ఉత్సాహం, తన బతుక్కూడా ఒక అర్థం, ఒక గమ్యస్థానం వున్నదనే భావం కలిగి తీరినట్లు సూచిస్తుంది. ఇలాటి అమూల్య వ్యక్తి తనకీలోకంలో ఒక్కరే! చాలు-యీ ఒక్క వ్యక్తి సహాయంతో, తానీలోకాన్నే జయించగలడేమో? ఒకపక్క ఆమెనుచూసి మనస్సు తరుక్కుపోతోంది; మరోపక్క తనను తాను ఊరడించుకుంటున్నాడు.

'చదువుకో నాయనా! మన యీ కష్టాలు ఎక్కువ రోజులుండవు...డబ్బు కావాలా?' అందామె.

'అక్కర్లేదమ్మా! పద్మనాభంగారింట్లో నా జీతం రెండు రూపాయలు పెంచారు. నీకు ఏదన్నా చీర కొందామనుకుంటున్నానమ్మా!' అన్నాడు.

'ఎందుకు ఆదోదండగ! ఈ ఇంటి ఇల్లాలు ఇచ్చే పాతచీరలే చాలు. నాగూర్చి నీవు ఆలోచించకు. నీపక్కనవుండి నీకు సేవచేయ్యలేకపోయ్యానే అని బాధపడుతూంటాను రాజా! రాజా! నేను అసహాయస్థితిలో వున్నాను—ఏం చేసేది?' అని ఆమె కంట నీరుపెట్టుకుంది.

తన కళ్ళల్లోకూడా నీళ్ళూరినవి. ఒక నిర్భాగ్యజీవి మరో నిర్భాగ్యజీవిని ఊరడించటం ఎంత కష్టం! ఇలా ఇద్దరూ ఏడుస్తూకూర్చుంటే, యీ విషాద మేఘచ్ఛాయను ఆ ఇంటి ప్రహరీల మధ్య విడుదలచేస్తే, ఇంటివారు ఊరుకోరు.

'నాయనా! ఏడుస్తున్నావా? ఎందుకురా నా తండ్రీ!' అని ఆమె తన కళ్ళ తడిని తుడిచింది. తన కంటివెంట కారే నీటినన్నా గమనించలేని అమాయకురాలు! దేవుడు లేడని ఏనాడో నిర్ణయంచేసుకున్న తనకు, దేవతవున్నదనే జ్ఞానాన్ని, ఆ దేవత తనకు రక్షగా, అండగా, తన ఎదుటనే నిలబడిందనే ధైర్యాన్ని యీ తల్లి ఇస్తూనే వుంది.

'పండగనాడన్నా నీకేమీ చేసిపెట్టలేదు కదా! ఇంటామెను అడుగుతే కాదనదు కాని...'

ఎంత ఆపేక్ష యీ తల్లికి! తనకోసం అడుక్కుతినేందుకైనా యీమె వెనుదీయదు కదా! ఇంతమందికి సేవచేసినప్పటికీ ఆమె తనకు సేవచేయనంతవరకూ, తన ధర్మాన్ని నిర్వర్తించలేదనే బాధకు, అసంతృప్తికి గురవుతూనే వుంటుంది. యీ తల్లి హృదయాన్ని, ఎవరు ఎట్లా కొలవగలరు?

'వొద్దమ్మా! నీవు ఎవర్నీ అడగొద్దు. నేను కడుపునిండా తిన్నాను.' అన్నాడు.

ఒకరొకరు చూసుకుంటూ, సానుభూతులు వెలిబుచ్చుకునేందుకూడా మాటలు దొరక్క, రెండు నిమిషాలపాటు అలాగే నిలబడి పొయ్యారు.

'నాయనా! ఎల్లుండి నీ పుట్టిన రోజురా—' అందామె.

పుట్టినందుకే ఏడుస్తూంటే, పుట్టిన రోజులు పండగలెలా అవుతవి? యీ సంగతి తనకూ తెలుసు. తల్లి మరిచిపోతుందేమో, కొంత మనశ్శాంతన్నా వుంటుందనుకున్నాడు. కాని బాధను ఎవరు, ఎట్లా మరిచిపోగలరు?

'నే వొస్తానమ్మా!' అన్నాడు, ఇక అక్కడ నిలబడలేక.

'పోయిరా నాయనా! ఇంతింత దూరం నడిచిరావటం దేనికి చెప్పూ? నీ తల్లికి వొచ్చిన ప్రమాదమేమీ లేదు రాజా!...సరే వెళ్ళు. ఇంట్లో బంధువులు వొచ్చారు. వాళ్ళకు కాఫీ ఫలహారాలు చూడాలి' అందామె. తిని తేన్చటం మినహాగా మరోపని లేని కరుకుహృదయాల సేవలో, నలిగి నల్లేరైన తల్లికి చూపవలసిన సానుభూతి ఎలాగో అర్థంకాలేదు తనకు, మెదలకుండా బైటపడ్డాడు.

మనశ్శాంతి దొరుకుతుందేమోననే ఆశతో యీ ఆరుమైళ్ళూ నడిచివొచ్చి, తన హృదయభారాన్ని పెంచుకొని తిరిగి పోవాల్సి వొచ్చింది. యీ విషాదం ఇంక తరిగే మార్గమే లేదేమోననిపించింది. తలుచుకుంటూన్నకొద్దీ తాను శక్తిహీనుడవుతూన్నట్లు, నిలిచి ఎదిరించే తాహతే తనకులేనట్లు దిగజారిపోసాగాడు. పేవ్ మెంట్ మీద నడుస్తూ ఒకచోట దాదాపు తూలిపడిపొయ్యే పర్యంతమై, పక్కనేవున్న ఎలక్ట్రిక్ స్తంభాన్ని పట్టుకొని నిలవతొక్కుకున్నాడు.

ఏమిటిది! ఎంతమార్పు! మొన్న సాయంత్రంవరకూవున్న ధైర్యమంతా నీళ్లు కారిపోయిందా? మొగవాడు, వయసులో వున్నతన స్థితే ఇలావుంటే, వార్థక్యానికి దరిదాపుల్లోవున్న తన తల్లి గతేమిటి? తను ఆమెకోసమన్నా ఉత్సాహంతో, ఆశతో జీవితాన్ని ఎదుర్కోవాలి.

తన కెందుకీ ఆవేదన? దేన్నిగూర్చి? ఇప్పుడు తనకేం లోటుజరిగిందని? ఎందుకీ అసంతృప్తి? అనవసరపు వ్యధ? ఒకవేళ ఇది బాధే ఐనప్పటికీ, దీన్ని వొదిలించుకోలేని పరిస్థితుల్లో మెదలకుండా అనుభవిస్తే సరిపోతుంది; కాని దీన్నిగూర్చి ఆలోచించిన కొద్దీ, దాని రూపమేమారి, అంతులేని అగాధాల్లోకి కూరుకొని పోవటమౌతుంది. సమతలంలో ప్రవహించే నదివలె, తొణకకుండా పారుతూ, అకాత్తుగా ఒక జలపాతాన్నే సృష్టించిన రీతిగా, జీవితగమనమే మారినట్లు తోచటం, అందుకు అనుగుణంగా మారలేక అశాంతితో తారెట్లాడటం, దారి తెలియక తన ఆత్మబంధువు సహాయం కోసం పరుగెత్తటం ఇదంతా తన బుర్ర కల్పించిన దృశ్యవిశేషమే కాని వేరొకటికాదు. తెలిసివుండీ, యీ ఆలోచనల్ని పెంచుకొని మనసును పిండుకోవటం వల్ల తనకూ, తనను నమ్ముకొన్న తల్లికీ కలిగే ప్రమాదాల్ని కొని తెచ్చుకోవటమే అవుతుంది! ఇక ముందు సాధ్యమైనంతవరకూ తల్లిని సందర్శించటాన్ని తగ్గించెయ్యాలి. అక్కడికిపోయి ఆమె స్థితిచూసి, విరిగిన మనస్సుతో తిరిగిరావటంకన్న, ఆమెకుదూరంగానే వుండి, ఆమె సుఖపడుతోందనే భ్రమలో ఉండటమే ఉభయుల మేలుకూ సహకరిస్తుంది. ఇదే విధంగా తానుకూడా ఆమెకు కనుపించనంతసేపూ, తన కొడుకు ఏదో సుఖపడుతూన్నట్లు ఆమె వూహించుకో గలుగుతుంది కనుక, తను ఎదుట పడ్డప్పుడు ఉండే వ్యధవుండదు.

యీ జంఝూ మారుతంనుంచి తట్టుకోగలిగాడు. పిచ్చివూహాల్ని చాలావరకు పారదోలుతున్నాడు. బాధలుపడటమూ, ఓదార్చుకోవటమూ రెండూ తన వొంతే! కనుక పడేబాధ పూర్తయేవరకూ వేచివుండి, ఆ తరువాత సానుభూతి చూపుకునేందుకు వేరొక అవతారాన్ని దాల్చుకోవాలి. యీ విధంగా ద్వంద్వ వ్యక్తిత్వాలను గడపాల్సి వొచ్చింది.

బలవంతాన ఆ విషాదం నుంచి తేరుకున్నాడు. దగ్గర్లోనే కొలనును ఆనుకొని దేవాలయం వుంది. జనం వస్తూపోతూ వున్నారు. తాను దేవాలయానికి వెళ్ళి చాలా

రోజులైంది. చిన్నప్పుడు తల్లితో మాత్రమే వెళ్లేవాడు. ఆమె పూజలూ, పునస్కారాలూ, నోములు నోచటం తనకు బాగా గుర్తు. కాని అందువల్ల ఆమె ఎన్నడూ సుఖపడలేదు. ఆమెకు న్యాయం జరగలేదు. ఆమె నోముల ఫలమేమిటనే మీమాంసలో పడ్డాడు. చివరకు యీ దేవుళ్ళను నమ్మటంకన్న బుద్ధి తక్కువపని ఉండదని నిర్ణయించుకున్నాడు. తన అభిప్రాయాలను తల్లికి చెప్పినప్పుడు, ఆమె ఎంతో నొచ్చుకుంది; తను నాస్తికుడవటం ఆమెకు బొత్తిగా ఇష్టంలేదు. ఆమెను బాధపెట్టకూడదని తన అభిప్రాయాల్ని తానే భరించాడు. కాని తల్లిమాత్రం అచంచల విశ్వాసంతో దేవుళ్లను పూజిస్తూనే వుంది; మొక్కులు మొక్కుతూనేవుంది; ఫలితం శూన్యమైనా, నిరాశ ఆమె దరిదాపులకు రావటంలేదు. బహుశా యీజన్మలోని పుణ్యమంతా మరు జన్మకు ఉపకరిస్తుందని ఆమె విశ్వాసమేమో?

ఇంతమంది, దేవుళ్ళను కొలవటంలో అర్థం ఏదైనా ఉండిఉండాలి. తనూ, తనలాటి కొద్దిమంది పెడతోవను పడుతున్నామేమోననే అనుమానం యీనాడు కలిగింది. అసలు అందుకనే తను మనశ్శాంతిలేక వేగిపోవటం, తన కష్టపరంపరకు అంతులేకుండటం జరుగుతోందేమో? తల్లి యీ దైవారాధనతోనే, అనాథఐనప్పటికీ, వేయిరెట్ల శక్తితో, ధైర్యంతో ఒంటరిగా జీవితాన్ని ఎదుర్కొగల ఆత్మవిశ్వాసాన్ని పొందగలగటాన్ని తాను కళ్ళారా చూశాడు. తనకిప్పుడు తక్కువైన ఆత్మవిశ్వాసం దైవసందర్శనంలో, ధ్యానంలో కొంతవరకన్నా పొందలేడా? అందులోనూ ఎన్ని బాధలున్నప్పటికీ, గుడినుంచి తిరిగివొచ్చే జనం సంతోషంగా, తమ దరఖాస్తులు మంజూరైనంత ఆనందంగా రావటాన్ని గమనిస్తూనే వున్నాడు. ఏమో, ఒకవేళ పొరపాటనన్నా ఆ దైవం కరుణించి తనను ఒక వొడ్డుకు పడేస్తాడేమో?

సందేహమనేది కలగాలే కాని, మనిషి మారేందుకు, తూగేందుకు ఎంతోసేపు పట్టదనే సంగతి తన కాళ్లు దేవాలయంవైపు పోవటంతో స్పష్టమైంది. ఆ దేవుడెవరో, తనకు పేరు తెలియదు. ఎవరైతేనేం—దేవుళ్ళందరూ ఒక్కటేనని పురాణాలు ఘోషిస్తూనే ఉన్నవి కదా! దేవాలయంలో చాలా కోలాహలంగా వుంది. చాలా సేపు వేచివుంటేనే కాని తనకు దర్శనం దొరికేట్లులేదు.

ధ్వజస్తంభం దగ్గిరి అరుగుమీద కూలబడ్డాడు. ఎంతజనం! వీళ్ళందరూ అమాయకంగా తమ కోర్కెలు తీరుతవనే గాఢనమ్మకంలోనే భక్తి నటిస్తూ, కట్నాలు కానుకలే లంచాలుగా దర్శనం చేసుకొని పోతున్నారు...కాని దూరం ఆలోచిస్తే యీ దేవుడు విచారించి, ఎవరికి న్యాయంచేశాడు? కొంతమంది, సుఖపడేవాళ్లు తమకు న్యాయం జరిగిందని తృప్తిపడొచ్చు; కాని ఏ ధర్మసూత్రాలప్రకారం, తమకీ న్యాయం ప్రసాదించబడిందో, అవే ధర్మసూత్రాలు తమలాటి ఇతరులపట్ల కొరగాకుండా ఎందుకుపోయినవో వారుకొాదుకదా, చివరకు ఆదేవుడుకూడా చెప్పలేడు. పోతే ఆ దేవుడు చేసిందేమిటంటే—తన దగ్గరవున్న న్యాయాన్ని భూలోకంమీదికి వెదజల్లాడు; దొరికిన వాళ్ళకు దొరికింది; దొరకనివాళ్ళకు లేదు. అంతే! ఇలా ఎందుకుచేశావని

ఎవరైనా అడుగుతే, జవాబు చెప్పలేడు కనుకనే, అదృశ్య రూపానవుండి, ఇంకా
తనదగ్గిర ఏదోవుందనే ఆశను కల్పిస్తున్నాడేమో?

ఒకపక్క ఆకలిబాధల్తో నశించేవారు, మరోపక్క అజీర్ణవ్యాధితో బాధపడే
వారూను! యీ ఇద్దరికీ ఒకేరకం న్యాయం జరిగిందని నమ్మగలుగుతే ఫర్వాలేదు!
ఎందుకంటే ఇద్దరిదీ వేరువేరు రూపాలలోని బాధే కనుక! పోతే జీవితం వెగటని
పించి, భగవత్ సాన్నిధ్యంలో మనశ్శాంతి దొరికి, తమ కోర్కెలు ఫలిస్తవేమోననే
ఆశతో వొచ్చే జనమూవున్నారు. ఉన్న ఐశ్వర్యం, సౌఖ్యంచాలక మరి కొంతకావా
లని, దురాశతో, లేదా ఉన్నది కాస్తా పోతుందేమోననే భయంతో దేవుణ్ని కొలిచే
వాళ్ళూ వున్నారు. యీ ఇద్దర్నీ కరుణించటమంటే ఒక తావులో దయా రహిత
మైన న్యాయం, మరొకచోట న్యాయరహితమైనదయే కాగలదు. ఎలా సమర్థించుకో
వాలని చూసినా, యీ దేవుడు రాయికన్న కఠిన సమస్యగానే తోచాడు.

యీ న్యాయాన్యాయాలకు పూర్వజన్మ సుకృతమే కారణమనే విషయాన్ని
తనెలా నమ్మగలడు? ఆపూర్వజన్మ ఏమిటి—అందులో తాను, తనలాటివాళ్లు చేసిన
అకృత్యాలు, సుఖపడేవాళ్లుచేసిన సుకృత్యాలేమిటి? అవి ఎవరికీ తెలియవు. పోనీ
ఉన్నఫళంగా యీ పూర్వజన్మ సిద్ధాంతాన్ని తానెప్పుడు నమ్మగలడంటే—యీ
జన్మలో సుఖపడుతూండేవాళ్ళు, ఆ ఉత్తర జన్మలోకూడా సుఖపడేందుకు సుకృ
త్యాలు చేస్తూంటేకదా! అది లేనప్పుడు ఇదంతా మిథ్య; ఆత్మను మోసపుచ్చుకు
నేందుకు ఒక అడ్డతోవ-అంతే!

ఇక్కడ యీ గుళ్ళో కూర్చొని ఆలోచిస్తే ఏమౌతుంది? ఇప్పటికిప్పుడు తన
సమస్యల్ని తీర్చేందుకు యీ దేవుడికి తీరకేది? ఐనా తను కనిపించిన ప్రతి రాయినీ,
రప్పనీ నమ్ముకోవటంలో అర్థమేముంది? కళ్ళారాచూస్తూ మళ్ళీ తాను మౌఢ్యంలో
పడటం ఏమిటి? తనకూ కొన్ని నిశ్చితాభిప్రాయాలుండాలి. అవి తప్పయినా,
కాకున్నా సరే వాటిని నమ్ముకోవాలి. యీ రకంగా అటూఇటూ బెసుగుతూ వుండ
టంలోనే యీ మనోవేదన! తనకు భక్తి కుదిరేందుకు మారుగా, మీమాంస, తర్కం
ఎక్కువైంది; అలాటివాడికి యీ దేవాలయంలో స్థానంలేదు; ఎంత గుడ్డిగా నమ్మ
గలుగుతే, అంతభక్తుడు కాగలడు. కాని యీ నాడు దృష్టివుండగా, తనకా అంధ
త్వం కావాలన్నా ప్రాప్తించేట్లులేదు.

లాభంలేదని బయలుదేరాడు. తిరిగి గదికి నడిచేశక్తిలేదు. బస్సులో పడ్డాడు...
రెండురోజులక్రితం ప్రొఫెసరొకాయన "యీసంవత్సరం వెరశిమొత్తం మార్కులు
ఎక్కువగా వొచ్చినవారికి, ఫీజులేకుండా చేద్దామని కమిటీ నిర్ణయించింది-జాగర్త!"
అని హెచ్చరించటం గుర్తుకొచ్చింది. దేవుణ్ని నమ్ముకుంటే పరీక్షల్లో కళ్ళముందు
కనిపించేది ఆ విగ్రహమేకాని, పుస్తకాల్లోవున్నది కాదు. అందుకని వాళ్ళు దగ్గిర
పెట్టుకొని, కాస్త కష్టపడి చదువుతే, వొచ్చేఏటికి, యీ నాలుగోవొంతు జీతం కట్టా

ల్సిన బాధకూడా ఉండదు. తల్లి సంతోషిస్తుంది. తను జీవిత గమ్యస్థానంవైపు అనుభవ పూర్వకంగా జరగటం రుజూ అవుతుంది. యీ జన్మకే ఇన్ని అవస్థలూ పడుతూ దుఃఖపడుతూవుంటే, మరోజన్మ కావాలనుకోవటం, అందుకుగాను యీ దైవ సేవలూ అర్థంలేనివి; ఉట్టికెగరలేక, స్వర్గానికి ఎగిరేందుకు ప్రయత్నించటంవంటిది. ఒకవేళ యీ భక్తులకు యీ జన్మలోనే ఏ అదృష్టమో తన్నుకొచ్చినట్లయితే, జీవిత మనేది కేవలం జూదంలాటిదే కాగలదు; తను ఎన్నటికీ జూదగాడుకాలేడు; భరించ లేనంత వొచ్చిపడినా తను తట్టుకోలేడు; యీ వున్నకాస్తా పోయినా బతకలేడు. అందుకని చుట్టుతోవ ఐనప్పటికీ, తను కష్టపడి యీ జీవితాన్ని సాధించటమే ఉత్త మోత్తమం. ప్రాపంచిక విషయాల్లో తలదూర్చకుండా ముక్కుమూసుకొని మూల కూర్చోవటం అసంభవం. యీ ప్రవాహంలోపడి కొట్టుకొని పోతూనే సాధ్యమై నంత త్వరలో, ఈలుచూసుకొని, ఒక తీరానికి జేరటంతప్ప, మరో మార్గంలేదు.

లలిత గుర్తుకొచ్చింది. ఆమెవల్లనే తన జీవితమంతా తలక్రిందులయ్యే పర్యం తమై, ఎలాగో నిలవతొక్కుకో గలిగాడు...ఒక విధంగాచూస్తే ఆమె విమర్శన తనను పెడమార్గానికి పోకుండా తొక్కిపట్టిందా అనిపించింది. తనలోని రచయిత అంత్యదశలో పడటంవల్ల తనుతనుగానే మిగిలాడు. కనుక తనశక్తి సామార్థ్యాలన్ని టినీ ఉపయోగించి, చదివి, మంచిమార్కులు తెచ్చుకోగలడు. పై సంవత్సరం యూనివర్శిటీలో మొదటివాడుగా ఉత్తీర్ణుడైతే ఫ్రీ స్కాలర్‌షిప్ దొరుకుతుంది. ఇదంతాకూడా తన చేతుల్లోవున్నపని! ఇతరులను—మానవులుకానీ, దేవుళ్లేకానీ నమ్మి, మోసపోయి భంగపాటు పొందక్కర్లేదు. అందుకని...

"ప్యారీస్!" అన్నాడు కండక్టర్.

మరిచిపోయి కనీసం రెండుఫర్లాంగులు ముందుకు వొచ్చాడు. చప్పున బస్‌దిగి, కాళ్ళీడ్చుకుంటూ గదిజేరాడు, పట్టుదలతో స్కూలుపుస్తకాలు తెరిచాడు.

కొత్తగాచదివి నేర్చుకోవాల్సింది పుస్తకాల్లో ఏమీ వున్నట్లు కని పించలేదు. ఐనప్పటికీ మరిచిపోకుండా ఉండేందుకు, చదవాలని నిశ్చయించు కున్నాడు కనుక, అదేపనిగా చదువులో మునిగిపొయ్యాడు.

## 12

ఉదయం నిద్రలేచేప్పటికి మనస్సు చాలా తేలిగ్గావుంది. హృదయంలోని బాధంతా కన్నీటిరూపాన బైటపడ్డాక ఆ భారం మరి కనిపించలేదు. అంతే-మామూలు కార్యక్రమానికి ఏమీ భిన్నంలేకుండా పనులు సాగినవి. ఇంతా ఏడుస్తే తనే ఏదో పెడతోవలో విశేషంగా ఆలోచించి లేనిపోని మనోవేదనను కొనితెచ్చుకున్నాడేమో ననిపించింది.

ఆ సాయంత్రం పద్మనాభంగారింటికి యథాప్రకారమే ట్యూషన్‌కు వెళ్ళాడు. ఎప్పుడన్నా ట్యూషన్‌కు రాకుంటే వాళ్ళు అడిగేవాళ్ళు కాదు. అట్లాంటిది యీనాడు రమణమ్మగారు అడగటం ఆశ్చర్యంగా తోచింది.

"నిన్న రాలేదేంబాబూ? లలిత చాలాసేపటిదాకా నీకోసం వుండిపోయింది." అందామె.

ఐతే తను రానందుకు కాదు ఆమెబాధ; లలితను తను అనవసరంగా వేచి ఉంచినందుకన్నమాట! ఐనా తనిక్కడికి ట్యూషన్ చెప్పేందుకు వొస్తున్నాడుకానీ, లలితకోసం కాదు. ఆమెతో మాట్లాడాలని, ఆమెనుచూడాలనే వాంఛనుకూడా చంపుకున్నాడాయె! సాధ్యమైనంతవరకూ ఆమెను తప్పించుకోవాలనిచూసే తనకు పొగమంచువలె వెంటాడి ఆవరించినట్లు తోచింది. ఆమె ఏం మాట్లాడాలనుకుందో ననే ఆలోచనకూడా లేకుండా చాలా నిర్లిప్తంగా, ఇంటరెస్టే లేనట్లు వూరుకున్నాడు. రమణమ్మగారుకూడా మరేమీ అనలేదు.

యీరోజు లలిత ఇంకా రాలేదు. ఆమె రాకముందే యీ ట్యూషన్ వొదిలించుకొని పోదామనే తొందర కలిగింది. ఒకపక్క చదువు చెపుతూనే, చెవుల్ని మాత్రం సావిటివైపు తిప్పివుంచాడు; ప్రతిక్షణమూ లలితవొచ్చి పడుతుందనే ఆతృత ఎక్కువ కాసాగింది; చివరకు విసిగి వొస్తేరానీ—నిర్మొహమాటంగా మాట్లాడితే సరిపోతుందనిపించాక, యీ మొండితనం తాలూకు మనశ్శాంతి కలిగింది.

ఇంకో ఐదు నిమిషాల్లో వెళ్ళిపోతాడనగా లలిత రానే వొచ్చింది; ఆమె రాగానే రమణమ్మగారు పెద్దగా, ఆనందంగా నవ్వుతూ ఎదుర్కొని స్వాగతం ఇవ్వటాన్ని తాను విన్నాడు. తీరా ఆ ప్రమాదమేదో సంభవించింది కనుక, దాన్ని ఎదుర్కొనేందుకూ క్కూడా సిద్ధంగానే వున్నాడు.

పోనీ ఆమె వెళ్ళిపోతుందేమో, ఆమెను తప్పించుకునేందుకు, మరోపావుగంట యీ గదిలోనే వుండిపోవటం మంచి ఉపాయమనిపించి, అలాగే కూర్చున్నాడు. కాని చిట్టి తొందరపెట్టసాగింది.

'సినిమాకు వెళ్ళాలి మాష్టారూ!' అంది.

బతికాననిపించింది; వీళ్ళ సినిమా హడావిడిలో వుండగానే తను దూసుకోగలడు. ట్యూషన్ కట్టిపెట్టి మెల్లిగా జారుకుంటూండగా రమణమ్మగారు పిలిచింది.

'ఏం లేదు...ఇవ్వాళ సినిమాకు వెళ్తున్నాం. మీరుకూడా రండి' అందామె.

'క్షమించండి: నేను చదువుకోవాలి' అన్నాడతను; ఇలా అడగటానికి లలితే కారకురాలని తెలుసు. అందుకనే తన అయిష్టతను వెలిబుచ్చాడు; లలిత లేనట్లయితే, యీ ఆహ్వానాన్ని తోసిపుచ్చేవాడు కాదు.

'ఔనే పిన్నీ ! ఆయనకు ఇప్పుడొస్తూన్న ఫస్టుమార్కులు చాలటంలేదు...' అని కొంటెగా, చెక్కిళ్ళు గుంటలుపడేట్లు నవ్వింది లలిత.

• 'యీ ఒక్క రోజుకూ చదవకుంటేనేం బాబూ! తీరా టిక్కెట్లుకూడా తెప్పించాం' అంది రవణమ్మగారు.

లలిత హాస్యం, ములుకులు గుచ్చుకున్నట్లుంటే, రవణమ్మగారి ఆదరణ మందు రాచి ఉపశాంతి కలిగించింది. చివరకు రవణమ్మగారి మాటను తీసివేయలేక, యీ ఆహ్వానాన్ని ఒప్పుకున్నాడు.

సినిమా బాగానేవుంది; కాని చూస్తున్నంతసేపూ లలిత రవణమ్మగారి పక్కనే కూర్చొని గుసగుసలాడటం, తనకంత స్పష్టంగా వినిపించకపోయినా, విసుగ్గానూ, న్యూసెన్స్‌గానూ తోచింది. ఆమె తనను గూర్చే మాట్లాడుతోందనే ఊహవల్లనే మరీ ఇబ్బందిగావుంది. చేసేదిలేక అలాగే భరించాడు.

ఆ రాత్రి ఇంటికివొచ్చాక, చూసిన సినిమానుగూర్చే తీవ్రంగా ఆలోచించాడు. కథ తనకు తెలియందికాదు—రోమియో అండ్ జూలియట్—ప్రణయ గాథ! ప్రణయగాథలంటే తనకంత ఇష్టమైనవికాదు. కాని యీ కథలోని ప్రణయానికి, కవి ఒక దివ్యత్వాన్ని ప్రదర్శించాడు; వారివారి కుటుంబ వైరాల్నీ, సామాజిక నిబంధనలనూ కూడా లెక్కచేయకుండానే, మహానదీప్రవాహమల్లే వారి ప్రణయం పయనించింది. చివరకు ఇద్దరూ ప్రణయంకోసమే ప్రాణాల్ని అర్పిస్తారు!

ప్రణయానికివున్న శక్తి బాగా అర్థమైంది; ఎంతముందుగా తెలుసుకున్నప్పటికీ, తనుకూడా అలాటి సాలెగూడులోనే ఇరుక్కుపోతాడేమోనని, ఎన్నిజాగర్తలు తీసుకున్నా ఇది తప్పదేమోననే భయంవేసింది. అది నేరమనీకాదు; తప్పనీకాదు; నిజానికి సహజమైనదే! కాని తనకుమాత్రం అతీతాలు. ఒకసారి కాలుజారాడో, తనను లేవనెత్తేందుకు ఎవ్వరూ రారు; ఆ సుడిగుండంలో కొట్టుకొని పోవాల్సిందే! వీటన్నిటినీ మించి తనహృదయంలో తల్లికి తప్ప వేరెవ్వరికీ స్థానమీయకూడదు. తన ధర్మాన్ని విస్మరించి, మాతృమూర్తికి తీరని అన్యాయాన్ని చేయలేడు......యీ కారణంగానే ప్రణయమనేదానికి ఎంత దూరానవుంటే అంత క్షేమకరమని తోచింది.

మర్నాడు మళ్ళీ లలిత ఎదురవుతుందనుకున్నాడు. కాలేజిలో కనిపించింది కాని, పద్మనాభంగారింటికి రాలేదు. ఒకపక్క పోనీలే ఇదీ తనమంచికే అనుకున్నాడు; కాని మరోవైపున ఆమెను పద్మనాభంగారింట్లో చూడలేకపొయ్యాననే అసంతృప్తికూడా కలిగింది. యీ అసంతృప్తికి కారణమైతే తెలియటంలేదు కాని, ఇందువల్ల చాలా ప్రమాదమున్నదనిమాత్రం అర్థమౌతోంది.

యీ విధంగా వారంరోజులపాటు ఆమె పద్మనాభంగారింట కనిపించలేదు; తనవెంటపడిందనుకోవటం ఎంత పొరపాటో అర్థమైంది; ఇదే సమయంలో ఆమె

నిరాశ చేసుకొన్నో, లేక తనను అసహ్యించుకొన్నో—దగ్గరికి వొచ్చినట్లే వొచ్చి, దూరమైపోయిందనే బాధ, తనతప్పేమీ లేకపోయినప్పటికీ ఆమె తళుక్కున కళ్ల ముందు మెరిసి, చేతికి అందినట్లే అంది, మాయమైందనే వ్యధ మనసును పిండసాగినవి. ఏ వ్యక్తికైతే దూరంగా ఉండాలని నిశ్చయించుకున్నాడో, ఆ వ్యక్తి దూరంకాగానే బాధపడుతున్నాడు. తనకు తెలియకుండానే,* తను ద్వేషిస్తున్నాననుకునే వ్యక్తిని నిజంగానే ప్రేమించటం జరిగిందా అనే అనుమానంకూడా కలిగింది. అనురాగమనేది ద్వేషమనే బురఖాలో తనను మోసంచేసిందేమో?

ఒకవైపున తన సమస్య ఇదికాదనుకుంటూనే, మరోవైపున ఆలోచిస్తున్నాడు. ఆలోచించినా చేయగలిగిందేమీ లేదు. తను ఆమెను ప్రేమించటం ఏనాటికన్నా నమ్మకంగా తను తెలుసుకోగలిగినా, ఆ ప్రేమను స్పష్టంగా బైటపెట్టగలిగినప్పటికీ ఫలితమేమిటో ముందుగానే తెలుసుకోగలడు! ఆమె తప్పక నిరాకరిస్తుంది; కనుక యీ తీయని బాధను మనసులోనే ఉంచుకొని, కలలు కనటం ఎన్నుకోదగింది; ఎందుకంటే అందని ద్రాక్షపండని తెలిసి అర్రులుజాచి, ఆశను అడియాసచేసుకోవటం, మొదలంటా నరుక్కోవటమూ జరుగుతుంది కనుక!

అప్పుడే కాలేజిలో గుసగుసలు బయలుదేరినవి. కొంతమంది విద్యార్థులు చాటుగా తనను కొంకపోయినా, లలితను కనిపెడుతూనేవున్నారు. అందగత్తె వెంట పడటమనేది ప్రపంచం మొదటినుంచీవున్న ఆచారమే కనుక ఇవాళ కొత్తగాచెప్పేదేమీలేదు. ఆమెను వెన్నాడిన జనం పద్మనాభంగారింట్లోని యీ సమావేశాల్నీ, ఆనాడు సినిమాకు వెళ్లిన సంఘటననూకూడా వాసనపట్టినట్లే వున్నారు. యీవిధంగా తన రహస్యజీవితం, అజ్ఞాతవాసం కొంతవరకూ వెలుగులోకి వొచ్చివుంటవి.

'ట్యూషన్లు దొరికినా బాగుండు; డబ్బు తీసుకోకుండానే చెప్పొచ్చు' అని తనవెనకాల వాగటం, పకలబడి నవ్వటం తను విన్నాడు.

'అంత దురదగావుంటే చెప్పుకోరాదా? ఎవరు వొద్దన్నారు?' అని అంటిద్దామనిపించింది కాని, ఇందువల్ల తను దొరికిపోవటమేగాక, అనవసరంగా లేనిపోని రొంపిలో ఇరుక్కోవట మౌతుందని ఊరుకున్నాడు. తనకేదో అదృష్టం పట్టిందనుకుంటున్నారు వీళ్ళు! వీళ్ళమాటలు విన్నాక తనకు పట్టని అదృష్టాన్నిగూర్చి ఎలా సంతోషించాలో తెలియలేదు. తనలాంటి బీదవాడిమీద, సరైన దుస్తులుకానీ, తీర్చి దిద్దుకోగల అందచందాలుకానీ, షోకులుకానీ లేనివాడిపట్ల లలిత దృష్టి మరలటం—అన్నివిధాలా ఆమె తాహతుకు సమానులు, ఆమెను పువ్వుల్లోపెట్టి పూజిస్తూ అడుగులకు మడుగులొత్తగల ఐశ్వర్యవంతులూ, విలాస జీవితంలో కాలాన్ని గడిపేందుకు ప్రయత్నించే యువకులూ—తనంటే ఇప్పుడు మరీ అక్కసును వెడలగక్కుతున్నారు. తనుకూడా ఒకప్పుడు యీర్ష్యపడవలసిన వ్యక్తుల్లో ఒకడవుతాడని కలల్లో కూడా అనుకోలేదు కదా!

పక్కవాయిద్యాలవలె మారుమోగిన యీ దృశ్యాల తాలూకు శబ్దాలు తనను మరింత ఆలోచింపచేసినవి. ఎంతగా నచ్చచెప్పుకున్నా బొత్తిగా నమ్మకుండటం అసంభవ మనిపించింది. ఇతర విద్యార్థు లనుకోవటంలో అతిశయోక్తులు ఉండొచ్చు కాని, కొంతవరకన్నా పునాదులు ఉండివుంటవనే నమ్మకం కుదిరింది.

ఏమైనా ఇది ఇంతటితో ఆగుతే ప్రమాదంలేదు. హద్దులుదాటే సూచనలే వున్నట్లయితే, తనగతి ఏమౌతుందో స్పష్టంగా చూడగలుగుతున్నాడు. నిజంగా పెద్ద వాళ్ళకు తెలిసిందంటే, వారు మూడోకన్ను తెరవకుండానే తాను భస్మీభూతు డవుతాడు. తెలిసివుండీ జ్వాలను కోరి కావిలించుకోవటంలో అర్థంలేదు. ప్రణయం కోసం చచ్చిన జీవుల చరిత్రలు తనకు తెలుసు. తానుమాత్రం వాళ్ళల్లో ఒక రయేందుకు ఒప్పుకోలేడు. ఇది కేవలం తన ఒక్కడి సమస్యకూడా కాదు. బతికివున్న తనతల్లికి తాను ఇవ్వగల న్యాయాన్ని కడుపులో దాచుకున్న సమస్య!

పది రోజులు గడిచాక, లలిత ఒకనాడు సాయంత్రంపూట పద్మనాభంగా రింట్లో తటస్థపడింది. ఆమెమీద పూర్వం తనకున్న ద్వేషమంతా యీ పదిరోజు ల్లోనూ పూర్తిగా చల్లారింది; మళ్ళీ ఆవేడి ఇప్పట్లో రాదేమో కూడాను. తనను చూస్తూనే ఆమె ఆహ్వాన పురస్సరంగా నవ్వింది. రవణమ్మగారు లోపలెక్కడో వున్నారు. తనకు తెలియకుండానే తనూ నవ్వాడు: జీవితంలో నవ్వే క్షణాల్నే ఎరుగని తనచేత యీ మె ఎలా నవ్వించగలిగిందో? ఎదుటివ్యక్తిలో ఆనందాన్ని చూడ గలగటంకూడా కొంత ఆనందాన్నివ్వగలదు కాబోలు!

'నమస్కారం మాస్టారూ!' అందామె.

ప్రతి నమస్కారం చేశాడు. ఏం మాట్లాడాలో తెలియక అలాగే నిలబడి పోయ్యాడు.

'కూర్చోండి; మీ శిష్యురాలు లోపల ఫలహారం చేస్తూన్నట్లుంది' అందామె. చేసేదిలేక తను కూర్చున్నాడు.

'ఇప్పుడేం రాస్తున్నారూ?' అందామె.

తన అస్త్రం ఎంతవరకూ హాటమార్చిందో తెలుసుకొనే ప్రయత్నం చేస్తూన్న ట్లుగా తోచింది తనకు. యీ ప్రశ్నకు బాధకూడా కలిగింది.

'ఏమీ లేదు...అసలేమీ రాయదల్చుకోలేదు' అన్నాడుతను.

'అరేం? ఎందుకు రాయరు?' అందామె, ఆశ్చర్యంతో కనుబొమలు పైకెత్తి.

'ఆనాటి మీ విమర్శ విన్నాక, రాయకూడదని నిశ్చయించుకున్నాను; ఆత్మ విమర్శలో కలిగిన ఫలితం!'

ఆమె దుర్వార్తను విన్నట్లు, తలక్రిందులైనట్లు స్పష్టంగా తెలిసింది తనకు' నోటమాట రాక తనను తాను సంబాళించుకుంటున్న సమయంలో 'పోనీండి... నేను రాయకపోతే, రాయలేకపోతే వొచ్చిన ప్రమాదమేమీలేదు. అదేమంత పెద్ద విషయంకూడా కాదు' అన్నాడు.

ఆమె మెల్లిగా తేరుకుంది. గాద్గదిక కంఠస్వరంతో 'అలాకాదండీ... నేను విమర్శించిన ఉద్దేశ్యం అది కానేకాదు. మీరింకా బాగా రాయాలని, ఇంకా లోతులకు వెళ్ళి ఆలోచించాలని! మీరు నన్ను అపార్థం చేసుకున్నారు—' అంది.

'మీ ఉద్దేశ్యం ఏదైనప్పటికీ, మీ విమర్శ నాకు మేలుచేసింది. వ్యసనంవలె వెంటపడిన యీ సాహిత్యాన్ని నేను జీవితంలో వొదిలించుకునేవాణ్ని కాదు. నన్నా వ్యసనం నుంచి రక్షించారు'

'మీరు నిజంగానే అలా అనుకుంటున్నారా? కళ వ్యసనమనే భావిస్తున్నారా?.. మీరొక గొప్ప రచయిత అని నా భావం. అలాటి మీరు సాహిత్యాన్నే వొదిలేస్తే నేనేమనాలి?' అని ఆమె ఒక వారపత్రికను తీసి 'ఇది చదవండి' అంది తెరిచిన పేజీని చూపుతూ.

చదివే ఇంటరెస్ట్ లేకపోయినా చకచకా చదివాడు. ఆ వ్యాసం ఆ సంవత్సరం సాహిత్యంలో జరిగిన కృషిని గూర్చిన సింహావలోకనం. తన కథలు అత్యుత్తమంగా ఉన్నవని రాయబడివుంది. అది చూశాక, తనెంత పొరబడ్డాడో, నిజానికి తన యీ నిరాశకు లలిత ఎంతవరకూ కారణభూతురాలో అర్థమైన కొద్దీ, తిరిగి యీమెపట్ల ప్రేమంకూడా రగలసాగింది. కాని ఇంతకుముందు ఆమె వెలిబుచ్చిన పశ్చాత్తాపాన్నిబట్టి తేలిగ్గానే క్షమించగలిగాడు.

అంతా చదివాక పైన రచయిత పేరు చూశాడు; 'లత' అనివుంది; ఒకవేళ ఇది లలితే రాసి వుంటుందా అనే అనుమానంకూడా కలిగింది.

'ఎలా వుంది?' అందామె.

'ఏమో నన్ను కాస్త పొగిడినట్లుంది.'

'అర్థంలేని పొగడ్త కాదు కదా?'

"అది ఏమైనా నేను పట్టించుకో దలచలేదు...మీరే రాశారని నా అనుమానం!"

ఆమె చిలిపిగానవ్వి "నేను... నేనే రాశాను. చాలా ఆలోచించే రాశాను" అంది. యీ రాసింది బాగాలేదనీ, తను కొన్ని సలహాలిచ్చి ఆమెను బాధపెడదామని కించింది. కాని నిజంగానే రాసింది చాలా బాగున్నప్పుడు ఏమనగలడు?

"ఐతే మీరు నా ఎదుట ఒకమాటా, నా వెనుక ఇంకోమాటా చెప్పారన్నమాట!" అన్నాడు.

"మీరు నన్ను అర్థం చేసుకో లేకపోతున్నారు...మీరు ఇంతటితోనే తృప్తి పడిపోతారేమోననే భయంతో అలా చేశాను. నా విమర్శ మిమ్మల్ని పై అంతస్థులకు పాకిస్తుందనుకున్నాను కాని, నిరాశలోకి దించుతుందనుకోలేదు"—ఆమె కల్మషాత్మలో సిగ్గుపడినట్లుంది.

"అచ్చయిన కథలన్నీ ఆరాత్రే తగలబెట్టాను" అన్నాడు, ఆ నిరాశ తాలూకు ఫలితాన్ని చెప్పేందుకు.

"ఎంతపని చేశారు! ఐనా ఫర్వాలేదులెండి. ఆ కథలన్నీ నాదగ్గిర భద్రంగా ఉన్నవి. అవి మీకిస్తాను...కాని మీరురాయటం మానొద్దు; రాసినదాంతో తృప్తి పడనూవొద్దు. మీ తత్వమేమిటో ఇప్పుడు నాకు తెలిసింది కనుక, ముందెప్పుడూ నేను కఠినంగా విమర్శించను" అందామె.

"అప్పుడు నాకు లోపాలు తెలియవు. గుడ్డెద్దు చేలో పడ్డట్లవుతుంది."

"మీ కంతనమ్మకంలేదేం? మీకెంతో ఆత్మవిశ్వాసముందని ఆనాడు తమాషాకు కొంతా, తర్కంలోని తెలివితేటల్తో కొంతా మాట్లాడాను. అంతమాత్రానికే మీరు తలక్రిందు లవుతారనుకోలేదు... నేను నిజం చెపుతున్నాను. ఇప్పటికీ మీరు ఉత్తమ కథకులు. ఇంకా ముందుముందు మీ కీర్తి విస్తరిస్తుంది. ఐతే పొగడ్తలకు మూర్ఛపోవొద్దు" అందామె.

పోయిన శక్తంతా తిరిగి వొచ్చినట్లయింది. యీ స్త్రీ మూర్తిని చూస్తుంటే యీమెలోనే సృష్టిలయాలు రెండూ ఇమిడి వున్నవా అనిపిస్తోంది. తనలో శాశ్వితంగా అణగి పొయ్యాడనుకున్న రచయిత, తను గమనించని కాలంలోకూడా విపరీతంగా పెరిగి, ఇప్పుడే ఒక్కసారిగా సాక్షాత్కరిస్తున్నాడు. తలలోనుంచి విసిరి పారేశాననుకున్న అనేక కథావస్తువులు, మూలల్లో దాక్కొని తాను వెతకనక్కర్లే కుండానే కళ్ళముందు ప్రత్యక్షమైనవి...పోయిన ఉత్సాహం ద్విగుణీకృతమైంది.

'మీరు తప్పక రాయాలి. నా యీ కోర్కెను మన్నిస్తారుగా?'

ఎందుకింత ప్రాధేయపడుతుందీమె? సాహిత్యంమీద వుండే ఆపేక్షవల్లనా? తనమీది గౌరవంవల్లనా? బహుశా రెండూ కారణాలే కావొచ్చు.

'రాస్తాను...తప్పక రాస్తాను!' అన్నాడు శపథంచేసే ధోరణిలో. ఆమె సకల కోర్కెలూ తీరినంతగా సంతోషపడటం ఆ మొహంలోనే కనిపించింది.

ఇది వరకు తనను బాధించిన కొన్ని అనుమానాల్ని తీర్చుకునే సావకాశం లభించిందిప్పుడు.

'విమర్శ ఇంత బాగా రాయగలరుకదా—మరి మీరెందుకు కథలు రాయకూడదు?' అన్నాడు.

'నేనా?' నవ్వి అన్నదామె: 'నేను రాయలేను. రాసేందుకు నా బుర్ర చాలదు. వంట చెయ్యటం మీ వొంతైతే, రుచులు చెప్పటం నా వొంతు...రాసేందుకు ప్రయత్నించి, వాక్యాలు కదలక వూరుకున్నాను. కావాలంటే నేను వూహించిన కథలు కొన్ని చెప్పగలను, కాని విన్నాక మీరు నవ్వుతారు. నాకే పేలవంగా కనిపించినయ్' అందామె.

'చెప్పండి పోనీ విందాం'

'ఇంకోసారి చెపుతాను'

'అసలు నేను కథలు రాస్తానని మీకెలా తెలిసింది?'

ఆమె నవ్వింది. 'తెలుసుకోవాలనుకున్నాను...ఒకనాడు మీరు వెళ్తూండగా, మీ పుస్తకాల్లోంచి కవరొకటి జారిపడింది. మీరది గమనించలేదు. నేను ఏరి వుంచాను. ఆ రాత్రి చదివాను; కథ చాలా బాగుంది. ఒకటి రెండుసార్లు మీకా కవరు అప్పగిద్దామని పలకరించినా, మీరు వినిపించుకోలేదు. ఎడ్రస్ కూడా రాసివుంది కనుక, నేనే స్టాంపువేసి పోస్టుచేశాను...'

ఐతే యీమె తన ఆపులలోనే జమ అనిపించింది. తన వెనుక జరిగిన యీ కథంతా తమాషాగానే తోచింది.

'మరోమాట...మీరు ఎవ్వరితోనూ నా సంగతి అనొద్దు...'

'అంటే మీరు కథల రాస్తారనకూడదా?'

'వొద్దు—'

'ఎందుకీ అజ్ఞాతవాసం? మీరు చేయగలిగింది లోకం తెలుసుకో కూడదా? మీ కవరు చూడకముందు, యీ రచయిత ఎవరా అని తహతహ లాడానంటే నమ్మండి. నా వలెనే మరి కొంతమంది పఠితలు...'

'వారందరి సంగతీ పోనీండి. నాకు పబ్లిసిటీ వొద్దు. పాఠక లోకాన్ని రిప్రజంట్ చేసే మీ అభిప్రాయాలే చాలు.'

"సరే...అలాగైతే ఎక్కడా అనను లెండి" అందామె.

ఇంతలో రమణమ్మగారు వొచ్చింది.

"ఏం నాయనా! చాలాసేపైందా వొచ్చి? ఇవాళ కాస్త పెందలాడే వొచ్చినట్లున్నావ్?" అందామె.

'ఔనండీ...లెక్చరర్ ఒకాయన సెలవు; అందుకని ఒక గంటముందే క్లాసు వొదిలేశారు.'

"చిట్టీ! మాష్టారువొచ్చారు...కాఫీ తీసుకొనిరా?' అని కేకవేసింది రమణమ్మగారు.

'ఆఁ, వొద్దండీ! యీమధ్య లేనిపోని అలవాట్లు అవుతూన్నట్లుంది' అని వారించాడు తను.

కాని రవణమ్మగారు పట్టించుకోలేదు. "అలవాటైతేమాత్రం ప్రమాదమేమిటి? ఇదీ ఒకరకం ఆహారమేకదా!" అందామె! ఇక తనస్థితిగతులకు కాఫీ ఎంత చెరుపో చెప్పటం, చెప్పి ఆమెను ఒప్పించటం కుదరదు కనుక, తనేమీ మాట్లాడలేదు... తన రచనలపట్లచూపే గౌరవంగానే వున్నదంతా. ఇందుకు కారకురాలు లలిత— ఒకనాడు పాతాళానికి దిగతొక్కి, యీనాడు తిరిగి తనను ఆకాశానికి ఎత్తి, తనలోని శక్తిని రెండింతలుచేసిన స్త్రీమూర్తి!

చిట్టి తెచ్చిన కాఫీగ్లాసు ఖాళీచేస్తుండగా, లలిత రవణమ్మగారి చెవులో ఏదో రహస్యం చెప్పింది. తను కాఫీ పూర్తిచేయగానే ఆమె 'నాయనా! నీకు కాస్త తీరుబడి వుంటుందా?' అంది.

ఏదోపని తగిలిందని 'ఏం చెయ్యాలో చెప్పండి' అన్నాడు.

ఏంలేదు. మా లలిత చదువులో కాస్త వెనకబడింది. దానికి తెలివితేటలేమీ తక్కువలేవు. మొన్నామధ్య మాట్లాడుతూంటే ఇంతవయసువొచ్చి, ఇంత అనుభవంవున్న నాకే ఆశ్చర్యం కలిగింది. ఐతే దీని తెలివితేటలు చదువులో ఉపయోగపడకుండా ఉన్నవి...దీనిక్కూడా కాస్త ట్యూషన్ చెపుతే...నీవు వాళ్ళింటికి వెళ్ళక్కర్లేదు. ప్రతిసాయింత్రమూ ఇక్కడికే వొస్తుంది.' అందామె.

తను నిర్ఘాంత పొయ్యాడు. తనేమిటీ-తన క్లాసు విద్యార్థినికే ట్యూషన్ చెప్పటమేమిటి! ఐనా లలిత ఇందాకట్నుంచీ అంత కలిసిమెలిసి మాట్లాడి, తీరా యీ సంగతి అడగొచ్చేప్పటికి రవణమ్మగార్ని ఎందుకు అడ్డం పెట్టుకుందో అర్థం కాలేదు.

'కాని...కాని...' అని గుటకలు మింగి 'నా క్లాసు వాళ్ళకే ట్యూషన్ చెప్ప గలిగినంత శక్తి సామర్థ్యాలు నాకు లేవు...' అన్నాడు.

'దీన్ని ట్యూషన్ అనకపోతే, కలిసి చదువుకోటం అను. ఏదన్నా అను. దానికి అర్థంకానివి, నీకు అర్థమైనవి చెప్పటమే కదా! నీకన్న తెలివిగల వాళ్లూ, కష్టపడి చదివేవాళ్లూ కాలేజిలోనే లేరని లలిత చెప్పింది...ఎం. ఏ. ప్యాసైనవాళ్లు, ఎం. ఎ. క్లాసుకు లెక్చరర్లగా ఉండటంలేదా?' అంది రవణమ్మగారు.

తను సందిగ్ధంలో పడ్డాడు. ఏ కారణం చెప్పి తప్పించుకుందామా అనికూడా ఆలోచిస్తున్నాడు.

'రోజూకన్న మరో అరగంటో, ముప్పావుగంటో వుంటే సరిపోతుంది...నీ కష్టానికి తగినట్లే పాతిక రూపాయలు ముట్టచెపుతుంది'

పాతిక రూపాయిలు! రూపాయిలు సంపాయించటం ఇంత తేలికని ఎన్నడూ అనుకోలేదు! పోతే తనకు నమ్మకంలేని శక్తిమీద, వారికెంతో నమ్మకం కుదిరింది... ఐతే తాను లలిత దగ్గర డబ్బుతీసుకొని చదువు చెప్పటానికి చాలా సిగ్గుపడాల్సి వొచ్చింది. చదువును అమ్ముకోవటమల్లే, ఏదో నీచకార్యం చేస్తూన్న భావనకలిగింది. ఇతర ట్యూషన్లుకూడా అలా గేతోచి ఉండవలసింది; కాని ఇక్కడే, ఇప్పుడే ఆ బాధ కలిగింది...మరోవైపు డబ్బుకు మొహంవాచిపోయి, యీ జీవితం ఇంకెలాగా అని దిన దిన గండంగా గడుపుతూండగా యీ మొత్తాన్ని చేజేతులా వొదులుకోలేని అశక్తత పీడిస్తోంది. ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు.

'ఒప్పుకున్నట్లేనా బాబూ?' అందామె.

'సరే—కానియ్యండి' అన్నాడు వినపడీ వినపడకుండా. లలిత విజయసూచకంగా, తీవిగా నవ్వింది.

ఇక ఆ సాయంత్రమే కొత్త ట్యూషన్ కూడా ఆరంభమైంది. లలిత చాలా అణకువతో, అల్లరనేదే ఎరుగని దానివలె, తనపట్ల ఒకరకం భక్తితో, తివాసీమీద మోకాళ్లు ముడుచుకొని కూర్చొనివుంది. ఆమెకు ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థంకాలేదు తనకు.

'నాకు కెమిస్ట్రీ లెక్కలూ బొత్తిగా రావండీ...ఆ రెంటిలోనూ పోతే, గ్రూప్ అంతా పోతుందని భయం. మిగతావి నేను చూసుకోగలను—' అందామె, అనవసర కాలయాపననూ, తన తికమకనూ తప్పిస్తూ.

లెక్కలు మొదలుపెట్టాడు. లెక్కలంత తేలిక సబ్జక్టు మరి లేదనే నమ్మకాన్ని కలిగించాడు. అల్జీబ్రా అగమ్యగోచరమైంది కాదనీ, అంకెలకు బదులు అక్షరాలు ఉండటమే తప్ప, ఇంకో గాబరా ఏమీలేదనీ నమ్మించాడు. జామిట్రీలో కాస్త గుర్తు పెట్టుకోవాల్సింది, కొంచెం అలోచించాల్సింది వుంటుందన్నాడు ... ఇంకే మేమో చెప్పాడు. మొత్తంమీద ఆమెను దారిలో పెట్టేందుకు ఎక్కువ శ్రమ కాలేదు.

మామూలు టైంకన్నా ఒక గంటసేపు ఎక్కువ ఉన్నాడు. చిట్టికి ఇది ఇష్టముండేది కాదు కాని, లలితక్కాయ్ లాటిసి శ్రద్ధగా కూర్చునేప్పటికి, తోడు వుందనే సంతోషంతో కూర్చోగలిగింది.

చివరకు ఇంటికి వెళ్ళేప్పుడు 'మాస్టారూ! మీదగ్గరేవన్నా కథలపుస్తకాలుంటే తెచ్చివ్వండి; చదువుకొని ఇచ్చేస్తాను. నాదగ్గరున్న పుస్తకాలు మీకిస్తూంటాను' అంది లలిత. ఇవాళంతా వ్యాపారధోరణిలోనే సంభాషణలు సాగినట్లు తోచినవి. తలవూపి ఇంటిదారి పట్టాడు.

## 13

జీవితంలో యీనాడొక నూతనాధ్యాయం ఆరంభమైనట్లే తోచింది తనకు. లలితా, పద్మనాభంగారి ఇల్లాలూ, చిట్టీ అందరూ ఎంతో ఆప్యాయతను చూపుతున్నారు. యీలోకంలో తనకెవ్వరూ లేరని, ఎవ్వరికీ తన సంగతే పట్టదనుకున్న తనకూడా కొంతమంది మేలుకోరేజనం వున్నారని తోచింది. యీమాత్రం సానుభూతి వుంటే బతుకింత భారంగా వుండదు.

ప్రతిరోజూ ఎంతో ఆయాసపడుతూ, హృదయ భారంతో వుండే తనకు, ఇవాళ ఎంతో తేలిగ్గా, హాయిగా ఉత్సాహంగా వుంది. జీవితంలోని చేదు చాలా వరకు అలవాటైనప్పటికీ, యీనాడు ఆ కొంతకూడా కనిపించటంలేదు; ఇది మధురంగా మారేందుకు కొన్ని సంవత్సరాలు పట్టొచ్చు; యీ మాత్రం ఆశవుంది కనుక, తాను ఓర్చుకోగలడు.

తనను ఎంత తేలిగ్గా గాయపరిచిందో, అంత తేలిగ్గానూ గాయాన్ని మాన్పించగలిగింది లలిత! ఇవాళే తిరిగి కలం ఎత్తాడు. యీసారి దీన్ని దింపేందుకు బ్రహ్మరుద్రులు దిగిరావాలి. ఇప్పుడు ఎంత పదునుగా తన బుర్ర తయారైందో, ఎంత ఉత్సాహంతో కలం కదులుతోంతో చూసుకుంటే. తన యీ కొత్త శక్తికి లలితే కారకురాలని అర్థమౌతూనే వుంది. ఆమెపట్ల ద్వేషమనేది మరెన్నటికీ కలగదు. ఒక రకంగా ఆమెను మార్గదర్శకురాలుగా, తనను నడిపించగల చుక్కానిగా, గౌరవ భావంతో చూడగలుగుతున్నాడిప్పుడు. ఒక్కొక్క వ్యక్తితో మాట్లాడుతూంటే ఆ వ్యక్తిలోని శక్తుల్ని కొన్నిటిని పీల్చుకున్నట్లే వుంటుంది. కొత్త విషయాలు, తనకు తోచనవి, తోచినా గ్రహించలేని వాటికి సంభాషణలు ఒక విశిష్టరూపాన్నిస్తవి. యీనాడు ఇలాటిది అనుభవంలోకి వొచ్చింది.

చదువు వెనక్కినెట్టి, సాహిత్యంమీద పడ్డాడు. ఆకలితో మలమలా మాడినా సరే, యీ సాహిత్యాన్ని మాత్రం వొదలకూడదనే ధృఢనిశ్చయం కలిగింది. తనలాగు మాడిన రచయితలందరూ, తను మొదటివాడు కాకుండా, ముందు ఉండనేవున్నారు. ఆ నలుగురితోనూ చావు, పెళ్ళితో సమానమే కాగలదు.

అర్థరాత్రివరకూ రాశాక, నడుంవాల్చాడు. ఇంకా రాయవలసింది చాలా వున్నప్పటికీ, శారీరకంగా మరి శక్తిలేదు. ఒకపక్క జీవితం తాలూకు వొత్తిడీ, మరోవైపు కళాభిమానం, కళ వంటబట్టి బైటపడేందుకు చేసే తిరుగుబాటూ, దాన్ని మనసులో మరి దాచుకోలేక మథనపడుతూ, అశాంతితో బాధపడుతూ వివిధానుభూతులకు నిలయమయ్యాడు. వీటిని ఒక్కొక్కటిగా వొదుల్చుకునేందుకు లేదు. ప్రతిరోజూ అన్నిటి వ్యవహారాలూ చూస్తూనే వుండాలి. వివిధానుభవాల సమ్మేళనమే జీవితం అని తనకు తెలియకపోతేగా?

పడుకున్నాక లలిత ట్యూషనూ, ఆమె పాతికరూపాయిలు ఇస్తాననటం గుర్తొచ్చింది. డబ్బు విషయంలో తాను కౌననా లేదు; కాదనాలేదు. ఇప్పుడు అది తీసుకోవటమా, మానటమా అనే మీమాంస బయలుదేరింది. నిజానికి లలితకు ట్యూషన్ అనే పేరున, తనచదువు సాగుతోంది. కనుక ఆమెదగ్గిర ఏమైనా తీసుకోవటం చాలా అన్యాయంగానే తోచింది. అందులోనూ తనకు మహోపకారం చేసిందామె! తనలోని రచయిత్రికు అచంచల శక్తిని ప్రసాదించింది. దయ్యమై వొచ్చిందనుకున్న తనకామె దేవతగానే మారింది...ఆమెచేసిన యీ ఉపకారానికి తనేం ఇవ్వగలదు? ధనరూపంలో దాన్ని విలువ కట్టగలిగినప్పటికీ, ఎంతైనా తన శక్తికి మించిందే అవుతుంది. పోతే ఆమెమాత్రం తాను చేస్తున్నాననుకునే సహాయానికి ధనరూపంలో ప్రతిఫలాన్ని ముట్టచెప్పేందుకు సిద్ధమైంది...ఆమెదగ్గిర డబ్బు తీసుకోవటం తనను తాను నీచపరుచుకోవటంగానే తోచింది. ఇంకానయం—డబ్బు తీసుకోవటం ఇంకా ప్రారంభం కాలేదు కనుక, ఆ నైచాన్ని దూరంగా ఉంచగలదు!

—కాని, మరోరకంగా ఆలోచిస్తే, తను కష్టపడుతూన్నందుకు జీతం తీసుకోవటం న్యాయమైన ప్రతిఫలంగానే తోచింది. తన బతుకే ట్యూషన్లమీద; అలాంటి తన వృత్తిధర్మాన్ని అనుసరించటంలో తప్పేమిటి? తన బీదతనాన్ని మరే మార్గంలో పరిష్కరించగలదీ లోకం? ప్రతి సమస్యకూ ప్రపంచంలో కొన్ని పరిష్కారమార్గాలు ఉండనే ఉన్నవి. వాటిని వెతికిపట్టుకొని, అనుసరించటమే శ్రమ. ఇది నేరమా?

ఈ సమస్య కేవలం తనొక్కతెన్నే దృష్టిలో వుంచుకోకుండా, తన తల్లి దృష్ట్యాకూడా చూస్తే ఇంకా విపులంగా అర్థమౌతోంది. ఇరవైరూపాయిల జీతానికే కదా, ఆమె అక్కడ గాడిద చాకిరీ అంతా చేస్తోంది? ఎన్నాళ్లిట్లా? ఆమె సుఖపడేదెప్పుడు? తన ప్రయోజకత్వానికి మురిసిపొయ్యేదెప్పుడు? ఇన్నాళ్లూ ఆమె కష్టాన్ని పిండుకొనితింటూ తానామెపట్ల అపచారం చేస్తూనేవొచ్చాడు. ఇప్పుడు యీ పాతిక రూపాయిలూ సంపాయిస్తే ఆమె వొచ్చి తన దగ్గిరే సుఖంగా వుండగలదు. ఆమె బానిసత్వపు సంకెళ్ళను విడగొడుతుందీ డబ్బు! అలాంటిదాన్ని వొదులుకోవటం ఎలా?

ఒకవేళ ఇది మానవత్వానికి భిన్నమైనదనుకున్నప్పటికీ, ముసలి తనంలోకూడా తల్లిచేత ఇతరులకు చాకిరీచేయించటం, ఇంతకన్న తక్కువ అమానుషమని ఎవరనగలరు? ప్రపంచం ఎన్నో అమానుష కార్యాలమీదనే దొర్లుతూవుండటం తను కళ్లారా చూస్తూ, తానీ ప్రపంచానికి సంబంధించని వ్యక్తివలె, కళ్లు మూసుకు కూర్చుంటే బతుకు సాగటమే కష్టం! ఐతే సాధ్యమైనంతవరకూ, అవకాశం చిక్కినంత వరకూ తానలాటి పనుల్ని చేయదు; చేయలేదు. ఘోరమూ, ఘోరతరమూ

అన్న రెండు పనుల్లో ఏదో వొకదాన్ని చేసి తీరవలని వొచ్చినప్పుడు, విజ్ఞుడెవడైనా సరే ఘోరాన్ని చేసేందుకే నిశ్చయించుకోవటం, తనపట్ల అమలు జరుపుకో వొచ్చు...

ఐనా యీ లలిత ఎవరు ? తన తల్లితో పోలుస్తే యీమె స్థానం చాలా తక్కువది. తల్లిపట్ల తన బాధ్యతల్తో సరి చూసుకుంటే, లలితపట్ల తను చూపవలసిన బాధ్యతలు ఏమున్నవి కనుక ? అందుకని యీ జీతాన్ని, ఆమె ఇష్టపడి ఇచ్చే సొమ్మును తీసుకొని, దాన్ని మాతృసేవకు ఉపయోగిస్తాడు. ఏ పనిలోని మంచిచెడ్డలైనా, దాని పర్యవసానాన్నిబట్టి నిర్ణయించటం జరిగినట్లయితే, ఇది సత్కార్యమే కాగలదు !

ఎంత ఆలోచించినా ఎటూ తెగటంలేదు. మొదటి నెల జీతం నిరాకరించి తన గొప్పతనాన్ని చూపటమా, లేక అది తీసుకొని, తనతల్లిని దాస్యవిముక్తురాల్ని చేయటమా ? రెండు దృశ్యాలూ కళ్ళముందు సాక్షాత్కరించినవి: తల్లిదగ్గిర తను ఎంత అల్పుడో, ఆమె తనకు చేసిన త్యాగాలతో పోలుస్తే తను ఎంత హీనుడో అర్థమైంది. ఆమెకు స్వాతంత్ర్యాన్ని సాధించిపెట్టినప్పుడు మాత్రం తను నిజంగా గొప్పవాడు కాడా ? అప్పుడామెతోపాటు తనూ ఆనందించగలడు. యీ విధంగా ఒకే వ్యక్తికి సంబంధించిన ఆనందం, అదే స్థాయిలో ఇద్దరికి లభ్యమవగలదు...ఐనా దీన్ని గూర్చి మరికొంత ఆలోచించాలనుకుంటూనే నిద్రకు ఉపక్రమించాడు.

మర్నాటికి మనస్సెంతో తేలిగ్గా వుంది. తల్లికాకుండా తను మరి కొంతమంది సమ్మదగ్గ వ్యక్తులు, తన మనశ్శాంతికి ఏదో విధంగా కారణభూతులౌతున్న వారు ఉన్నారనే సంగతీ, వారిలో కొంతమందిని గుర్తించి సహచర్యాన్ని సంపాయించగలిగాననే సత్యమూ, యీ ఉదయానే కొత్తగా కనిపెట్టినట్లయింది. చాలా ఉత్సాహంగా, హుషారుగా దినచర్య గడిచింది ..కాలేజికి బయులుదేరుతూండగా లలిత పుస్తకాలడిగిన మాట గుర్తొచ్చింది. తను కొనుక్కున్న యీ సెకండ్ హ్యాండ్ పుస్తకాలనుచూసి ఆమె అసహ్యించుకుంటుందేమో ననుకున్నాడు; కాని తన దగ్గర అంతకన్న కొత్తపుస్తకాలుంటవని ఆమెఅభిప్రాయపడివుంటే, అదికేవలం ఆమె పొరపాటే అవగలదు; అందుకు తన బాధ్యతే ఏ విధంగానూ ఉండబోదు. ఐనా తనకు వున్న పుస్తకాల్నే ఎరువివ్వగలడు కాని, యీమె కోసమని జీవితస్థాయి ఒక్కసారిగా పెరగటం అసంభవం ! అసలు మనిషి మనిషికీ ఎవరు మారగలరు ? ఎందుకు మారాలి ?

రెండు మంచి కథలపుస్తకాల్ని చంకలో పెట్టుకొని బయులుదేరాడు. ఆ సాయంత్రం పుస్తకాల్ని అందుకుంటూ 'మీరు మరిచిపోయి ఉంటారేమో ననుకున్నాను' అంది లలిత నవ్వుతూ; ఆమె పుస్తకాలను అసహ్యించుకున్న సూచనేమీ కనిపించలేదు; అంతా ఊహాగానమే జరిగింది! ఆమె పుస్తకం అందుచుందాలు, బాహ్య ఆకర్షణలకన్న లోని సరుకుకే ఎక్కువ ప్రాముఖ్యత నివ్వగలగటంతో, మనసులో ఆమెపట్లగౌరవం మరోమెట్టు పైకిపాకింది,

ఆమె వ్యాఖ్యానం చేసిన విధంగానే తనవి — మూడు కొత్తపుస్తకాలిస్తూ, 'మంచి రచయితలవి కొత్త ఎడిషన్లు అనుకున్నప్పుడల్లా దొరకవు. కొద్దిమందికోసం పుస్తకాల షాపులవాళ్ళు శ్రమపడి తెప్పించరు...అలాంటివి కావాలంటే మూర్ మార్కెట్‌లో సెకండ్ హ్యాండు షాపులు గాలించటమే మంచిది. ఐతే నాకు అంత ఓపిక లేదండీ!' అంది, తన పద్ధతిని అభినందిస్తూ. దీనికి తను జవాబు చెప్ప లేక ఊరుకున్నాడు.

ఆ సాయంత్రంనుంచే దినచర్యలో కొద్దిమార్పు ఆరంభమైంది. తను అనుకున్నట్లు లలిత లెక్కల్లోనూ, కెమిస్ట్రీలోనూ అంత వెనుకబడిలేదు. స్వతహాగా తెలివిగలదే ఐనా, కొన్ని సబ్జక్ట్సు కొంతమందికి తలనెప్పిగా ఉంటవి; అసలవి నిరుపయోగాలైనప్పటికీ, తమ బోట్లను ఏడిపించేందుకే పాఠ్యగ్రంథాలుగా తయారైనట్లు కనిపిస్తవి. 'ఇంటరెస్టు' లేకుండటంవల్ల అవి భయంకరరూపాలుదాల్చి బెదిరిస్తూంటవి. ఐతే వాటిని కాస్త శ్రద్ధగా చదువుతూ, కొంత 'ఇంటరెస్ట్' కలిగించుకుంటే, ఇతర సబ్జక్ట్సు వలెనే అవీ లొంగుతవి...లలిత యీ స్థితిలోనేవుంది. వాటి భయానక రూపాలను ఆమె ఊహించి, వాటిజోలికి పోకుండానే కాలం గడిపింది. ఆమెకు కావాల్సిందల్లా ఆత్మ విశ్వాసం. యీ సంగతి తాను గ్రహించాడు. ప్రతిసారీ పాఠాలకు ఉపక్రమించేముందు తగినంత డోసులో ఆమెకు ధైర్యం చెప్పేందుకు నిశ్చయించుకున్నాడు.

రోజులు గడుస్తున్నవి. అనుకున్నదానికన్న వేగంగానే లలిత చదువులో ముందుకు సాగుతోంది. ఇదివరకు వృథాచేసిన కాలాన్ని కూడగట్టుకోవటంలో తన సహాయాన్ని సద్వినియోగం చేసుకుంటోంది. ఇప్పుడామెకు కలిగించిన 'ఇంటెరెస్ట్' ఫలితం స్పష్టమౌతోంది. గురువుకూ, శిష్యురాలికీ, ఉభయుల్నీ ఒకకంట కనిపెడుతూన్న రవణమ్మగారికూడా యీ చదువు చాలా తృప్తికరంగా ఉన్నది.

ప్రతి సాయంత్రమూ, ట్యూషన్ పూర్తికాగానే కనీసం గంటసేపన్నా ఇష్టాగోష్ఠి జరుగుతోంది. ఇదివరకు లేని ఇంటగెస్ట్‌ను రవణమ్మగారు చూపుతూన్నారు. యీ సమావేశాలు రవణమ్మగారి ఆధ్వర్యాన జరుగుతూన్నప్పటికీ ఆమె దాదాపు ప్రేక్షకురాలిగా, శ్రోతగావుంటూ తాను వూహించని కొత్తసంగతులు తెలుసుకుంటూవుంది. ఒక్కోసారి వారి సంభాషణను అనుసరించలేక, తన వూహల్లోనే కొట్టుకొనిపోతూ, సోఫాలో హాయిగా కాళ్లు పారజాపుకొని విక్టోరియారాణి పోజులో పగటికలలు కంటూవుంటుంది; ఆమెను ఆ కలలలోనుంచి మేల్కొల్పటం కష్టం; ఆమె అంతట ఆమే మేల్కొంటుంది కనుక, ఎవ్వరూ శ్రమపడనవసరం లేదు.

ఈ కాలక్షేపం తనకు చాలా మనో వికాసాన్ని కలిగించింది. ఇంతకు ముందు తనకు తట్టిన వూహలకే మూర్ఛపొయ్యే పర్యంతమౌతూండే వాడు; ఇప్పుడు తను ఆలోచించని వాటిని, ఇతరులు ఆలోచించి తనకు చెపుతూంటే కొత్త విషయాల్ని

నేర్చుకోవటమేగాక, వాటిని రచనల్లో ఉపయోగించుకోగలుగుతున్నాడు. ఇది ఒక కాలక్షేపంగా కాకుండా, రచనా సామాగ్రిని పోగుచేసుకునేందుకు ఉపయోగించేది గానే తోచింది. యీ సమావేశానంతరం తనెంతో ఉత్సాహంగా, మనోవికాసంతో, హాయిగా ఇంటికి తిరిగివొస్తూండేవాడు. తన నిర్భాగ్యజీవితంలోకూడా ఆనందం తాలూకు ఛాయలు కొన్ని లభ్యమయే అవకాశాలున్నవని తెలుసుకునేందుకు తనకు ఎక్కువ కాలం పట్టలేదు.

ఒక కొత్త సమాజంలోకి తను కాలుపెట్టాడు. ఆర్థికంగా, యీ సమాజం ఉన్నత స్థాయికి చెందింది; దీని ఆశయాలుకూడా ఉన్నతంగానే కనిపించినవి. దైనందిన సమస్యలంటూ లేవు కనుక, జీవితపు తాకిడి చాలా తక్కువ కనుక, ఉన్నతాశయాల్ని వూహించేందుకూ, కొంత వరకూ అమలు జరిపేందుకూ వారికి తగినంత అవకాశాలూ, తీరికా ఉన్నవి. తన తాహతుకు మించిన వారితోడి స్నేహం ఒక విధంగా వెగటనిపించినా, మరో విధంగా ఆత్మతృప్తికి కారణభూతమైంది. వారి గొప్పతనంలో కొంత భాగం తనకు అంటుకుంటుందని కాదు కాని, తను చూరలేని కొత్త రకం జీవితం కళ్లముందు చిత్రించబడుతూ, కనీసం ఆ కాస్సేపూ జీవిత భారం తను అనుకున్నంత బాధావహమనిపించదు. వీటిని మించి తనలాటి వ్యక్తులకు, దూరానవుండే సంస్కారం కొంత, యీ సమాజంలో కనిపించింది.

పద్మనాభం గారింట్లో గడిచే కాలమంతా చాలా ఆనందంగా వుంటోంది; వారు అన్ని విషయాల్నీ మాట్లాడుతారు. తాను రాస్తూన్న, రాయవలసిన కథల్ని గూర్చిన చర్చ జరుగుతూంటుంది. లలిత కొన్ని సలహాలు ఇస్తూంటుంది; యీ సలహాలు తనలాటి వాడికి ఒకోక్కసారి అమూల్యాలుగా తోస్తవి; ఆ ప్రకారంమార్పులు చేసి చూసుకుంటే కథలకు కొత్త వన్నెలు వొస్తూన్నవి. మరికొన్ని కథల్నివిని ఆమె ఎంతో మెచ్చుకుంటుంది. తన సాహిత్య సేవ మానవుల్ని కదిలిస్తోందని, వారిని ఆలోచింప చేస్తోందని, రచయితగా తాను పొందే ఆత్మతృప్తితో ముందుకు సాగగలుగుతున్నాడు.

యీ మధ్య రాయటం తగ్గించి, చదవటం ఎక్కువ చేశాడు. లలిత రచయిత్రి కాకుంటేనేం ఎంత చదివిందో, ఆమె ఎరువిచ్చే పుస్తకాలు చదువుతూంటేనే అర్థమౌతోంది. అందుకనే ఏది ఉత్తమ సాహిత్యమో, ఎందుకనో యీనాడు ఆమె తేల్చిగా, సకారణంగా నిరూపించగల సమర్థురాలుగా, తనకు కొత్త దోవల్ని చూపగలిగింది! చాలామంది కొత్త రచయితలు పరిచయమయ్యారు: వారి రచనల్ని చదివి ఆలోచిస్తూ వాటిని జీర్ణించుకోగలుగుతున్నాడు. కొద్ది రోజుల్లోనే తన వైజ్ఞానిక స్థాయి విశేషంగా పెరిగినట్లు తెలిసి, మనోవికాసం కలిగించే హాయిని పొందగలిగాడు.

లలిత ఎన్నో కథలు చెప్పింది. నిత్య జీవితానికి సంబంధించిన సామాన్య సంఘటనలవి. వాటికి మెరుగులుదిద్ది కథలుగా రాస్తే, చాలా బాగా వొస్తూన్నవి. యీ

మధ్య తన కథల్లోని నాయకిగా లలితను సృష్టిస్తూ వొస్తున్నాడు; తనకు తెలిసే యీ పని చేశాడు. లలిత చదివి 'నన్నుగూర్చే కదూ?' అన్నట్లు నవ్వి వూరుకుంటోంది. ఏదో మూగభాష ఉభయుల మధ్యా సాగుతోంది. దానికి కంఠస్వరాన్నిచ్చే అవకాశం కానీ, సాహసంకానీ ఎవరిలోనూ కలగని కారణంవల్లనే నేమో, అది దూర దూరానే తామిద్దర్నీ వుంచింది.

ఐతే కాలేజిలోని విద్యార్థుల ప్రవర్తన చాలా నీచంగా తయారైంది. వారు తనను తక్కువచూపు చూసినందుకు తానెన్నడూ నొచ్చుకోలేదు; ఇలాటిది తాను జీవితారంభం నుంచీ అనుభవిస్తూ అలవాటై పొయ్యాడు. కాని లలితను ఎగతాళిగా, ఆమె ఏదో చేయరానిపని చేసినట్లుగా గుసగుసల్తో ఆరంభించి, నూటీపాటీ మాటలన టం వరకూ వెళ్ళింది. అంతకన్న వారు చేయగలిగింది లేనప్పటికీ తమ ద్వేషాల్ని పెంచుకొని, దాంతోనే దహించుకుపోతున్నారు. ఆ సెగకు కొత్త అలవాటైన తామిద్దరికీ అంత బాధకాదు కాని, ఇంత నైచ్యాన్ని విద్యార్థులు ఎలా భరించి, జీవితాల్ని గడుపుతున్నారోనని ఆశ్చర్యం కలిగేది; ఏమైనా అనుభవించేది వారు కనుక, ఆ సమస్య వారిదే కాని, తనదికాదు!

సెలవు రోజుల్లో ఒక ప్రత్యేక కార్యక్రమం అనుసరించబడేది. ఇందులో పద్మనాభంగారుకూడా పాల్గొనేవారు. ఉదయమే వాళ్ళింటికి వెళ్ళేవాడు; ఆ రోజున ట్యూషన్‌కుకూడా సెలవే! అందరూ కలిసి కారమ్స్ ఆడుకోవటమో, లేక పేకాటో, చదరంగమో-ఏదో విధంగా కాలాన్ని తెలియకుండానే, తేలిగ్గా గడిపేస్తారు. తన భోజనంకూడా అక్కడే. ఒకోసారి ఏ మహాబలిపురమో, రెడ్‌హిల్సో, ఎన్నూరో షికారుగా పోయి వొస్తూంటారు. సాహిత్యాన్నిగూర్చి మాట్లాడటం సర్వసామాన్య విషయం. వివిధ వ్యక్తుల అభిరుచులు ఎలా ఉంటవో తెలుసుకునేందుకు తనకు మంచి అవకాశాలు దొరుకుతూంటవి. ఈ విధంగా తనకు తెలియకుండానే, ఆ కుటుంబంలోని వ్యక్తిగా కలిసిమెలిసి పొయ్యాడు.

అమ్మదగ్గిరికి వెళ్లామనే కోర్కెను ఇప్పుడు చాలావరకు చంపుకున్నాడు; ఆమెనుగూర్చి ఆలోచిస్తూంటే దుఃఖసముద్రానికి వొడ్డు కనిపించదు. కాని ఇప్పుడు ఆమెనుగూర్చి అంతగా ఆలోచించటంలేదు; అందుచేని ఆమె సుఖంగానే, తనవలెనే తేలిగ్గా రోజులు వెళ్ళబుచ్చుతోంది లెమ్మనే వూహవల్ల కొంత మనశ్శాంతి ఏర్పడింది. స్థాయికొస్త పెరగ్గానే దృక్పథ వైశాల్యం పెరగటంలో కొత్తేముంది?

యీ విధంగా నెలగడిచేప్పటికి లలిత పాతిక రూపాయిలూ ఇచ్చింది. తన ఆత్మబంధువు, తన కష్టాన్ని రూపాయి అణా పైసల్లో లెక్కించినట్లూ, దాన్ని అంగీకరించటంలో కలిగిన మొహమాటం, ఏదో నీచానికి దిగజారిపొయ్యాననే బాధ మొదలైనవి ఒక్కసారిగా పనిచేసినవి ..కాని ఇదొక్కటే తన మాతృమూర్తికి తరుణోపాయమనే మాట అతన్ని ముందుకు తోసింది. చివరకు ఏమీ ఆలోచించకుండానే పైకం తీసుకున్నాడు. ఆమె ఏమనుకుంటుందో, ఆమె భావమేమిటో

కనిపెట్టేందుకు ఆమె ముఖంలోకిచూసే ధైర్యమే లేకపోయింది. తనకు ఏదో మంచి నీళ్ళిస్తే తాగి, ఖాళీగ్లాసు తిరిగి ఇచ్చేసినంత తేలిగ్గా గడిపాడా ఘట్టాన్ని.

ఆ సాయంత్రం ఇంటికి తిరిగిపోతూ, యీ శుభవార్త తల్లికి వెంటనే జేరేద్దామనుకున్నాడు. పని మానిపించి తన గదికే ఆమెను తీసుకురావాలి. ఆమెను సుఖపెట్టగలిగే శక్తిసామార్ధ్యాలకు గర్వం కలిగింది. ఆమెను ఎన్నివిధాలుగా గౌరవించగలడో ఆలోచించాడు... కాని ఇప్పుడు యీ చీకట్లో వెళ్ళటం అంతమంచిది కాదు. మర్నాడు శనివారమే కనుక, మధ్యాహ్నం వెళ్ళొస్తే సరిపోతుందనీ, అప్పటికి యీ ఆనందోద్రేకానికి తాను అలవడ గలుగుతాననీ తోచింది.

## 14

వ్యాయామాలు అరగంటా వేసివున్నాక, బాదంచెట్టు నీడలో తల్లిని కలుసుకున్నాడు. ఆమెను చూస్తూండగానే, ఎంత మారిపోయిందో, ఎంత కృశించిపోయిందో అర్థమైంది. విశ్రాంతిలేని బడలిక ఆమె ముఖంలో స్పష్టంగా ప్రతిఫలిస్తోంది. తన తల్లి చేత యీ చాకిరీ చేయించటం, తనకింక సిగ్గుచేటు; ఐనా ఇప్పుడా అవసరం లేదాయె! యీనాడన్నా తను అమ్మను వెంటపెట్టుకొని వెళ్ళకుండటం నిజంగా అమానుషమే అవగలదు.

—కాని తనలోని మార్పుల్నికూడా ఆమె పరిశీలించినట్లుంది. ఆమె ముఖంలోని విషాదరేఖలు మెల్లిగా రంగుమార్చుకొని, పేలవమైన నవ్వులోకి మారినవి. తనిప్పుడు సుఖపడుతూన్నట్లామె గ్రహించి, ఆ సుఖమంతా తన దన్నట్లు తృప్తిపడుతోంది. అరనిమిషంసేపు ఎవ్వరూ మాట్లాడకుండానే, ఒకర్నిగూర్చి మరొకరు ఆలోచిస్తూ నిలుచుండి పోయ్యారు.

జరిగిందంతా చెప్పి అన్నాడు: 'ఈ వూడిగం నీవు మరి చేయలేవమ్మా! ఇన్నేళ్ళూ నీవు నీ బాధ్యతల్ని తీర్చుకున్నావు. నా బాధ్యతల్ని తీర్చుకునేందు కూడా అవకాశం ఇవ్వు. ఇక్కడ నీకొచ్చే జీతమేమిటో నేనే సంపాయిస్తున్నానాయె... నీవు నాదగ్గిరేవుంటే ఎలాగో రోజులు గడుపుదాం. ఒకవేళ నేతెచ్చేది చాలకపోయినా, ఒకళ్ళకు మరొకరు తోడుగా వుంటే పస్తులున్నప్పటికీ అంతకష్ట మనిపించదు.'

ఆమె కన్నులు తడిఐనవి; కడుపుతీపిలో ఆమె ఇన్నాళ్లూ వొళ్లు విరుచుకుంటోంది; దానికి ప్రతిఫలం ఉంటుందని ఆమె ఎన్నడూ ఆశించలేదు. అలాటిది యీనాడు తన కన్నకొడుకు తనపట్ల చూపే భయభక్తులు, ఆపేక్షలు, అనురాగాలు–ఇంకా తనకు అర్థంకాని అనేక అనుభూతుల్ని ఆమె సంబాళించుకోలేక పోయింది. కంఠం గాద్గదికమైంది. మనిషి ఎంతో చలించిపోవటంవల్ల దాదాపు కిందపడేపర్యంతమై, బావిగట్టు పట్టుకొని ఎలాగో నిలవతొక్కుకుంది. గట్టిగా గాలిపీల్చి, కళ్ళు తుడుచుకున్నాక, ఎదుటవున్న తన తలనిమిరింది.

'నాయనా! నా శరీరంలో ఇంకా శక్తివుంది. నీవు యీ ప్రపంచబాధలన్నీ పడవలసిన రోజులు ఇంకా ముందెన్నో వున్నవి. చదువుకునే రోజుల్లోకూడా పని చేయవలసిన గతి నీకు పట్టింది...ఏమైనా యీ వున్నంతలోనే నీ ముద్దు ముచ్చ ట్లేమీ తీర్చకుండానే రోజులు వెళ్ళబుచ్చుతున్నాను ..నాగూర్చిన దిగులెందుకు?' అందామె.

'ఏదో ఉత్సాహంతో యీనాడు నీవుచేసే చాకిరీవల్ల ఆరోగ్యం ఎంత దెబ్బ తింటోందో నీకు తెలియటంలేదు. యీ నాలుగు వారాల్లోనూ చాలా కృషించి పోయావు. ఒక్కసారి అద్దంలో చూసుకుంటే నీకే అర్థమౌతుందమ్మా!.... ఇప్పుడింక ఆ అవసరంలేదారు. యీ వయస్సులో రామా కృష్ణా అనుకుంటూ ఉండాల్సింది—'

ఆమె నవ్వింది—తన కొడుకు ప్రయోజకత్వానికేమో? 'నేనింకా అంత ముసలిదాన్ని కాలేదు. ఇహలోక బాధ్యతలు తీరాకకదా, పరలోకచింత? నీవు యీ విషయాలన్నీ ఆలోచిస్తూ చదువు పాడుచేసుకోవొద్దు. పెద్ద చదువులకు దిగాక, ఎలాగో యీదుతే, ఆ తరువాత మంచి ఉద్యోగం సంపాయిస్తే ఆనాడు సుఖాలు అనుభవించవొచ్చు. అంతేకాని, ఇవాళ ఎక్కడో కాస్త దొరికింది కదానని కాళ్ళు పారజాపుకు పడుకుంటే అవుతుందా? రేపు అవసరానికి చేతుల్లో ఏమీలేక, కాళ్లు కడుపులోకి ముడుచుకోవాల్సి వొస్తుంది' అంది.

'మనకు ఏం అవసరాలుంటవమ్మా? మనకు అందుబాటులో లేకుండా ఊహాలు కూడా పైకిపోవుకదా! ఏదో వేళకు ఇంత తిని కాలం వెళ్ళబుచ్చగలుగుతే...'

తల్లి మధ్యలోనే అందుకుంది: 'నీకేం తెలుసు నాయనా! ఇంకా ముక్కు పచ్చలారని వాడివి. పుట్టినప్పటినుంచీ కష్టాలే పడుతూండటంవల్ల, జీవితమంతా ఇంతేననే అభిప్రాయంలో పడ్డట్లున్నావ్. చిన్నతనంలో నీకు తండ్రి ప్రేమా కరు వైంది. నిజంగా నే నా నరకంలో కాలంగడిపానంటే, నిన్నుచూసుకోనే! ఏనాటి కైనా నిన్ను సుఖపెట్టగలననే! ఇంక అవసరాలంటావా? నీవేం పసిపాపవుకాదు. పెళ్ళికుడు వొచ్చావ్. సంసారమూ, ఇల్లూ, వాకిలీ, ఇంకా ఎన్నో ఉన్నవి...'

పెల్లి ఆనేప్పటికి చాలా సిగ్గయింది. తల్లి వూహాలు యీ నాడు ఎంత ముం దుకు దూకుతూన్నవో అర్థమైంది. ఆమెకీ తాపత్రయం దేనికి?

'అనొక్కటే తక్కువైందా అమ్మా? శరీరం భూమిమీదవుంచి, ఊహాల్ని ఆకాశంలో ఎగరనివ్వటంవల్ల చాలా ప్రమాదం...'

'నీకేం తెలుస్తుందిరా సంతాన వ్యామోహం? రేపునీకు పిల్లలు పుడితే వాళ్ళ పట్ల ఎంత అనురాగాన్ని చూపుతావో, కాలు కిందపెట్టనీకుండా వాళ్ళంటే ఎంత తాపత్రయ పడతావో—'

'అదంతా పోనీవే. ఎప్పటి సంగతో ఇప్పుడెందుకు? ఇంక యీ వెట్టిచాకిరీ చేయలేవు. చేయిగల ననుకుంటున్నావు. నిజంగా చేసే త్రాణ నీ శరీరంలో లేదు. నా మాట విను' అన్నాడు.

'ఏనాడైతే నిజంగా నేను చేయలేనో, ఆనాడు నీకు కబురుచేస్తాను.' అందామె.

ఏదో ఆలోచించుకొని మాట్లాడలేకపోయాడు. ఆ ఆలోచన సరైనదైనా, కాకపోయినా అది మనసును ఎంతకలవర పెట్టిందో కాని, దాచుకోలేని దుఃఖం పొంగి పొరలింది; వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. కన్నీళ్లు తుడుస్తూ, ఓదార్చుతూ 'ఎందుకూ? ఏంకావాలి? ఉన్నట్లుండి ఇలా ఏడవటమేమిటి?...ఏడవాల్సిన రోజులు గడిచిపోతున్నవనుకుంటే—ఏమిటో చెప్పరాతండ్రీ!' అని తల్లి ఆతృతతో అడిగింది. చెప్పలేక పొయ్యాడు తను. ఎలాగో ఏడుపు మానగలిగాడు.

'చెప్పవా? నాకు చెప్పవా?' అందామె.

'చెప్పలేనమ్మా! ఏదో వెధవ ఆలోచన—'

'ఏమైనా సరే చెప్పాల్సిందే! నాకు తప్ప ఎవరికి చెప్పుకుంటావ్? చెప్పు—త్వరగా!' అని పట్టుపట్టిందామె.

'పోనీలే అమ్మా! ఏదో నిన్నుగూర్చిన కీడును శంకించింది పాడు మనస్సు!' అని, తనను తాను నిందించుకున్నాడు.

'చెప్పు...ఏమిటో చెప్పు' అన్నదామె. కంఠస్వరంలో కఠినత్వమైతే లేదు కాని, ఆజ్ఞాపూర్వకంగానూ, పట్టుదలతోనూ కూడివుంది.

తనకిక చెప్పక తప్పలేదు.

'ఏం లేదు...ఇందాక నీవు ఏమన్నావంటే—నిజంగా చాకిరీచేయలేనప్పుడు నాకు కబురు చేస్తానన్నావ్. అప్పుడు నేను నిన్ను తీసుకెళ్ళి సుఖపెట్టలేమిటనిపించింది. నీవు సుఖపడేందుకు మరి బతకవేమో ననిపించిందమ్మా!'

ఆమె మనస్సు ఎంతో తేలికై, నిట్టూర్చింది.

'ప్రపంచంలో నిజంగా సుఖపడకపోయినా, ఆ సుఖాన్నిగూర్చి తలుచుకుంటూ, కలలు కంటూ, నిజంగానే సుఖపడుతూన్న భావనలో రోజులు గడపటాన్ని ఇద్దరమూ కొత్తగా నేర్చుకోనక్కర్లేదు. ఒకవేళ ఆ సుఖమే మన దరిదాపులకు రాకున్నప్పటికీ బాధలేదు. ఇక నా సంగతంటావా? నీవు అనుకున్నట్లు నేను అంతవరకూ బతకనప్పటికీ, నా బాధ్యతల్ని ఏమరిచి ఉండలేను. ఇక నీవు తల్లికి చేయదగింది చేయలేదనే బాధపడక్కర్లేదు. నా ఋణం ఎలా తీరుస్తానోనని దిగులుపడొద్దు. ఒక వేళ తల్లిగా నేను యీ ప్రపంచం నుంచి అస్తమించినట్లయితే, తిరిగి నీ కడుపున పుడ

కాదు. అప్పుడు నీ బాధ్యతలన్నిటినీ శ్రద్ధతో సహా తీర్చుకుందువు కాని - సరేనా?' అంది.

ఆ తల్లి ఊహాల్లో తన ఊహలు ఏ విధంగానూ పోటీ చేయలేవని బాగా అర్థమైంది. ఆమె అనురాగానికి హద్దులు లేనట్లే, ఆమె తలపులకూ కూడా అడ్డంకులు లేవు. అవి ఇహ లోకంనుంచి పరలోకాల్లోకూ కూడా పయనించగలవు. ఆమె ఆ ఆశల్ని భంగపరచటం భావ్యమనిపించలేదు. నిస్వార్థంగా తనపట్ల అనురాగసుధను వర్షించగల యీ ఒక్క వ్యక్తి అండగా తను ప్రపంచాన్నే జయించగల శక్తి సామర్థ్యాలను పొందినట్లయింది.

'మనకూ మంచి రోజులు వొస్తూన్న సూచనలున్నవి. చెప్పటం మరిచి పొయ్యాను—ఆ మధ్య బాబుగారు సంతోషంగావున్న సమయంలో, నీకు చదువు చెప్పిస్తున్నాననీ, అదీ ఇదీ కష్టసుఖాలు చెప్పుకుంటే, యీ నెలనుంచీ జీతం పది రూపాయలు పెంచారు. ఇప్పుడే వొదిలించుకోలేని సుఖాలకు అలవడకుండా, కొంత కొంతగా దాచుకుంటే, రేపటి అవసరాలకు ఉపయోగిస్తుంది. ఇది వరకటి పొదుపు తనమే చాలు.' అందామె.

'సరే ..నీవు చెప్పినట్లే చేస్తాను—వొస్తాను.' అంటూ, ఇక ఆ ప్రదేశంలో నిలవలేక చకచకా నడవసాగాడు.

గెలుపు నిశ్చయంగా తనదే ననుకొన్న తనకు నిరాశ కలిగింది. ఆమె అచంచల విశ్వాసం తనను ఓడించింది. కాని ఉభయులూ కలిసి జీవితాన్ని సాధించగల మనో ధైర్యం కలిగింది. ముందుముందు జీవితమాధుర్యం వున్నదనే ఆశ స్పష్టంగా కనిపిస్తోంది. ఆమె చెప్పినట్లే నడుచుకోక తప్పేది లేదు.

యీ నెలనుంచే ఎట్లాచూసినా తను నెలకొక యాభై రూపాయిల చొప్పునన్నా ఆదా చేయగలడు. రాత్రిళ్ళు కొంచెం కష్టపడితే పత్రికలనుంచి పొందే ప్రతిఫలం మరో పదిరూపాయిలు పెరుగుతుంది. ఇలా ఒక సంవత్సరం గడిచాక, తనతో వచ్చేందుకు తల్లి మరి అభ్యంతరపెట్టదు.

—కాని, అప్పటికీ తన చదువు పూర్తికాదు. యీ వెధవ చదువు ఎందుకు పెట్టుకున్నానా అనిపించింది. ఆనాడు తెలియలేదుకాని,యీ చదువువల్ల ఒకపక్క తనూ, మరోపక్క తల్లీ కూడా ఎముకలు విరగ్గొట్టుకుంటున్నారు. యీ చదువువల్ల డిగ్రీరావటం తప్పితే తన విజ్ఞానం పెరుగుతుందని తోచటంలేదు. ఐనా బాగా ఉన్నవాళ్ళకు కాని; తనలాటి బీదవాళ్ళకు యీ చదువులెందుకు? తనకూ తన తల్లికీ తీరని ఎడబాటును కలిగించిన యీ చదువుపట్ల ద్వేషం ఆరంభమైంది.

ఇలా వుంటూనే ఎక్కడన్నా ఉద్యోగంకూడా ప్రయత్నిస్తూంటే, మంచి ఉద్యోగం దొరగ్గానే యీచదువుమానెయ్యవొచ్చు. యీ చదివేది ఉద్యోగ నిమిత్తమే

కనుక, అది లభ్యమైతే దీని జోలికి పోవటమే అనవసరం. అప్పుడు తల్లినికూడా ఒప్పించగలడు.

లలిత ఇచ్చిన ట్యూషన్ ఫీజు తల్లి విముక్తికి ఉపకరించలేదు. వ్రతం చెడినా ఫలం దక్కలేదనిపించింది. కాని ఇలాగే కొంత కూడబెట్టాకకాని, ఆమెకు విముక్తి రాదు. ఇదేపంథాలో మరికొన్నాళ్ళు సాగాలి. రాబొయ్యే ఆ మంచిరోజులకోసం, యీ దుర్దినాలను గడపక తప్పదు...ఇలాగే ఆలోచిస్తూ గదికి చేరాడు.

## 15

నాలుగు నెలలు గడిచినవి. యీ నాలుగు నెలల్లోనూ పెద్ద మార్పులేమీ జరగ లేదు. తను రెండే రెండుసార్లు తల్లిని చూడబొయ్యాడు. మామూలు సంభాషణతప్ప, కష్ట సుఖాల్ని మాట్లాడేందుకు సాహసించలేక పొయ్యాడు; ఎందుకంటే ఆమె అను భవపూర్వకంగా మాట్లాడే మాటలవల్ల హృదయభారం పెరగటమేకాని, తరగట ముండదని తనకు తెలుసు. ఆమె ఆరోగ్యం క్షీణిస్తోందని తెలిసికూడా హెచ్చరించ లేక పొయ్యాడు; ఆమె పిచ్చి ఆమె కానందాన్నిస్తోందికదాననే తృప్తిమినహా ఇంకే మీలేదు. ఏమైనా యీ ఊబిలోనుంచి బైట పడేందుకు తనూ విశ్వప్రయత్నాలు చేస్తూనే వున్నాడాయె!

డిసెంబర్ పరీక్షల్లో లలితకు లెక్కల్లోనూ, కెమిస్ట్రీలోనూ మంచి మార్కులు వొచ్చినవి. తన ధర్మాన్ని నిర్వర్తించిన తృప్తీ, పద్మనాభంగారి ఇంట్లో తనపట్ల అభిమానం పెరగటం, లలితకు తనపట్ల గౌరవం పెంపొందటం జరిగినవి. ఐతే తను వీటన్నిటికీ ప్రయత్నించటం లేదు; ఎక్కడైనా మంచి ఉద్యోగం, కాస్త నమ్మక మైనది, నెలకు కనీసం ఒక అరవై, డభ్భై రూపాయిలది దొరుకుతుందేమోనని నానా తంటాలూ పడుతున్నాడు.

సేవింగ్స్ బ్యాంకులో డబ్బు వేస్తూ వొచ్చాడు; అది దాదాపు రెండొందు లైంది. రాత్రిళ్లు కష్టపడి కథలు రాస్తూనే వున్నాడు. ఇదివరకల్లే ఎక్కువసేపు ఆలోచించటం లేదు. అలవాటై, చెయ్యి తిరగటంవల్ల, కళ్లుమూసుకొని రాసినా, బాగానే కుదురుతూన్నవి. ఏమైనా రచనల్ని వ్యాపారదృష్ట్యా చూడసాగాక, యీ పోకులూ, నగిషీలూ కుదరవు. అందులోనూ వీటినుంచి తాను సాధించబొయ్యేది జీవిత విజయమయ్యాక, కాలయాపన చేసేందుకు వీల్లేదు; అలాగే సాగిస్తున్నాడు కూడాను.

తెగని సమస్యల్లా లలితనుగూర్చే! రోజు రోజుకూ ఆమె సన్నిహితురాలవు తోంది. ఆమె దగ్గిరవుతూన్నకొద్దీ ఒక భూకంపమే దరిజేరుతూన్నట్లు తోస్తోంది. సమాజం ఏర్పరిచిన అగాధం ఏనాటికీ, కనీసం తను బతికివుండగా, పూడి, తనూ, లలితా ఒక సమతలానికి రాగలుగుతామనే నమ్మకం కలగటంలేదు. మరీ ఆమె ప్రవ ర్తన తన దీక్షకు భంగం వాటిల్లేమాదిరిగా తోచసాగింది. తానెంత ప్రమత్తతతో,

దూరదూరంగా వుంటూన్నప్పటికీ ఆమెమాత్రం ప్రవర్తనలో, సంభాషణలో, ప్రతి కదలికలోనూ తనను ఆకర్షిస్తూ, దగ్గిరికి లాక్కునేందుకు ప్రయత్నిస్తూనే వుంది. ఇది కేవలం తన మనోవికారమే కాని, వేరుకాదని సరిపెట్టుకునేందుకు ఎంతో ప్రయత్నించాడు కాని, ఎటుచూసినా సమర్థించుకోలేకుండా వున్నాడు.

విశ్వామిత్రునికి మేనకవలె, ఋష్యశృంగునికి రాకుమారివలెనే లలితకూడా తన వ్రతాన్ని భంగంచేసే కామినీ అవతారాన్ని దాల్చి క్షణక్షణమూ దండయాత్రలు సాగిస్తూనే వుంది. ఇంతవరకూ తను ఎదిరి నిలవగలిగాడు. కాని ఒకనాటికి, తాను బలహీనుడవుతాడని, అప్పుడు లొంగిపోక తప్పదనే భీతిమాత్రం వేధిస్తూవుంది. ఆరోజు ఎప్పటి కప్పుడు వాయిదా పడటమే కాని, అసలు రాకుండా వుంటుందని నమ్మలేకుండా వున్నాడు.

ఐతే సమాజం తనలాటి వాడి కోసం, లేదా లలితలాటి ఉన్నత వంశజకోసం తన కఠిన చట్టాలు కొన్నిటిని సడలించగలదేమోననే వూహా వొస్తూంటుంది. ఎక్కడన్నా నూటికీ కోటికీ అలాటి దాంపత్యాలు ఉండొచ్చు; ఒక వేళ అలాటిది సంభవమైతే...? ఆ ఊహ తాలూకు ఆనందంలో గాలిలో తేలిపోవటం జరుగుతుంది. కొంత దూరం వెళ్లాక తనెంత మూఢత్వంలో, అగాధంలోపడి పోతున్నాడో అర్థమై, అదంతా నమ్మలేని కలవలె భావించి, మళ్ళీ తను 'తను' గా మిగిలిపొయ్యేవాడు. ఏనాడూ తను తన హృదయాన్ని కానీ లలిత తన హృదయాన్ని కానీ బైట పెట్టలేదు. తను అన్ని విధాలా ఆమెకు అయోగ్యుడు; అప్రయోజకుడు. ఏదైనా ఆమె నుంచే అలాటిమాట రావాలి. అంతవరకూ తను మూగవాడుగానే ఉండాలి. యీ స్వల్పవిషయం ఆమెకు తెలియకపోదు.

అవకాశాలు లేక కాదు. నిజానికి ప్రపంచంలోని ప్రణయగాథ లెన్నిటినో గూర్చి వారు మాట్లాడుతూనే వుంటారు; ఏ నాటివో కాకుండా, యీనాడు కళ్లెదుట జరిగే వాటినిగూర్చి కూడా చర్చిస్తూనేవున్నారు... తానిప్పుడు కలిసి పోయిన సమాజంలో యీ చర్చలు సిగ్గుచేటైనవిగా కాకుండా, సంస్కారాభిలాషవున్న వారందరూ, బాహాటంగా మాట్లాడుకునేవిగానే స్ఫురింప జేస్తున్నవి. అలాటప్పుడు లలిత ఎందుకు బైటపడదు? కనీసం సూచన ప్రాయంగానన్నా, తనకు స్పష్టమైన అభిప్రాయాన్ని ఎందుకు కలిగించదు?

ఆలోచించినకొద్దీ అసలామె తనను ప్రేమించటం లేదనేందుకే ఎక్కువ కారణాలు కనిపించసాగినవి. యీ వూహ బాధాకరంగా వున్నప్పటికీ, మాధుర్యంలేని నగ్నసత్యంవలెనే కనిపించేది. దీన్ని భరించగలుగుతే తను మూర్ఖుడవటంనుంచి తప్పించుకోవొచ్చు.

ఐనా తన జీవిత సమస్యలు యీ లలితకు ఎలాటి సంబంధాన్ని లేకుండానే ఉన్నవి. వాటిని పరిష్కరించుకోకుండా, యీ కొత్త సమస్యకూడా తెచ్చుకొని,

బలవంతాన మూడిపెట్టుకోవటంవల్ల, కఠినమైన వాటిని, కఠినతమం చేసుకోవటంతప్ప జరిగేదేమిటి? ఏమైనా తనంతటతానుగా మాత్రం యీ ఉచ్చుల్లో పడకుండా కాపాడుకోవాల్సిందే! ఆమె అంతట ఆమెగా తన ప్రేమను వెల్లడిస్తే-అప్పటి మాట వేరు. యీ సమస్య ఎటుతేలినా, తనకు ఒకటిగానే కనిపించింది. కాలమే నిర్ణయించే దిగా భావించి వొదిలేశాడు.

జీవిత గమ్యస్థానమంటూ ఏర్పడుచుకున్నాక, ఇదివరకువలె, కాలయాపన జరిగేందుకు వీల్లేదు. జీవితమే ఒక రేస్; గెల్చుకునేందుకు వూపిరికూడా పీల్చుకోకుండా పరుగెత్తాల్సిందే తప్ప, తనలాంటివాడికి అడ్డదోవలేవి లేవు. అందుకనే ఆరోగ్యాన్నీ శ్రమనుకూడా లెక్కచెయ్యకుండా ప్రతినిమిషాన్నీ అమూల్యంగానే భావిస్తున్నాడు. ఐతే చదువుపట్ల శ్రద్ధతగ్గింది; ఐనప్పటికీ మొదటివాడుగా ఉత్తీర్ణుడు కాగలననే ధైర్యంవుంది...సాహిత్యంపట్ల, అంతకన్నా ఉద్యోగసాధనపట్ల పట్టుదల అధికమైంది.

ఒకనాటి ఉదయాన—

నిద్రలేచేటప్పటికే వొళ్లంతా విరగ్గొట్టినట్లు వుంది. బద్ధకించి కాస్సేపు పడుకున్నా తగ్గలేదు. లేచి తిరగనారంభిస్తే అదే సర్దుకుంటుందనే నమ్మకంతో, కాలకృత్యాలు తీర్చుకున్నాడు. కాని శరీరం తనకే భారమనిపించింది; కళ్లుమండుతూన్నవి. సన్నగా తలనెప్పి ఆరంభమైంది. కాస్సేపు పడుకున్నాడు. కొంచెం కునుకు పట్టింది...తీరాలేచి చూచేప్పటికి కాలేజికి బయలుదేరవలసిన వేళయినట్లు తోచింది. బద్ధకం వొదిలించుకునేందుకు తలారా చన్నీటి స్నానం చేశాడు. బాధగావున్నా, అది సోమరితనానికి శిక్షగా భావించాడు.

ఉదయం ట్యూషన్‌కు పోలేక పొయ్యాడు. యీ విధంగా సోమరితనంకూడా అలవాటైనందుకు తనను తాను దూషించుకున్నాడు. అన్నం వొండుకునే వ్యవధికూడా లేదు; ఐనా ఆకలి అనిపించటంలేదు. పులితేపులు వొస్తూన్నవి. కాస్త కాఫీ తాగి ఆదరాబాదరాగా కాలేజికి వెళ్ళాడు.

క్లాసులో కళ్ళు తెరిపిడి పడటంలేదు. కూర్చున్నవాడు కూర్చున్నట్లే నిద్రపోసాగాడు. పక్కనవున్న విద్యార్థి తట్టిలేపాడు; సిగ్గుపడి బలవంతాన మేల్కొన్నాడన్నమాటే కాని, ఒక పక్క బుర్ర తిరిగిపోతోంది. మరోపక్క కడుపులో చెయ్యిపెట్టి కెలికినట్లు వికారం. క్లాసులో జరిగేదేమిటో, లెక్చరర్ వాగేదేమిటో తెలియటం లేదు; ఏదో అర్థంకాని స్వప్నానికి ప్రేక్షకుడల్లే వున్నట్లే తోచింది.

మధ్యాహ్నం ఆకలనిపించి, కొంచెం టిఫిన్ తిని, కాఫీ తాగాడు. బహుశా సాయంత్రానికి అదే తగ్గుతుందిలెమ్మనుకున్నాడు. కాని తీరా సాయంత్రానికి పైత్యం ఎక్కువైంది. ఎంత తోసుకొని తిరుగుదా మనుకున్నా, తనవొళ్లు తన స్వాధీనంలో నుంచి తప్పుతూన్నట్లువుంది. మొదట్లో గదికి జేరుదామను

తున్నాడు కాని, చివరకు ఎలాగైనా యీ రోజు పద్మనాభంగారింటికి వెళ్ళి మర్నాటికి సెలవిచ్చి వెళ్దామనే నిశ్చయించాడు. అక్కడికి వెళ్తే మనస్సులోని చీకాకు కొంత తగ్గి తేలిగ్గావుంటుంది కనుక, అదే ఒక రకం ఔషధంగా పనిచేస్తుందని ఆశ.

పద్మనాభంగారింటికి ఎలా జేరగలిగాడో, మధ్యలో ఏ కారుకిందన్నా పడకుండా ఎలా నిలవతొక్కుకోగలిగాడో తెలియదు. తీరా అక్కడికి వెళ్ళాక, గేటు దాటగానే తూలి కిందపడ్డాడు. తగిలిన దెబ్బ బలమైంది కాదుకాని, తన నిద్రమత్తును వొదలగొట్టింది. మెల్లిగా లేచి హాలులోకి వెళ్ళాడు. లలితా, రమణమ్మగారూ మాట్లాడుతున్నారు. చిట్టి లలిత జడలోని సిల్కు రిబ్బన్‌ను పరీక్షిస్తోంది. ఆ దృశ్యాన్ని చూస్తూనే అర్థం చేసుకోలేనంత చైతన్యపు తిప్పలో పడిపోయ్యాడు.

కడుపులో గుడగుడమన్నది; కాదు ఏదో గొంతులోకి తీసుకొని వొస్తోంది; బహుశా వాంతి అవుతుందేమో—చప్పున బైటికి పరుగెత్తాడు-చేతిలోని పుస్తకాలు అక్కడే వొదిలేసి.

అరుగుమీద కూర్చొని వాంతి చేసుకున్నాడు. కళ్ళు తైళ్ళు కమ్మి, కంటినుంచి నీరు వొచ్చింది. కడుపులోని పేగులన్నీ మెలితిరిగి శ్వాస ఆడకుండా బాధపెడుతున్నవి. ఎవ్వరూ పట్టుకోనట్లయితే, కింద పడిపోతాడు! కింద! అదేదో పెద్ద అగాధమల్లే, పడితే, ప్రాణాలే నిలవవన్నట్లు తోచింది. 'అమ్మా!' అని కేకపెట్టాడు.

కాని అమ్మ అక్కడలేదు-పలికేందుకు. ఆ సంగతి గుర్తులేదేమో! లేక తన కేకకు ఆమె పరుగెత్తుకొని రాగలదనే ఆశేమో? ఏమైనా ఆ కేక ఫలితం వెంటనే కనిపించింద.

రెండు మృదువైన చల్లని అరచేతులు కాలిపొయ్యే తన దేహంమీదికి వాలినవి. కణతల్ని గట్టిగాపట్టుకొని చేతులలో వొత్తుతున్నవి ... శ్వాస పీల్చుకోగలిగాక మళ్లీ కక్కాడు. బాధతో మూలుగుతూ 'అమ్మా!' అన్నాడు మళ్ళీ.

'వాంతి చేసుకోండి...తగ్గుతుంది' అంది తనను పట్టుకున్న కోకిల కంఠం. తనకైతే తలెత్తి చూసే ఓపిక లేదుకాని, ఆమె లలితని చెవులు గుర్తుపట్టినవి.

కాస్త దూరంనుంచి 'అంతా అన్నం పోతుందే' అన్న రమణమ్మగారి కంఠస్వరం వినిపించింది.

'వొళ్ళు కాగిపోతోంది. జ్వరం బాగావుంది పిన్నీ!'

యీ జ్వరంవల్లనే తను అశక్తుడౌతున్నాడు. కాని ఏం చెయ్యటం...ఎంత ప్రయత్నించినా వొచ్చినట్లేవుంది కాని, వాంతిరావటం లేదు; వొస్తే కాస్త తేలిగ్గావుండుననిపిస్తోంది.

యీ హడావుడి చూసి తోటమాలికూడా వొచ్చాడు.

'కాస్త నీళ్ళందుకో' అన్నది లలిత.

తోటమాలి చెంబుతో నీళ్ళు తెచ్చాడు. లలితే నీళ్ళిచ్చింది; పుక్కిలించి ఉమ్మేశాడు; ఆ చన్నీళ్ళతో మొహం కడిగింది. తనంటే జాలిచూపే వ్యక్తులు నిజంగానే వున్నారని మరోసారి తెలుసుకోగానే, బాధ చాలావరకు తగ్గిన ట్లయింది.

లలిత సహాయంతో సావిట్లోకి వొచ్చాడు. కాని కళ్ళుతిరిగి పోతూన్నవి. వెచ్చని గాలి, తనకే ఆవిరల్లే తోచింది. అలాగే సోఫాలోపడుకున్నాడు. ఎక్కడో అగాధాల్లోకి జారిపోతూన్నట్లు తోచింది. ఎంతో అశాంతి; ఎందుకో కలవరం; అర్థం కాని పీడకలలన్నీ ఒక్కసారిగా మీదికి ఉరుకుతూన్నట్లు తోచింది.

కొద్దినిమిషాలు గడిచివుంటవి. తలకింద చేయివేసి ఎవరో లేవనెత్తారు. మెల్లిగా తెలివివొచ్చింది. కళ్ళు తెరిచిచూశాడు; కదిలే నీళ్లల్లో ప్రతిబింబమల్లే లలిత రూపు కనిపించింది.

'యీ వేడికాఫీ తాగండి కాస్త సర్దుకుంటుంది' అందామె, ఆపేక్ష ఉట్టిపడే కంఠస్వరంతో.

మెదలకుండా తాగాడు.

'అంతా పసరే లలితా! పైత్యం...కాస్తఅల్లంముక్క నమిలిస్తే...?' అంది రమణమ్మగారు.

'తర్వాత...ఏదైనా మందులో కలుపిస్తే బాగుంటుంది' అంది లలిత.

యీ ఇంటిని హాస్పిటల్ చేయటం తనకు ఇష్టంలేదు. అసలింత బాధ తనకూ, లలితకూ వుంటుందనుకుంటే ఇక్కడికి వొచ్చేవాడేకాదు. కాఫీతాగాక కొంత ప్రాణ వొచ్చినట్లు తోచింది.

'నేను గదికి వెళ్తాను' అన్నాడు.

మెల్లిగా తలగడమీద పడుకోబెడుతూ 'ఎట్లా వెళ్తారూ? అక్కడ మిమ్మ ఎవరుచూస్తారు?...డాక్టర్‌గారి దగ్గిరికి పంపుతాము' అంది లలిత.

'వొద్దు...వొద్దు' అన్నాడు తను ప్రార్థనాపూర్వకంగా 'రేపటికి అదే తగ్గు తుంది. ఏ రిక్షాలోనన్నా పడి వెళ్తాను' అని లేవబొయ్యాడు.

'సరే వెళ్దురుకాని...పడుకోండి. రిక్షా పిలిపిస్తాను' అందామె.

ఆ తరువాత తన ఆలోచనల్తో పడుకున్నాడు.

చివరకు, రిక్షావొచ్చాక, తోటమాలి సహాయంతో రిక్షాలో ఎక్కాడు.

'నీవుకూడా వెంట వెళ్ళు గోపయ్యా! యీ రాత్రికి అక్కడే వుండు...' అంది లలిత.

'ఆఁ. అక్కడే వుండు—పాపం!' అంది రమణమ్మగారు.

'సరేనమ్మా!'

దేవతలందరూ తనంటే కరుణచూపుతూన్నట్లే తోచింది. రిక్షా మెల్లిగా కదిలింది.

'పాపం! ఎంత అమాయకుడు!' అంది రమణమ్మగారు. 'ఔను' అంది లలిత కంఠం. ఆతరువాత వాళ్ళేం మాట్లాడుకుంటున్నారో తనకు వినిపించలేదు; వినిపించినా అర్థమయ్యేట్లూ తోచలేదు. రిక్షా పోతూంటే కళ్ళు తెరిచాడు: రిక్షా కాకుండా రోడ్డు నడుస్తూన్నట్లులోచి, భయంతో కళ్ళుమూసుకున్నాడు.

గదికి చేరాక, నరకంలో పడ్డట్లే తోచింది. వొళ్ళంతా నెప్పులు. పక్కమీద పడుకున్నాడన్న మాటేకాని, గాలిలో తేలిపోతూన్నట్లు, గాలివాటుకు ఎటుపడితే అటే కొట్టుకొని పోతూన్నట్లూ వుంది. గది గోడలు నాట్యమాడుతున్నవి; పైకప్పు విరిగి మీదపడుతూన్నట్లుంది. దీనికితోడు చలి—ఒకటే చలి! రైలు ఇంజన్ బాయిలర్లోవుంటేకూడా తగ్గేట్లులేదా చలి! ఆగలేక, పక్క బట్టలన్నీ తీసి కప్పుకొని ముడుచుకున్నాడు. ఐనా తగ్గలేదది. ఒక్కటే వొణుకు.

గోపయ్య వొణకకుండా పట్టుకున్నాడు తనను. అప్పుడు గుర్తొచ్చింది తనకు తోడువున్నదని. కాని అమ్మవొస్తే బాగుండు. ఆమె ఐతే ఎంతసేవన్నా చేసేది... కాదు—ఆమె పక్కనవుంటే యీ బాధంతా ఒకలెక్కలోదికాదు. మరి ఆమె ఇంకా ఎందుకురాదు? పాపం! ఆమె అవస్థ ఆమె పడుతోంది. ఒకళ్ళదగ్గర నౌకరీకి వున్నాక, అన్నప్పుడల్లా రావటం పడుతుందా మరి?

ఒక గంట గడిచాక చలికొస్త తగ్గింది. మళ్ళీ వాంతయేట్లు వున్నదని చెపితే, గోపయ్య బైటికి తీసుకొని వెళ్ళాడు. పసరు కొంత పోయింది. కొంచెం తేలికనిపించింది...కాని పైత్యం...ఒకటే తలతిరగటం.

ఇక ఆ రాత్రి-కాళరాత్రి, ఎలాగడిచిందో తనిప్పుడు చెప్పలేడు. నిద్రమాత్రం పట్టటంలేదు. ఎంతో ప్రయత్నం చేశాడు-ఊహూఁ. కన్ను మూసుకున్నా, తెరిచినా ఒకటిగానే వుంది, అన్నీ పీడకలలే! జీవితం కన్న కలలు ఎన్నుకోదగ్గవని అనుకునే వాడు; అది నిజంకాదు. జీవితంకన్న భయంకరమైన కలలున్నవనేది ఇప్పుడు అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడు. జీవితానికి భయపడి కలల్ని ఆశ్రయించటం, కలలకు బెదిరి జీవితాన్నే ఎన్నుకోవటంగా మారుతోంది! అన్నీ కీడును శంకించే తలపులే! తనను పెద్ద పెనంమీద వేయిస్తున్నంత బాధకలిగించినవి! ఆ వెధవ వూహాల్ని, అకారణంగా తనను వేధించకుండా పారద్రోలాలని వ్యర్థప్రయత్నాలు చేశాడు. శారీరకంగావున్న బాధ, మానసికంగాకూడా రూపొంది, మెదడు తినేస్తున్నట్లు తోచింది. ఏమైనా భరించాలి; కాదు-భరించి తెల్లారేదాకా బతకగలగటమే ఆశ్చర్యం!

రాత్రి చాలా సేపటివరకూ మేలుకొని గోపయ్య ఏమేమిటో అడిగాడు. వాడు ఏం మాట్లాడాడో, తనేమైనా జవాబులిచ్చాడో, లేదో, కూడా తెలియదు. వాడు మాట్లాడిన ధోరణి మాత్రం చాలా సానుభూతితో కూడి వుంది. తనపట్ల చూపే దయనుకూడా అంగీకరించి, అనుభవించగలిగే స్థితిలో లేడు; కనుకనే ఏమీ పట్టించుకోలేక పోయ్యాడు. చివరకు గోపయ్య కటిక నేలమీద ఎడంచెయ్యి ముడుచుకొని, తలగడగా పెట్టుకొని నిద్రపోవటం చూశాడు. వాడి మాటల బాధ ఒకటి తప్పింది.

అశాంతితోనే తెల్లారింది. కాని తెల్లారిందనే సంతోషం, ఒకరాత్రి బాధతో గడిచిపోయిందనే ఆనందం తనకు కలగలేదు. రాత్రయినా పగలయినా ఒకటే. స్వర్గమైనా నరకమైనా ఒకటే! తనకు కావాల్సింది-తల్లి! మిగతా ప్రపంచమంతా తనచుట్టూవున్నా యీ స్థితిలో ఆమెకు ఎవ్వరూ సరిరారు!

గోపయ్య నిద్రమేల్కొన్నాడు. తనదగ్గిరికివొచ్చి వొంటిమీద చెయ్యివేసి చూశాడు.

'బాబూ! ఇంకా జ్వరంవుంది. నేను బంగళాకువెళ్ళి అమ్మగారికి చెప్పొస్తాను' అన్నాడు వాడు.

తనకోసం ఎవరొస్తారు? తనకేం కాకున్నదని వీళ్ళందర్నీ ఆజ్ఞాపించగలడు? ఐనా వీళ్ళంతా తనకేం కావాలని? ఏమిటో వెధవ భ్రమ!

తను ఆలోచించుకుంటూండగా 'గంటలో తిరిగొస్తాను బాబయ్యా! మిమ్మల్నీ స్థితిలో వొదిలి వెళ్తే లలితమ్మగారు కోప్పడతారు కూడాను...ఇంటోళ్ళకు చెప్పి పోతాను.' అన్నాడు గోపయ్య.

ఇంటివాళ్లు తన విషయం ఎప్పుడూ పట్టించుకోరు—నెల మొదట్లో అద్దె వసూలుచేసుకోవటం మినహా! ఇదంతా ఇప్పుడీ గోపయ్యకు చెప్పగల ఓపికలేక, తల ఆడించి వూరుకున్నాడు.

గోపయ్య ఇంటివాళ్లకుచెప్పి వెళ్ళినట్లుంది. పది నిమిషాలు గడిచాక, ఇంటాయనవొచ్చి పలకరించాడు. కాని తనకు ఎవరితోనూ మాట్లాడాలనికూడా లేదు. వికారంతో, తల నెప్పితో బాధ పడుతున్నాడు. కాసేపు కూర్చొని, ఏదేదో వాగి 'ఆఫీసుకు వెళ్ళాలి...సాయంత్రం వొస్తాను' అని ఇంటాయన జారుకున్నాడు. ఒక విధంగా శని విరగడయిందనిపించింది.

కాని ఏమిటో ఆవేదన, దేన్నిగూర్చో తెలియకుండానే, అర్థమయీ కాకుండా మెలితిప్పుతోంది. తనకెందుకీ అంతులేని దుఃఖం? ఎవర్నిగూర్చి? ఏమొచ్చిందని? వొడ్లగింజలో బియ్యపుగింజే ఐనా ఎంత రాద్ధాంతం తన మనసులోజరుగుతోందో, ఎన్ని భూకంపాలు, భీకరపోరాటాలు తన బుర్రలో తిరుగుతున్నాయో

కాని, మెదడంతా తెకతెకలాడిపోతోంది. ఇలా మరికొంతసేపు వుంటే మతిపోయి పిచ్చివాడవటంకూడా జరగటంలో ఆశ్చర్యమేమిటి?

కాలం జరుగుతూనేవుంది; ప్రతినిమిషమూ యుగంలాగు గడుస్తోంది. ప్రతి క్షణంలోనూ తల్లి రాకను ఎదురుచూస్తూ తత్తరపడుతూనే వున్నాడు. ఆమె ఎందుకు రాదు? తనంటే ప్రాణాలొడ్డే జీవి, తన ప్రాణాలే నిలిచేట్టు కనిపించని యీ స్థితిలో ఏమరి ఉండగలిగిందా?

ఏమో—ఇవి తన అంత్యక్షణాలేనేమో ననిపించింది. ఇదే నిజమైతే, తన తల్లిని ఎవరికి అప్పగించి వెళ్లగలడు? పాపం—ఆమె ఇంకన్నాళ్ళు చాకిరీ చేసుకొని బతుకుతుంది? కాని తనేం చేయగలడు? మరణమనేది ఎవరి స్వాధీనంలో నన్నా ఉండివుంటే, యీ ప్రపంచంలో ఎవరు చచ్చేవాళ్ళు?...కాని నిజంగా ఇది తన మరణశయ్యే కనుక ఐతే, ఒకేఒక్క కోర్కె వుంది. మృత్యుదేవతను, తల్లితో మాట్లాడే వరకూ వేచిఉండమని వేడటం! ఆమెకు తన కడసారి నమస్కారాన్ని అర్పించి, తనను క్షమించమనివేడి, నిశ్చితంగా పరలోకాలకు ప్రయాణమౌతాడు...కాని మృత్యుదేవత కరుణించినా, తల్లి రానట్లయితే, విసుగెత్తి తనను లాక్కొనే వెళ్తుందేమో?

మళ్ళీ వాంతయేట్లుంది; లేచే ఓపికకూడాలేదు. అలాగే ఆపుకున్నాడు. దాహమౌతూన్నా నీళ్ళిచ్చే దిక్కుకూడా లేదు. ఇది దిక్కులేని చావుకు నాంది ప్రస్తావనేమో?...నిజంగానే దిక్కులేక ఛస్తే?...ఇదివరకన్నడూ ఒంటరి పాటులో కలగని భయం ఒక్కసారిగా ఆవరించింది. ఎంత భయం! ఆ భయానికి రక్తం గడ్డకట్టి బిగుసుకొనిపోయి ఉండాల్సింది. కాని, సెగలుకక్కే శరీరంలోని ఉష్ణం బిగుసుకొనిపోకుండా చేసింది. చావంటే ఇంత భయమని అనుకోలేదు...ఐనా తనెలా ఛస్తాడు? ఎందుకుచావాలి? తల్లిని ఉద్ధరించవలసినతను, కనీస బాధ్యతల్ని నిర్వర్తించవలసినతను, మరికొన్ని మంచిపనులు చేయవలసినతను, అప్పుడే ఛస్తే?...కాని మృత్యుదేవతకు యీ మంచి చెడ్డలతో పనేమిటి? యీ న్యాయాన్యాయ విచారణలు, యోగ్యతాయోగ్యతల తూకాలూ ఇవన్నీ దేనికి? ప్రపంచంలో ప్రతిఒక్కరినీ కబళించవలసిన తన బాధ్యతను నిర్విచారంగా, నిరాటంకంగా కొనసాగించుకోవటమే దానిపని! దాన్ని అడ్డుతగల గలిగేవా రెవరు?

వెలుగులోనుంచి క్రమంగా అంధకారంలోకి పోతూన్నట్లు, అదే పరలోకాల్లోకేమోననిపించేట్లుతోచి, గుంజుకొని మళ్ళీ యీ ప్రపంచంలోకి పడేందుకు ప్రయత్నించాడు. తిరిగి గదిగోడలు కనిపించాక, తనప్రాణి ఇంకా పోలేదనిపించింది. కాని అదేభ్రమ, ఎక్కడికో జారిపోతూన్న సూచన మాటిమాటికీ కలుగుతూనేవుంది. కొన్నిసార్లు బలవంతాన బైటపడినా, చివరకు అది తనను పూర్తిగా ఆక్రమించింది. దానికి లొంగటంలోనే కొంతసౌఖ్యం వుందనిపించింది..,

ఆ తరువాత మళ్ళీ తెలివివొచ్చింది. మెల్లిగా కళ్లు తెరిచి, గదిలోనే వున్నట్లు తెలుసుకున్నాక, తను చావలేదనిపించింది; నిద్రపోయి మేల్కొన్నాడన్నమాట! నిద్రలో వేధించని అనేకవ్యూహాలు తిరిగి తనను చుట్టుముట్టుతూన్నవి. ఆలోచనా శక్తి వున్నన్నాళ్ళూ వీటిబాధ తప్పేట్లులేదు.

పక్కనే గోపయ్య కూర్చొనివున్నాడు. ఒక వేళ తను చచ్చినా ఎవరో ఒకరు దిక్కుంటారు! కాని వీళ్లల్లో ఎవరూ అమ్మకు సాటిరారు; కాని అమ్మ లేని పక్షంలో వీళ్ళేగతి తనకు!

తను కళ్ళు తెరవగానే 'బాబూ! మొహం కడుక్కుంటారా — కాఫీ తెస్తాను' అన్నాడు గోపయ్య.

లేచేందుకూ కూడా శక్తిలేదు. మాటలు అర్థమౌతూన్నా జవాబు చెప్పే కుతూహలంకూడాలేదు. కాని జవాబు చెప్పకుంటే పనులుకావనీ, మరింత వేధిస్తారనీ తెలుసు. 'ఇప్పుడేమీ వొద్దు' అని చేతితో సౌజ్ఞచేశాడు. గొంతు ఆరిపోయినట్లయి, కాసిని మంచినీళ్ళు మాత్రం తాగాడు.

'ఆసుపత్రికి వెళ్ళి మందు తెచ్చుకుందాం' అన్నాడు గోపయ్య.

దానికీ చెయ్యి అడ్డంగా తిప్పి తన అయిష్టాన్ని ప్రకటించాడు. ఆ తరువాత గోపయ్య అంతా చెప్పాడు. తనను ఇక్కడే సహాయంగా ఉండమన్నారనీ, అవసర సరమైతే కబురు చెయ్యమనీ ఇంకేమేమో చెప్పాడు. లలిత ఏమన్నదని అడుగుదా మనుకున్నాడు తను. కాని ఆ అడగటంవల్ల తనను అపార్థం చేసుకుంటారేమోననీ, వినా ఆమె ఏమన్నా అంటుందని తను పొరబడటం ఎందుకనీ ఊరుకున్నాడు.

మళ్ళీ వింత వింత ఆలోచనలు ఆరంభమైనవి. ఏ ఒక్క విషయాన్ని గూర్చీ మెదడు నిలకడగా ఆలోచించటం లేదు. అనేక ఆలోచనలు ఒక దానితో మరొకటి సంఘర్షిస్తూ బుర్రలో అల్లకల్లోలంగా కదను తొక్కుతూన్నవి. వాటిని కంట్రోలు చేసే శక్తిలేదు; భరించే శక్తీలేదు...అందుకనే నలిగిపోతున్నాడు.

ఉండి వుండి ఆలోచనలు పోట్లాటలో అలసిపోయి కాస్సేపు విశ్రాంతి తీసు కున్నట్లుంటుంది. అప్పుడు తన స్థితి పూర్తిగా అర్థమౌతుంది. కాస్త ప్రశాంతంగా తననుగూర్చి ఆలోచించగలుగుతాడు. ఐతే ఆ ఆలోచన తెగక పూర్వమే తనను గాబరాపెడుతూ మళ్ళీ ఆలోచనా ప్రవాహం తాలూకు అల్లకల్లోలం ఆరంభ మౌతూంటుంది. ఏం చేస్తాడు తను? ఏం చేయగలడు కనుక?

మధ్యలో ఒకసారి గోపయ్యను పంపి, అమ్మను పిలిపించుకుందామా అను కున్నాడు. కాని యీ సంగతులన్నీ వీళ్ళందరికీ తెలియటం ఎందుకు? అదేదో తన జీవితరహస్యం; దాన్ని రహస్యంగానే వుంచటం మంచిదనిపించింది; అదీగాక తనదగ్గిర గోపయ్యకూడా లేకుండాపోతాడాయె. ఐనా తల్లి ఇంకా రాదేం? ఆమె

వొస్తే యీ బైటి వ్యక్తులందర్నీ పంపేయ్యవొచ్చు; వాళ్ళకూ యీ అనవసరపు శ్రమనుంచి విముక్తి కలుగుతుంది...కాని తను కోరినట్లు జరగదు...ఏది జరిగింది కనుక? జీవితమంతా పొద్దెదురుగానేవుంది. ఎక్కడో దూరాన మిణుకు మిణుకు మనే ఆశా కిరణాన్ని చూస్తూనే జీవితగమనం సాగుతోంది. కాని ఎంతదూరం పోయినా, ఆ కిరణం దగ్గరవటంలేదు; బహుశా తనతోపాటే అదికూడా ముందుకు పయినిస్తోందేమో? ఇదే నిజమైతే తను ఎన్నటికీ దాన్ని అందుకోలేడు—ఎన్నటికీ!

కాలం నడుస్తోందా అనిపిస్తోంది. కాలం జరుగుతేనేకాని కొన్ని చిక్కులు వాటంతటవి విడివడవు; అలాటప్పుడు కాలం జరగటంలేదనే అనుమానం కలగటం సహజమే! లేదా, కాలం ఇంకా చకచకా సాగటంలేదనే బాధన్నా కలగక పోదు...టైం ఎంతైవుంటుందో తెలియదు. కాని బైటి సూర్యుని వేడికిరణాల తాకిడి, కప్పులోనుంచి, గదిగోడల్లోనుంచికూడా దూసుకొని వొచ్చి శరీరోష్ణానికి తోడుగా బాహ్యఉష్ణంకూడా కలిసి, తెకతెకలాడిస్తూన్నది. ఒకటే అశాంతి. నిద్రపడితే బాగుండు. తనలాటి నిర్భాగ్యులకు నిద్ర కల్పతరువులాటిది. నిద్రలో పొందే మనశ్శాంతివల్ల కలిగే శక్తితోనే నిత్యజీవితాన్ని ఎదుర్కోగలుగుతున్నాడు. కాని ఆ నిద్రకూడా కరువైతే ఇంక దేన్ని ఆశ్రయించగలడు?

ఎంత బలవంతంగా నిద్రాదేవిని కావిలించుకోవాలనుకున్నా, ఆమెకూడా తనను అసహ్యించుకొని దూరదూరంగా జరుగుతూన్నట్లే తోచింది. రోగుల్ని బల వంతంగా నిద్రపుచ్చే మందునుగూర్చి తను విన్నాడు. అదివుంటే బాగుండు ననిపిం చింది; కాని తనలాటివాళ్ళకు రోగాలంటే ఉచితంగా వొస్తవి కాని, మందులు ఎక్కణ్నుంచి వొస్తవి? కనుకనే బాధను పూర్తిగా అనుభవించి, వొదిలించుకోవ టమే మిగిలిన మార్గం.

తనచేత మాట్లాడిద్దామని గోపయ్య ప్రయత్నిస్తున్నాడు. కాని మాట్లాడటం ఇష్టంలేక కళ్ళుమూసుకొని నిద్ర నటిస్తున్నాడు తను. ఇలా చాలాసేపు గడిచాక, క్రమంగా మగతగావుండి నిద్రపట్టింది.

## 16

మెలకువ వొచ్చేప్పటికి తలనెప్పి, వొంటినెప్పులు రెండింతలైనట్లు తోచింది; మరోపక్క వొళ్లు తిరగటం; దీనికితోడు నీరసం. నోరంతా చేదుగానూ, వెగటుగానూవుంది. అతి కష్టంమీదకాని, దేనిమీదా దృష్టిని కేంద్రీకరించి, అర్థం చేసుకోలేనిస్థితి వొచ్చింది.

కిటికీలోనుంచి గోడమీద వెలుతురు పడుతోంది. ఇది సాయింత్రపు నీ రెండో, గుడ్డివెన్నెలో అర్థంకాలేదు...కొంచెం ఆలోచించాక, చీకటి పడినట్ల యితే గదిలో లైటు వుండేదనీ, కిటికీలోనుంచి కార్పరేషన్ వాళ్ల వీధి దీపపుకాంతి పడేదనీ గుర్తించి, ఇది సాయంత్రమనే నిశ్చయానికి వొచ్చాడు.

'అమ్మా!' అన్నాడు, బాధతో మూలుగుతూ.

'ఏం బాబూ?' అన్నాడు, తుళ్లిపడి గోపయ్య.

అమ్మ ఇంక రాలేదన్నమాట! ఎందుకని రాలేక పోయిందో? తన ఏకైక ఆత్మబాంధవి, ఒక్కగానొక్క కొడుకును చూడరాకుండటం విడ్డూరంగానే కనిపించింది. కాని తను అందుకేం చేయగలడు?

'బాబూ! కాస్త కాఫీ తెస్తాను' అన్నాడు గోపయ్య.

తనేమీ మాట్లాడలేదు; దృష్టంతా తల్లిమీదనే వుంది. మనసులో ఆరాటపడుతున్నాడు—అంతే! బుర్ర పట్టనన్ని తలపులు గుమికూడి మళ్ళీ మీదికి వొస్తూన్నవి. తనకు పిచ్చెక్కుతుందేమో ననిపించింది; అసలు ఇప్పటికి పిచ్చిపట్టలేదనేమిటి?

గోపయ్య ఎప్పుడు వెళ్ళాడో తెలియదు. ఎదురుగుండా వాకిలివైపు మాత్రం తను తదేకంగా చూస్తున్నాడు. అమ్మ వొస్తుందనే ఆశవొక్కటే మిగిలిన ఆలోచనలన్నిటితోనూ తీవ్రంగా పోరాడి మనసును మెలిపెడుతోంది.

కొంత సేపయాక, చీర కుచ్చెళ్లు కనిపించినవి; ఇప్పటికి వెలుగు బాగా తగ్గటంవల్ల లీలగా మాత్రమే తోచినవి. పరికించిచూస్తే ఆ కుచ్చెళ్ళు తన వైపుకే వొస్తూన్నవి. అమ్మ వొచ్చిందనే సంతోషంతో లేచి కూర్చోవాలనుకున్నాడు. కాని మరుక్షణంలోనే గోపయ్య గొంతు వినిపించి, నీరసంగా పడుకున్నవాడల్లా, గోడవైపు తిరిగాడు.

'రండమ్మా...లైటు వెలిగిస్తాను' అన్నాడు గోపయ్య.

ఎవరో స్త్రీ కూడా వెంటవుందనితోచి, మళ్ళీ ఇటు తిరిగాడు. ఐతే స్పష్టంగా కనిపించలేదు. కొంపదీసి లలిత కాదు కదా!

'వెలిగించే బయలుదేరక పొయ్యావా?' అన్నదా స్త్రీ కంఠం అధికారంతో.

నిజంగా లలితేనని గ్రహించాడు. యీమె తనయీగదికి వొస్తుందని కలలో కూడా అనుకోలేదు. ఆమె రాకుండా వుండాలనికూడా తన విధిని ప్రార్థించాడు. ఆమెవొచ్చి తనస్థితిచూస్తే, ఆమెదృష్టిలో తన విలువ తగ్గిపోతుందనే భయం ఒకవైపు, ఆమెను మర్యాదచేసి కూర్చోపెట్టేందుకన్నా కుర్చీలేకుండటంవల్ల కలిగే అవమానం ఒకపక్కా, ఆమె అసహ్యించు కుంటుందనేభావన మరోవైపూ అతన్ని బాధించినవి...కాని, ఇప్పుడు అంతా మించిపోయింది; ఆమె వొచ్చాక ఏం చెయ్యాలో తానెన్నడూ ఆలోచించలేదు. ఇప్పుడు ఏదైనా ఆలోచన కలిగినా, దాన్ని అమలు జరిపేస్థితిలో కూడా లేడాయె.

మసిబారిన లాంతరు వెలిగించబడి, ప్రకాశవంతంగాలేని కాంతితో గది నిండింది...లలిత ఎందుకురావాలి? ఆమె రాకుండావుంటేనే తన మనశ్శాంతిని నిల

బెట్టుకో కలిగి ఉండేవాడు. యీామె మొదటినుంచీ తన జీవిత రహస్యాలపట్ల కుతూహలాన్ని చూపుతూ, వెంటాడి కనుక్కుంటూ నేవుంది. ఎందుకు? ఆ మెకు తనవిషయాలతో ఏంపని? తనచావు తనను చావనీని సమాజంపట్ల అసహ్యభావం కలిగింది.

ఆమె మెల్లిగా తనదగ్గిరికి వొచ్చింది. దుప్పటికింది తన శరీరాన్ని తాకిచూసి 'జ్వరం చాలా తీవ్రంగావుంది...నాకు కబురు చెయ్యక పొయ్యారా?' అంది మృదువుగా.

యీామె వొచ్చినందుకే విచారపడుతూండగా, కబురు చేయలేదేమని అడుగుతుంటే, తనేం జవాబు చెప్పలేక ఊరుకున్నాడు.

'పొద్దుట్నుంచీ పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టలేదమ్మా' అన్నాడు గోపయ్య.

'ఆఁ' అన్నదామె ఆశ్చర్యంతో 'ఎందుకనీ? మాష్టారూ!...మాష్టారూ!' అని తనను కదిపింది. తనకు నిద్రపట్టీ పట్టకుండా వున్నదని ఆమె అభిప్రాయపడుతూన్నట్లు తోచింది. కాని ఇంకా దొంగ ఎత్తు వేయటంవల్ల లాభంలేదని తెలుసు. ఏదో జవాబుచెప్పి ఆమెను ఇక్కణ్నుంచి ఎంత త్వరగా పంపేస్తే అంత మంచిదని తోచింది.

కళ్ళు తెరిచాడు; ఇందాకటినుంచీ శబ్దాన్నిబట్టి గ్రహిస్తున్నాడే కాని ఏం జరుగుతోందో ఇప్పుడు చూడగలుగుతున్నాడు. లలిత కటిక నేలను, మోకాళ్ళు ముడిచి తన దగ్గరే కూర్చుంది. ఆమె ముఖంలో ఆతృత, కళ్లల్లో జాలి, తన ఆశయాలే భగ్నమౌతూన్నప్పుడు కలిగే ఆవేదనా కనిపిస్తున్నవి.

'నేనండీ...లలితను...' అని తన ఫాలభాగంమీద చల్లని చేతిని వేసింది. తలనెప్పి ఒక్క దెబ్బకు దిగిపోయినట్లే తోచింది. ఆమె చేతినుంచి విడుదలైన సుగంధ వాయువులను పీల్చగానే కొత్త లోకాలలో కాలుపెట్టినట్లనిపించింది. తేరిపారచూస్తే ఆమె తనచేతిని లాగేసుకుంటుందేమోనని భయంవేసింది.

'అబ్బ!...అమ్మా!...ఉఫ్!' అన్నాడు.

'మాష్టారూ! పొద్దుట్నుంచీ మంచినీళ్ళన్నా తాగలేదట...ఎందుకనీ?... జ్వరంవస్తే పోగొట్టుకోవాలి; జారేదాకా కొంత బాధపడాలి; అంతేకాని అలుగుతే ఎట్లా?' అంది ఆప్యాయంగా. తన తల్లికూడా ఇలాగే మాట్లాడివుండేది! మాతృత్వమనేది ప్రతి స్త్రీలోనూ వుంటుందనీ, అదే వారి విశిష్ట లక్షణమనీ, అవసరమైనప్పుడు అదొక స్రవంతివలెనే ప్రవహిస్తుందనీ మొట్ట మొదటిసారి అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు.

తనేమీ మాట్లాడకుండటం చూసి 'చూశారా! ఏమీ తీసుకోకపోతే ఎంత నీరసం వొచ్చిందో? కాఫీ తెచ్చాడు గోపయ్య. చల్లారక ముందే తాగండి' అంది.

వొద్దన్నట్లు చెయ్యి అడ్డంగా తిప్పాడు.

'కాదు...అలా అనొద్దు...నేను తాగిస్తానుగా...మీరేం భయపడకండి నేనిప్పుడే డాక్టర్‌కు కబురుచేస్తాను. మీరు ఇంత అధైర్యపడి పోతారనుకోలేదు... గోపయ్యా! నువ్వెళ్లి డాక్టర్ రాజగోపాలంగార్ని వెంటపెట్టుకొనిరా. నేను చెప్పానని చెప్పు...త్వరగా రా...నేను ఇక్కడే వుంటాను' అంది. వెళ్ళబోతూన్న గోపయ్యతో 'ఆ కాఫీగ్లాసు ఇటిచ్చి పో' అంది.

ప్రవాహంగా వొచ్చిపడే యీ సానుభూతికి దిమ్మెర పొయ్యాడు. ఇంతకు పూర్వం అనుభవిస్తూన్న శారీరక, మానసిక బాధలన్నీ భరించేగలిగే శక్తిని యీ సానుభూతి తనకు ప్రసాదించింది. తనకు ప్రపంచంలో ఏదైతే తక్కువైందని మధన పడుతున్నాడో, అదే తన కొంప వెతుక్కుంటూ వొచ్చింది.

ఆమె తన తలకింద చేయివేసి, మెల్లిగా ఎత్తి కాఫీగ్లాసు నోటి కందించింది. కాఫీ తాగాలనిలేదు. అందుకని పెదవులు గట్టిగా బిగించాడు.

'తాగండి...తాగరూ?...నా కోసం...ఇది తాగితే కాస్త ప్రాణవొస్తుంది. నా మాట వినండి మాస్టారూ!...మీరిలా మొండికేస్తే నేను వెళ్ళిపోతాను...ఆఁ, అట్లా...ఇంకాస్త తాగండి...' అని మెల్లిగా గ్లాసులోని కాఫీ అంతా తాగించింది. అది తాగాక, కొద్ది ఉత్సాహం వొచ్చినట్లుంది; మగతలో నుంచి ఎవరో తన్నినట్లు, బాగా మెలకువ వొచ్చింది.

యీమె దగ్గిర తనెంత చిన్నబిడ్డ ఐ పోతున్నాడో తెలుసుకున్నాడు. కాని, అలా వుండటమే తనకు బాగుంది. ఆమె మందలించటం, అంతలోనే బతిమాలటం ఇదంతా చూస్తుంటే తల్లిలేని లోటును పూరించేందుకు లలిత ఆ రూపంలో సాక్షాత్కరించినట్లే తోచింది.

'ఎందుకు గదంతా ఇంత అసహ్యంగా వుంచారు? మీ రొక్కసారిలేస్తే, మీ పక్క సరిగ్గా వేస్తాను...సిగ్గుపడుతున్నారా?...మీరలా దీనంగా మొహం పెట్టకండి. మొగాళ్లు ఇలా దిగజారి పోతారంటే నేను నమ్మలేకుండా వున్నాను'

ఆమె ఆసరాతో లేచి కాస్త అవతల కూర్చున్నాడు. పక్కంతా దులిపి ఆమె శుభ్రంగావేసి, తనను హాయిగా పడుకోబెట్టింది. యీమె పక్కనవుంటే తనకు లేని బలహీనతలుకూడా వొచ్చిపడుతూన్నవి. నిజంగా తనంతట తను లేవగలిగినా, ఆమె పట్టుకుంటేనే కాని లేవలేనిస్థితిలో వున్నట్లు తోచింది. అంతకన్న—సానుభూతి చూపేవారి ఎదుట కొత్తకష్టాల్ని నటించైనా సరే, ఆ సానుభూతిని పరిపూర్ణరూపంలో పొందాలనే అభిలాష అధికమైంది.

పైత్యంచి ఉండటంవల్ల ఇదొక స్వాప్నిక అనుభవంగాకూడా రూపొందుతోంది; కాని తననుతాను నిలవతొక్కుకుంటూ యీ సత్యాన్ని నమ్మేందుకు విశ్వ

ప్రయత్నం చేస్తున్నాడు. లలితనుగూర్చిన కొత్త ఆలోచనలు మెషిన్‌గన్‌నుంచి చక చకా విడుదలయ్యే గుళ్ళవలె తలలోకి చొరుచుకొని పోతూన్నవి.

లలిత హృదయపూర్వకంగా తనమేలుకోరేది; తనంటే ఆమెకు ఎంతో జాలి! అది ప్రణయమని తను కలలోకూడా నమ్మలేదు—ఏనాడైనా తనంతట తానుగా ఆమె చెపితేతప్ప!...కాని ధనికవర్గాలవారు చూపవలసిన నిర్దయ యీామెలోలేదు. గర్వంగా, ఠీవిగా, ప్రపంచమంతా తమలాటివారే పాలించేందుకు ఏర్పడిందనే ధోరణిలో కనిపించి నప్పటికీ, యీామె ఇక్కడ నిజంగా అబలగానే తయారైంది. అది తన బీదరికంపట్ల జాలో, లేక తనలోని రచయితకుచూపే గౌరవమో తెలియదు. ఏదైతేనేమి యీా లలితమాత్రం తనకొక ఆత్మబంధువేనని ఇన్నాళ్ళూ రుజూ చేసుకునేందుకు ప్రయత్నిస్తూనేవుంది. ఇక ఇప్పుడు ఆ రుజూ పూర్తయినట్లే భావించి, నమ్మగలిగాడు.

'మీారు అతిగా ఆలోచించి మనస్సు చెడగొట్టుకోకండి—మాష్టారూ! వొళ్ళు పైత్యంతో బాధపడుతున్నారు. నాలుగురోజుల్లో నెమ్మదిస్తుందిగా!' అంది లలిత. కటిక నేలమీాద తన తలదగ్గర కూర్చున్నది. ఆమెకు యీా కొంపకు రావాల్సిన అవసరమేమిటి? తనపట్ల యీా దయచూపట మెందుకు? లోకులుచూస్తే. ఆమె బతికే సమాజానికి ఇది కన్నెర్ర అవగలదు...అన్నిటికన్నా—యువతి,అందగత్తె, ధనికురాలు, ఒంటరిగా తన ఇంటికి రావటంలోగల లోకోపవాదుకూడా ఆమెను భయపెట్టలే దెందుకనో?...ఐతే ఆమె చాలా అమాయకంగా ప్రవర్తించి ఉండొచ్చు; చేయని నేరాన్నిగూర్చి భయపడకపోవొచ్చు. కాని ప్రపంచంలో అమాయకత్వానికి పడే శిక్షనుంచి తప్పించుకోలేక పోతుందేమో? ఒక ఉపకారం, సహృదయంతో చేయబోయి, అపకారాన్ని కావించుకోవాల్సి వుంటుందేమో? యీా సంగతులన్నీ ఆమెకు విశదీకరించా లనుకున్నాడు; కాని ఇది సమయంకాదు. పైపెచ్చు ఆమె న్యూనత పొందుతుంది. లోకులు విధించబొయ్యే శిక్షను ముందుగా తానే విధించినంత బాధ పడుతుంది!

'మీారు నాతో మాట్లాడకూడ దనుకున్నారా?' అందామె, తన తల నిమురుతూ.

కళ్ళు తెరిచాడు: 'అర్థంకాదు...మాట్లాడేందు కేముందనీ?'

'ఏమో—మాట్లాడేశక్తికూడా కోల్పోయేటంత బాధపడుతున్నారేమో నని భయంవేసింది' అందామె.

భయం! తనబాధ యీామెకు భయం! తను నమ్మలేని విషయమని కాదుకాని, లలిత తనకు ఇంత దగ్గిరవుతుందని ఎన్నడూ అనుకోలేదు; అందుకనే తప్పనిసరిగా యీా మార్పుకు మనసును అలవరుచు కుంటున్నాడు.

'మీారింత అమాయకులనుకోలేదు...' అందామె.

'ఏం ? ఎందుకనీ ?'

ద్వారం దగ్గిర అడుగుల చప్పుడైంది. తల్లి వొస్తోందేమోనని మోచేతుల మీద లేచాడు; లలితకూడా ఆతృతతోనే కాస్త దూరం జరిగి, చూసింది...గోపయ్యా అతని వెనుక డాక్టరూ వొచ్చారు.

యీ ప్రదేశాన్ని చూసి డాక్టర్ నిరుత్సాహపడినట్లు ఆయన ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది. పెద్ద డాక్టర్లెవరూ, ఇలాటి కొంపలచుట్టూ తిరిగేందుకు ఒప్పుకోరు. మానవసేవ, వృత్తి ధర్మం మొదలైనవి ప్రపంచానికీ, ఆశయాలకూ సంబంధించినవే కాని నిత్యజీవితంలో వీటిని అనుసరించగలగటం సామాన్యులకు అలవయ్యేది కాదు.

తప్పని సరిగా గొంతు కూర్చొని రోగిని పరీక్షించాడు. తీరావొచ్చాక, లలితను చూశాక, బలవంతాన నవ్వు మొహంపెట్టి రకరకాల ప్రశ్నలూ అడిగాడు.

పరీక్ష పూర్తయాక 'మందు పంపుతాను...' అని మెల్లిగా లేచాడు. లలిత కూడా డాక్టర్తోపాటు వెంటవెళ్ళింది. గది బైటవాళ్ళేదో గుసగుసలాడుతూంటే, నిజంగానే తనకు భయంవేసింది. కనుచూపుమేరలోవున్న తన మృత్యుదేవతను వాళ్ళు చూడగలుగుతున్నా రనిపించింది. ఐతే తనకు ఎంత విరక్తి కలుగుతూన్నప్పటికీ, ఎన్నిబాధలు ఎదురౌతూన్నప్పటికీ యీ జీవితాన్ని చాలించాలనే భావం ఎన్నడూ కలగలేదు. కాని తన ఇష్టాయిష్టాలతో పనిలేకుండా మృత్యుదేవి కావిలించుకుంటే...?

వీల్లేదు...వీల్లేదు...తను చావడు! చావలేదు! ఎంతైనా ప్రయత్నించి బతకాల్సిందే! తల్లివున్నది—చాకిరి చేసేందుకు! కాస్తోకూస్తో డబ్బు కూడబెట్టాడు మందులకూ, మాకులకూ. అన్నిటికన్నా లలిత అండవుంది, యీ శక్తులు చాలవా మృత్యువును ఓడించేందుకు?

పదినిమిషాలయ్యాక లలిత వొచ్చింది. ఇదివరకల్లేనే కటికనేలను కాళ్ళు ముడుచుకొని కూర్చుంది. ఇంతకుముందు ప్రశాంతంగావున్న ఆమె ముఖంలో ఆందోళన స్పష్టంగా కనిపించింది...నిజంగానే తన మరణవార్తను జేరేసే వార్తాహారుని వలెనే యీ డాక్టర్ వొచ్చివుంటాడు! క్షణంలో లలిత దిగజారి పోవటానికి మరో కారణం కనిపించదు. ఆ సంగతి అడిగి తెలుసుకునేందుకు భయంగావుంది. తను అనుకున్నట్లు అది నిజమే ఐతే!...ఏదో వొకటి విసం మనశ్శాంతి ఉండదు. అయేదేదో అవుతుంది కనుక, వినేతీరాలి. కొంచెంసేపు ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. చూస్తూండగానే లలితలో తిరిగి జీవకళ పొడసూపింది. ఇక అడగాలనే నిశ్చయానికి తనూ అలవడ గలిగాడు.

'ఏమంటాడు డాక్టర్?' అన్నాడు ఎలాగో.

దీనికి జవాబు చెప్పేందుకు ఆమె కాస్త తటపటాయించింది. దుర్వార్త

ఎలా చెప్పటమా అని ఆలోచిస్తూండి ఉండొచ్చనిపించింది. తనుకూడా తొందర పెట్టలేదు; అందువల్ల నిజం బైటపడ లేదని అనుమానం.

'డాక్టర్లు ఏవేవో కొత్తపేర్లు పెడుతూంటారు...ఇది బహుశా టైఫాయిడ్‌కు తిరుగుతుందేమోనని ఆయన అనుమానం...మీరేమీ భయపడకండి. ఆసుపత్రికి పంప మని నాకుసలహాఇచ్చాడు. కాదు మీరే చూడాలని నేను ఖచ్చితంగా చెప్పాను... దీనికయే ఖర్చునుగూర్చికూడా మీరు విచారించక్కర్లేదు; అదంతా నేను చూసుకుం టాను. కావాల్సిందల్లా మీరు మనశ్శాంతితో ఉండటం—అంతే.' అందామె.

నిజానికి తనెంతో భయపడాల్సింది; కాని యీ జ్వర తీవ్రత, ప్రమాదం ఇంకెవరికో నన్నంత తేలిగ్గా ఆమె నమ్మించగలిగింది.

—తనకు యీమె అండగా వుండగా భయపడాల్సిందేమీలేదు. ఆమెచెప్పి నట్లు కాస్త మనశ్శాంతీ—విశ్రాంతీ అవసరం. అమ్మవొస్తే అవీ లభ్యమౌతవి.

చాలాసేపటిదాకా ఎవ్వరూ మాట్లాడలేదు. బజారులో గోలకూడా అంతగా వినరావటంలేదు. ఎవరు ఎలా ఆలోచిస్తున్నారో ఒకరికొకరికి తెలియదు; తనలో మాత్రం ఎన్నో తెగిన వూహలు సముద్రతరంగాలవలె ఒకదానికొకటి సంబంధం లేకుండా వొడ్డుకొచ్చి కరిగిపోతూన్నట్లే—ఒక్కటీ విశిష్టాకారం లేకుండానే మాయమైనవి. కళ్లుమూసుకొనే యీ రగడను భరించాడు తను.

ఇక బైటి ప్రపంచాన్ని చూడాలనే కుతూహలం, అంతకన్న ఆ పిచ్చి వూహల తాకిడి నుంచి తప్పించుకుందామనే తీవ్రవాంఛతో మెల్లిగా కళ్లు తెరిచాడు. పక్కన కూర్చున్న లలిత మోకాళ్ల మధ్య తలకాయ వాల్చివుంది. మూలనున్న లాం తరు వెలుగులో అంతబాగా కనిపించలేదు. ఆమె అలా ఎందుకు కూర్చుందో మొదట్లో తెలియలేదు... కాని సన్నగా వినపడీ వినపడకుండా ఏదో హృదయంలోనే కుమల టం లాటిది జరుగుతోందని అనుమానం వేసింది. కాని నిర్ధారణగా తెలుసుకునేం దుకు తదేకంగా ఆమె వైపే మెదలకుండా చూడసాగాడు.

ఐదారు నిమిషాలు గడిచాక, ఆమె ముఖం పైకెత్తింది. తామరాకు మీది నీటి బిందువులల్లే కళ్ళనుంచి జారిపడే కన్నీటి బిందువులు స్పష్టంగా కనిపించినవి. తను కనిపెడుతూన్నట్లు చూడగానే, ఆమె ఆ వైపుకు తిరిగి చీరె చెంగుతో ముఖం తుడుచుకుంది. తనవైపు తిరుగుతూనే ముఖభంగిమను మార్చేందుకూ, చిరునవ్వు నవ్వేందుకూ వ్యర్థప్రయత్నం చేసింది. ఆమెముఖం కోమలత్వాన్నీ, నూతనత్వాన్నీ కోల్పోయింది యీమె...యీమె తననుగూర్చి విచారించిందా? ఇది నిజమా? ...చూశాకకూడా నమ్మకుండటం ఎలా? . ఇదే నిజమైతే తన జీవితమే ధన్యమైంది ...తనను మనిషిగా నన్నా చూడని సమాజంలోనే...ఒక కొత్త ఆత్మబంధువు లభ్యమైంది...ఇంక తనకేం కావాలి?...చాలు . యీ పళంగా చచ్చినా తనకు బాధనిపించదు.

'లలితా—ఏడుస్తున్నావా?...దేనికి?' అన్నాడు. ఎంత నిగ్రహం, మనో ధైర్యం, శాంతి తన కంఠంలో ప్రవేశించినవో తన చెవులకూ—డా తెలుస్తూనే వుంది.

'ఏమ్బే...లేదు...' అని తెప్పించుకోవాలని ప్రయత్నించిందామె; కాని గాద్గదికమైన ఆమె కంఠం, ఆమె పరిస్థితిని దాయలేక పోయింది.

'నీవు విచారపడకు లలితా! ఇందాకటినుంచీ నాకెంతో ధైర్యంచెప్పి ఇలా కుంగిపోతావేమిటి?... నేను చావను...ఒకవేళ నిజంగానే భస్మమాత్రమేం... నేనేం ఉద్ధరించాలని? ఒక పనికిరానివాడికోసం, నీవిలా దిగులుపడటమేమిటి? ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు?' యీమాటలంటూంటే తన కంఠంకూడా వొణికింది. ఆమెను ఓదార్చబోయి, తనే ఏడ్చేస్థితికి దిగుతూన్నట్లయింది.

లలిత తనను తాను సంబాళించుకో గలిగింది; 'నేనలా అనుకోవటం లేదు మాష్టారూ! ఏదన్నా అన్యాయం కళ్లెదుట జరుగుతూంటే, దాన్ని న్యాయంగా మార్చే శక్తి మనలో ఉన్నట్లయితే, దాన్ని చూసీచూడనట్లు వూరుకోవటం అమానుష మౌతుందని నా అభిప్రాయం. ఇది గొప్ప ఆశయం కాకపోవొచ్చు కాని, అనుస రించదగింది కాదని ఎవరనగలరు?.. ఐనా ఇప్పుడా విషయాలన్నీ దేనికి... నేనేదో నా స్వంతవిషయమై కొంత బాధపడ్డాను అంతే!...మీరు కాస్సేపు నిద్రపోకూడదా?' అందామె.

హృదయంనిండా మంచుపడింది. కాని నిప్పులు చెరిగే ఆహృదయంలో ఆ మంచు కరిగి, వెల్లువై శరీరమంతా ప్రవహించింది. ఆ అగ్నిని ఆర్పటమే కాకుండా, శీతల వాయుప్రసారంకూడా జరిగింది. యీస్థితి, యీ ఝుల్లుమనటానికి అలవాట య్యేందుకు కనీసం ఐదునిమిషాలన్నా పట్టివుంటుంది.

ఆమెకు తనలో కలిగిన వికారం అర్థంకాలేదేమో—తదేకంగా, కన్నార్ప కుండా తనవైపే చూస్తోంది. ఇంతకుపూర్వం తనకు విద్యుక్త ధర్మాల్ని బోధించిన యీమెకు, తనూ కొన్ని సలహాల్ని ఇవ్వాల్సిన బాధ్యత గుర్తొచ్చింది.

'లలితా! నామీద సానుభూతి చూపుతూన్నందుకు కృతజ్ఞుణ్ని...కానీ నీవీ ప్రదేశానికి రావటం మంచిదికాదు. ఆ కారణాలన్నీ నన్ను అడగొద్దు; కొంతన్నా నీకు తెలిసేవుంటుంది... నేను కోలుకున్నాక, మనం మామూలుగా పద్మనాభంగారింట్లో కలుస్తూండవొచ్చు' అన్నాడు తను.

'అంటే...మీకు ఎలావుందో నేనొచ్చి చూడకూడదన్నమాట?' అందామె తీవ్రంగా 'మాష్టారూ! మీరు సమాజాన్ని చూపి, మనుషుల బుర్రల్లో మెదిలే విషపు టాలోచనల్ని గూర్చి ఆలోచించి యీమాట అంటున్నారు...దీని అర్థం, మిగతా ప్రపంచం సంగతి అటుంచి, ముందుగా మీ బుర్రలోనే అలాంటి నీచపు టూహాలకు పునాది పడిందన్నమాట?'

తను నీరైపోయ్యాడు. లలితతో వాదించి నెగ్గటం మాటలుకాదని తనకు తెలుసు; వినా ఇప్పుడీ వాద ప్రతివాదాలవల్ల అయేదేమీలేదు; తనకంత ఓపికాలేదు. కాని ఆమెకు ఒక్కమాటలో ఎలా నచ్చచెప్పాలి? అందులోనూ తనమీదకే ఆ నెపాన్ని తోస్తోందాయె!

'నా సంగతికాదు లలితా! అది లోకంపోకడ. మనం పుట్టకపూర్వమే ఏర్పడిన లోకాచారం. ఆ ప్రవాహానికి కావాలని ఎదురెళ్లి ఆహుతి కావటంకన్న, ప్రవాహంలోనే కొట్టుకొనిపోతూ వొడ్డు జేరాలి.'

'ఆ మాత్రం నాకు తెలుసులెద్దురూ!...ఇప్పుడీ సంగతులన్నీ మరిచిపోండి. నేను వొచ్చి చూస్తూంటాను. ఇక మీ అమ్మగారు వొస్తే, మీకు దిగులుండదు' అంది నవ్వుతూ. ఇంత త్వరలో, ఆమె ఉద్రేకం చల్లారుతుందనుకోలేదు తను. ఎంతలో ఉద్రిక్త రాలైందో, అంతలోనే ప్రశాంత కాగలిగింది. యీమె తత్వమే చాలా విచిత్రంగా తోచింది.

గోపయ్య మందు సీసాతో రావటంతో వారి సంభాషణకు అంతరాయం కలిగింది; వినా ఇంకా మాట్లాడాల్సిన రాచకార్యాలేమీ లేవు; అదంతా జీవితమంతా మాట్లాడినా తరిగేదికాదు.

మందు మర్నాటి సాయింత్రం వరకూ, నాలుగేసి గంటలకొకసారి చొప్పున తాగాలని డాక్టర్ చెప్పిన మాటల్ని వల్లించాడు గోపయ్య. మొదటి మోతాదు లలితే ఇచ్చింది; తాగాడు తను.

'చాలా పొద్దుపోయినట్లుంది ... ఇక నీవు ఇంటికి వెళ్లు లలితా!' అన్నాడు తను.

ఆమె జవాబు చెప్పలేదు. కాని ఆ వెళ్ళటంలో అర్థంలేదనే అసంతృప్తిని ముఖంలోనే సూచించింది. ఆమె ఆలోచన తెగక మునుపే నలభై ఏళ్ళు పైబడి నామె ఆతృతతో గదిలోకి జొరబడింది.

ఆమెను చూస్తూనే తను చాలా కష్టపడి లేచి కూర్చుంటూ 'అమ్మా!' అన్నాడు, గొప్ప బాధలో నుంచి ఒక్కసారిగా విముక్తి పొందినప్పుడు ముంచెత్తే ఆనందాన్ని సూచిస్తూ.

'నాయనా!...'అంటూ ఆమె పరుగు పరుగునవొచ్చి కొడుకును కావిలించుకొని 'జ్వరం బాగావుంది బాబూ!' అంది. తల్లి రొమ్ముల్లో తలదాచుకున్నాడు తను. తనకుకానీ తల్లికికానీ ఆ గదిలో వేరెవ్వరూ లేరనే పిచ్చినమ్మకం కలిగింది— ఎందుకనో!

కాని తల్లి అంతాచూసి 'పడుకో' అంది తనను.

తమతమ అనురాగాల్ని వెల్లడి చేసుకునేందుకు కలిగిన అటంకాల్ని తాను కూడా గ్రహించాడు. లలిత వెళ్ళే ప్రయత్నంలో వుంది. గోపయ్య రాజారావ్యో ఆజ్ఞ కోసం ఎదురుచూస్తున్నాడు.

'లలితా! యీమె మాఅమ్మ' అన్నాడు పరిచయంచేస్తూ. అమ్మ లలితను తేరి పారజూచింది. యీ విద్యుల్లత ఇక్కడికి ఎలా, ఎందుకు దిగిందో అర్థంగాక అమ్మ నిర్ఘాంత పోయివుంటుంది. లలితమాత్రం తలవొంచి నమస్కారం చేసింది.

యీ మర్యాదకు తనతల్లి తట్టుకోలేక పోయింది. తనను—మనిషివలెకూడా చూడని తనను, గౌరవించటమా? యీ అనుమానంతోనే ఆమె ప్రతి నమస్కారం వెంటనే చేయలేక పోయింది. కొంత ఆలస్యమైనా, నమస్కరిస్తూ మనసులోనే ఆ పెద్దింటి పడుచును దీవించి వుంటుంది.

'వెళ్తానండీ!' తల్లితో అని, 'రేపుసాయింత్రం వొస్తాను మాస్టారూ! మందు మాట మరిచిపోకండి. గోపయ్యను ఇక్కడ ఉంచమంటారా?' అంది.

'అక్కర్లేదు...మా అమ్మవుందిగా!'

'సరే ఐతేవెళ్తాను. నాలుగేసి గంటలకొకసారి మందివ్వాలండీ! ఇంతకు ముందే ఒకడోస్ తాగారు' అని తల్లికిచెప్పి, గోపయ్య వెంటరాగా, లలిత వెళ్ళి పోయింది.

## 17

అనురాగ పూరితమైన రెండు మానవ హృదయాలు తమ భావపరంపరను వెల్లడించుకునేందుకు అనుకూల వాతావరణం ఏర్పడింది. కాని కొన్ని నిమిషాలపాటు వారిద్దరిలో ఎవ్వరూ మాట్లాడలేక పొయ్యారు. ఎవరికి వారుగానే తమను తాము సంబాళించుకోవటంలో నిమగ్నులై వుండొచ్చు.

చివరకు తనే అన్నాడు: 'అమ్మా!...ఎందుకింత ఆలస్యం చేశావు?... నీ వొచ్చేదాకా బతుకుతానో లేదోననికూడా భయంవేసిందే!'

ఇంత వరకూ ఎలాగో తొక్కిపట్టుకోగలిగిన విచారం ఆమెను ఒక్కసారిగా ముంచేసింది. తనన్న ప్రతి ఒక్క అక్షరమూ ఆమెను గాయపరచింది. ఆవుర్న ఏడుస్తూ నత్తి దానివలె ఆమె అంది: '...నే నేం...ఆలస్యం చేయలేదు...రాజా!...నీ ఉత్తరం...అందగానే ..వంటా అదీ... పూర్తిచేసి, అమ్మగారి దగ్గిర...సెలవు తీసుకొని...రెక్కలు కట్టుకొని...వొచ్చాను రా తండ్రీ!'

తనకు లోహితుడూ, చంద్రమతి కథ మనసులో తిరుగుతోంది. పాము కరిచిన లోహితుని స్థితిలో తానువుంటే, యీ చంద్రమతి యజమానులింట వుండి, వారి పనులన్నీ పూర్తి చేసుకొని కాని, తనను చూడరాలేక పోయింది! మానవులుగా కని

పించే అందరూ మానవులు కారు; వీరిలో చాలామంది యంత్రాలు; ఐతే ఇవి తిరుగుతూ, ఆలోచనా శక్తివున్నా, దానికి ప్రాధాన్యత ఇవ్వకుండానే సకల చాకిరీలూ చేస్తూంటవి. అలాటి యంత్రాల్లో తనూ, తల్లీ ఇద్దరూ జమే!

'ఇప్పుడెలా వుందిరా రాజా?' అందామె, కన్నీళ్ళు తుడుచుకుంటూ.

'ఏమిటో ఆవేదనే! ఎందుకో తెలియదు...డాక్టర్ వొచ్చాడు...' ఆమెకు అర్థంకాలేదు. డాక్టర్ రావటమనేది నమ్మలేకుండా వుందామె.

'ఎవరూ? డాక్టరా?'

'అవునే. ఆ అమ్మాయి పిలిపించింది.'

కాస్త ఆలోచించి 'ఎవరురా ఆ అమ్మాయి?' అందామె.

'నేను ట్యూషన్ చెపుతున్నా ననలా?'

ఆపైన ఎన్నో ప్రశ్నలు అడగాలనుకున్నట్లు కనిపించింది; కాని ఇది సమయం కాదని ఊరుకున్నట్లుగా మాట తప్పించి 'ఏమన్నాడు, డాక్టర్?' అంది.

'టైఫాయిడ్‌కు దింపుతుందేమో నన్నాట్టు!'

ఆమెగుండె గుభేలుమన్నది. క్షణంలో మనిషి అగాధాల్లోకి పోతూన్నట్లు బాధపడింది. ఏడుస్తూ అంది: 'నాయనా! మన చెడురోజులకు అంతులేదనిపిస్తోంది. ఎవరో ఐశ్వర్యవంతులకు రావాల్సిన కష్టాలు మనకు వొస్తూన్నవి. ఎన్నాళ్ళిల్లా నడుములు విరగొట్టుకున్నా...' ఆ తర్వాత ఆమె మాట్లాడలేక పోయింది. ఇదంతా చెప్పి తల్లిమనస్సు చెడగొట్టినందుకు నొచ్చుకున్నాడు.

'ఏడవకే అమ్మా! అదే తగ్గుతుంది...నీవు దగ్గరవుండు—అంతేచాలు.'

'నేను ఇక్కడే వుంటానురా తండ్రీ! నీకోసం తలపగలకొట్టుకుంటాను...రాజా! ఎంత ఏడ్చినా తరగని యీ దుఃఖం, ఎంత యీదినా ఒడ్డులేని యీ జీవిత సాగరం, నాలుగుమెట్లు పైకి పాకామనుకుంటే, మూడుమెట్లు జారిపడి, దురంత దుఃఖంతో, బాధతో, ఖిన్నవదనంతో పోగొట్టుకోగా మిగిలిన శక్తితో మళ్లీ పాకటం—ఎన్నాళ్ళిట్లా? ఏమిటో—యీ ప్రపంచమే మాయ అనుకొని సరిపెట్టుకోవాలనుకున్నా కుదరటంలేదు. చాకిరీతో అలసిపోవటం, లేమితో కుమిలిపోవటం నిజం! అది మాయకాదు. కాని మన సుఖం ఒక్కటే మాయ అంటే ఎలా నమ్మటం?... ఒక్కదాన్ని నేను నిన్నెలా ఇంతదూరం లాక్కొచ్చానో తలుచుకొని, వెనక్కు తిరిగి చూసుకుంటే, నిజంగా ఇంతదూరం రాగలిగానా అనిపిస్తూంటుంది...కాని యీనాడు నీవు ..'

'నేనేమన్నానే! ఎందుకు కలవరపడతావ్? . ఏదో నా ఆతృతలో, నిన్ను చూడలేదన్న ఆవేశంలో అన్నాను...నన్ను క్షమించవే! ఇప్పుడు మన జీవితాల్ని

తమతమ అనురాగాల్ని వెల్లడి చేసుకునేందుకు కలిగిన ఆటంకాల్ని తాను కూడా గ్రహించాడు. లలిత వెళ్ళే ప్రయత్నంలో వుంది. గోపయ్య రాజారావు ఆజ్ఞకోసం ఎదురుచూస్తున్నాడు.

'లలితా! యీమె మాఅమ్మ' అన్నాడు పరిచయంచేస్తూ. అమ్మ లలితను తేరి పారజూచింది. యీ విద్యుల్లత ఇక్కడికి ఎలా, ఎందుకు దిగిందో అర్థంగాక అమ్మ నిర్ఘాంత పోయివుంటుంది. లలితమాత్రం తలవొంచి నమస్కారం చేసింది.

యీ మర్యాదకు తనతల్లి తట్టుకోలేక పోయింది. తనను—మనిషివలెకూడా చూడని తనను, గౌరవించటమా? యీ అనుమానంతోనే ఆమె ప్రతి నమస్కారం వెంటనే చేయలేక పోయింది. కొంత ఆలస్యమైనా, నమస్కరిస్తూ మనసులోనే ఆ పెద్దింటి పడుచును దీవించి వుంటుంది.

'వెళ్తానండీ!' తల్లితో అని, 'రేపుసాయింత్రం వొస్తాను మాస్టారూ! మందు మాట మరిచిపోకండి. గోపయ్యను ఇక్కడ ఉంచమంటారా?' అంది.

'అక్కర్లేదు...మా అమ్మవుందిగా!'

'సరే ఐతేవెళ్తాను. నాలుగేసి గంటలకొకసారి మందివ్వాలండీ! ఇంతకు ముందే ఒకడోస్ తాగారు' అని తల్లికిచెప్పి, గోపయ్య వెంటరాగా, లలిత వెళ్ళి పోయింది.

## 17

అనురాగ పూరితమైన రెండు మానవ హృదయాలు తమ భావపరంపరను వెల్లడించుకునేందుకు అనుకూల వాతావరణం ఏర్పడింది. కాని కొన్ని నిమిషాలపాటు వారిద్దరిలో ఎవ్వరూ మాట్లాడలేక పొయ్యారు. ఎవరికి వారుగానే తమను తాము సంబాళించుకోవటంలో నిమగ్నులై వుండొచ్చు.

చివరకు తనే అన్నాడు: 'అమ్మా!...ఎందుకింత ఆలస్యం చేశావు?... నీ వొచ్చేదాకా బతుకుతానో లేదోననికూడా భయంవేసిందే!'

ఇంత వరకూ ఎలాగో తొక్కిపట్టుకోగలిగిన విచారం ఆమెను ఒక్కసారిగా ముంచేసింది. తనన్న ప్రతి ఒక్క అక్షరమూ ఆమెను గాయపరచింది. ఆపుర్నఏడుస్తూ నత్తి దానివలె ఆమె అంది: '...నేనేం...ఆలస్యం చేయలేదు...రాజా!...నీ క్షీరం...అందగానే ..వంటా అదీ .. పూర్తిచేసి, అమ్మగారి దగ్గిర...సెలవు తీసుకొని...రెక్కలు కట్టుకొని...వొచ్చారా తండ్రీ!'

తనకు లోహితుడూ, చంద్రమతి కథ మనసులో తిరుగుతోంది. పాము కరిచిన లోహితుని స్థితిలో తానువుంటే, యీ చంద్రమతి యజమానులింట వుండి, వారి పనులన్నీ పూర్తి చేసుకొని కాని, తనను చూడరాలేక పోయింది! మానవులుగా కని

పించే అందరూ మానవులు కారు; వీరిలో చాలామంది యంత్రాలు; ఐతే ఇవి తిరుగుతూ, ఆలోచనా శక్తివున్నా, దానికి ప్రాధాన్యత ఇవ్వకుండానే సకల చాకిరీలూ చేస్తూంటవి. అలాటి యంత్రాల్లో తనూ, తల్లీ ఇద్దరూ జమే!

'ఇప్పుడెలా వుందిరా రాజా?' అందామె, కన్నీళ్ళు తుడుచుకుంటూ.

'ఏమిటో ఆవేసనే! ఎందుకో తెలియదు ..డాక్టర్ వొచ్చాడు...' ఆమెకు అర్ధంకాలేదు. డాక్టర్ రావటమనేది నమ్మలేకుండా వుందామె.

'ఎవరూ? డాక్టరా?'

'అవునే. ఆ అమ్మాయి పిలిపించింది.'

కాస్త ఆలోచించి 'ఎవరురా ఆ అమ్మాయి?' అందామె.

'నేను ట్యూషన్ చెప్తున్నా ననలా?'

ఆపైన ఎన్నో ప్రశ్నలు అడగాలనుకున్నట్లు కనిపించింది; కాని ఇది సమయం కాదని ఊరుకున్నట్లుగా మాట తప్పించి 'ఏమన్నాడు, డాక్టర్?' అంది.

'టైఫాయిడ్ కు దింపుతుందేమో నన్నాట్టు!'

ఆమెగుండె గుభేలుమన్నది. క్షణంలో మనిషి అగాధాల్లోకి పోతూన్నట్లు బాధపడింది. ఏడుస్తూ అంది: 'నాయనా! మన చెడురోజులకు అంతులేదనిపిస్తోంది. ఎవరో ఐశ్వర్యవంతులకు రావాల్సిన కష్టాలు మనకు వొస్తూన్నవి. ఎన్నాళ్ళిల్లా నడుములు విరగొట్టుకున్నా...' ఆ తర్వాత ఆమె మాట్లాడలేక పోయింది. ఇదంతా చెప్పి తల్లిమనస్సు చెడగొట్టినందుకు నొచ్చుకున్నాడు.

'ఏడవకే అమ్మా! అదే తగ్గుతుంది...నీవు దగ్గిరవుండు—అంతేచాలు.'

'నేను ఇక్కడే వుంటానురా తండ్రీ! నీకోసం తలపగలకొట్టుకుంటాను... రాజా! ఎంత ఏడ్చినా తరగని యీ దుఃఖం, ఎంత యీదినా ఒడ్డులేని యీ జీవిత సాగరం, నాలుగుమెట్లు పైకి పాకామనుకుంటే, మూడుమెట్లు జారిపడి, దురంత దుఃఖంతో, బాధతో, ఖిన్నవదనంతో పోగొట్టుకోగా మిగిలిన శక్తితో మళ్లీ పాకటం—ఎన్నాళ్ళిట్లా? ఏమిటో—యీ ప్రపంచమే మాయ అనుకొని సరిపెట్టుకోవాలనుకున్నా కుదరటంలేదు. చాకిరీతో అలసిపోవటం, లేమితో కుమిలిపోవటం నిజం! అది మాయకాదు. కాని మన సుఖం ఒక్కటే మాయ అంటే ఎలా నమ్మటం?... ఒక్కదాన్ని నేను నిన్నెలా ఇంతదూరం లాక్కొచ్చానో తలుచుకొని, వెనక్కు తిరిగి చూసుకుంటే, నిజంగా ఇంతదూరం రాగలిగానా అనిపిస్తూంటుంది...కాని యీనాడు నీవు ..'

'నేనేమన్నానే! ఎందుకు కలవరపడతావ్? . ఏదో నా ఆతృతలో, నిన్ను చూడలేదన్న ఆవేశంలో అన్నాను...నన్ను క్షమించవే! ఇప్పుడు మన జీవితాల్ని

గూర్చి చెప్పుకోవటం మొదలెడితే యీ శతాబ్దంలో అవుతుందా? వినా నీకు తెలియంది ఏముంది?'

'ఏమోరా—నాకేమీ పాలుపోవటం లేదు' అందామె, ఎలాగో దుఃఖాన్ని దిగమింగి.

'నీవు భోంచేశావా?'

'లేదు...నాకు ఆకలిలేదు'

'అదేమిటే అమ్మా? కాస్త భోంచేసిరద్దూ!' అని బతిమాలాడు తను.

'ఏం వొద్దు. యీ దుఃఖంతోనే కడుపునిండింది. ఇంతకన్న బలమైన ఆహారం మనకు లేదురా నాయనా!'

'పోనీ ఏదన్నా తినిరావే' అన్నాడు తను.

'ఏం వొద్దు...మందివ్వనా?' అందామె.

ఏలాగైనా తల్లి పస్తుపడుకోకుండా చేయాలనే ఉద్దేశంతో 'నాకు కాస్త కాఫీ తెచ్చి, నీ వేదన్నా తినిరావే!' అన్నాడు.

ఆమె మాట్లాడకుండా లేచింది. కాస్సేపట్లో రెండు కప్పుల కాఫీ చెంబులో పోయించుకొని వొచ్చింది. ఒక కప్పు గ్లాసులోపోసి తనచేత తాగించి, మిగతాది తను తాగింది. తను ఎంత చెప్పినా, ఆమె ఏమీ తినలేదని అర్థమైంది.

ఆ తరువాత మందు తాగాడు...కాని అది ఇమడలేదు. మందుతోపాటు, తాగిన కాఫీకూడా వెళ్లిపోయింది. యీ వాంతులన్నా బాగా ఐతే చాలా సుఖంగా వుండేది. వాంతి వొచ్చినట్లే ఉండటం, చివరకు రాకుండానే ఏడిపించటం జరుగుతోంది.

శరీరానికి విశ్రాంతి అవసరమనిపిస్తోంది. హాయిగా నిద్రపడితే చాలా తేలిగ్గా వుంటుందని తెలుసు. కాని బలవంతానకూడా నిద్రరాకుండా వుంది కదా!

తల్లి తన తలను వొళ్ళోపెట్టుకొని చిచ్చికొట్టింది. చిన్నతనపు తన ముద్దు మురిపాలన్నిటినీ జ్ఞాపకం చేస్తూన్న విధంగా ఆమె బెదిరించి, లాలించసాగింది. ఇలా చాలాసేపు గడిచాక, తనకు తెలియకుండానే నిద్రపట్టింది.

ఒక రాత్రివేళ బహుశా తెల్లవారుజాము కావొచ్చు-లేచిచూస్తే, అమ్మ కటిక నేలను, చెంగు పరుచుకొని ఎడంచెయ్యి ముడుచుకొని తలకింద పెట్టుకొని నిద్రపోతోంది. యీమె కష్టాలు, తన కష్టాల్ని మించి ఉండనట్లయితే జీవితం ఇంత దుర్భరంగా ఉండక పొయ్యేది. ఆమె తల కిందికి తలగడా ఇద్దామనుకున్నాడు కాని, ఆమెకు నిద్రాభంగమౌతుందని వూరుకున్నాడు.

మళ్ళీ నిద్రపోవాలని ప్రయత్నించాడు కాని కుదరలేదు. మెదడంతా కుత కుత లాడుతోంది. యీ సమస్యలన్నీ ఒక్కరోజులో పరిష్కరించ బడవని తెలుసు. సంవత్సరాల తరబడి వెంటాడుతూనే ఉన్నవి. మరికొన్ని సంవత్సరాల్లో ఒక పొద్దుపట్టవొచ్చు; కాని అలా జరక్కనూ పోవొచ్చు. జీవితమంతా రాళ్ళబాటగా గడిపిన వాళ్లల్లో తనూ, తన తల్లీ మొదటివాళ్లుకాదు...ఒక రకంగాచూస్తే యీ కష్టాలకు తను అలవాటయ్యాడేమో? సుఖాన్ని కోరకుండా, ఆశించకుండా వుండ టంలో 'డిసప్పాయింట్ మెంట్' ఉండదు. కాని ఇది సాధ్యమా?

అశాంతితోనే తెల్లారింది. తను కళ్ళు తెరిచేదాకా, తల్లి మాట్లాడకుండా తన వైపే చూస్తూండి ఉండాలి.

'ఎలావుంది?' అందామె.

ఎలావుందో చెప్పగలిగేమాటలు దొరకలేదు. ఇది శారీరకమూ, మానసికమూ ఐనబాధ! దాన్ని అనుభవించి తెలుసుకోవాల్సిందే కాని, చెప్పి తెలియపరచటం కుదరదు.

ఐనప్పటికీ ఆమెను తృప్తిపరిచేందుకు 'ఒక మాదిరిగా వుంది' అన్నాడు.

'తగ్గుతుందిలే ..మొహం కడుక్కొని కాస్త కాఫీతాగుతావా?' అంది.

మాట్లాడకుండా లేచేందుకు ప్రయత్నించాడు. కాని తన శక్తులేవీ వశంలో వున్నట్లులేవు. పర్వత ప్రమాణమేదో పైన పడినట్లుంది. రెండు రోజుల జ్వరానికే ఇంత నీరసించి పోతానని అనుకోలేదు.

బైటికి పోలేక, అక్కడే బొక్కెనలో మొహం కడుక్కున్నాడు. కాఫీ తాగాడు కాని, అది మందు చేదునుమించి వుంది. యీ పేద జీవితంలో 'చేదు' 'మధురం' అని తర్కించి, బాధపడటం ఏదో భ్రమగాక మరేమిటనిపించింది.

కాలం సాగుతోంది. యీ రోజున ఎండ చాలా తీవ్రంగా వుంది. గదిగోడల మధ్య గాలే లేనట్లు, ప్రాణవాయువు పీల్చేందుకు అందకుండా గుండెలమీద బండలు దొర్లుతూన్నట్లనిపించింది. అలా అని విసిరించుకున్నా సుఖంగాలేదు. విసరటంవల్ల వొచ్చిన గాలి బాహ్యంగా శరీరానికే కాని, లోని మంటలకు ఏమీ ఉపయోగించ లేదు; పై పెచ్చు ఆ మంటల్ని మరింతగా ప్రజ్వరిల్లేందుకు సహాయపడుతూన్న ట్లుంది.

ఎవ్వరూ మాట్లాడలేదు. మూగగా ఉభయులూ బాధపడుతూనే వున్నారు. మాట్లాడటమంటే కష్టజీవితాన్ని కెలుక్కోవటమే అవుతుందని ఉభయులకూ తెలుసు.

మధ్యాహ్నమయాక 'అమ్మా! నీవు భోంచెయ్యవే' అన్నాడు తను.

కాని ఆమె మొండికేసింది; తనకు ఆకలిలేదంది. చివరకు తను బతిమాలగా, బతిమాలగా ఆమె వెళ్లి ఏదో పలహారం చేసి వొచ్చింది. ఇన్నాళ్లూ ఎంతో

ధైర్యంగా జీవితాన్ని ఎదుర్కొన్న యీమెని, తన స్థితిచూసి దిగజారి పోతూన్నట్లు తోచింది. నిజంగానే తను ధన్యే! యీ తలపు రాగానే యీసారి తను అపాదమస్తకమూ వొణికి పొయ్యాడు; యీమె బతకగలదా? తనపాటికి తనకే భూలోక సమస్యలన్నీ తీరుతవి కాని, . తన సమస్యల్ని కూడా ఆమె మీదికి విసిరివేసినట్లే అవుతుంది...కాని మృత్యువనేది తన అధీనంలో లేదు. ఐనప్పటికీ తాను ఘోరంగా దానితో పోరాడాలి . తను ఎలాగైనా బతకాలి! బతుక్కుంటే తల్లి కన్నీటిని చూడలేదు; బతుకుతే ఆమె కన్నీటికి సానుభూతి చూపగలడు...బతికి తీరాలనే నిశ్చయం గడ్డకట్టి కొత్త ఆశల్ని స్థాపించింది.

బైట నీడలు బాగా సాగినవి; సూర్యుడు తీక్షణంగా లేడు. చివరిమాతాదు మందుకూడా పూర్తయింది.

'నాయనా! ఇవాళ వొస్తానని చెప్పి వొచ్చాను. నేను వెళ్ళి మరో వారం దాకా సెలవుపెట్టి వొస్తాను...వెళ్ళటం, రావటం...అంతే! ఒక్క క్షణంకూడా అక్కడ కూర్చోను.' అందామె.

ఇష్టం లేక పోయినా తలవూపాడు—ఇష్టం లేకుండానే ప్రపంచంలో బతికేందుకు ఏనాడో సిద్ధపడ్డాడు; ఇక మిగతా అయిష్టాలు ఒక లెక్కలోకి రావు.

ఆమె 'త్వరలోనే వొస్తాను' అని రెండు మూడుసార్లు చెప్పి తననా నాలుగు గోడలకూ అప్పగించి వెళ్ళిపోయింది.

మళ్ళీ తన ప్రవాహాల్లోకి దొర్లిపొయ్యే సమయంలోనే గోపయ్య వొచ్చాడు. లలిత ఏదని అడుగుదామనుకున్నాడు. కాని, అడిగే సాహసం లేదు. ఎవరేమనుకుంటారోనని ప్రపంచానికే వొదిగివున్నాడు. అలాటి తనకు పక్కదార్లే గతి కాని రాజమార్గాలు కాదు.

'ఎలా వుంది బాబూ?' అన్నాడు గోపయ్య.

కాస్త బాగానే వుందని చేతితో సైగ చేశాడు.

'తగ్గుతుంది లెండి...లలితమ్మగారు వుండగా మీకేం భయంలేదు' అన్నాడు గోపయ్య.

ఇదే సంగతి తన మనసులోనూ మెదుల్తోంది; దాన్ని గోపయ్య బైటపెట్టేడు. ఇదేదో తన కొక్కడికే తెలిసిన, సంబంధించిన రహస్యమనుకున్నాడు! గోపయ్యకూడా తెలిసిపోయింది! ఇంకెంత మందికి తెలిసిందో, ఎవరేమనుకుంటున్నారో ఎలా తెలుస్తుంది? తనను గూర్చి కాదు-లలితను గూర్చి!

యీ మృత్యుదేవితో పోరాడి గెలిచేందుకు ఇప్పుడు తనకెంతో ధైర్యం వొచ్చింది. వెనకటికి సావిత్రి ఒక్కతే యముని వెంటపడి, చచ్చిన తన భర్తను సజీవుణ్ని చేసుకోగలగటం నిజమైతే, ఇప్పుడు ఇద్దరు స్త్రీలు తన ప్రాణభిక్షకోసం

యమునితో పోట్లాడగలరు! గోపయ్య అన్నట్లు లలితలాంటిది తనకు అండగా వుండగా భయమేమిటి?

విశేషాలు అడిగి తెలుసుకుందామనుకున్నాడు కాని, ఎవరి సంగతెలావున్నా ముందుగా గోపయ్యదృష్టికే అనుమానాల్ని అందించినట్లవుతుందని, మెదలకుండా పడుకున్నాడు.

దాదాపు ఒకగంట నిశ్శబ్దంలోనే గడిచిపోయింది. తరువాత బరువైన పాదాల చప్పుడు విని, కళ్ళు తెరిచాడు. ముందు డాక్టరూ, ఆ వెనుక లలితా ప్రవేశించారు.

యథాప్రకారం డాక్టర్ పరీక్షచేశాడు; అతని ముఖకళనుబట్టి తనస్థితి అంత తృప్తికరంగా వున్నట్లు తోచలేదు. డాక్టర్‌తోపాటు లలితకూడా బైటికెళ్ళి ఏమేమో మాట్లాడి వొచ్చింది.

'గోపయ్యా! నువ్వెళ్ళి మందు తీసుకురా' అనగానే గోపయ్య వెళ్ళాడు.

డాక్టర్ ఏమన్నాడోనని భయంవేసింది తనకు. కీడును శంకించే మనసుతో అడగలేక పోయ్యాడు.

లలితముఖంలోకూడా ఉత్సాహం కనిపించలేదు. చెడువార్తను విన్నప్పుడు కలిగే వికారంనుంచి, ఆమె మెల్లిగా తెంచుకొని బైటపడేందుకు ప్రయత్నిస్తూనట్లు తోచింది.

ఐదారు నిమిషాలు గడిచాక ఆమె అంది, 'మీ కిక్కడ ఏమంత సుఖంగా ఉండదు. డాక్టర్‌గారి నర్సింగ్‌హోంకు మారకూడదా?'

యీ మాటల్నిబట్టి తన స్థితి కాస్త దిగజారిందని తేలిగ్గా గ్రహించాడు. కాని ఎదురుకుండా యీ లలిత వున్నంతసేపూ తనకెంతో హాయిగా, యీ ప్రపంచం నివశించ దగ్గదిగానే వుంటుంది. ఆమె ఏం చెప్పినా శిరసావహించటంలోనే ఆనందం వుందనిపిస్తుంది హితులని తెలిశాక, వారి మాటలకు లోబడటం అబ్బురంకాదు .. కాని ఆసుపత్రికి మారే విషయంలో తల్లితోకూడా చెప్పాలి.

తన ఆలోచన తెగకముందే 'అక్కడ మీకు సకల సేవలూ చేసేందుకు మనుషులుంటారు; డాక్టర్ జాగర్తగా చూస్తాడు. నేనూ వొచ్చి చూసి పోతూంటానుగా!' అందామె.

పేలవంగా నవ్వాడు తను. 'అమ్మను అడిగి—' అన్నాడు.

'అన్నట్లు అమ్మగారు ఏరీ?'

'మైలాపూర్ వెళ్ళారు-ఇప్పుడే వొస్తారు'

ఆమె మరేమీ అడగలేదు. ఆమె మనసులో తిరిగే విషయాలు ఏమిటో గ్రహిద్దామని తను నానా అవస్థపడ్డాడు. ఒకటి మాత్రం నిశ్చయంగా నమ్మవొచ్చు: ఆమె తననుగూర్చి ఆలోచిస్తోంది. తనంటే ఎంత అభిమానం! మొదట్లో తను విపరీ

తార్థాలు తీశాడు కాని, లోతులకు వెళ్ళేకొద్దీ, యీమె హృదయ సౌందర్యాన్ని, దయాపూరితమైన ప్రవర్తనను గ్రహించగలిగాడు...నిజంగానే తనను ప్రేమిస్తోం దనేది నిర్వివాదం...కాని ఆ ప్రేమకు ఇంకా ఒక నిశ్చితరూపం ఏర్పడలేదు; దాని రంగు, ఆకారం, ప్రవృత్తి ఎలాటిదో ఇంకా తెలియదు...కాని, త్వరలోనే విశిష్ట రూపాన్ని పొందుతుంది...ఐనా ఏమిటి తనకీ పిచ్చి ఆలోచనలు? ఏది ఏమైనా, తానిప్పుడు దిగబడిన యీ ఊబిలోనుంచి, జీవన్మరణ సమస్యగా పరిణమిస్తుందేమో నన్న యీ స్థితి నుంచి ముందుగా బైటపడాలి కదా!

ఆలోచనలు తెగకపూర్వమే అమ్మవొచ్చింది. ఆమెను చూడగానే లలిత నమస్కరించింది. అమ్మముఖంలో ఇదివరకు తానెన్నడూ గమనించని ఆనందం, సంతృప్తి, తనకు జరిగిన యీ గౌరవానికి తన్మయత మొదలైనవెన్నో కనిపించినవి. ఆమె ప్రతి నమస్కారం చేయగలిగింది - కొంచెం ఆలస్యంగానే.

లలిత అంతా చెప్పింది.

'మీ ఇష్టంవొచ్చినట్లు చెయ్యండి. మీకు బాగా తెలుసు. నేను ఆలోచించగల స్థితిలోకూడా లేనుకదా!' అంది అమ్మ.

'రేపు ఉదయమే జేరుద్దాం...గోపయ్య మందు తెస్తాడు. జాగర్తగా తాగిం చండి...ఇక నేను వొస్తాను!' అని లలిత వెళ్ళేందుకు లేచింది. ఆమె ఇంకాస్సేపు వుండి, తామిద్దరికీ ధైర్యంగా వుండేమాటలు చెపితే బాగుండు ననిపించింది తనకు. కాని, అడగలేని దుర్బలత, ఇద్దరు స్త్రీల మధ్య తననుగూర్చి జరిగే సంఘర్షణ, సున్నిత మైన అనేక విషయాల్ని సున్నితంగానే పోనివ్వవలసిన అవసరం మొదలైన వాటివల్ల తానామెను వారించలేదు.

లలిత వెళ్లిపోయింది. ఇదివరకు తల్లిమొహంలో కనిపించని మొండిధైర్యం తానిప్పుడు స్పష్టంగా చూడ గలుగుతున్నాడు.

'ఏం భయంలేదురా రాజా! యీమె...లలిత మనపాలిట దేవతలాగు వొచ్చింది. యీ అమ్మాయిని చూస్తుంటే, దేవతలుకూడా మనమధ్య వుంటూంటా రనిపిస్తోంది. యీమె...' అని ఆగింది. ఆ మాటలేవో వినాలని తనకు వున్నప్పటికీ, ఆమెను అడగలేక వూరుకున్నాడు. ఆమె విడిచిన కొనలో లలితను తలుచుకొని, తానే ఆలోచించుకో సాగాడు.

## 18

లలిత చెప్పినట్లు నర్సింగ్ హోంలో చాలా హాయిగానే వుంది. ప్రత్యేకించబడిన గదిలో వెలుతురూ గాలీ వుండటమే గాకుండా, చాలా శుభ్రంగానూ, ఘాటైన డెట్టాల్ వాసన, తగినంత ప్రశాంతతా వున్నవి. వ్యాధి సంగతి ఎలావున్నా యీ వాతావరణమే సగం రోగాన్ని కుదుర్చగల మోననిపిస్తోంది. ఇందుకు తగినట్లు రెండు పూటలా డాక్టర్ చూస్తున్నాడు; నర్సు గంట గంటకూ టెంపరేచర్ తీసు

తుంటోంది. లలితకూడా రెండు పూటలావొస్తూ, దయతో ధైర్యంగా వుండమని తియ్యని మాటలు చెపుతోంది.

అమ్మకు లలితంటే ఎంత గొప్ప అభిప్రాయం ఏర్పడిందో-ఆమె లేనప్పుడు మాట్లాడే మాటల్నిబట్టే తెలుసుకోవొచ్చు. అన్నీ వినటమే కాని, తన అభిప్రాయాన్ని బైటపెట్టకుండా జాగర్త పడ్డాడు. ఎందుకంటే, అమ్మ అనుకున్నట్లుగా లలితకు తనమీద అభిమానం వుంటే వుండొచ్చు; వ్యధిత మానవునికి ఆమె దయ చూపుతే చూపొచ్చు; కాని తనను ప్రేమిస్తోందనే సంగతి తనకే ఇంకా నిర్ధారణగా తేలలేదు. అందుకని తల్లి మాటల్ని అంగీకరించకుండానూ, ఖండించకుండానూ తటస్థంగా వూరుకుంటున్నాడు; ఆమెకు కలిగే సదభిప్రాయాలకు తనకు సంతోషంగా వుంది.

మొదటి వారంలోనే తాను చాలా నీరసించి పోయినట్లు తనకే తెలుస్తోంది. కాలం చాలా బరువుగా సాగుతోందనిపిస్తోంది. టెంపరేచర్ దిగకపోను, సాయంత్రానికి ఎక్కువవుతోంది. ఉండి ఉండి ఏదో పిచ్చివాగుడు వాగుతూన్నట్లు కూడా అనుమానం. అర్థం లేకుండా మాట్లాడుతూన్నట్లు తెలుసు; కాని మాట్లాడకుండా కంట్రోల్ చేసుకోగల శక్తిలేదు. తనలా మాట్లాడుతుంటే తల్లి నిర్ఘాంత పోవటం కూడా తెలుసు. కాని తన చేతుల్లో ఏమీలేనంత బలహీనత, ఏదో అదృశ్య శక్తికి లొంగి పోయిన ధోరణి వుంది...ఇలా అలసిపోయి, కాస్త నిద్రపట్టాక, అంతా మరిచి పోయినట్లే వుండేది. తల్లి అడుగుతే, ఆ జరిగిపోయిన దృశ్యం సంగతి ఏమీ చెప్పలేక పొయ్యేవాడు.

రెండో వారంలోకూడా తగ్గుదలేమీ కనిపించలేదు. ఒకటే తపన, ఆవేదన. మైళ్ళ తరబడి పరుగెత్తుతూ, కాస్త గాలి పీల్చుకునే సావకాశంకూడా లేక, రొప్పుతూన్నంత బాధ. మెదడు ఘుక ఘుక మని కాగిపోతూన్నట్లుంటుంది; శరీరంలోని రక్తమంతా యీ వేడికి ఆవిరై పోయినంత వ్యథ. సగం తెలిసీ, సగం తెలియక పోవటం...దుర్లక్షణాలు ప్రవేశించినవనే దిగజారుడు, తనింక బతకనేమోననే పిరికితనం వేధిస్తూన్నవి.

మూడో వారంలో తను చావుబతుకుల మధ్య కొట్టుమిట్లాడ సాగాడు. చాలా సేపు తెలివి తప్పి ఉండటం, తెలివొచ్చాక పిచ్చి వాగుడులో, మనిషిని పిండేసే బాధతో, గాడి పొయ్యిలో వున్నట్లుగా అటూ ఇటూ పొర్లటం...పెంకులు ఎగిరేట్లుగా కేకలు వేయటం, మొదలైన పిచ్చి కళలు వేసేవాడు.

ఒకనాడు దీపాలు పెట్టే వేళ తన చుట్టూవున్న జనాన్ని చూసి తను మృత్యుముఖంలో వున్నానని తెలుసుకున్నాడు. ఎదురుగా తల్లి భోరున ఏడుస్తోంది; ఆమె వెనుక లలిత పమిట చెంగు ముఖానికి అడ్డం పెట్టుకొని వుంది. బహుశా ఆమెకూడా ఏడుస్తూనే, తన ఏడుపు ఎవరికీ తెలియకూడదని వ్యర్థప్రయత్నం చేస్తూన్నట్లుంది!

ఈ దృశ్యాన్ని గూర్చి ఎవ్వరూ తనకు చెప్పవలసిన పనిలేదు. ఒక్కసారి కళ్లు తెరిచిచూచి, కళ్ళు మూసుకున్నాడు. తన స్థితిచూసి లలితా, తల్లీ ఎంత దుఃఖిస్తున్నారో, తనుకూడా అంతదుఃఖిస్తూనే వున్నాడు. యీ ప్రపంచ బంధనాలనుంచి శాశ్వతంగా తెంచుకొని పోబోతూన్న తనకు యీ తర్కాలు, అనురాగాలు, సమస్యలు, సానుభూతులతో పనిలేదు; కాని అక్కర్లేదని విదిలించుకున్నా అవేవీ తనను వొదిలేట్లు లేవు.

యీ బాధలు పడటంకన్న, చస్తేనే మంచిదిగా తోచింది. తన సమస్యలన్నిటినీ పరిష్కరించేందుకు విధి యీ దారి చూపుతోందేమో?...అంతా చాలా విచిత్రంగా, ఏదో లోకాల్లోకి తుంగిపోతూన్నట్లు, సముద్రపు టలలమీద తేలిపొయ్యే బెండువలె, పెనుగాలిలో కొట్టుకొనిపొయ్యే ఆకువలె వూగిపోతున్నాడు; ఒక నిర్ణీత స్థలంలేదు; దిక్కులేదు - ఎటో, ఎక్కడికో, ఏమో?

—ఆ తరువాత మళ్ళీ తెలివివొచ్చినప్పుడుచూస్తే డిమ్మర్ వేసివుంది...కిటికీ పైరెక్కల్లోంచి చల్లిగాలి మెల్లిగా వీస్తోంది. టేబిల్ మీది బిగ్ బెన్ 3 గంటలకూ పదినిమిషాలు వుందని చెపుతోంది...అగో, ఎదురుగా తల్లీ, లలితా ఆతృతతోవున్నారు... తనింకా చావలేదని నిశ్చయించుకున్నాడు; నిజంగానే తను బతుకుతాడు! ఎందుకు బతకడు? జీవితమంటే కలిగిన ఏవగింపంతా, తిరిగి జీవితంవైపుకే తనను తిప్పుతూన్నది. కొత్త ఆశలు, బుర్రఊహించ గలిగినవే చాలు ధైర్యాన్నిచ్చేందుకు!

తల్లి పెద్దగాఏడ్చే ఓపికలేక, నీరసంగా వెక్కి వెక్కి ఏడుస్తోంది. లలిత కళ్లు ఎర్రబడి, వాచిఉన్నవి. ఆమె ముఖంలోని విషాదాన్ని తను జన్మలో మరిచిపోలేడు. ఆ విషాదాన్నిచూసే మృత్యువుకూడా భయపడి ఆ ప్రాంతాల్లో లేకుండా పరుగెత్తిందేమో?

తను కళ్ళు తెరవగానే ఇద్దరూ వొచ్చి తనను కదిపారు. ఏమేమో మాట్లాడారు. తనకేమీ అర్థం కాలేదు. అందుకు ప్రయత్నించనూ లేదు. తిరిగి మాట్లాడగలిగే శక్తిలేదు. మెదలకుండా వూరుకున్నాడు...మళ్ళీ మగతలో పడ్డాడు.

ఆ తరువాత ఎన్ని రోజులు గడిచినవో తనకు తెలియదు. మెలకువ వచ్చినప్పుడల్లా ఇది తన మృత్యుశయ్యేనని నిశ్చయంగా చెప్పే దృశ్యం ఎదురుగుండా కనిపిస్తోంది. నిజమైన మృత్యువుకన్న, యీ ప్రస్థావన దృశ్యమే భయంకరంగా తోస్తోంది. దీన్నుంచి తప్పించుకుందామని కొంతా, అశక్తత కొంతా ఆవరించి తనకు తెలివి తప్పేట్లు చేస్తున్నవి.

తెలివి వొచ్చాక, బాగా నిలివ తొక్కుకోగలిగాక జరిగిందంతా తనకు గుర్తే! తనకిక మృత్యుభయం లేదనే సంగతి గ్రహించాక శరీరంలోకి కొత్త శక్తి వొచ్చింది. సాధారణ మానవుడు పొందే అనుభూతులన్నీ క్రమంగా ఆవరించసాగినవి. టెంపరేచర్ నార్మల్ కు దిగిన దగ్గిర్నుంచీ ఒకటే ఆకలి; నోరు చవిచచ్చి

ఉండటంవల్ల కాఫీలూ, పళ్ళూ అంటే ఏవగింపుగా వుంది... మిరపకాయలున్నవైతే బాగుండుననిపించింది. పత్యం పెట్టించమని వేధించ సాగాడు. యీ ఆకలికి చస్తానేమోననే కొత్త భయంకూడా కలిగింది.

నాలుగో వారంలో పత్యం పెట్టాక, ఇక వొడ్డునపడ్డట్లేనని ధైర్యం కలిగింది. తర్జన భర్జనల తర్వాత ఆ వారంకూడా నర్సింగ్ హోంలోనే ఉండటానికి నిశ్చయించబడింది. రోజులు గడుస్తేనే కాని జ్వరం విడిచి వెళ్ళిన విషం విరగదు; కోల్పోయిన శక్తి పుంజుకోలేదు. కొన్నాళ్ళపాటు యీ బాధ పడక తప్పదు. మొత్తంమీద ప్రాణగండం గడిచింది.

తనుచేసిన సహాయమంతా ఫలించినందుకు లలిత చాలా సంతోషించింది. కేవలం తన కన్నీటితోనే యముణ్ని బెదరగొట్టి గెలిచినంత గర్వంగా ఆమె మాటల ధోరణి వుండేది. అదంతా నిజమేనని కళ్ళారాచూసిన తను నమ్మకుండా ఎలా ఉండగలడు? దీనికితోడు తల్లి సాక్ష్యంకూడా బలంగా వుందాయె! లలితలాంటి దేవ సంభూతులు యీ ప్రపంచంలో చాలా కొద్దిమంది వుంటారు; వారు ఎక్కడ వున్నారో, మనకు ఎప్పుడు ఎదురవుతారో, అసలు జీవితంలో కలుసుకోవటం పడుతుందో పడదో తెలియదు. అలాంటిది తనకు ఆ దేవత దర్శన మివ్వటమే కాదు - తనకు తోడునీడగా వుంది. అదృష్టం అనేకరూపాల్లో వుంటుందనేది నిజమైతే, అది లలితరూపంలో తనకు కనిపించిందనేది, తన దగ్గరకు వొచ్చిందనేది నిజం!

సాయంత్రం లలితవొచ్చి ఒక గంటసేపుండి వెళ్తుంది. ప్రతి సాయంత్రమూ, తను ఆమెరాకకోసం ఎదురుచూస్తుంటాడు; ఒకవేళ రాదేమోనని దిగులు; చివరకు ఆమె వొచ్చాక తనుకూడా ప్రయోజకుడైనట్లు, ఆధారపడదగిన వేరొక వ్యక్తి తనకీలోకంలో వున్నట్లనిపించి, జీవిత మాధుర్యం తాలూకు వాసనలు తగిలేవి.

మొదట్లో లలితంటే ద్వేషించేవాడు. ప్రపంచంలోని ప్రతివ్యక్తీ తనలాంటి బీదవాళ్ళపట్ల కఠినంగా వుంటారనీ, కనుక తనే వారికి దూరంగా వుండాలనీ భావించేవాడు. విశేషించి లలితలాంటి ధనికురాలంటే మరీభయం; సమయం దొరుకుతే, తన జీవితంతోనే చెలగాటాలాడి తనబాధకు ఆనందించగల స్వభావమని పొరబడ్డాడు. ఆమెలో మూర్తీభవించే స్త్రీత్వ సౌందర్యం, తేలిగ్గా ఆకర్షించి మతి పోయేట్లు చేస్తుందనే సంగతి మొదట్లోనే అనుభవపూర్వకంగా తను తెలుసుకున్నాడు; అందుకనే దీపాన్నిచూసి మోసపోయే శలభం కాకుండా, తనకు తాను హెచ్చరికలు చెప్పుకుంటూ దూరదూరంగా ఉన్నాడు. తెలిసివుండీ అనవసరపు ప్రమాదాల్ని కొనితెచ్చుకోగల సమర్థుడు కాదు తాను!

—కాని, లలితే నడక సాగించింది; తను వెనకడుగులు వేస్తున్నప్పటికీ, ఆమె అంతకు రెట్టింపు వేగంతో తనను కలుసుకుంది. తనకు మరి దారిలేక లొంగిపోయ్యాడు. ఆమె స్నేహాన్ని స్వీకరించక తప్పలేదు. ఇక్కడకూడా ఎంతో జాగ్రత్తగా వొళ్లు దగ్గిరుంచుకొనే ప్రవర్తిస్తున్నాడు. ఏ విషయంలోనూ తనామెతో

పోల్చుకోలేదు; ఆ భేదాన్ని స్పష్టంగా అడుగడుగునా జ్ఞాపకం చేసుకుంటూనే వున్నాడు. ఆమె బాహ్య సౌందర్యంతో ముగ్ధుడైనప్పటికీ, క్రమంగా ఆమె అంతర సౌందర్యాన్ని చూడగలిగాక, మేడిపండు కాదనే సత్యం బైటపడింది. లలితపట్ల తనకు కలిగిన పూర్వపు అభిప్రాయాలు చాలా వరకు మారినవి; యీనాడు ఆమె అంటే ఎంతో గౌరవం, ప్రాణదానం చేసిన కృతజ్ఞత, ఉన్నతాశయాలుండి, వాటిని ఆచరణలో పెట్టగలిగిన వ్యక్తిపట్ల ఉండవలసిన నిజమైన విలువ మొదలైనవి స్థిరపడినవి. ఆమె దగ్గరకు రావటమంటే పూర్వంవున్న భయంపోయి, దగ్గరవుతూన్న కొద్దీ జీవితంమీద ఆసక్తి కలిగి, పూర్వపు ద్వేషం విరగసాగింది. తను జీవితంతో ఎంత ఘోరంగా పోట్లాడుతే మాత్రమేం, ఫలితంగా లలితలాటి దేవకన్య స్నేహం చిక్కిందనే తృప్తి కలిగింది.

తను కాస్త కోలుకున్నాక, లలిత తోడి స్నేహానికి తల్లి తనను మందలిస్తుం దనుకున్నాడు. ఎందుకంటే పూర్ణంగా తల్లికి అంకితమైన హృదయం, భిన్నమై కొంత భాగం లలితకు చెందటాన్ని తల్లి భరించగలుగుతుందనుకోలేదు. ఒక రకం ఈర్ష్య ఆమెలో ప్రవేశించి, ధనిక వర్గాల వారికి దూరంగా ఉండి తీరవలసిన తన బాధ్యతను గుర్తు చేస్తుందనుకున్నాడు.

కాని, అలాటి దేమీ జరగలేదు. యీ స్నేహానికి తల్లి సమ్మతించింది; సంతో షించింది కూడాను. ఆమె హృదయంలో ఏమనుకుంటోందో తను స్పష్టంగా విన గలుగుతూన్నాడు.. లలితలాటి కోడల్ని ఆమె మనఃపూర్వకంగా కోరుతోంది. కాని యీ తలపు రాగానే తను అపాదమస్తకమూ వొణికి పోతున్నాడు. రూపొందిన యీ స్నేహం పెరిగి, సక్రమమైనట్లయితే లలిత శాశ్వతంగా తనది కాక పోవటంలో అర్థమేలేదు. మరో విధంగా అది రూపొందినా తనకు గొప్ప 'డిసప్పాయింట్ మెంట్' తప్పదు. కాని తల్లి అనుకున్నట్లూ, ఒకొకప్పుడు తను వూహిస్తూన్నట్లూ జరుగుతుందనుకోవటంలో ఆనందం ఉండొచ్చు. కాని అలా జరుగుతుందనుకోవ టాన్ని మరో విధంగా మాస్తే, ఎంత మాఢ్యంలో పడిపోతున్నాడో చూడగలుగు తున్నాడు. నడిసముద్రంలో తేలేందుకు దొరికిన బెండును పట్టుకున్నంత మాత్రాన, తను వొడ్డుకు జేరినట్లే భావించటం అసందర్భంగా తోస్తుంది; కాని ఆ ఆశే లేనట్ల యితే, ఆ బెండును పట్టుకొని వేళ్ళాడవలసిన పనేలేదు. తన పరిస్థితికూడా సరిగ్గా అలాగే తయారైంది.

ఏమైనా లలిత స్నేహాన్ని ప్రణయంగానే తీసుకునే పొరపాటు పడకూడ దనేనిశ్చయం కలిగింది; ఇది అసంభవమని కాదు; ముందుగానే ఆకాశపుటెత్తులో ఆలోచనల్ని పెంచుకుంటే, తీరా దిగేందుకు కష్టమౌతుంది. ముందుముందు అది నిజమైన ప్రణయస్వరూపమే దాల్చినట్లయితే, అది వేరుసంగతి. నిరాశకు తావు లేదు గనుక, గట్టినేలను ఆధారంగానే తన ఆశపెరిగి, పెంపొంది, ఫలిస్తుంది. ఆ

భవిష్యత్ అంధకారంలో వుంది కనుక, దాన్ని సమీపించేవరకూ ఓపిగ్గా, పిచ్చి పిచ్చి ఆలోచనలకు దూరంగా వుండటమే ఉత్తమ మార్గం.

జీవితంలో ఒక రాజీ కుదిరినట్లయింది. తల్లి లలితను ద్వేషించకుండటం, యీ మాయదారి జ్వరంలో లలిత సకలసేవలూ చేయటం, మానసికంగా వుండే అశాంతి పోయి, ప్రశాంతంగా వుండటం మొదలైనవి చూస్తే పూర్వంవలె జీవితాన్ని ఆగర్భశత్రువువలె పోరాడ నక్కర్లేదు; స్నేహంతోనే కలిసి పయనించవొచ్చనే భావం కలిగింది. ఇదీ ఒకందుకు మంచిదే! తను అలసిపోయి, ఓటమికి సిద్ధంగావున్న సమయంలో యీ రాజీ తన మేలుకే జరిగింది.

లలితనుగూర్చి విశేషంగా ఆలోచించి, ఇసుక నేలమీద గాలిమేడలు కట్టలేక పోయినందుకు ఒక ముఖ్యకారణంవుంది; తన తల్లి! తన జీవితపు గమ్యస్థానం తల్లిని సుఖపెట్టటమేననే నిశ్చయం, యీ లలితవల్ల చలించలేదు. అలా జరిగినట్లయితే తన సౌఖ్యానికే పాకులాడి, తల్లికి తప్పకుండా అన్యాయం జరిగేది. ఆ ప్రమాదం ఎన్నటికీరాదు. మరీ అమ్మ నెలరోజులకు పైగా ఆతృతతో, కన్నీటితో, కుంగి కృశించిపోయిన ఆరోగ్యంతో కళ్ళెదుట వుండటంతో మనస్సు వికలమైపోయింది. యీ తల్లివల్లనే తనకీజన్మ ప్రాప్తించింది; యీనాడు ఆమె తనను మృత్యుముఖంనుంచి మరల్చి, పునర్జన్మ ఇవ్వగలిగింది. యీ రెండు జన్మల కారణంగా, ఆమెపట్ల తన బాధ్యత రెండింతలైంది. ముందు యీమెను సుఖపెట్టే ఆలోచనే బుర్రలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించుకుంది; తను సరైన మార్గంలోనే వున్నందుకు తనను తాను అభినందించుకున్నాడు కూడాను.

తను విశ్రాంతి తీసుకుంటున్న యీ వారంలో లలిత ధోరణిలో చాలా మార్పు కనిపించింది. తనకు జీవితేచ్ఛ కలిగించేందుకు ఆమె శతవిధాల ప్రయత్నిస్తోంది. ఉత్తరోత్రా గొప్ప రచయిత అవగలడనే అభిప్రాయాన్ని వెలిబుచ్చింది.

'జీవితంమీద కసికొద్దీ, జీవితాన్నే ద్వేషించటంలో అర్థంలేదు. దాన్ని సరిదిద్దుకునేందుకు ప్రయత్నించాలి. చెడురోజులనేవి అందరికీ ఎప్పుడో అప్పుడొస్తవి. మంచిరోజులకోసం ఓర్పు వహించాలి' అంటుందామె.

ఇలాటి సంభాషణలు తనకు కొత్తకాదు; తన కథల్లో కొన్ని పాత్రలచేత ఇలాటి మాటలే పలికించాడు. కాని అప్పుడవి, పాత్ర నడిచేందుకు ఉపయోగిపడినట్లుగానే ఉన్నవి. కాని తన జీవితానికి అన్వయించుకోలేదు. ఇప్పుడు లలిత నోటివెంట వెలువడే ఆ మాటలకే ఎంతో విలువవొచ్చింది. తనకు తెలిసివుండీ, ఏమరుపాటున మరిచిపోయిన నగ్నసత్యాల్ని ఆమె తనకోసం వెతికి సమయానికి అందించినట్లనిపించింది. ఆ మాటల సారాంశాన్ని ఎన్నడూ తాను ఎదుర్కోలేదు; ఒప్పుకొని ఆచరణలో పెట్టకుండేందుకు తనేం మూర్ఖుడుకాదు.

—కాని జీవితమంటే తనకూ ఒక విశిష్టాభిప్రాయం వుంది; అంటే ఒకో వ్యక్తి తను జీవితంలో సాధించగలిగేది ఏమిటో ఒక నిర్ణయానికి వొచ్చి, దానికోసమే పాటుపడుతూంటాడు. కొంతమంది వ్యక్తులపట్ల ఇది నిజం కాకపోవొచ్చు. చుక్కానిలేని పడవల్లే, ఒడ్డులేని మహా సాగరంలో ఎటుపడితే అటు పయనించేందుకు వారు ఒప్పుకుంటారు...కాని తను అంతతేలిగ్గా జీవితాన్ని వొడ్డి జూదమాడలేడు. ఎంత చిన్నదైనా సరే, ప్రపంచానికి ఎంత అల్పంగా కనిపించినా సరే, తనకూ వొక గమ్యస్థానం, ఒక బాధ్యతంటూ ఏడిసింది. ఇన్నాళ్ళూ ఇనేకసార్లు తాను మనస్సాక్షితో ఆ బాధ్యతను చెప్పుకుంటూనే వున్నాడు; తనకు తప్ప ఆ విషయం ప్రపంచంలో వేరెవ్వరికీ తెలియదు. తెలియవలసిన అవసరం మాత్రం ఏముంది? ఇక యీనాడు ఆ రహస్యాన్ని లలితదగ్గిర బైట పెట్టాలనిపించింది. ఎందుకంటే నిజంగా తనను అర్థంచేసుకోగల వ్యక్తంటూ ఎవరైనా వుంటే తన తల్లి తరువాత యీ లలితే!

'—కాని నా జీవితానికి ఒక్కటే అర్థం—నా తల్లిని సుఖపెట్టిననాడు నేను జీవితాన్ని గెలుచుకున్నంతగా సంతోషిస్తాను లలితా! ఇంతకుమించి నేనేమీ కోరను' అన్నాడు. యీ మాటలు చెప్తూన్నప్పుడు కళ్ళల్లో నీళ్లూరినవి. చాలా కష్టంమీద వాటిని కనుకొలకుల్లోనే ఉంచగలిగాడు.

లలిత ఏమీ అనలేదు; బహుశా తనకు కలిగిన అనుభూతిలాటిదే ఆమెలో కూడా కలిగి, దానికి తట్టుకుంటూండి ఉండొచ్చనుకున్నాడు. అలాగే బరువైన ఆలోచనా భారంతో తలవొంచుకు కూర్చుందామె.

ఆమె అభిప్రాయం అడగాలనిపించలేదు తనకు; ఆ అభిప్రాయంతో తనకు పనిలేదు. తను చెప్పదల్చుకున్నదేమిటో చెప్పగలిగాననే నమ్మకం కలిగింది కనుక, తనూ మెదలకుండా ఊరుకున్నాడు.

కొద్ది క్షణాలు పైన తిరిగే ఫాన్ మోత మినహాగా వేరే శబ్దమూ లేకుండానే గడిచినవి. లలిత మెల్లిగా తలపైకెత్తింది; ఆమెలో కలిగిన భావసంచలనం ఏమిటనే ఆత్రుత వేధిస్తూండటంవల్ల, తను దీక్షగా ఆమె వైపే చూస్తున్నాడు. ఈ సంగతి ముందుగా ఆమెకు తెలిసినట్లయితే తన ఉద్వేగాన్ని దాచుకునేందుకు ప్రయత్నించేదేమో? ఆమె ముఖం చూస్తేనే ఆమె చెప్పదల్చుకున్నదేమిటో ఇట్టే అర్థమయేట్లుంది. రెండు కళ్ళ నుంచి రాలేందుకు సిద్ధంగావున్న అశ్రుబిందువుల్తో ముఖమంతా వివర్ణమైంది. తను అనుకున్న దానికన్న ఎన్నో రెట్ల సానుభూతి లలితదగ్గర తనకు లభించింది. ఒకరొకరిని చూసుకుంటూనే కొద్ది సేపు గడిపారు. వారు మాట్లాడుకోలేక పోయినా, రోజులతరబడి చర్చించవలసిన విషయం మూగగానే తమ కళ్ళ ముందు నడిచి, ఉభయులకూ అర్థమైనట్లే తోచింది.

చివరకు లలితే గాద్గదికంగా అంది; 'మాష్టారూ! మీ ఆశయం అత్యున్నతమైనది. దాన్ని గూర్చి మెచ్చుకునేందుకూ, చర్చించేందుకూ నా భాషా పరిజ్ఞానం

చాలదు... నాకు తల్లిలేదు. చిన్నప్పుడే చనిపోయింది. నాకూ తల్లి వుంటే ఎలావుండేదోనని ఆలోచిస్తూనే ఇంత బాధా పడ్డాను. ఇది వరకెన్నడూ అమ్మలేని లోటును గూర్చి ఇంత తీవ్రంగా ఆలోచించలేదు. కాని యీనాడు-'

'నిన్ను గాయపరిచాను లలితా!' అన్నాడు తను సానుభూతిగా.

'కాదు. నేనలా అనుకోవటంలేదు. నాకు అర్థంకాని ఒకానొక అనుభూతికి భావంతో విశిష్టరూపాన్ని ఇచ్చి తేలిగ్గా అర్థమయేట్లు చేశారనుకుంటున్నాను. ఒక వ్యక్తికోసం బతకటం ఎంత మధురం! ఆ వ్యక్తికోసం సర్వస్వాన్నీ త్యాగం చేయటం ఎంత గొప్ప ఆశయం! ఆ వ్యక్తి వేరెవ్వరో కాకుండా, కన్నతల్లే అవటంకన్న గొప్పవిషయం వేరొకటి ఉండేందుకు వీల్లేదనిపిస్తోంది నాకు' అందాను.

'లలితా! ఇది నా కనీస కర్తవ్యం. నేనేదో తల్లికోసం త్యాగం చేస్తున్నాననీ, నా సర్వస్వాన్నీ అర్పిస్తున్నాననీ ఎన్నడూ అనుకోలేను. ఆమె నాకు చేసిన త్యాగంతో పోలుస్తే, నేను జీవితమంతా చెయ్యగలిగింది ఒక భాగమే అవగలదు. ఐతే ఆమె నాకుచేసిన దాన్ని చెల్లు వేసేందుకూ కూడా నేనేమీ చేయలేక పోతున్నాను... చూస్తున్నావుగా!'

తన అసమర్థతంతా బైటపడేట్లుగా దీనంగా చూశాడు. ఆమె చాలా తీవ్రంగా ఆలోచిస్తోంది. యీ సంభాషణను పొడిగించటంవల్ల ఉభయులూ గాయపడతారనే సంగతి గ్రహించి ఉండాలి.

ఆ తరువాత సంభాషణ వేరు విషయాలమీదికి మళ్ళింది. కాలేజీలో యీ నెలరోజులూ జరిగిన విశేషాలు, ఎవరెవరు ఏమంటున్నారో, తననుకూడా సూటీ పోటీ మాటల్లో ఎలా పొడవాలని చూస్తున్నారో అంతా చెప్పిందామె.

ఇన్నాళ్ళూ తనమీద కత్తికట్టిన సమాజం, ఇప్పుడు లలితపట్లకూడా శత్రుత్వాన్ని ప్రదర్శిస్తూన్నందుకు మనసుకు కష్టం కలిగింది. కాని తను చేయగలిగిందేమిటి?

ఆమె చెపుతూన్నంతసేపూ తను ఆలోచిస్తూనే వున్నాడు. తను దీనుడు కనుక సమాజం ఏమన్నా భరించక తప్పదు; కాని లలితలాంటి భాగ్యవంతుల పడుచు, తనతో స్నేహం చేసిన కారణంగానే అనేక నిందలకు గురవుతోంది. దీనికంతా తనదే! లలిత తనకు చేసిన ఉపకారానికి, పొందిన అపకారం ఏమిటో స్పష్టంగా చూడగలడు. పోతే తన చేతుల్లోవున్న ప్రక్రియల్లా సాధ్యమైనంత వరకు లలితకు దూరంగా వుండటమే!

'నాకు తెలుసు లలితా! ఇలాంటి ప్రమాదం సంభవిస్తుందనే [illegible] తోనే నేను దూరదూరంగా వుంటూ వొచ్చాను. నీవా సంగతి గ్రహించక-

తన మాట పూర్తి కాకుండానే ఆమె అంది: 'యీ వెధవలంటేనే భయపడతారనుకున్నారా మాష్టారూ? ఐనా నేను చేయని నేరాలనుగూర్చి క్రుంగిపోయేటంత పిరికిదాన్ని కాదు. మీతో మాటవరసకన్నాను-అంతే!'

ఆ కంఠస్వరంలోని హుందా తనం, గర్వం, తన ఆధిక్యత, తన పవిత్రతను గ్రహించలేని లోకంమీద కలిగిన ఏహ్యభావం మొదలైనవి ప్రతి ధ్వనించినవి... కాని అన్నీ తెలిసిన తనకు, సహజంమీద తిరగబడి గెలవటమంటే మాటలు కాదని తెలియక పోలేదు. ఆ సంగతి యీమెకు అర్థమయేట్లు చెప్పవలసిన బాధ్యత తనది.

'లలితా! నీ వలా మండిపడితే లాభంలేదు. వాళ్ళ నీచత్వం, వాళ్లకు అర్థమయేట్లు చేయడంలో జీవితాన్నే భగ్నం చేసుకోవాల్సి వుంటుంది. మనం సమాజాన్ని ఎంత దూషించినా, మనమూ ఆ సమాజంలోనే వున్నాం కనుక దాన్ని కాదనలేం...!

తన మాటకు అడ్డు తగులుతూ 'అంటే మీ ఉద్దేశ్యం వీళ్ళకోసమనే బతకాలనా?' అంది.

'కాదు. జాగర్తగా ఆలోచించు. స్వతహాగా తెలివిగలదానివి కనుక నేను ఎక్కువ చెప్పక్కర్లేదు. ప్రపంచవిధానాన్ని పరిశీలించినట్లయితే సులభంగా అర్థమౌతుంది. బీదవాడికి ధర్మంచేయని ధనికుణ్ని 'పిల్లికన్నా బిచ్చంవెయ్యని పీనాసి' అనే లోకమే, బీదవాడికి సహాయం చేయటాన్నే వేరొకరూపంలో నిందిస్తుంది. దీనికి ప్రత్యేకమైన పద్ధతులంటూ లేవు కాని, సంఘటనకు రంగువేయటంలో, ప్రదర్శించటంలో ఒక ప్రత్యేకతనే చూపుతుంది...అదంతా అలా వుంచు. నీకు నీవై అనవసరంగా అపనిందలపాలు కావటం సబబుకాదు. మరీ స్త్రీకివుండే ప్రతికూలవాతావరణం అలాటిది. అందుకని......

'మీకు లోకమంటే ఎందుకింత భయం? పిరికిపడిపోయి వెనకడుగులు వేస్తారెందుకు? మిగతా వాళ్ళుకూడా మానవులేననే ధోరణే కనిపించకుండా...'

ఆమెమాట పూర్తిగాకుండానే ఉద్రిక్త కంఠస్వరంతో తను అన్నాడు: 'భయం కాదామరి? అడివిలో జీవితానికీ, ప్రపంచంలో జీవితానికీ భేదమేమీ నాకు కనిపించటంలేదు. పులినిచూసి లేడి ఎందుకు భయపడుతుంది? లేడినిచూసి పులి ఎందుకు భయపడదు? అక్కడ బలమైన జంతువు బలంలేని దాన్ని భక్షిస్తూవుంటే, ఇక్కడా అదే జరుగుతోంది. ఆ బలానికే వేరొక మాట 'ధనం'—అంతే!...లలితా! నీకు తెలిసిన సమాజం వేరు; నేను బతికేది వేరూను...'

ఆమె కొంతవరకూ సమాధానపడినట్లు కనిపించినా వాదించాలనే ఉత్సాహంతో మాట్లాడబోయింది. కాని తాను వారించి అన్నాడు; 'వాద ప్రతివాదాలూ, న్యాయాన్యాయ విచక్షణలూ, విచారణలూ వొద్దు. వాటితో ప్రపంచానికి పనిలేదు. అబద్ధాన్ని నిజమని ప్రపంచం తేలిగ్గా నమ్మగలదు. నిజాన్ని నిజమేనని రుజూచేయగలిగేందుకు తాతలు దిగిరావాల్సినంత పనవుతుంది...కనుక నా సలహా ఒకటివిను. వింటావా?'

ఆమె తలవొంచుకునే వుంది; తనకన్న బలమైన వ్యక్తితో ఓటమి తప్పదని తెలుసుకున్నాక, లొంగిపోవటమే పరిష్కారమనే ధోరణిలో ఉండిపోయింది. తన

ప్రశ్నకు వెంటనే జవాబు చెప్పనందువల్ల అసలామె వినటంలేదేమోననే అనుమానం కూడా కలిగింది.

'లలితా! నేను చెప్పేది వినటంలేదా?'

'వింటున్నాను—చెప్పండి.'

వెలుగు బాగా తగ్గింది. మనిషి ఆకారమైతే కనిపిస్తోంది కాని, ముఖంలో ప్రతిఫలించే ఉద్వేగం తెలియటం లేదు. కాని కంఠస్వరాన్ని బట్టిచూస్తే ఆమెలో విషాదం ప్రవేశించిందని అర్థమైంది.

'సాధ్యమైనంతవరకూ నాకు దూరంగానే ఉండు లలితా! మనుషులు దూరమైనంత మాత్రాన మనసులు దూరమవక్కర్లేదు. కనుక మన స్నేహానికి ఇది భంగం కాకుండా, సమాజంలో గౌరవాన్నీ, హోదానూ కాపాడుకునేందుకు మరోమార్గంలేదు.. ఐనా మనం మామూలుగా పద్మనాభంగారింట్లో కలుసుకుంటూనే వుంటాంగదా?'

తను ఆగాడు—ఆమె మాట్లాడుతుందేమోనని. కాని ఆమె మౌనంగా ఉండి పోయింది.

'ఏం ఆలోచిస్తున్నావ్ లలితా?'

'ఏమీలేదు...'

'నేను చెప్పిందానికి ఏమంటావ్?'

'అనేందుకు ఏముంది? మీ సలహాప్రకారమే నడుచుకుంటాను' ఆ కంఠ స్వరంలో అలగటంవల్ల కలిగే అంగీకారం ధ్వనించింది.

'ఇంకోవిషయంకూడా ఇవాళ నీతో చెప్పాలనుకున్నాను లలితా! నేను చావుబతుకులమధ్య పెనుగులాడే సమయంలో నీవు సంజీవితెచ్చి బతికించావు. యీ జన్మలో నేను నీ మహోపకారాన్ని మరచిపోలేను. మా అమ్మకూడా అమాటే అంటుంది.'

'నేనలా అనుకోవటంలేదు మాస్టారూ! ఒక మానవుడికి, మానవధర్మంగా సహాయం చేయటం విధిగా భావించాను అంతే!...దీన్నిగూర్చి మీరు మరీ మరీ చెపుతే వినేందుకు నాకు సిగ్గుగాతోంది'

కొంతమంది వ్యక్తులు, వారి పైమెరుగుల్లోనూ, దుస్తుల ధారణలోనూ, మాటల మృదుత్వంలోనూ, చేష్టల్లోని సంస్కారంలోనూ చాలా గొప్పవారుగా కనిపిస్తారు. కాని వారిని తరచి తరచి వారి అంతర్యాలను పరిశీలించినట్లయితే, లోన దాగిన కుళ్లు బైటపడుతూ వుంటుంది. చిన్న గుంటలోని నీరు కదలిక లేకుండా పైకి ఎంతో నిర్మలంగా వున్నప్పటికీ, కాస్త కెలుకుతే ఎంత మురికి వున్నదో బైటపడినట్లే, కొంతమంది తత్వాలను లోతులకు పోయిన కొద్దీ భరించలేం.. ఇది సర్వసామాన్య మైన విషయమే ఐనప్పటికీ లలితలాటి గంభీర స్వభావుల్లో నటన దాదాపు కనిపిం

చదు; మొదట్లో ఏర్పడిన తన అభిప్రాయమే పోను పోను బలపడుతోంది. లలిత పైకి ఎంత నిర్మలంగా కనిపిస్తుందో, అంతరాంతరాల్లోకూడా ఆ నైర్మల్యాన్ని ప్రదర్శించగలుగుతోంది. ప్రపంచంఅప్పుడప్పుడు చాలాగొప్పదనిపిస్తుందంటే, ఇలాటి వ్యక్తుల వల్లనే నేమో?

'లలితా! నీవు అనుకున్నంత బీదరికంలో నేను లేను...యీ మధ్య కాస్త కూడబెట్టాను. డాక్టర్ బిల్లు నన్ను ఇవ్వనీ' అన్నాడు, తన గౌరవ మర్యాదలు, తనలోకూడా కాస్తో కూస్తోవున్న అహం, తనకూ ఒక వ్యక్తిత్వం వుండి దాన్ని రుజూ చేసుకోవాల్సిన బాధ్యత మొదలైనవి వేధించినవి.

'మీరా దిగులుపడకండి. ఆ బిల్లంతా నేను ఇచ్చేశాను. మీరు నన్ను అపార్థం చేసుకోవొద్దు. నేనేదో మీకు దయాధర్మంగా చేస్తున్నాననీ, మీరేదో యాచిస్తున్నారనీ కాదు...ఒక వ్యక్తిపట్లవుండే అభిమానాన్ని చూపటం నేరంకాదు కదా!...యీ విషయంమీద తర్కించకండి.'

మాట్లాడేందుకేమీ లేనందువల్ల మరికొన్ని క్షణాలు కంఠస్వరాలేవీ వినరాలేదు. గదంతా చీకటి ఆవరించింది. అవతలిగదిలో వెలుగుతూన్న ఎలక్ట్రిక్ లైటు తాలూకు కాంతి యీ గది బైటివరకూ పడుతోంది. యీ గదిలో లైటు వేయవలసిన సమయమైనదని తనకు తెలుసు; బహుశా ఆమెకూ తెలిసే వుంటుంది. కాని మాటల్లో దొర్లిన విషాదంతాలూకు చీకటికీ, బాహ్యంగావున్న చీకటికీ వుండే పోలికవల్ల తామా సంగతి గుర్తించి ఉండరు; యీ సంభాషణ తన శక్తులన్నిటినీ హరించినట్లే, ఆమెనుకూడా కుంగదీసిందేమో?

'లలితా! మరో నిశ్చయానికి కొచ్చాను. అమ్మను చూశావుగా! ఆమెను చూస్తుంటే మనస్సు తరుక్కుపోతూ వుంటుంది. నేనామెను సుఖపెట్టేవరకూ ఆమె యీ లోకంలో వేచికూర్చోగలుగుతుందా అనే అనుమానం కూడా వొస్తూంటుంది. ...సాధ్యమైనంత త్వరలో చదువుమానేస్తాను—'

'మానేసి?' అందామె వెంటనే. తనమాటల్ని ఎంత జాగర్తగా, వేగంగా ఆమె విని అర్థంచేసుకో గలుగుతోందో ఆ అంధకారంలోకూడా స్పష్టంగా చూసినట్లయింది.

'ఎక్కడనా ఉద్యోగం చూసుకుంటాను. అమ్మను నాదగ్గిరే వుంచుకుంటాను.'

'చదువు సంధ్యల్లో మీరు యూనివర్సిటీ ఫస్టవొస్తారని చాలామంది ప్రొఫెసర్లే అనుకుంటున్నారు. మీరు చదువుమానటం బాగాలేదు. మీ అమ్మగారుకూడా వొప్పుకో రనుకుంటాను' అందామె చాలా మృదువుగా.

'చదువుకు భయపడి నేను మానెయ్యటంలేదు. యీ డిగ్రీలూ, మొదటివాడుగా ఉత్తీర్ణుడవటం ఇవన్నీ నా జీవితంలో ఏవిధంగానూ ఉపయోగపడవని తోచింది. యీ చదువంతా వ్యాపారదృష్టితోనే సాగించవలసి వొచ్చింది: ఆ

వ్యాపారం గిట్టదని తోచాక దాన్ని సాగించటంలో అర్థంలేదు కదా! యీ చదువు సంధ్యలకు ఉపయోగించే కష్టాన్ని ఏ ఉద్యోగానికన్నా ఉపయోగిస్తే నేనూ అమ్మా కూడా సుఖపడగలం. ఏళ్ళ తరబడిగా సాగించాల్సిన యీ చదువుమీద నాకు మనసుపోవటంలేదు. ఇంక అమ్మంటావా ఆమె నామీద గంపెడాశలు పెట్టు కుంది. పెద్దచదువుకు పెద్ద ఉద్యోగం దొరుకుతుందని ఆమె నమ్మకం. వొట్టి అమా యకురాలు. వయస్సుకు పెద్దదే కాని, చిన్నపిల్లల మనస్తత్వం కనిపిస్తుంది. తన సుఖం తనకు తెలియని ఆ అమాయకురాల్ని పిండి యీ బోడి చదువు సాగించకుంటే నేం?'

ఆగాడు - దృశ్యమంతా తన కళ్ళముందు ప్రత్యక్షమైనట్లే లలిత కళ్ళముందు కూడా సృష్టించుకుంటుందని. తన మానాన్ని ఆమె వెంటనే ఛేదించటంలో తేలిగ్గా అర్థం చేసుకున్నదని గ్రహించ గలిగాడు.

'మీరన్న ప్రతిమాటా నిజమే మాస్టారూ! చదువు చదువుకోసమే అనుకో గలిగినవారికీ, పెద్ద పలుకుబడులుండీ, వెనుక కావలసినంత వున్నవారికీ తప్ప, యీ కాలేజీలు సామాన్యులకు కాదు. యీ సామాన్యుల్లో అసామాన్యులు వున్నప్పటికీ, వారు ఏ నూటికి కోటికి నొకరో బైటపడుతూంటారు; అదీ ఎప్పుడో జీవితంలో తమ ప్రతిభను రుజూచేసుకోవటం ద్వారా.. ఎక్కడైనా ఉద్యోగం దొరికిందా?'

'లేదింకా. ప్రయత్నాలు ఇది వరకే సాగించాను. తృప్తికరమైంది, నన్నూ అమ్మనూ నమ్మకంగా బతికించగలిగేది ఏదైనా ఆధారం దొరకగానే చదువుకు స్వస్తి చెపుతాను. ఉద్యోగం దొరికేదాకా యీ సంగతి అమ్మకుకూడా చెప్ప దలుచుకోలేదు. ఎందుకంటే ఆమెకీ విషయాలు అంత తేలిగ్గా అర్థంకావు.'

లలిత కూర్చున్న స్థలంనుంచి దీర్ఘమైన నిట్టూర్పు వెలువడింది; ఆ తరువాత చాలాసేపు వూపిరి బిగపట్టాక ఒక్కసారే ఎక్కువగాలి పీలుస్తూన్న శబ్దం విన వొచ్చింది. తన యీ స్వవిషయాల్ని చర్చించి ఆమెను బాధపెట్టిన సంగతి, ఆ బాధను తట్టుకునేందుకు ఆమె వ్యర్థప్రయత్నం చేస్తూన్న విషయం ఇప్పుడే బాగా అర్థమైంది. తనుకూడా చాలా అలసిపొయ్యాడు; అసలే శరీరంలో తగినంత ప్రాణ లేని సమయంలో యీ ఉద్రేకాల తాకిడి చితక కొట్టినట్లయింది. పోరాటం జరిగే ప్పుడు ఆ పట్టుదలలో కనిపించని బాధలు, పూర్తయాక తమ ప్రభావాన్ని చూపినట్ల యింది. ఇదంతా అనవసరంగా కెలకటమైనందుకు నొచ్చుకున్నాడు.

'లలితా! చాలా ఆలస్యమైంది. నిన్ను చాలా సేపు వుంచేశాను. ఇక ఇంటికి వెళ్ళు. రేపటి నుంచీ ఇటు రావొద్దు. బహుశా వారం పది రోజులు గడిచాక, మనం మళ్ళీ పద్మనాభంగారింట్లో కలుసుకుందాం ... నీ మనసు కష్టపెట్టినందుకు క్షమించు—' ఆమె జవాబు చెప్పలేదు. చివరిమాట విన్నప్పుడు, వినరానిది విన్నప్పుడు కలిగే రొప్పులాటిది వినిపించింది.

'ఇక వెళ్ళు లలితా! నేను చెప్పినట్లు దూరంగా వుండేందుకే ప్రయత్నిం చాలి సుమా!...కాస్త లైటువేస్తావా?'

లైటు వెలిగింది. ఆ కాంతిలో లలిత ముఖం గుర్తు పట్టేందుకు వీల్లేనంతగా పాలిపోయి వుంది. విషాద మేఘాల తాలూకు ఛాయలన్నీ కనిపిస్తూనే వున్నవి. మనసు ఎంతో బరువెక్కినట్లు, తన శరీరమే తనకు భారమైన రీతిగా ఆమె నిటారుగా నిలబడలేక పోయింది.

'వొస్తాను మాస్టారూ!' అని ఇంకేమైనా మాట్లాడుతే మాటలకు మారుగా దుఃఖమే బైటపడుతుం 'దేమోనన్నట్లు, నమస్కరించి త్వరత్వరగా వెళ్ళిపోయింది.

నిట్టూర్పులతో, కన్నీళ్లతో, విషాదభారంతో ముగిసిన దృశ్యం తాలూకు స్మృతులన్నీ కళ్ళముందు నాట్యంచేస్తూ మనసును మెలేస్తూనే ఉన్నవి. చాలాసేపు అలాగే ఆలోచిస్తూండి పోయ్యాడు. లలిత చూపే అభిమానాన్ని స్వీకరించటంవల్ల ఆమెకు కలిగే కీడును తలుచుకుంటేనే శరీరం గగుర్పొడిచింది. తను ఉద్దేశించక పోయినా ఫలితంగా కలిగే హానికి తన బాధ్యతను గుర్తించాడు...ఇప్పుడు మనసుకు కష్టంగా వున్నప్పటికీ యీ చేదు తప్పకుండా వ్యాధిని కుదురుస్తుందనే నమ్మకం వుంది. ఐపోయిన దానికి చేసేదేమీ లేకపోయినప్పటికీ, రాగల ప్రమాదాల నుంచి తనను తాను రక్షించుకొని, లలితకుకూడా తగిన హెచ్చరికలు చేయగలిగాడు.

ఆలోచనా ప్రవాహంలో కొట్టుకొని పోయిన తనను, రాత్రి చాలా పొద్దు కాక వొచ్చిన తల్లి బైటపడేసింది. తనను చూడగానే 'అట్లా వున్నావేం నాయనా? ఏం జరిగింది?' అని ఆతృతతో అడిగిందామె. తను మామూలుగా కనిపించేందుకు శతవిధాల ప్రయత్నిస్తూ 'ఏం లేదమ్మా!...అన్నట్లు మనం రేపే ఇంటికి వెళ్ళాలి...' అని మాట తప్పించాడు.

ఏదో జరిగివుంటుందని ఆమె నమ్మకం; గుచ్చిగుచ్చి అడగాలని ప్రయత్నం చేసింది కాని, తను పక్కదార్లపడేప్పటికి ఆమె వొత్తిడి చేయలేదు. కాస్త రొట్టె తిని, పాలుతాగక నిద్రను నటిస్తూ అప్పటికి తప్పుకున్నాడు ..కాని చాలా రాత్రి గడిచేవరకూ నిద్రపట్టక బాధపడిన ఫలితంగా మర్నాటి ఉదయం బడలిక, శరీర భారం కనిపించింది...డాక్టర్ దగ్గిర సెలవు పుచ్చుకొని బండిలో తల్లితో పాటు ఇంటికి జేరాడు.

## 19

మళ్ళీ మామూలు వాతావరణంలో పడ్డాడు. జీవితంలో ఇంతకన్న పైస్థాయి ఎప్పటికన్నా చేతికి అందుతుందా అనే అనుమానం వేసే వాతావరణం! ఇదివరకెప్పుడూ కలగని కొత్తబాధ ఇది. కొద్ది రోజులు జీవితం తాహతుకు మించటం వల్ల, మళ్ళీ కిందికి దిగినప్పుడు కలిగే అసంతృప్తి ఇది!

'మళ్ళీ వారంరోజులదాకా రాలేనని చెప్పివొచ్చాను.' అంది అమ్మ.

'ఎందుకూ? నాకు కులాసాగానే వుందికదా?'

'కాస్త త్రాణ రానీరా నాయనా! చచ్చి బతికావు...నేను లేకపోతే నీకు పత్యపానాదులు ఎవరు చూస్తారు?'

యీమె లేకపోతే! నిజంగానే తల్లిలేకుంటే భూమే నరకంగా మారుతుంది! ఆపేక్షలు ఎంతగా పెరిగినవో కాని, తనలాటి సామాన్య మానవుడు భరించలేకపోతున్నాడు. ఆ సాయంత్రానికే జ్వరం మళ్ళీ తిరగబెడుతోందనే అనుమానం కలిగింది తనకు. కాని అమ్మకు చెప్పలేదు—ఆమె గాబరా పడుతుందని! యీసారి నిజంగానే జ్వరం తిరగబడితే స్వర్గంనుండి వొచ్చే అమృతం తప్ప మరేదీ తనను రక్షించలేదు.

—కాని మొదటినుంచీ తను మానసికంగా ఎంత వేగిపోతున్నాడో, ఆలోచనలవల్ల ఎంత తలకిందులవుతున్నాడో, ఇప్పుడు తలుచుకుంటే ఆ మూర్ఖత్వమంతా కళ్ళకు కట్టినట్లయింది. మిన్నువిరిగి మీద పడుతూన్నప్పటికీ చలించని తత్వాలవారున్నారు; ప్రతి చిన్న విషయానికీ చిలవలు పలవలు కలిపించి, ఆకు చప్పుడుకే అదిరిపొయ్యేవాళ్ళున్నారు. తన తత్వం యీ రెండోజాతికి చెందింది. ఒకొకప్పుడు ఇది మేలు కలిగించవొచ్చు; ఎందుకంటే నిశితంగా ఆలోచించటంవల్ల జాగ్రత్తగా మెలిగే అవకాశాలుంటవి కనుక, నిజంగానే ఆలోచించిన ప్రమాదాలే సంభవిస్తే వాటికి ఎరగాకుండా తప్పించుకోవొచ్చు. కాని తీవ్రంగా ఆలోచించిన ప్రమాదాలే కలగనప్పుడు, లేనిదానికి అనవసరంగా భయపడటమే అవుతుంది. ఇన్నాళ్ళ అనుభవంలోనూ తను చూడగలిగిన యీ సత్యాన్ని ఆధారంగా,బుర్రను శ్రమపెట్టటం ఎంత తుంగి పోవటమో తెలియక పోలేదు.

ఐనా తనను వేధించే సమస్యలు మాత్రం ప్రస్తుతం ఏమున్నవని? లలితతో గత సాయంత్రం జరిగిన సంభాషణ ఫలితంగా ఆమెకూ తనకూ కొంతదూరం ఏర్పడుతుంది. 'ఇది ఉభయులకూ క్షేమకరమే!' ఆమెమీద తనకు కొండంత ఆశలు ఏర్పడేందుకు వీల్లేదుకనుక, పెద్దగా విచారించనక్కర్లేదు. ఒకవిధంగా లలితవల్ల ఏర్పడే సమస్య, దాన్ని ఛేదించేందుకు పడే శ్రమ తప్పినవి.

పోతే తన జీవితవిధానంలో తీసుకొని రావాల్సినమార్పు. అమ్మను తన దగ్గిరే వుంచుకొని సుఖపెట్టటం; యీ చదువుకు స్వస్తి చెప్పటం. యీ సమస్య తనకు ఉద్యోగం దొరకటంతో పరిష్కరించబడుతుంది. తను ఎంత ఆలోచించినా అది క్షణాలమీద జరిగేదికాదు; ఎంత ప్రయత్నించినా రెండు మూడు రోజుల్లో తేలేదీకాదు. కాలగమనమే దాన్ని పరిష్కరిస్తుంది.

ఇంత స్పష్టంగా వున్నదాన్ని కలగాపులగంచేసి అనవసరంగా ఆ చిక్కుల్లో, ఉచ్చుల్లో ఇరుక్కోవటం దేనికి? ఇలాగే రోజులు సాగనిస్తే, కొన్నాళ్ళకు ఆ చిక్కులన్నీ వాటంతటవే విడివడుతవి; ఒకవేళ విడకపోయినా అప్పటికి బాగా అలవాటవుతుంది కనుక, వాటిని గూర్చిన బాధ అనవసరం...

యీ నాటినుంచీ బుర్రలో ప్రవేశించే వింతతలపులన్నిటినీ దులిపెయ్యాలనే నిశ్చయం కలిగింది. ముళ్ళమీద కూర్చున్నా నవ్వగలిగే తత్వాన్ని అలవరుచుకోవాలి. ఇది అసాధ్యమేమీకాదు. నవ్వలేకపోయినా, ఏడవకుండా ఉండటం మొదటిమెట్టు. యీ మెట్టుమీద కాలుమోపాడు,

మనస్సును వేరు విషయాలమీదికి మళ్ళించటం చాలా అవసర మనిపించింది. దుమ్ముపడ్డ సాహిత్యాన్ని దులిపి పైకితీశాడు. కొత్తకొత్త రచయితల్ని తనకు పరిచయంచేసే ఉద్దేశంతో లలిత ఇచ్చిన పుస్తకాలు చదవసాగాడు. జీవితాన్ని పిండి, దాన్నిసారాన్ని సాహిత్యపరంగా స్థాపితంచేసిన రచనలవి! ఇవి చదుతూంటే ఎప్పటికన్నా తనశిల్పం యీ స్థాయికి పెరుగుతుందా అనిపించింది. అనేక కొత్త విషయాల్ని తెలుసుకుంటూన్నప్పుడు, తనకు తెలిసినవే ఐనా గమనించని సత్యాలను చూడ గలిగినప్పుడు, కొత్త దృక్పథం ఏర్పడినప్పుడు కలిగే మనోవికాసం తాలూకు ఆనందానుభూతిని పొందాడు.

రాత్రి పదిగంటలైనా ఇంకా నిద్రపోనందుకు అమ్మ మందలించింది. ఇక తప్పని సరై పుస్తకం మూశాడన్న మాటేకాని, తను చదివిన పాత్రల్ని గూర్చిన ఆలోచనల్ని బుర్రలోంచి తొలిగించలేక పొయ్యాడు. కాని ఆయాపాత్రల తాలూకు మనస్తత్వాలతోనూ, వారు సామాజికంగా అనుభవించిన కష్టపరంపరలతోనూ తన జీవితాన్ని పోల్చుకోవటంవల్ల, తన బతుకు తాను అనుకున్నంత అధ్వాన్నంగా, అధోగతిలో లేదనే సత్యం బైటపడింది. తను పోల్చుకున్నది సాహిత్యంలో జీవం వున్న పాత్రలే ఐనప్పటికీ, అవి తన చుట్టూ ఇంకా బతికే ఉన్నవనే నమ్మకాన్ని వొదులుకోలేక పొయ్యాడు. అంటే ఆ పాత్రలు మనఃఫలకం మీద ఎంత గాఢంగా ముద్రించబడినవో గ్రహించాడు. ఏమైనా సాహిత్యం తనను వేరు దిక్కులకు తోలటంవల్ల మనస్సు చాలా తేలికైంది.

అనుకున్న అనారోగ్యం దూరంగా జరిగింది. రోజు రోజుకూ కోల్పోయిన శక్తుల్ని రెండింతల వేగంతో పుంజుకుంటున్నాడు. వారం గడిచేప్పటికి, మళ్ళీ కాలేజికి వెళ్ళగలిగే బలం చేకూరినట్లే తోచింది. చదువుమీద ఆసక్తి చాలా వరకు తగ్గినప్పటికీ, ఇటు ఉద్యోగమూ దొరక్క, అటు చదువూ పోతుందేమోననే భయం వుంది. యీ ఉభయ భ్రష్టుత్వం నుంచి తప్పుకునేందుకన్నా కాలేజికి పోక తప్పదు; చివరకు ఆ రెండేన్నా తక్కువ కాకుండా చూసుకోవాలి కూడాను.

అమ్మ ఇక వుండేందుకు వీల్లేదు. ఇప్పటికే ఆమె యజమానులు కస్సు బుస్సుమంటున్నారు. ఐనా ఆమె ఇక్కడ ఉండాల్సిన అవసరంకూడా లేదాయె.

ఆమె వెళ్తూ వెళ్తూ 'మరి కొన్నాళ్ళపాటు ఆరోగ్యం కాపాడుకో. రాత్రిళ్లు ఎక్కువసేపు మేలుకో వొద్దు. కాలేజికి నడవొద్దు; బస్సుమీద వెళ్ళు...' మొదలైన హెచ్చరికలు చేసి 'నాయనా! లలితకుకూడా చెప్పి వెళ్దామనుకున్నాను. యీ మధ్య ఆమె రావటంలేదు ఎందుకని? ఆమెతో పోట్లాడావా?' అంది. కాని తను జవాబు చెప్పకుండా మెదలకుండా ఊరుకున్నాడు.

'ఆ అమ్మాయి ఎంత మంచిది! మానవత్వంలోని ఉచ్ఛదశ ఎలా వుంటుందో నేను లలితలోనే చూడగలిగాను. అలాటి స్నేహాల్ని చెడగొట్టుకోవొద్దు' అని సలహా ఇచ్చి వెళ్ళింది.

అమ్మ వెళ్ళిపోయ్యాక చాలాసేపటిదాకా లలితనుగూర్చిన ఆలోచనల్లోనే వున్నాడు. ఆమె మంచితనాన్ని అమ్మకూడా గ్రహించింది. తమకేదో సహాయం చేసినందుకు కృతజ్ఞతగానే ఆ 'మంచితనం' బైటపడిందని కాదు. తనలాటి నిరాధారుడికి ఇంకెవరికైనా సహాయం చేసినప్పటికీ ఆమె గొప్పతనం బైటపడేదే కదా! భావాలు విస్తరించి, అత్యున్నతస్థాయికి వెళ్తూన్నవి. లలిత యీ మంచితనాన్ని సంపాయించేందుకే తనకు సహాయం చేసివుండదు. ఒకో మనిషిమీద వుండే అభిమానంవల్ల, మాటలకు లొంగని స్నేహభావంవల్లనే ఇలా జరిగివుంటుంది.

ఐతే లలితకు తనమీద ఇంత 'దయ' దేనికి? తన నిస్సహాయత కారణంగానే ఆమె యీ దయను వహించిందనలేడు; ఎందుకంటే ప్రపంచంలో తనకన్న హీనంగా బతికేవాళ్ళనేకమంది వున్నారు. అలాటి వారినిగూర్చి బహుశా ఆమె ఎప్పుడూ ఆలోచించేవుండదు. మరో ప్రత్యేకమైన కారణం ఏదో వుండివుండాలి. ఇక్కడ 'దయ' అనే పదానికి మారుగా 'ప్రేమ' అనే పదాన్ని వేసుకునేందుకు భయపడ్డాడు. పోనీ అభిమానం అనుకోవొచ్చు.

ఐతే ఎందుకీ అభిమానం? ఒకో వ్యక్తిత్వానికి ఇట్టే లొంగిపోవటం, ఆ వ్యక్తిత్వాన్ని ఎంతో గౌరవించటం తనకు తెలియంది కాదు. ప్రపంచంలోని వ్యక్తులందరిమాటల్నీ తృణీకరించినప్పటికీ, ఎవ్వరో ఒక్క వ్యక్తిమీద గురివుండటం, నాగస్వరానికి లొంగిపొయ్యే తాచుపాముల్లే ఆ వ్యక్తి కనుసన్నల్లో మెలగటం, ఇది ఓటమే ఐనప్పటికీ, ఇందువల్ల ఎంతో ఆనందం కలగటంకూడా తను ఎరుగును. ఇక లలిత విషయంలో ఆమె తన వ్యక్తిత్వానికి తల వాల్చిందో, తనే ఆమె గుప్పెట్లోకి కుంచుకుపొయ్యాడో కాని, తామిద్దరిమధ్యా గాఢతమమైన స్నేహబంధం మాత్రం ఏర్పడి పోయింది.

తను ఆమెముందు మోకరించిన కారణాలేమిటో తెలుసు. ఆమె తనకు సహాయం చేసిందనికాదు; తనకోసం లలితచేసిన త్యాగమంటూ ఏమున్నావుంటే, అమ్మచేసిన త్యాగాలతో వాటిని పోలుస్తే ఏమూలకు?...కాని లలితకు తనమీద ఏర్పడిన అధికారం, తానామెకు లొంగిపోయిన కారణం ఇది: సాహిత్యంలో ఆమె పలుకుబడి తనమీద అమోఘంగా పనిచేసింది. ఒక మార్గదర్శనివలె, సముద్రయానంలో దిక్సూచివలెనే తను పెడమార్గాల పడకుండా కాపాడింది. అంతేకాదు; తను సృష్టించిన సాహిత్యంలో లలిత వ్యక్తిత్వం చాలా స్పష్టంగా ప్రతిఫలిస్తోంది. యీ సంగతి బహుశా ఆమెకూ్కడా తెలిసే వుంటుంది. తన కథ చదివినప్పుడు 'నన్నుగూర్చే కదా? యీ కథానాయిక నేనేకదూ?' అన్నట్లు చూస్తుంది; తనను జయించి, తనహృదయంలో స్థానాన్ని పొందినందుకు లలిత గర్వంగా నవ్వుతుంది. లలిత స్నేహమే తనకు లభ్యం కానట్లయితే కళాసృష్టి ఏనాడో తనలో అంతరించిపొయ్యేది. పోతే విమర్శకురాలిగా ఆమెను ఎప్పుడూ తను పూజిస్తూనే వున్నాడు. ఆమెది సద్విమర్శగా స్వీకరించక తప్పటం లేదు. ఆమె రచయిత్రి కాకుంటేనేం? రాసి కాగితాలు ఖరాబుచేయకుంటేనేం?

ఎలా రాయాలో, ఏం రాయాలో, రాత ఉద్దేశ్య మేమిటో ఆ విషయాలన్నీ చాలా స్పష్టంగా, క్షుణ్ణంగా తెలుసామెకు. ఒకరకంగా చూస్తే ఆమే తనలో ప్రవేశించి రాయిస్తోంది. పోతనామాత్యునికి సరస్వతీదేవి ప్రత్యక్షమై, దగ్గిరకూర్చొని రాయించినట్లే యీ లలిత, తనవూహకు అందని అనేకవిషయాల్ని కరతలామలకం చేయగలిగింది...

—కాని ఇందువల్ల ఆమెకు పేరు ప్రఖ్యాతులు వొస్తవనే ఉద్దేశ్యమే ఆమెకు లేదు. ఎందుకంటే తన కథలు మెచ్చుకునే వాళ్ళెవ్వరికీ, తన వెనుక లలితలాటి ఒక వ్యక్తివున్నదనే సంగతి తెలియదు. ఆ కీర్తి అంతా తనదే ననప్పటికీ, నిజానికి అందులో అధికభాగం లలితకే చెందుతుంది. దస్తూరి బొత్తిగా బాగుండనివాడు, టైపుచేసినట్లయితే, ఆ అక్షరాలు ముత్యాల కోవలేకదా! 'టైపు ఎంత బాగా చేశాడు!' అంటామే కాని, ఆ అందమంతా యంత్రానిదే ననప్పటికీ, దానిపేరు తలిచేవాళ్ళెరు? అదేవిధంగా కాళిదాసు పేరుకానీ, షేక్స్పియర్ పేరుకానీ అందరికీ తెలిసిందేకాని, వాళ్ళ వెనుకవున్న వ్యక్తిత్వాలు, ఉదాహరణకు వాళ్ళ తలిదండ్రుల పేర్లెవడికొక్కావాలి? అలాగే లలితఏనాటికైనా తనవెనుకవుండి, తనను ప్రకాశింపచేసే శక్తిని ఇచ్చేదేకాని, ఆమె స్వయంగా ప్రకాశించలేదు...ఇలాటి విషయాల్నే ఆమె ఎన్నడూ ఆలోచించివుండదు. ఆమెది కళాపూరితమైన హృదయం; ఆ భావాలకు విడుదలవుండి తీరాలి. ఆ విడుదల తనద్వారా జరిపించుకొని తృప్తిపడుతోంది. ఇందుకుగాను లలితంటే తనకు అమితమైన గురి ఏర్పడిపోయింది. ఆమె తనకు గురుత్వాన్ని వహించింది మరి!

పోతే లలితకు తనమీద కలిగిన అభిమానానికూడా ఒక కారణాన్ని వెతికి పట్టుకోవాలి. ఆమె తన కళానుభూతులకు, తనను ఉపయోగించుకుంటూన్న మాట నిజమే కాని, అందువల్ల మాత్రమే తనపట్ల అభిమానాన్ని పెంచుకున్నదని చెప్పటం కష్టం. ఒక కళాకారుడు (కళను సృష్టించనీ, సృష్టించకుండనీ-కళను అర్థంచేసుకోగల వ్యక్తి అనుకుంటే) మరో కళాకారుణ్ని మెచ్చుకోవటం నేరంకాదు. అదే విధంగా తనపట్ల లలితకు అభిమానం పెంపొంది ఉండవొచ్చు.

ఇంకా స్పష్టంగా విడదియ్యాలంటే, వ్యక్తిత్వానికి లొంగి పోయినప్పటికీ, ఆ వ్యక్తిత్వంలోని ఒక ప్రత్యేక గుణానికి లొంగిపోవటం జరుగుతోంది. ఉదాహరణకు ఒక వ్యక్తి అందంగా వున్నందువల్ల అభిమానించబడుతున్నాడు; అందంగాక మిగతా సద్గుణాలువున్నా అవి లెక్కలోకిరావు; అలాగే ఇతర దుర్గుణాలుకూడా లెక్కించబడవు. ఒక సద్గుణం మిగతా దుర్గుణాలను కప్పిపెట్టినట్లే, ఒక దుర్గుణం మరో సద్గుణాన్ని స్పష్టంగా ప్రకాశింపజేస్తుంది. యీ దృష్టితో చూసినట్లయితే తన వ్యక్తిత్వంలోని సాహిత్య కళనే ఆమె అభిమానించి ఉండొచ్చు. తనను 'సాహిత్య కళాకారుడు' నుంచి విడదీయటం అసంభవం కనుక, తననే క్షమానించి తీరాలి. ఇదీ సరైన కారణం!...కనుక తననామె ప్రేమిస్తోందనే పొరపాటు పడటంలో అర్థంలేదు. తనలోని కళాకారుడికే ఆ జయం-తనకు కాదు!

ఇలాటి తర్కం వల్లనే తను లలిత కల్పించే ఎండమావుల్ని చూసి మోస పోలేదు. తనకు తెలుసు-యీత రానివాడు, విధిమీద భారంవేసి చూస్తూ చూస్తూ సుడిగుండంలో ఇరుక్కోవటం లాటిదే. లలితను గూర్చిన కలలు కనటమని! యీ విధంగా తనను తాను అనుక్షణమూ కాపాడుకుంటూనే వున్నాడు.

—కాని, ఇందువల్ల ఒక రకం క్షోభను అనుభవిస్తూనే వున్నాడు. తర్కం తనను దూరతీరాలకు తరుముతూంటే, మనస్సు ఆమె దరిదాపులకు దారితీస్తోంది. యీ ఘర్షణ, మోకు రెండు కొనలను రెండు బలవత్తర శక్తులు లాగటం వల్ల మోకుకు కలిగే వొత్తిడి లాటిది. ఏమరివుంటే, కన్నుమూస్తే, ఆ స్వర్గ ద్వారమే శాశ్వతంగా మూసివేయబడుతుందేమోననే భయం; కళ్లల్లో వొత్తులు వేసుకొని ఆ దివ్యక్షణం కోసం ఎదురు చూడటం మానలేదు. తనుకూడా కేవలం మానవమాత్రుడు; తనకూ ఆశలనేవి, కోర్కెలనేవి ఉన్నవి. అదృష్టదేవత ఎప్పుడో ఒక్క క్షణంలోనే మందహాసం చేస్తుందనీ, మందమతి ఆ క్షణాన్ని గుర్తించనట్లయితే చేతులారా జీవితాన్ని బుగ్గిపాలు చేసుకోవటమౌతుందనీ తనకు తెలుసు. ఆ క్షణం ఎప్పుడొస్తుందో, అసలు ఎన్నటికీరాదో-తనకు, తనకేమిటి, ఎవ్వరికీ తెలియదు. కనుకనే జీవితమంతా యీ ఆరని ఆశల తాలూకు చిచ్చు, మనుషుల్ని ముందుకు సాగేట్లు చేయగలుగుతోంది. ఆ ప్రవాహంలో తనూ ఒక గడ్డిపోచవలెనే కొట్టుకొని పోతున్నాడు.

బైటి ప్రపంచాన్ని చూసి చాలా రోజులైంది. ఆ ప్రపంచంలో తనకు సుఖ సౌఖ్యాలు దొరుకుతవని కాదుకాని, ఆనందంతో కదిలిపొయ్యే మనుషుల్ని చూడటం కూడా కొంత ఆనందాన్నే ఇస్తుంది. ఒక్కడూ కూర్చొని తెగని ఆలోచనల్తో బాధ పడటంవల్ల తనమీద తనకే విసుగుపుడుతోంది. మామూలుగానే మళ్ళీ దినచర్య సాగుతే కొంత మనశ్శాంతి వుంటుంది.

అందుకనే కాలేజికివెళ్ళాడు. తనలో స్పష్టమైన మార్పు వొచ్చినసంగతి తనకే తెలుస్తోంది. కాలేజి వాతావరణంలోకూడా మార్పు వొచ్చినట్లుంది. కాలేజిలో తనను చూడగానే, లలిత వెన్నెల వెదజల్లే చిరునవ్వునవ్వింది. తమ ప్రవర్తనల్ని గమనించిన కొందరు ఎగతాళిగా నవ్వారు; ఏమో అలా నవ్వుతున్నారనిపించి, వెంటనే భుజాలు తడుముకొని మామూలుగానే దూరాన వుండసాగాడు. తనను ఎన్నటికీ నవ్వనీని ప్రపంచం, అదృష్టదేవత పొరపాటునన్నా తన దగ్గిరికి వొస్తూంటే దాన్ని బెదరగొట్టి, తను ఖిన్నుడైతే నవ్వే ప్రపంచం, యీర్ష్యతో, జలసీతో ఇతరుల బాధల్నే తమ ఆనందంగా స్వీకరించగల ప్రపంచంపట్ల ఏనాటికీ తనకు రాజీ కుదరదు; అంతకన్న విరోధమే అన్ని విధాలా మేలనిపించింది.

పాఠాలు సాగిపోయినా, తను ందుకో గలిగాడు. అంత కష్టమనిపించలేదీ చదువు. సాయంత్రం యధాప్రకారంగా పద్మనాభంగారింటికి ట్యూషన్‌కు వెళ్లాడు.

'నాయనా! బాగా కులాసాగావుందా?' అంది రమణమ్మగారు.

ఇంత ఆపేక్షగా ఆమె మాట్లాడుతుందనుకోలేదు తను. ప్రపంచంలో కొంతమంది మానవులన్నా, మానవత్వాన్ని విడనాడనందువల్లనే భూమి నరకంగా మారలేక పోయింది.

'బాగానే వుందండీ' అన్నాడు.

లలిత కనిపించలేదు. చిట్టికిమాత్రం ట్యూషన్ చెపుతున్నాడు. అసలిక్కడికి వొచ్చింది లలిత కనిపిస్తుందని. యీ కారణాన్ని ఒప్పుకునేందుకు మనసులో బాధపడ్డాడు కాని, నిజమేమిటో తనకు తెలియక కాదు.

ట్యూషన్ ముగించుకొని వెళ్లిపోదామనుకుంటూండగా లలిత వొచ్చింది... కాని ఆమెముఖంలో తను ఎదురుచూసే ఉత్సాహంలేదు. గాయపడిన మనిషి, ఆ గాయాన్ని ఇతరులకు తెలియకుండా దాయాలనిచేసే ప్రయత్నం లాటిది కనిపించింది. ఆ గాయపరిచింది, నర్సింగ్ హోంలో తనే నేమోననే అనుమానం తళుక్కున మెరిసింది. ఇదే నిజమైతే ఆమెకు క్షమార్పణల్ని చెప్పటం ఎలాగో తెలియలేదు. ఐనా నిజం తెలుసుకోనిదే తను ముందుకెలా సాగగలడు కనుక?

తనంతట తానుగా ఆమె ట్యూషన్‌కు వొస్తుందేమో ననుకున్నాడు కాని రాలేదు; తనేమీ అడగనూలేదు. లలిత కాస్సేపు అక్కడేకూర్చొని, తనకు అర్థం కాని, చూపేదో చూసి సావిట్లోకి వెళ్ళి పిన్నమ్మతో మాట్లాడుతోంది. ఆమె కంఠ స్వరంలోకూడా ఎంతో మార్పువొచ్చిందనిపించింది తనకు. కాని ఆ మార్పు మేలు కన్న కీడుకే దగ్గరగా వున్నదని తోచింది. ఆ కీడు పరిణామాన్ని తనుకూడా పంచుకోవాల్సి వుంటుందనే సంగతీ గ్రహించక పోలేదు.

ట్యూషన్ అయాక సాహిత్య చర్చ జరుగుతుందేమోనని ఎదురు చూసిన తనకు నిరాశే ఐంది. చాలా సాధారణ విషయాలు, నిస్సారమైన సంగతుల్ని మాట్లాడారు రవణమ్మగారూ, లలితాను. తన వెనుక ఏదో గొప్ప ప్రమాదం జరిగినట్లూ, దాన్ని గూర్చి తనకు తెలియకుండా వారిద్దరూ ప్రయత్నం చేస్తున్నట్లు తోచింది...కొద్ది రోజుల్లో తెలియక పోతుందా అనుకున్నాడు. కాని ఎంత గింజుకున్నా ఆతృత తగ్గలేదు.

బాగా చీకటి పడేవరకూ వుండి గదికి తిరిగి వొచ్చాడు. యీ మధ్య కాస్త పత్యంగానే భోజనం చేస్తున్నాడు. రాత్రిపూట అన్నం తినకుండా చపాతీలు తిని, పాలుతాగి సరిపెట్టుకుంటున్నాడు. ఇవాళ అమ్మలేదు కనుక, హోటల్‌లో మొక్కు తీర్చుకొచ్చాడు.

ఒకో మెట్టే పైకి పాకుతోందనుకుంటూన్న జీవితం, ఒకో మెట్టే దిగజారుతోందేమోననే అనుమానం కలిగింది. యీ సాయంత్రం లలిత ధోరణిచూస్తే ఆమె యీ వారం, పదిరోజుల్లోనూ చాలా దూరమైందనిపించింది. ఒకానొక అమూల్య

రత్నం దొరికినట్లే దొరికి, చేయిజారి మహాప్రవాహంలో జారిపడిపోయినంత బాధ కలిగింది...లలిత లేకుంటే సాహిత్యకళ తనలో చాలా వరకు దెబ్బతింటుంది; ఒక వేళ యీ కళంతా ఎండిపోయి, మోడై తానొక్కడే మిగిలినా ఆశ్చర్యపడాల్సింది లేదు. ఎందుకంటే తల్లిపడే కష్టాల్ని చూసి ఆమె నుంచి పొందిన ఆవేశంతో ఎలాటి కష్టాలైనా తాను అనుభవించగలిగాడో, అదేవిధంగా లలితను చూసి, ఆమె మాటల మాధుర్యంతో ఆవేశాన్ని పొంది సాహిత్య సృష్టి చేయగలిగాడు. తల్లి తనకు దూరమైన నాడు కష్టాల్ని భరించే శక్తికూడా దూరమౌతుంది; అదేవిధంగా లలిత తనకు దూరమైననాడు తన కౌశలమంతా తనను విడనాడి, తనను తనగా, కొరగాని వానిగా మాత్రమే మిగులుస్తుంది.

తనంటే ప్రాణాల్నయినా అర్పించేందుకు సంసిద్ధతను చూపిన లలిత దూరి దూరంగా జరగటం ఎందుకనో తెలియటంలేదు. ఆ కారణం ఏదైనప్పటికీ, తెలుసుకో గలిగినప్పటికీ, సమర్థించుకునే శక్తి తనకులేదు. అసలు ఇంతమార్పు ఎందుకొచ్చింది? ధనికుల మనస్తత్వంలో కలిగే విచిత్రాంలాటిదా, అర్థంలేని వారి అనుగ్రహ ఆగ్రహాల్లాటివే ఐవుంటవా? యీ కారణాన్ని తను ఏ విధంగానూ నమ్మలేకుండా ఉన్నాడు. ఎందుకంటే లలిత ధనికురాలైనప్పటికీ, సామాన్య మానవుల్లోని బలహీనతల్ని తేలిగ్గా జయించగలదు; ఆమెకు ఆ విచక్షణాజ్ఞానమూ, ఇంగితజ్ఞానమూ ఉన్నవి. అంత తేలిగ్గా మారిందంటే బలవత్తరమైన కారణాలే ఉండివుండాలి. అవి ఏమైవుంటవో ఎంత ఆలోచించినా అంతుచిక్కటంలేదు. తెలిసివుండీ తానుచేసిన నేరమేమీలేదు. తెలియక చేసిందేమన్నావుంటే, ఆ సంగతి లలితే ఏదోవిధంగా తెలియచెప్పాలి. ఆలోచనకన్న, వేచి ఉండటమే అత్యుత్తమ మార్గం.

భారమైన మనస్సుతో, చెప్పలేని దిగులుతో బాధపడుతూనే ఆ రాత్రి గడిపాడు.

## 20

కాలం నడుస్తోంది; కాలంతోపాటే లలితకూడా దూరానికి నడుస్తూన్న సూచనలు కనిపిస్తూన్నవి. ఇప్పుడామె ట్యూషన్‌కు రావటంలేదు; ట్యూషన్ మానుకున్నాననీ చెప్పలేదు. కారణం అడిగే అవకాశాలు ఉండటంలేదు. ఏం జరిగిందో, దేని ఫలితంగా లలిత తనను విడనాడిందో అర్థం కావటంలేదు. ఇదివరకల్లే యీమెను తనకేమీ సంబంధంలేని వ్యక్తిగా భావించి, సరిపెట్టుకునే మనోధైర్యం తనకు లేదు.

లలిత ఏ విధంగా తనకు పరాయి వ్యక్తవుతుంది? తనలోని కళాకారునికి ప్రోత్సాహమిచ్చి, అత్యున్నత శిఖరాలు ఎక్కించింది. తన ప్రతిభ అంటూ వుంటే, దాన్ని పైకి లాగింది. తననూ, విశేషించి తన తల్లినీ మానవులుగా స్వీకరించి, గౌరవించింది. తను చావు బతుకుల మధ్య వుంటే మృత్యువును ఎదిర్చి విజయం సాధించి

పెట్టింది. యీ పునర్జన్మను ప్రసాదించగలిగిన లలిత ఆత్మీయురాలు కాక, పరాయి దవగలదా?

అందుకే తీరని ఆందోళన. అసంతృప్తితో గిల గిలా కొట్టుకునే మనోవ్యథ. తాను చేయని, చేయలేని నేరాలూ, అపచారాలూ వూహించుకున్నాడు; తానామె మనస్సును కష్టపెట్టి వున్నట్లయితే, అందుకు మన్నించమని అడిగేందుకు వెనుకాడడు—పోరాడి సాధించుకోలేనిది, అర్థించి సాధించుకోవాలి కనుక. అందులోనూ లలిత ఎదుట తాను చాలా అల్పునివలెనే నిస్సహాయ స్థితిలో ఉండటంవల్ల, కించ పడాల్సిందేమీలేదు. ఐతే ఆ అవకాశం కూడా కలగటంలేదు. తాను క్షమార్పణ లను అర్పిస్తే ఆమె కరిగిపోయి, క్షమించగలదు. తనంటే ఇది వరకు ఆమె చూపిన అభిమానం తాలూకు ఛాయలే చాలు.

పద్మనాభం గారింట్లో కలుసుకోగలుగుతూన్నప్పటికీ, ఏవన్నా పుస్తకాలు ఇచ్చి పుచ్చుకోవటమేకాని, చివరకు సాహిత్య చర్చలుకూడా జరగటంలేదు. ఇది వరకు ట్యూషన్‌కు వెళ్ళటమంటే ఎంతో ఉత్సాహంగా ఉండేది; ఇప్పుడు ప్రాణ సంకటంగా వుంది. యీ బాధ్యత తనకు తలకు మించిందిగా, వెగటుగా తయారైంది. ఎందుకంటే రోజురోజుకూ వర్షకాలమేఘంవలె మనస్సు బరువెక్కుతూనే వుంది. ఏనాటికన్నా వర్షించి తేలికవకపోతుందా అన్న ఆశకూడా లేనట్లయితే, తను బతక టంకూడా చాలా అనవసరమనిపించేది.

లలిత చాలా ముభావంగా వుంటోంది. పద్మనాభంగారింట్లో ఇదివరకువలె తను సన్నిహితుడుగా ఉండలేక పోతున్నాడు. ఏదో పరాయిఇంట్లో, కేవలం వ్యా పారరీత్యా వెళ్ళివొస్తున్నట్లు వుంటోంది. తనంటే ఇంట్లోవాళ్లు ఇదివరకల్లే చెవికోసు కోవటంలేదు. మొదటినుంచీ ఇలావున్నా బాధవుండేదికాదు. మిగతా వ్యక్తులందరి విషయం వేరూ-లలిత విషయం వేరూను. తనను ఆ పాదమస్తకం అర్థం చేసుకున్న వ్యక్తులంటూవుంటే, తల్లి తరువాత, యీ లలితే!

కాని లలితకూడా తనను విడనాడిన చిహ్నాలు స్పష్టంగా కనిపిస్తూన్నవి. యీ ప్రణయాలమీద తనకు నమ్మకంలేదు; అవి లేకున్నా తను మాతాళుడు అవడు. కాని లలితకూ, తనకూ మధ్య పెరిగిన పవిత్రమైన స్నేహం, అతాత్తుగా తుంచివేయబడింది. మధ్యలో ఏర్పడిన యీ అగాధాన్ని చూస్తుంటే కళ్లు తిరిగిపోతున్నై. ప్రపంచంలో వున్న ప్రక్రియ ఏదైనాసరే, యీ స్నేహాన్ని తిరిగి కలపగలుగుతే, తాను ఎన్ని అవ స్థలుపడైనా సాధించితీరుతాడు.

కాలమే తనకొకమార్గం చూపిఉండాల్సింది; కాని తనపట్ల కాలానికికూడా దయలేదు. కేవలం తను దుఃఖపడేందుకు, బాధపడేందుకే నన్నట్లు కాలం ఏర్పడి, దొర్లుతోందేమో ననిపిస్తోంది. తనచేతుల్లో లేనిదానికోసం వ్యథపడి ప్రయోజనం లేదు. అందుకనే రెండుచేతులూ నెత్తిన పెట్టుకొని, తనలో తానే కుమిలిపో సాగాడు.

మనుషుల తత్వాలన్నీ ఇలాగే ఉంటవనుకొని సరిపెట్టుకోవటం ఆత్మవంచనే అవుతుంది. ఇది నిజమైతే, ఒకప్పుడు తాను లలితను మిగతా మానవులనుంచి విడదీసి దేవత్వాన్ని ఆపాదించగలిగాడుకదా! మరి ఆ లలితే ఇప్పుడు వేరువిధంగా ఎందుకు కనిపించాలి?

—ఒక్కొక్కప్పుడు తాను వెర్రిలో పడిపోతున్నాననే భావనకలిగి, ఆ మత్తు నుంచి విదిలించుకొని బైటపడేందుకు ప్రయత్నం చేస్తూంటాడు. తన పిచ్చికొని, తన బుర్ర తీవ్రంగా పనిచేయగలదని, ఏదో కొత్తకొత్త లోకాల్ని నిర్మించుకొని, గాలి మేడలకు రంగులు దిద్దుకున్నాడేకాని, జీవితానికీ, ఊహలకూ నిజంగా ఉండవలసిన దూరం తగ్గుతుందని భ్రమపడటం, ఎంత అవివేకం! ఎవరెల్లా పోతేనేం, తనకు అమ్మవుంది కదా! యీ ప్రపంచం తనపట్ల ఎంత క్రూరంగా ప్రవర్తించినా, తనను అమ్మనుంచి దూరంచేయలేదు.

అమ్మగుర్తుకురాగానే తన బతుక్కున్న అర్థం, ఆదర్శం—లలిత మెచ్చుకున్న ఆదర్శం!—కొత్త బలాన్ని చేకూరుస్తుంది. జైను-తను ఏమరి ఉండటంవల్ల, లలిత ప్రవర్తనకూడా ఒక కొత్త సమస్యను తెచ్చిపెట్టటంవల్ల ఇదివరకల్లే మాటి మాటికీ అమ్మను జ్ఞాపకం చేసుకోలేక పోతున్నాడు. ఆమె కనుక గుర్తువుంటే, మిగతావన్నీ సూర్యునిముందున్న విద్యుద్దీపాలుగాక మరేమిటి?

యీ మధ్య రచనలు మానేశాడు. ఒకపక్క ఉద్యోగాలకోసం ప్రయత్నాలు చేస్తూనే వున్నాడు. తను పెట్టిన దరఖాస్తులన్నీ ఏమవుతూన్నవో, ఇంటర్వ్యూలకు కూడా పిలుపు రావటంలేదు. పెరిగి పెద్దవుతూన్నకొద్దీ ప్రపంచం ఎంతఘోరంగా వుందో తెలుసుకోవటమే అవుతోందేమో?

ఇలా ఉంటూండగా ఒకనాటి సాయంత్రం తన అదృష్టదేవత, ఒక ఉత్తరం రూపంలో గది గుమ్మందగ్గర తన రాకకోసం ఎదురుచూస్తోంది. ఒకానొక వార పత్రిక కార్యాలయంలో సహాయ సంపాదకుని ఉద్యోగం ఇవ్వగలమనీ, నెలకు అరవై రూపాయిల జీతానికి సమ్మతిస్తే వెంటనే రావలసిందనీ వుంది. ఎక్కువ ఆలోచన లేకుండానే, యీ ఉద్యోగం వొచ్చినందుకు ఆనందపడ్డాడు. రాత్రయింది కాని, లేకుంటే ఇప్పటి కిప్పుడే పరుగెత్తుకొని వెళ్లేవాడు.

ఆ సంతోషంలో అన్నంకూడా సయించలేదు. ఎన్ని ఊహలు! ఇకేమీ భయంలేదు—అమ్మను తెచ్చుకొని, తాను మరో కొత్త ప్రపంచాన్ని సృష్టించుకో గలడు! తనూ ఒక ప్రయోజకుడైనట్లుగా రుజూ చేసుకోగలడు. ఆమె ఋణం తీర్చ గలిగే అవకాశం చిక్కింది...!

—కాని యీ ఉద్యోగం తనను లలితకు మరింత దూరాన్ని ఏర్పరుస్తుంది. ఐతేనేం—అదే మంచిది. ఏ కారణంగా, ఎందుకోసం లలిత తన జీవితంలో ఎదురైందో, ఏ కారణంగా విడిపడుతోందో తనకే అర్థంకాని స్థితిలో వుంది. ఒక

విధంగా ప్రియబాంధవి ఐంది; మరోవిధంగా తనకు పిచ్చెక్కించి వొదిలేసింది. కాదు—తనను అగౌరవపరిచి మాటవరసకన్నా మన్నించ మనలేదు కదా!

పోనీ—ప్రపంచంలో తనకు అందని వాటన్నిటినీ పోనీ-తనకు తల్లి మిగిలింది; ఆతల్లిని పోషించి సుఖపెట్టగలిగే శక్తి మిగిలింది. అదే పదివేలు. ఇక చదువా ఏం చేసుకోను? తనకూ ఆసక్తి సన్నగిలింది. ధనమంటే మోహం వాచిపోయి వున్నాడు; ఆ ధనం కొనగలిగిన అనేక సౌఖ్యాలకు నోటిలో ఊటలూరించుకుంటూ నిస్సహాయునివలె ఖేదపడుతున్నాడు. ఎవర్ని నమ్ముకొని ఏం బావుకోగలడు? ఇప్పుడు తన స్వశక్తి మీదనే నిలబడగలడు. ఇక చదువు అనవసరం. ఎక్స్పరిమెంట్లకు కాలం కాదిది—ముందుకు దూకేందుకే.

ఈ ఉద్యోగంవల్ల తనకు మనశ్శాంతి ఉండగలదు. పనిలో నిమగ్నుడై ఉంటాడు కనుక ఇతరుల్ని గూర్చిన ఆలోచనలతో సతమతమవక్కర్లేదు. లలితకు మరింత దూరమౌతాడు కనుక, తానే ఆమెను విడనాడి, క్రమంగా స్మృతిపథం నుంచి పారద్రోలగలడు. మరీ మాతృసేవలో కాలం గడుస్తూంటుంది కనుక బాధ వుండదు.

ఈ సంగతి తల్లికి చెప్పటమా, మానటమా అని చాలాసేపు ఆలోచించాడు. ఆమెకు చెప్పందే ఆమె పని మానేసి రాదు. కాని చెపితే ఏళ్ళతరబడిగా చదువుచ్చిన తన కష్టమంతా పాడైందని బాధపడుతుందేమో? తాను చేసే పని చాలా తేలికైనదీ, ఉపయోగపడేదీ ఐనప్పటికీ అమ్మకు అర్థమవదు. ఏమున్నా కూర్చున్నదంటే తన హృదయం భిన్నాభిన్నమౌతుంది. సమయంచూసి చెప్పాల్సిందే కాని, వెంటనే మాత్రం కాదు.

తాను చదువుమాని ఉద్యోగం సంపాయించి తల్లిని సుఖపెట్టే ప్రయత్నంలో వున్నానని చెప్పినప్పుడు లలిత ఎంతో మెచ్చుకుంది. ఇక ఇప్పుడది సాధించే అవకాశం లభించింది. యీసంగతి లలితకు చెప్పటం తన కనీసబాధ్యత. ఆమె ఏమన్నా అనుకోనీ, చెప్పి తీరవలసిందే. పద్మనాభంగారింట్లో ట్యూషన్ ఇక ఎలాగూ కుదరదు. అక్కడా యీ సంగతి చెపుతాడు; కాని లలితకు ప్రత్యేకంగా చెప్పాలి. ఏటూ తెగతెంపులు చేసుకోబోతున్నాడు తను.

ఇన్నాళ్ళూ జీవితం తనను పిండింది; ఇప్పుడు జీవితాన్ని తను పిండుకోవాలి. యీ సారమే ధనరూపాన తనకులక్ష్యమై, తననూ తల్లినీ సుఖపెట్టగలుగుతే అదే పదివేలు...యీ రకం ఆలోచనలతో మగత నిద్రతోనే సూర్యోదయానికై ఎదురు చూడసాగాడు.

జల్లుపడుతూన్నా లెక్కచేయకుండానే ఆత్రుతతో పత్రిక కార్యాలయానికి చేరాడు; ఎనిమిది గంటలైనా తలుపులింకా తెరువబడలేదు. తన తొందర, తనకలా

అనిపిస్తోంది కాని, మరేమీ కాదని అర్థం చేసుకున్నాడు. కాలు కాలిన పిల్లల్లే, కాలం గడిపేందుకు అటూఇటూ తిరగసాగాడు. సన్నని వానతుపర ప్రాణానికి హాయిగావుంది; అంతకన్న తన జీవితంలో కలగబొయ్యే మార్పు, ఆ కొత్తజీవితంలోని సుఖాలు, అమ్మ నవ్వుతూ తనకోసం ఎదురుచూడటం, తనకు నిద్రరాకుంటే ఆమె చిచ్చికొట్టడం మొదలైనవన్నీ ఊహించుకోవటంవల్ల, యీ హాయి రెండింతలై, గాలిలో తేలుతూన్నట్లనిపించింది.

పదిగంటలయ్యాక కాని కార్యాలయంలోకి ఒక్కరొక్కరే రావటం జరగలేదు. పదకొండింటికి సంపాదకుడొచ్చాడు. ఆయన్ను చూడగానే తనకు కాళ్ళు వొణికినవి. తన జీవిత సర్వస్వమూ ఆయన చేతుల్లోవున్నదనిపించింది. ఇంతకుముందు ముఖూ మొహం ఎరుగని వ్యక్తి ఎదుట భయపడిపోవటం చిత్రమే. కాని తన జీవిత విధానమే అలా తయారైంది.

సంపాదకుడు పైకి కనిపించేటంత కరుకుమనిషి కాదు. చాలా నెమ్మదస్తుడు; మంచి మర్యాదలున్నవి. ఆయనకూడా తనలాగే ఉద్యోగం చేసుకుంటున్నాడు; తనతో దయగా మాట్లాడాడు. కార్యాలయంలోని కష్టసుఖాల్ని వివరించాడు.

—అవసరమైతే రాత్రింబవళ్లు పనిచేయాల్సి వుంటుంది. ఆలోచించే వ్యవధి ఉండదు కనుక, భుజబలాన్ని ప్రయోగించి రాసుకొని పోవాలి. పత్రిక సకాలంలో వెలువడటం అతి ముఖ్యం కనుక, భూమ్యాకాశాల్ని ఏకం చేసయినా సరే, ఏదో విధంగా పత్రికను బైటపడెయ్యాలి. కష్టం, సుఖం అనే పదాల్ని గూర్చిన తలపులే పనికిరావు—తలొంచుకొని పనిచేయటమే ముఖ్యం. ఇదంతా ఆలోచించుకొని మరీ దిగమన్నాడాయన; తీరా ఉద్యోగంలో ప్రవేశించాక, నెల తిరక్కుండానే మానుకోవటం మంచిది కాదన్నాడు.

ఆ చెప్పే ధోరణిచూస్తే, గానుగ ఎద్దుల సామెత గుర్తొచ్చింది తనకు; తను కూడా జంతువే ఐతే యీ వెధవ ఆలోచనలు ఉండేవి కాదు కదా! ఒక విధంగా మేధస్సుకు గర్వించే మానవునికన్న, మెదడులేని జంతుజాలమే సుఖపడుతోందేమో ననిపిస్తోంది...యీ వెట్టి చాకిరీతో కళాకారుడు నశించి, వాడిస్థానే కార్మికుడు తయారవుతాడనేది నిస్సందేహం. ఐతే కళాకారుడు తనను జీవించనిచ్చి, సుఖపెట్టేందుకు సంసిద్ధుడుకాడు; ఇక ఆ కార్మికుణ్ని నమ్ముకోక తప్పదు. పని ఎంత కష్టమైనప్పటికీ తానీ ఉద్యోగాన్ని స్వీకరించేందుకు వెనుక ముందుల ఆలోచనే అవసరంలేదు. కష్టతరమైన పనే తనకిప్పుడు కావాల్సింది. మనస్సు పరి పరి విధాల పోకుండా గురుతర బాధ్యతలే తనను తొక్కివుంచాలి. ఇందువల్ల తాను ఆశించిన మనశ్శాంతికూడా లభ్యమౌతుంది.

ఇదివర కతను ఎందుకు మానుకున్నాడో తెలుసుకోవాలని వుంది తనకు. కాని అడుగుతే ఆయన ఏమనుకుంటాడోనని ఊరుకున్నాడు. ఆయన మాటలు తనను బెదర కొట్టేందుకు మారుగా, దాపరికం లేకుండా చెప్పినవిగానూ, ఆకర్షణీయం

గానూ తోచినవి. ఆయన చెప్పిన మాటలన్నిటికీ సరేనని ఒప్పుకున్నాడు. సంపాదకుడుకూడా చాలా సంతోషించాడు. ఆయన పేరు శర్మ.

'అంతకన్న నిష్టూరంకన్న, అది నిష్టూరం మేలు. మీరు చాలా చిన్నవారు. ప్రపంచానుభవం తక్కువ కనుక నేను చెప్పాల్సిన మాటలన్నీ చెప్పాను...ఇదివరకటతను యీ ఉద్యోగంకన్న వ్యవసాయం చేసుకోవటం మేలని వాళ్ళ వూరు వెళ్లి పొయ్యాడు—' అన్నాడాయన.

ఏమో—తనకూ కొద్ది కాలానికే అలా అనిపించవొచ్చు. కాని ఎక్కడ, ఎట్లా వ్యవసాయం చేస్తాడు తను? తనకు పొలం ఏది? వ్యసాయానికి తను ఉపయోగపడాలంటే, నోరులేని పశువులకూడు తీసేసి, నాగలి మెడమీద వేసుకోవాలి ...దానికన్న యీ ఉద్యోగమే వేయిరెట్లు మేలనిపించింది.

తనకు మరిగతిలేదు కనుక ఎంత కష్టనిష్టూరాన్నయినా భరించిపడివుంటాడు. ఇంకా పనిలో ప్రవేశించక ముందే, దాన్నిగూర్చిన వింత ఆలోచనలకు అర్థం ఉండదు. అందుకని శర్మ చెప్పే మాటన్నిటికీ బుర్రవూపాడు.

చివరకు ఆయనకూడా చాలా సంతోషించాడు. ఇదివరకు యీ వారపత్రికలోనే తన కథలు చాలా అచ్చయినవి. ఆ అభిమానంతోనే ముందుగా తనను పిలిచారు.

'సరే పనిలో ప్రవేశించండి. మిమ్మ స్థిరపరిచానని యజమానికి చెప్పివొస్తాను—' అని ఆయన కిందికి వెళ్ళాడు.

యీ ప్రవాహంలో తనకూ నొక ఆధారంవుంది. ఇది తనకు స్వర్గానికి నిచ్చెన అవకపోవుగాక, కేవలం బతికించగలుగుతుంది. అంతకన్న ప్రస్తుతానికి కోరదగింది మాత్ర మేమిటి?...తానీ విషయాన్ని తనకు ఆత్మీయులనుకున్న వారికి యీనాడే చెప్పిరావాలి. తల్లికి కాదు—పద్మనాభంగారింట్లోనూ, ముఖ్యంగా లలితకూ, కాలేజీలో, తనంటే ఎంతో అభిమానంచూపే ఇద్దరు ముగ్గురు ప్రొఫెసర్లకూ చెప్పాలి. మరొన్నటినుంచీ పనిలోకివొస్తే బాగుంటుం దనిపించింది. కాని మొదటి రోజూనే సెలవు అడగటంతో శర్మగారు ఏమన్నా అనుకుంటారేమోనని భయంవేసింది. అదీగాక ఆయనఅన్న పనిలోని ఆకష్టం ఏమిటో ఇప్పుడే, ఇక్కడే అనుభవపూర్వకంగా కొంతవరకన్నా తెలుసుకోవొచ్చు.

శర్మగారు తిరిగి రాగానే, మూడు రాజకీయ వ్యాసాలుఇచ్చి, వాటికి తెలుగు చేయమన్నాడు. తనకు వేరే టేబిలూ, కాగితాల కట్టలూను...ముందా రచనల్ని చదివాడు. తేలిగ్గా అర్థం అవుతున్నవి కాని, చాలా తలనెప్పిగా ఉన్నవి. ఐతే వీటిని చదివేవాళ్ళు ఉండిఉండాలి. వాళ్ళకోసమేగా యీ చాకిరీ అంతా!

అనువదించ సాగాడు. ఇంతకుముందు యీ అలవాటు లేకుండటంవల్ల, కలం చకచకా సాగటంలేదు. మధ్యమధ్యవొచ్చే రాజకీయ పదాల తాలూకు తెలుగు

బాధాకరంగా వుంది; దానికి వేరే శబ్దరత్నాకరం వుంది; దాంట్లో చూసి రాయ సాగాడు.

మధ్యాహ్నం కాఫీహోటల్లో మెక్కి, మొత్తంమీద ఆ మూడు వ్యాసాల్నీ రాసిచ్చాడు. శర్మగారు అక్కడక్కడ చూసి, సరిగ్గా కంపోజుకు పంపేశాడు. ముఖ కళను బట్టిచూస్తే ఆయన తనపనికి తృప్తిపడినట్లే తోచింది.

సాయంత్రం ఆరింటికి బైట పడ్డాడు. అలవాటులేనిపని చేసినందువల్ల వేళ్ళన్నీ నెప్పి పెడుతున్నవి. దగ్గిర హోటల్లో చపాతీలు తిని, పాలుతాగి గదికి జేరాడు. పడుకున్న తర్వాత, యీ సువార్తను చేరవేయవలసిన వ్యక్తులు మళ్లీ జ్ఞాపకం వొచ్చారు. ఇది అసమయం; అదీగాక, తనకు తిరిగే ఒపికా లేదు. రేపు మాటా కుదరదు. ఎల్లుండి ఆదివారం కనుక, బహుశా సెలవు వుంటుంది. ఆ రోజు ఒకసారి ఊరంతా చుట్టిరావొచ్చునని సమాధాన పడుచున్నాడు.

పడుంవాల్చాక, అలసిన శరీరాన్ని నిద్రపోనీకుండా మెదడు పెద్ద తిరుగు బాటు చేస్తోంది. యాంత్రికమైన జీవితానికీ, బానిసబుద్ధికీ కూడా సిద్ధమయ్యావని దూషించింది తనను. నిజమే - తన ప్రతిభ ఏముంది! ఏదో అనువాదం, అది సాహిత్యమన్నా కాదు — చెత్తను, చెత్తగానే రాయవలసిన ఖర్మ పట్టింది. కళాకారుని పీక నొక్కివేశాడు తను. తనేమిటి — తన స్థితిలో ఎంతమంది యీ విధంగా కుమిలి పోతున్నారో?

అంతరాత్మలు చెప్పే విషయాల్ని ఆచరణలో పెట్టటం గొప్ప విషయమే అవుగాక; ఆత్మతృప్తికి అవకాశం ఉండుగాక... కాని ప్రపంచంలో ఆత్మలకే ప్రాధాన్యతవుంటే, లోకం ఇంకో రూపంలో ఉండేది. తను సామాన్య మానవుడు. తన హక్కులనేవి ఏమన్నావుంటే, వాటిని సాధించుకునే పరికరాలు తనకు లేవు. కనుక, అవసరాలనేవే ఆత్మల ప్రాధాన్యతను తగ్గిస్తూన్నవి. ఇది కారణంగానే ప్రస్తుతానికి తన ఆత్మను ఒక మూలకు నెట్టివేశాడు.

మర్నాటి నుంచీ జీవిత విధానంలో మార్పు తెచ్చుకున్నాడు. ఇది వరకులాగే పొద్దున్నే అన్నం వొండుకోవటం, తిని బయలుదేరటమూను. ఐతే కాలేజికి గాదు ఆఫీసుకు వెళ్తున్నాడు. తన కోసం ఎదురుచూసే ప్రశ్నల కట్టలూ, అనువాదం కోసమై కాచుకుండే అచ్చు కాగితాలూ సిద్ధంగా ఉన్నవి. శర్మగారు చెప్పినట్లు ఆలోచనా రహితంగా బుర్ర వొంచుకొని పని చేయటమే తనకు మిగిలింది.

రెండు రోజులు గడిచేప్పటికి పని కొంత అలవాటయింది. పనిలో ఉత్సాహం లేక పోయినా, బాధ్యత, అవసరం, తనను ముందుకు తోస్తూన్నవి. ఏదో వొక బలవత్తర శక్తి వెనుక ఉండకుండా మానవుడు కదలలేడేమో!

తానేదో నీచకార్యం, మనసుకు కష్టం కలిగించేది, తనకు చాలా అయిష్టమైంది చేస్తున్నాననే బాధ వుంది, కాని ప్రపంచంలోని నీచకార్యాలను లెక్క

చూసుకుంటూ కూర్చుంటే అసలు బతుకులే సాగవు; ప్రపంచ విధానమే తారుమారవుతుంది. మిగతా వాటితో పోలిస్తే, తన యీ బతుకు అంత అధ్వాన్నంకాదు. చేసే పనినిబట్టి కాకుండా, దాని ఫలితాన్నిబట్టి ఉచ్ఛనీచాల అంచనాలుంటే, తాను సాధించగలిగే ఆదర్శాన్ని దృష్టిలో పెట్టుకుంటే, తన యీ ఉద్యోగంలోని నైచ్యం ఒక లెక్కలోకి కాదు. ఐనా యీ తర్జన భర్జనలకు తనకు తీరికెక్కడ? ఏది న్యాయమో తెలియకా, ఇన్ని అన్యాయాలు ప్రపంచంలో జరుగుతోంది?

ఆదివారం ఉదయంకూడా పని వుండటంవల్ల, మధ్యాహ్నానికి కాని తీరుబడి కాలేదు. సరాసరి అమ్మను చూడబోయ్యాడు.

'నాయనా! బాగా చదువుకుంటున్నావా? ఎక్కువ శ్రమపడొద్దు. మనిషివి నలిగినట్లు కనిపిస్తున్నావ్!' అందామె.

తనింకా చదువు కుంటున్నాడనే అనుకుంటోంది. కాదని చెపితే, ఆమె చాలా కష్టపడుతుంది. ఇక నలగటం—తను నిజంగా నలగటమనేది మూడు రోజులకు ముందే ఆరంభమైంది. కాని జీవితమంతా నలుగుతూన్న తనమీద తనకు లేని జాలి, యీ పిచ్చితల్లి తనమీద చూపుతుంది! అందుకే తల్లి ఎదుట నిలబడినప్పుడు తను అల్పుడవుతాడు. ఆమె మాటల మాధుర్యం కుంగదీస్తుంది.

'అమ్మా! నీవుకూడా చాలా అలసిపోయినట్లున్నావ్. వొంట్లో బాగోవటం లేదా?' అన్నాడు.

'బాగానే వుంది—' అందామె 'యీ మధ్య ఒకరోజు తలనెప్పి, జ్వరం వొచ్చాయి. ఇప్పుడు కాస్త నయమే'

అమ్మ మనిషా అనిపించింది. ఏదో మహత్తర శక్తి ఆమెలో ప్రవేశించి యీ బండ చాకిరీ చేయిస్తోంది. ఆశక్తికి కారకుడు తనేనేమో?

'ఆరోగ్యాన్ని సరిగా కాపాడుకోవే అమ్మా! ఏమిటో—నిన్ను చూస్తుంటే నాకు దిగులవుతూంటుంది' అన్నాడు తను.

'పిచ్చి తండ్రీ కదరా!' అందామె తల నిమురుతూ 'దిగులెందుకు? శరీరంలోవున్న ప్రాణం ఖర్చయేందుకేకదా? రేపు నువ్వు పెద్ద ఉద్యోగం చేసిననాడు, సుఖపడేందుకే రోజులుండవా?... అన్నట్లు లలితమ్మ బాగుందా? ఒకసారి నీ దగ్గిరకొచ్చి, ఆమెను చూడాలని వుందిరా.'

గతుక్కుమన్నాడు తను. లలిత రోజూ తనగదికి రాకపోకలు సాగిస్తోందని అమ్మ అనుకుంటోందేమో? ఆమె దృష్టిలో ఇది తప్పుగాక పోవొచ్చు, లేదా తామిద్దరిమధ్యా వున్న స్నేహానికి వేరొక స్పష్టమైన రూపునిచ్చి నమ్మి ఉండొచ్చు. ఐతే అదంతా నిజంకాదనీ, ఏదో తను చావుబతుకులమధ్య వేళ్ళాడుతూ వుంటే ఆమె సానుభూతి చూపేటంతవరకే తమ స్నేహమనీ చెప్పాలనుకున్నాడు. కాని యీ విషయంమీద వాదించటం, అమ్మను ఒప్పించటం ఇష్టంలేదు. ఆగా

ధంతా తవ్వి, తనను తాను గాయపరుచుకుంటూ, అమ్మనూహల్లోపొందే విచిత్రానుభూతిని పాడుచెయ్యటం అనవసరం. అందువల్ల అయేదీలేదు. పోనీ లలిత ఇప్పుడు తనకు దూరదూరంగా వుంటోందనీ, ముభావంగా ప్రవర్తిస్తోందనీ, మరీ తానీ ఉద్యోగంలో జేరాక మరింత దూరమౌతోందనీ చెపితే, లలితనుగూర్చిన తలపులే ఉభయులకూ ఉండకుండా అంతరించే ప్రయత్నాలు జరుగుతవి. యీ సంగతుల్ని, తనకుతానే సమాధానపరుచుకోలేని స్థితిలో, తల్లికి ఏమని, ఎట్లా చెప్పగలడు? అందులోనూ తనకులాగే, లలిత, తల్లికికూడా ఒక సమస్యగానే తయారైన స్థితి! అందుకనే మెదలకుండా వూరుకున్నాడు.

బహుశా తాను సిగ్గుపడి ఏమీ మాట్లాడటంలేదని అమ్మ అనుకొని వుండాలి 'పిచ్చి నాన్నా!' అని తల నిమిరి, కళ్లు మూసుకొంది.

'సరే వొస్తానమ్మా—' అంటూ, ఆ తలపుల్ని ఆమెకే వొదిలి మెల్లిగా బైటపడ్డాడు.

తను సాధించగలిగింది లలిత అనురాగం కాదు, ఉద్యోగం అంటే అమ్మకు ఎంతో అసంతృప్తి కలుగుతుంది; చదువు పాడు చేసినందుకు చాలా నొచ్చుకుంటుంది. ఏనాటికైనా యీ సంగతులన్నీ ఆమెకు తెలుస్తవి; తెలియకుండా దాచటం, ఆమెకు ద్రోహం చేయటమే అవుతుంది. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా ఆమెకు సంజాయిషీలతో సహా మనసువిప్పి మాట్లాడాల్సిన బాధ్యత తనకు వుంది.

తరువాత ప్రొఫెసర్ల ఇంటికి వెళ్లి తాను చదువు మానేస్తున్నట్లు చెప్పాడు. ఒకాయన చాలా ఆశ్చర్యపడి 'ఎందుకని?' అని అడిగాడు; తను అసలు కారణాన్ని దాచేసి, ఏవేవో కుంటి గుడ్డి సాకుల్ని చెప్పాడు; అవి ఒక దాని కొకటి అతకలేదు.

'నీకు డబ్బుకు ఇబ్బందైతే నేను సర్దుతాను. బాగా చదివే కుర్రాడు చదువు మానటం కాలేజికే నష్టం!' అన్నాడాయన.

తన యీ దీనావస్థలో దయచూపేవారు కూడా ప్రపంచంలో ఉన్నారు. కాని ఆ దయను స్వీకరించటమే కాని, కృతజ్ఞతతో దాన్ని తీర్చటమూ తన చేతకాదు. అందుకనే ఇలాటి వ్యక్తులు ఎదురైనప్పుడు, తను వొణికి పోతాడు. భరించలేని అశక్తతతో పారిపోతాడు.

కళ్ళనీళ్ల పర్యంతమైంది తనకు. కఠినమైన పదాలు ఎంత గాయపరుస్తవో, ఒకొకప్పుడు దయాపూరితమైన మాటలూ అంత గాయపరుస్తాంటవేమో?

'అదేం కాదండీ ..' అని ఇంకా మాట్లాడబోతే ఏడవాల్సి వొస్తుందని గబగబా బైటికి నడిచాడు.

తను తనకాళ్లమీద నిలబడాలి. ఎవ్వరి సహాయమూ అక్కర్లేదు. ఆ స్వేచ్ఛను సాధించి నిలబెట్టుకునేందుకు తను విశ్వప్రయత్నం చేయాలి. అందుకనే తను ఎప్పుడూ, ఎవర్నీ ఏదీ అర్థించలేదు. అంతేకాదు—దాసంతటదిగా వొచ్చేదాన్ని

కూడా భరించలేడు. తనూ మానవుడు; తనకూ పరువు మర్యాదలు, కనీసం, మాన వుడిగా జీవించేహక్కు వుంది. దాన్ని రుజూచేసుకునేందుకు తానిప్పుడు అవలం బించినమార్గం ఉచితమైనదనే సంగతి మరింత స్పష్టంగా తెలుస్తోంది.

ఇక మిగిలింది పద్మనాభంగారింట్లో చెప్పటం. అక్కడికి జేరేప్పటికి ఆరు న్నరయింది. పద్మనాభంగారూ, రమణమ్మగారూ పోర్టికోలో కూర్చొనివున్నారు. చిట్టి తోటలో ఆడుకుంటోంది. ఆ ప్రాంతాల్లో లలిత ఎక్కడన్నా కనిపిస్తుందే మోనని చప్పున ఒక్కసారి కలయచూశాడు; ఆమె లేదని తేల్చుకో గలిగాడు.

వాళ్ళదగ్గిరికి వెళ్ళి నమస్కరించాడు. పద్మనాభంగారు నవ్వుమొహంతో కూర్చీచూపి 'కూర్చోండి' అన్నాడు.

తను నిలబడే 'ఏంలేదు... నేనొక వారపత్రికలో ఉద్యోగం సంపాయిం చాను. చదువుకూడా మానేస్తున్నాను. ఇక ట్యూషన్‌కు రానని చెప్పేందుకు వొచ్చాను' అన్నాడు. తనన్న మాటలన్నీ చాలా వ్యాపారసంబంధంగానే ఉన్నవి. ఇదివరకులాగె తనకు ఆప్యాయత ఏనాడైతే యీ ఇంట్లో కరువైందో, ఆనాటినుంచే హృదయం మండిపడుతోంది; కరుకు లింది. అందుకనే పాఠం అప్పగించినట్లు, నిర్లిప్తంగా, నిర్లక్ష్యంగా మాట్లాడాడు.

పద్మనాభం గారికి వెంటనే అర్థంకాలేదు. రమణమ్మగారు ఆలోచిస్తోంది. ఇక తన బాధ్యత తీరింది కనుక, వెళ్ళిపోదామా అనుకుంటున్నాడు.

'కూర్చోండి...' అన్నాడు పద్మనాభంగారు. విధిలేక కూర్చున్నాడు తను.

'మరి రెండు నెలల్లోనే పరీక్షలొస్తున్నవి కదా-ఇప్పుడు చదువు మానట మెందుకు?' అన్నాడాయన.

ప్రపంచంలో తనుచేసే ప్రతి పనికీ, ప్రతి వాడికీ సంజాయిషీ చెప్పుకోవల్సిం దేనా? ఇలా చెప్పి అందర్నీ తాను ఒప్పించగలడా? ఐతే ఆయన చాలా సదుద్దే శ్యంతోనూ, తన మేలుకోరే వాడిలాగా అడిగాడు.

'ఏంలేదు...మా అమ్మ జబ్బు మనిషి. ఆమెను చూస్తూండాలి. దానికీ, చదు వుకూ తూగదు' అన్నాడు.

యీ జవాబు అతకలేదు. అదృష్టవశాత్తూ పద్మనాభంగారుకూడా సాగదీయ లేదు. రమణమ్మగారు మాత్రం 'ఉద్యోగం చేసుకుంటూ ట్యూషన్ చెప్పేందుకు వీలుండదా?' అని అడిగింది.

'ఒక్కొక్కప్పుడు ఆఫీసునుంచి వొచ్చేప్పటికే చీకటిపడుతూంటుంది. నాకూ ఇబ్బంది, మీకూ ఇబ్బంది——' అని నీళ్ళు నమిలాడు తను.

ఇంతలో చిట్టి పరుగెత్తుకుంటూ వొచ్చింది. తనమీద అచంచలానురాగాన్ని వర్షించిన యీ పిల్ల, తను ఎంతో ముద్దుగా, అభిమానంతో చదువు చెప్పిన చిట్టిని

చూస్తే హృదయం ద్రవిస్తోంది. చిన్న పిల్లల్తో, వారి ముద్దు లొలికే మాటల్తో, కల్మ షాన్నెరుగని పసి హృదయాలతో తన్మయుడవగలడు తను... కాని తన చేతుల్లో ఏ మున్నదని-ఏ సుఖం తనకు దక్కింది కనుక ?

'చిట్టీ! నేనిక ట్యూషనుకు రాను...జాగర్తగా చదువుకో తల్లీ' అన్నాడు.

ఆమె నివ్వెరపోయింది; క్షణంలో విషాద మేఘమేదో నిర్మలమైన ఆమె ముఖాన్ని అడ్డింది. అనుకం తాగేప్పుడు పెట్టినట్లు మొహంపెట్టి 'ఎందుకని మాస్టారూ? మీరు చెప్పినట్లే వింటాను. లెక్కలన్నీ చేస్తాను. అల్లరి చేయనుగా!' అందామె. తనమీద అలగటంవల్ల పారిపోతున్నాడనుకుందేమో? పెద్దలు పిల్లల్ని సముదాయించినట్లే, పిల్లలు పెద్దల్ని సముదాయించే పద్ధతిగా ఆమె భావించిందేమో?

'అదేం కాదమ్మా!...నేను ఉద్యోగంలో చేరాను' అన్నాడు. ఒకపక్క కళ్లు తడి అవుతున్నవి. యీ పెద్దమనుషుల ఎదుట భోరున ఏడుస్తే, తన అసమర్థత, దైన్యావస్థ బైటపడిపోతుందేమోనని భయం. ఏడ్వకుండే ఆ విచార మేఘం బరువు తననే కుంగతీసేటంత తీవ్రంగా వుంది.

'వొస్తానండీ...వొస్తాను...లలితకుకూడా చెపుదామనుకున్నాను...మీరన్నా చెప్పండి' అని నమస్కరించి, రెండడుగులు వేశాడు. పద్మనాభంగారి పిలుపు విని ఆగిపోయి, వెనక్కు తిరిగాడు.

ఆయనే ముందుకునడిచి, మూడు పదిరూపాయిల కాగితాల్ని చేతికి అందించాడు!

యీ సొమ్ము అక్రమమైనదనీ, తను స్వీకరించటం అన్యాయమనీ అనిపించింది. నిజానికి జీతంకూడా, అందులోనూ యీ పదిరోజులకూ, కాగు - ఇందులో మానుకున్న మూడురోజులూ పోను, వారానికి ఏ మొహంపెట్టుకొని అడగగలడు ? అడగకుండానే ఇచ్చినా తీసుకో గలడు?

'వొద్దండీ...నాకేమీ ఇవ్వొద్దు' అన్నాడు.

'కాదు వుంచండి...మీరేదో ట్యూషన్ చెప్పారని కూడా కాదు...' అని బలవంతాన ఆయనే జేబులో పెట్టాడు. తర్కాలతో లాభంలేదు. వాతావరణమంతా కేవలం తనను పిండి పిప్పిచేసి పారేసేదిగా నేవుంది. ఇక ఆ ప్రదేశంలో నిలువలేక, పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ గదికి జేరాడు.

యీ నాడు జరిగిన సంఘటనలన్నీ వరసాగ్గా జ్ఞాపకం చేసుకుంటూంటే, పెనుగాలిలో కొట్టుకునే చిగురుటాకల్లే హృదయం కొట్టుకోసాగింది. ప్రపంచంలో ఎంత క్రౌర్యంవుందో, అంత దయకూడా వుంది; ఎంత అన్యాయం, అక్రమంవుందో, అంత న్యాయమూవుంది. ఎటొచ్చీ యీ రెండూ కలగాపులగంగా ఉండటంవల్ల,

ఎక్కడ ఏది దొరుకుతుందో తెలియకుండా వుంది. యీ కలిసిపోవటం కూడా బియ్యమూ, నల్లరాళ్ళవలె గాకుండా, పాలూ నీళ్ళవలె ఉండటంవల్ల—హంస పద్ధతిని అనుసరిస్తేనే కాని విడదీయలేకుండా తయారైంది.

ముఖ్యంగా తను లలితకు చెప్పలేక పొయ్యాడు. మిగతా వాళ్ళమాట లన్నీ ఒక ఎత్తూ, ఆమె మాట లొకఎత్తూను. ఆమె సలహాచేసేది; కాదు—తన ఆదర్శాన్ని హృదయపూర్వకంగా మెచ్చుకున్నది కనుక, దాన్ని సాధించేందుకు చేసిన యీ ప్రయత్నాన్ని తప్పకుండా ప్రోత్సాహపరిచేది. మిగతావాళ్ళకు తను అర్థంకాడు. అర్థమైన వ్యక్తికి చెప్పలేక పోయినందుకు విచారం.

ఏమో—ఇప్పుడు ఆమెకూడా పూర్తిగా మారిపోయింది. వినీవిననట్లు, పట్టించీ పట్టించుకోనట్లు వుంటుందేమో? ఆమె అనుభూతులు ఎలా వున్నప్పటికీ, తాను బాహ్యతగా భావించేది సఫలమవలేదు కదా!

ఆమెనిక బహుశా జీవితంలోనే కలుసుకోలేడు. యీ నాడు చివరిసారి కలుసు కొని ఉండవలసింది! అని పోసగలేదు. ఆమె తనకిక కనిపించదనే ఆలోచన రాగానే శూలం గుచ్చుకున్నంత బాధ కలిగింది...కాదు...ఎప్పుడన్నా, ఎక్కడన్నా కలుసు కుంటేమాత్రమేం? రోడ్డుమీద ఎదురయ్యే అనేక ముఖాల్లో ఆమె ముఖంకూడా ఒకటవుతుంది. కొద్దిరోజుల్లో బహుశా ఆమెకు వివాహమై అత్తవారింటికి వెళ్ళి, లోకాచారంగా పిల్లలతల్లి అవుతుంది. తన చేయిజారి పొయ్యాక, ఆమె ఏమైతే తనకేం?...ఛీ...ఛీ...ఏమిటీ పాడు ఆలోచనలు? తనకు దక్కలేదని ఆమెమీద కోపమా? ఏహ్యభావమా? ఎందుకు?

'లలిత సుఖపడుగాక' అనుకున్నాడు అంతరాత్మలో. నిజంగానే ఆమె సుఖపడి, పదికాలాలపాటు బీదకూ, బక్కకూ ఆసరాగా వుండగలదు. ఆమె స్వభా వమే అంత! అలాటివ్యక్తులు యీ బాధిత ప్రపంచానికి కల్పతరువులు. ఆమె తనపట్ల అనురాగాన్ని వర్షించకుంటేనేం? తన స్వార్థాన్ని దృష్టిలో పెట్టుకోవటంవల్ల ఇలా దిగజారి పోతున్నాడేకాని, ఆమె తత్వాన్ని విశాలభావంతో చూసినట్ల యితే, మానవుల మధ్యవుండే దేవకన్యే కాగలదు. ఇక యీ ఎడబాటనేది ఎటూ తప్పదు కనుక, అది ఎంత త్వరగా జరిగిపోతే అంత మంచిది.

తాను లలితకు స్వయంగా చెప్పలేక పోయినా రమణమ్మగారే యీ వార్తను ఆమెకు జేరుస్తారు. బహుశా విని వూరుకుంటుంది...ఊరుకుంటుందా? తనను వెతు క్కుంటూ వొచ్చి, మాట్లాడదా? తానామెకు ఎలాటి హానీ చేయలేదు; ఆమె నుంచి ఏమీ అర్థించలేదు. నిజానికి మొదట్లో ఆమెనుకూడా తప్పించుకునే తిరిగాడు. కాని ఆమే కావాలని తన దరిదాపులకు వొచ్చి ఆత్మీయతను సాధించు కుంది. ఆమె సాధించుకున్న దాన్ని, ఆమె వొదులు కోవటం న్యాయమే! తానం దుకు బాధపడటం కేవలం తన దుర్బలత్వం.

అనేక ఇతర కష్టాల వలెనే. తనూ క్రమంగా కష్టపడి లలితను మరిచి పోగలడు-మరువక తప్పదు. అది ఉభయులకూ క్షేమకరమైన మార్గం. ఐనా లలిత తనకు ఏ ఆశలు చూపి మోసం చేసిందని ఆమెను నిందించగలడు! ప్రపంచంలోని వ్యక్తులమీదపడి ఏడుస్తాం కాని, నిజానికి తనకు తాను చేసుకున్న దానికి ఎవరు బాధ్యులు! గోరంతలు కొండంతలుగా ఊహించుకొని, నిధి తనకేదో దొరకబోతు న్నదని నమ్మటం మూర్ఖత్వమే అనగలను. ఇక తన తప్పును తానొక్కడే భరించలేక, వారా వీరా అని తలా కొంత పంచేందుకు సిద్ధమై, ఇందులో లలితకు ఎక్కువ భాగాన్ని పంచేందుకు చూశాడు. పాపం ఇదంతా ఆమెకు తెలియదు. మంచి మనసుగల మగువ. ఆమెను గూర్చి ఏమేమో అనుకోవటం తన అల్పత్వం.

తనను తానే నిందించుకుంటూ, క్రమంగా నిద్రకు లొంగి పోయాడు.

## 21

పగటిపూట బొత్తిగా తీరిక వుండదు. ఆఫీసులో చేతులు పడిపోయేట్లు రాస్తేనే కాని పని తెమలదు. ఏం రాస్తున్నాననేది కాకుండా, ఎంత రాస్తున్నాననేదే లెక్క. అంతరాత్మ గొంతు పిసికేసి, భుజబలాన్ని ప్రదర్శించటమే బతుకుబాటగా తయారైంది. తనస్థితి తలుచుకుంటే ఆవుర్న ఏడవాలనిపిస్తుంది. ఉద్యోగి నయ్యాననే ఉత్సాహాన్ని, కళకు ద్రోహం చేస్తున్నాననే బాధ మింగింది. గొప్ప నేరం చేసి, పట్టుబడక, తప్పించుకొని తిరుగుతూ తన అంతరాత్మకు చేసుకున్న గాయంతో ప్రతి క్షణమూ గిలగిలా తన్నుకుంటూన్న స్థితిలో పడ్డాడు. చూస్తూ చూస్తూ సాలెగూడులో ఇరుక్కున్నట్లయింది. దీనికి వేరే మార్గమేదీ లేదు. క్రమంగా అలవాటైతే తప్ప యీ బాధ తగ్గదు.

పగలు ఊపిరి తిరగదు కనుక అమ్మసంగతి కానీ, లలితసంగతి కానీ గుర్తుకు రాదు. ఇక రాత్రి, ఎంత అలసివున్నప్పటికీ, శరీరం విశ్రాంతికోరుతూన్నా, మనసు మాత్రం తన ఆత్మబంధువు లిద్దర్నిగూర్చి తర్కిస్తూంటుంది.

తన యీ ఉద్యోగం సంగతి లలితకు తప్పకుండా తెలిసేవుంటుంది. తనే చెప్ప లేదు - కాని, ఆమె కనిపించక పోవటం తనకే స్పష్టం కాదూ! ఐతే ఆమె ఏమను కుందో? తనొక అగాధంలో పడిపోయిన సంగతి తెలివిగల లలిత గ్రహించి, పలక రిస్తే తను బాధపడతాడని మెదలకుండా వూరుకుందా? లేక తన మాతృమూర్తికి సేవచేసే ఉద్దేశంలో, తన సర్వస్వాన్నీ, చివరకు పవిత్రమని భావించి ఆరాధించే కళనుకూడా వెలగట్టి అమ్మేసినందుకు మెచ్చుకుందేమో? లేక యీ నీచకార్యానికి తలపడటం కాకుల్ని కొట్టి గద్దలకు వేయటంగా భావించి బాధపడిందేమో?...ఆమె అభిప్రాయం ఏమైనా కానీ, అది తెలుసుకొనివుంటే ఎంతో తృప్తివుండేది. కేవలం ఊహించటంవల్లనే అసలు విషయాన్ని దూరతీరాలకు విస్తరింపజేసి, ఆ వైశాల్యానికి ఆశ్చర్యపోతున్నాడు.

లలిత తనను కలుసుకోలేక పోయి ఉండొచ్చు. ఆమె తన యీ ఓటి కొంపకు రావాలనికూడా తను కోరడు. నిజానికి తనను కలవకుండటమే ఉభయులకూ క్షేమకరమని తనే ఆదేశించాడు...కాని తన యీ కొత్త జీవితాన్ని గూర్చి ఒక్క ముక్క ఉత్తరం ద్వారా తెలియపరుస్తుందని తను ఆశించటం ఏమంత పెద్దకోర్కె? కనీసం పెదవులు కదిపి సానుభూతన్నా చూపలేదాయె! తన మేలుకోరే వ్యక్తిగా తనను హృదయ పూర్వకంగా నమ్మించి, ఇప్పుడు తనకేమీ పట్టనట్లు, తనెవరో తెలియనట్లుగానే ఆమె ధోరణి వుండగలదని నిరూపించటం, ఏదో నమ్మకద్రోహమే ఐనంత బాధపడేందుకు అవకాశాన్నిచ్చింది. ఇందువల్ల తనకూ, తన ఆశయాలకూ వొచ్చిన ప్రమాదమంటూ లేక పోగాక; కాని తానొక దేవతనే పోగొట్టుకొన్న బాధ వేధిస్తూవుంది. లలిత తనపట్ల ఇంత కఠినంగా వుంటుందనుకోలేదు; అందులోనూ అంత కరుణను వర్షించాక! ఆమె హృదయం సముద్రమంత విశాలమని తానొకనాడు నమ్మాడు. ఐతే ఆ సముద్రంలోవున్న అపార జలానికి తోడుగా, హాలాహలంకూడా వున్నదనే సంగతి ఇప్పుడిప్పుడే అర్థమౌతోంది.

లలిత చూపిన నిర్లక్ష్యత లాటిదే, తానుకూడా ఆమె పట్ల చూపగలుగుతే అసలు సమస్యే తీరిపొయ్యేది. ఆమె ఎంత తీవ్రంగా తనను ఆకర్షించగలిగిందో, అంతే తీవ్రతతో తాను ఆకర్షించి ఉండలేక పోవొచ్చు. లేదా ఆమె ఆలోచనలు కూడా తన ఆలోచనలవలెనే ఉండక, విరుద్ధంగా తయారై ఉండొచ్చు. ఏమైతేనేం, ఆమె తనను విడనాడిందనేది తెలుస్తూనే వుంది. తనే ఇంకా బుద్ధిహీనుడివలె, సర్వస్వాన్నీ పోగొట్టుకొని, ఏదో దివ్యశక్తులమీది నమ్మకంతో చేతులెత్తి ఆకాశంలోకి చూస్తూ ప్రార్థించే హీనస్థితికి దిగజారాడు. ఎంత నచ్చచెప్పుకొని నిలవ దొక్కుకోవాలన్నా కుదరటం లేదు. పూర్వం తెలియలేదు కాని లలిత ఇంత గొప్ప స్థానాన్ని తన హృదయంలో సంపాయించిందనే సంగతి ఇప్పుడే నసాళానికి అంటేట్లు అర్థమైంది. ఆపేక్ష తీవ్రత, మనుషులు దూరమైతేనే కాని తెలియదేమో?

లలితను గూర్చి తానీ తహతహకు గురవటమే ఒక గొప్ప సమస్య! ఆమె తనతో పోట్లాడి, తిట్టి దూరమైనట్లయితే ఒక కారణమంటూ వున్నదనే తృప్తన్నా మిగిలేది. ఏమీ లేకుండానే అకస్మాత్తుగా ఆమె తప్పుకోవటంతో తన ఆధారాలన్నీ తెగిపోయి, మళ్ళీ వెనక్కు రాలేని ఎత్తులో వదిలివేయబడిన వానివలె బాధ కలుగుతోంది. కనీసం ఆమె తానీ ఉద్యోగాన్ని ఒప్పుకోవటం మీదన్నా తన అభిప్రాయాన్ని చెప్పివుంటే, ఆ అభిప్రాయం ఏదైనప్పటికీ బాధలేదు-లలిత కనీసం తననింకా పూర్తిగా విడనాడలేదనే ధైర్యమన్నా వుండేది. ఆమెలో ఏదో గొప్ప మార్పు వొచ్చింది. ఎందుకొచ్చిందో, ఏమిటో తెలియక తను తలక్రిందులవుతున్నాడు.

—ఇంకో విధంగా ఆలోచిస్తే ఒకానొక సత్కార్యం కోసమే యీఅవస్థలన్నీ పడుతున్నాడు. తాను ప్రపంచంలో ఎవరికీ, ఎప్పుడూ కారణాలూ, తన యీ ప్రవర్తనకు విశదీకరణల్నీ చెప్ప నవసరంలేదు; అదంతా తన బతుక్కు సంబంధిం

చిన వ్యక్తిగత విషయం కనుక! కాని తనను తాను సమాధాన పరుచుకోవాలి కదా! అది జరుగుతూన్నప్పటికీ, ఏదో లోపించిన అసంతృప్తి ఎందుకు కలగాలి? యీ లలితమీద తాను మూర్ఖుడై, కాదు, తనకు తెలియకుండానే ఆధారపడినట్లు అర్థమైంది. ఏనాడైతే తన జీవితభారాన్ని ఆమె పంచుకోసాగిందో, ఆనాటినుంచీ ఆ బరువు తగ్గినప్పటికీ, యీనాడు ఆమె తనను విడనాడేప్పటికి, తిరిగి ఆ బరువంతా తనమీదనే పడింది. ఇందులో న్యాయాన్యాయాలు కాదు విచారించాల్సింది; తన యీ సమస్యా రూపమే!

తల్లిని సుఖపెట్టేందుకై తాను చేస్తున్న యీ త్యాగం అత్యుత్తమమైనదిగా, ఉజ్వలమైనదిగా తోచకపోలేదు. కాని లలితకూడా ఆమాట అన్నట్లయితే, తన వెనుక ఉన్నాననే విషయాన్ని తెలియచెప్పినట్లయితే, తన ఉత్సాహం రెండింతలయ్యేది. పోనిమ్మనుకోవటమా కుదరకుండా వుంది. ఐతే పట్టుకు వేళ్ళాడేందుకు ఆధారం లేనప్పుడు, అది వున్నదనుకోవటం తన పతనానికి కారణమౌతుంది. కనుక ఏనాటికైనా నమ్మదగిన తన శక్తిమీదనే, తను ఆధారపడటం సమంజసం.

—మూడు వారాలు గడిచినవి. క్రమంగా లలిత విషయంకూడా మరిచిపోసాగాడు. మొదట్లో తను అనుకున్నంత తీవ్రంగా యీ ఆలోచన లిప్పుడు వేధించటంలేదు. రాత్రికూడా ఏదో రాసుకుంటూ గడపటంవల్ల, కార్యభారం ముంచెత్తటంలో ఇతర సమస్యలన్నీ ఆ బరువుకింద అణగిపోతూన్నవి.

ఒకనాటి రాత్రి ఇంటికొచ్చేప్పటికి ఎనిమిది గంటలయింది. గది గుమ్మంలో చీరకుచ్చెళ్ళు కనిపించి అమ్మ వొచ్చివుంటుందని ఆతృతతో ముందుకు నడిచాడు. తీరా దగ్గరకొచ్చిచూస్తే లలిత! ఒక్క క్షణం తనకళ్లను తాను నమ్మలేకపొయ్యాడు; మరుక్షణంలో 'షాక్' తగిలినట్లయి వొణికిపొయ్యాడు; ఆ తరువాత మరచిపోతూన్న జ్ఞాపకాలన్నీ ఒక్క సారిగా ప్రవాహంగా ముంచెత్తి ఊపిరాడనట్లు చేసినయ్. పలకరించేందుకుకూడా నోటమాట రాలేదు. దిమ్మెరపోయి ఆమెను ఎగాదిగా చూస్తున్నాడు.

'నేను లలితను మాష్టారూ! గుర్తుపట్టలేదా!' అందామె, ఖేదంలో మోదాన్ని ధ్వనింపజేస్తూ.

నిజమే—తన యీ ఆశ్చర్యానికి కారణం, వెంటనే ఆమెను గుర్తుపట్టలేకపోవటమే. ఆమెలో ఎంతమార్పు వొచ్చింది! పరిశీలించిచూస్తే ఆమె ఎంత చిక్కి శల్యమై పోయిందో, నీరసంగా, జబ్బుస్థితిలో పాలిపోయివుందో చప్పున అర్థమైంది. ఆమె మొహంచూస్తేనే ఏదో వ్యాధిపీడిత అని తెలుస్తోంది. యీ సంగతులన్నీ తరువాత మాట్లాడవొచ్చు. యీమెను ఇంకా వీధిలో నిలబెట్టటం ఏమిటి? చప్పున తెలివి తెచ్చుకొని, గది తాళం తీసి ఆమెను లోనికి ఆహ్వానించాడు.

'దీపం వెలిగించండి...నాకేం కనిపించటం లేదు' అందామె.

అగ్గిపెట్టె వెతికి, దీపం వెలిగించాక ఆమె గదిలోకి వొచ్చింది. దుమ్ము దులిపి చాప పరిచాడు. ఆమె కాళ్ళు ముడుచుకొని కూర్చుంది. తను నిలబడే, తీవ్రంగా ఆలోచిస్తూ గదిలో అటూ, ఇటూ సచార్లు చేస్తున్నాడు. ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో అర్థంకాకుండావుంది. చిక్కుపడిన దారపు కొసను ఓప్పిగ్గా, లలితే వెతికి అందిస్తే బాగుండుననుకొన్నాడు.

తను అనుకున్నట్లుగానే లలితే మొదలు పెట్టింది: 'మీరింకా అమ్మగార్ని తీసుకొని రాలేదా?' అందామె.

'లేదు... నేను ఉద్యోగం చేస్తున్న సంగతి ఆమెకు చెప్పలేదు. అవసరమైన ప్పుడు చెపుదాం కదాసని వూరుకున్నాను.'

లలిత తనకు దూరమైపోయిందని చేసుకున్న నిర్ణయం అర్థంలేనిదని తేలి పోయింది. యీ రోజుల్లో ఆమెను కలుసుకోలేక పోతూన్నప్పటికీ, ఒకరి విషయాలు వేరొకరికి తెలిసే అవకాశం ఏమీ లేక పోయినప్పటికీ, ఆమే తన దగ్గిరికి వొచ్చింది. లలిత తనను విడనాడిందని పొరబడ్డాడు కాని, నిజానికి తనే లలితను విడనాడా డేమో? ఐతే లలిత ఆ విధంగా ఆలోచించనందువల్ల, తమ స్నేహంలో ఏర్ప డిన పగులు, నిజంగా పగులే కాదు.

ఎన్నో సంగతులు అడుగుదామనుకున్నాడు. ఏది ముందు అడగాలో అర్థం కాలేదు. అసలు తను కుశల ప్రశ్నకూడా వేయనందుకు సిగ్గు పడ్డాడు.

'లలితా! చాలా సేపయిందా వొచ్చి?' అన్నాడు.

'ఒక గంటవుతుంది... మీరింత ఆలస్యంగా ఇంటికి వొస్తారని అనుకోలేదు'

'పని అలా వుందక్కడ.. రోజూ ఇంతే!' అని నిట్టూర్చాడు.

'యీ ఉద్యోగం దొరికినందుకు మీరు చాలా సంతోషిస్తారనుకున్నాను మాస్టారూ!' అందామె, నీరసంగా.

'ఒక విధంగా అంతేననుకో. కాని మరో విధంగా చూస్తే, సృజనాత్మక శక్తి సామర్థ్యాలు పోయి, భుజబల ప్రదర్శన మాత్రం మిగిలిందనిపిస్తోంది' అన్నాడు.

ఆమె ఒక క్షణంలో తన పరిస్థితినంతనూ గ్రహించి గిలిగిందన్నట్లు ఇలా అంది: 'ఏమిటో మాస్టారూ! జీవితానికీ, ఆదర్శాలకూ ముడిపెట్టి, వాటిని సాధిం చాలనుకుంటాం కాని, నిత్య జీవితంలో అవి కుదరవు. బతికేందుకూ యీ ఆదర్శాలకూ సంబంధంలేదు. ముందు బతికేట్లు చూసుకోవాలి కనుక, యీ ఆదర్శాలను బలి పెట్టకా తప్పదు. బతకటమా, ఆదర్శమా అనే ప్రశ్నవొస్తే, మొదటిదే గెలుస్తుంది ...అదంతా పోనీండి. మీరు అనవసరంగా మనస్సు పాడుచేసుకోవటం దేనికి? వృద్ధాప్యంలో తల్లిని సుఖపెట్టేందుకు మీరు చేసే ఏ పనయినా చెల్లుబడి అవగలదు. ఆ ఆదర్శం కోసం, వేరొక ఆదర్శాన్ని వొదులుకుంటే మాత్రమేం? చిన్న చేపను ఎరగా వేసి, పెద్ద చేపను పట్టినట్లుగా భావించండి. యీ ఆదర్శవాదులు ఇంతకన్న పొడిచేసేది మాత్రం ఏముంటుంది?'

లలిత మాటల్తో తనలోవున్న దుర్బలత్వాలన్నీ వొదిలిపోయినయ్. ఏదో శక్తి బైటినుంచి వొచ్చి తనకు తెలియకుండానే తనలో ప్రవేశించినట్లనిపించింది. తను వెళ్తూన్నమార్గం, రాజమార్గం. తన భవిష్యం ఉజ్జ్వలమైంది. లలిత అన్నట్లు ఆదర్శాలను వల్లించేవాళ్ళు ఇంతకన్న గొప్ప ఆదర్శాన్ని సాధించారా అనేది ప్రశ్నే మరి.

తన యోగక్షేమాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, యీనాడు లలిత తన ఇంటికి వొచ్చింది. ఆమె ఎలావుందో, ఏమిటో, ముఖ్యంగా, ఆమె ఆరోగ్యాన్ని కోల్పోయిన సంగతి చూడగానే గ్రహించికూడా, ఒక్కమాటన్నా అడగలేకున్నా!

'లలితా! అలా వున్నావేమిటి!' అన్నాడు.

వెలవెలబోతూ నవ్విందామె.

'ఏం లేదు. యీ మధ్య పధ్నాలుగు లంకణాలు పడినయ్... మొన్ననే పత్యం తీసుకున్నాను. ఇవాళే బైటికి రావటం'

తన గుండె గుభేలుమన్నది. లలిత జ్వరపడినందువల్ల తనకు దర్శనమివ్వలేదు. అంతేగాక, బైటికి రాగల్గానే, ముందుగా తన ఇంటికేవొచ్చి, గంటసేపట్నుంచీ వాకిటిముందు పడిగాపులు కాచింది. తనపట్ల ఆమె ఇంకేవిధంగా ఇంతకన్న ఎక్కువ అభిమానాన్ని చూపగలదు? ఆమె జబ్బుపడనట్లయితే, ఆనాడే, తనకు ఉద్యోగమయిందని తెలిసిననాడే, పరుగెత్తుకుంటూ వొచ్చి పలకరించేది. తనకు జ్వరమొస్తే సకలసేవలూ చేసిన ప్రాణదాత యీమె! యీమె జ్వరపడితే తను వెళ్ళిచూసి, ఆమెను కనీసం పలకరించనన్నా పలకరించలేదు సరికదా, ఆమె తనపట్ల ఏదో అన్యాయంగా, కఠినత్వాన్ని పూనిందని బాధపడ్డాడు. నిజం తెలుసుకోకుండా చేసే ఆలోచనలు తనకే కాకుండా ఇతరులకుకూడా ఎంత బాధావహమో అర్థమౌతోంది. తను యీమధ్య పొందిన యీ తలపుల తాపులన్నీ వివరించి లలితకు చెప్పి, తనామెను ఎందుకు అపార్థం చేసుకున్నాడో వివరించి, క్షమాపణ కోరుదామనిపించింది. కాని తన యీ అనుభూతుల్ని పైకి చెప్పగలగటం మాటలు కాదు.

'లలితా! ఇంకా యీ జబ్బు స్థితిలో ఇంతసేపు ఇక్కడ ఉండటం మంచిది కాదు. బైట మంచు కురుస్తోంది. కొన్నాళ్ళపాటు వేళకు తిండితిని, విశ్రాంతి తీసుకోందే తిరిగి ఆరోగ్యాన్ని పొందలేవు' అన్నాడు.

'స్వానుభవం కదా?' అందామె కిలకిలా నవ్వుతూ.

తిరిగి ఆమెలో పూర్వపు ఉత్సాహం మొలకలెత్తుతోంది. దెబ్బతిన్న జీవాలేవో తిరిగి స్వశక్తిని పొందుతూన్నవి. తనకూ అలాగేవుంది.

'నన్ను మరిచిపొయ్యావేమో ననుకున్నాను లలితా!...అప్పుడు ట్యూషన్‌కు కూడా రాక, దూర దూరంగా వెళ్తూవుంటే, ఏదన్నా అపరాధం చేశానేమోనని బాధపడ్డాను సుమా!' అన్నాడు.

క్షణంలో ఆమె ముఖం ముడుచుకుంది.

'మంచి స్నేహితుల్ని అంత తేలిగ్గా మరిచిపోగలమా మాష్టారూ? కాని ప్రపంచంలో స్నేహితులు ఒకభాగమే. ఒక్కొక్కప్పుడు ఇతర శక్తుల ప్రాబల్యంవల్ల చేయరాని పనులుకూడా, ఇష్టంలేని పనులుకూడా చేయవలసి వుంటుంది కదా!...మీకు జ్ఞాపకం లేదా? ఆనాడు నర్సింగ్ హోంలో, మీకు దూరంగా ఉండమని బోధించిందీ మీరే, తీరా తప్పుకు తిరుగుతే తప్పు పట్టిందీ మీరే కదా?' అందామె.

ఇదంతా తన నేరమేనని తెలుసుకోగానే తను ఆపాదమస్తకమూ వొణికిపొయ్యాడు. కేవలం తన యీ వెధవ ఆలోచనలవల్లే తను యీ గోతుల్లో పడుతున్నాడు.

'క్షమించు లలితా!' అన్నాడు 'నేను చాలా అపార్థం చేసుకున్నాను. ఆనాడు ఏదో ఉద్రేకంలో నర్సింగ్ హోంలో మాట్లాడాను...నిజమే...దాన్నే నీవు శిరసావహించావు. ఇది ఉభయులకూ సురక్షితమైన మార్గం. కాని కఠిన సత్యం ఎప్పుడూ మనసును కష్టపెట్టేదిగానే వుంటుందనే సంగతి మరిచి పొయ్యాను—అంతే!'

'అదే కాదనుకోండి మాష్టారూ!' అంది లలిత 'ఇంట్లోకూడా కాస్త తర్జన భర్జనలయినయ్. యీడొచ్చిన ఆడపిల్లల్ని సమాజం నమ్మదు; మరి మొగాళ్ళను ఎందుకు నమ్ముతుందో నాకు తెలియదు. తమాషా-నేను ఏ ధనిక యువకుడితోనన్నా కలిసి మెలిసి స్నేహంచేస్తే, అదంతా ఆదర్శ ప్రణయమని మా వాళ్ళందరూ భావించగలరు! తలా తోకా వుందా యీ అభిప్రాయాలకు?'

సమాజమనేది రక్త మాంసాలతో ఎదుటవుంటే తల నేలకేసి కొట్టుకోవాల్సి వొచ్చేది; కాని అది మనుషుల కూడలిగా, ఏ ఒక్కరికీ సంబంధించకుండా, మళ్ళీ అందరికీ సంబంధించేదిగా ఉండటంవల్ల బతికి పోయింది. ఏమైనా ఉన్న యీ సమాజం నుంచి ఎవ్వరూ, ఎప్పుడూ బైటపడలేరు. ఏకొద్దికైనా దాని కన్నుకప్పి పనులు చేసుకోవటం, లేదా వినయాన్ని చూపుతూ అణిగి మణిగి ఉండటం తప్ప, మధ్యే మార్గమంటూ లేదు. దానికి యీనాడు లలిత కానీ, తను కానీ చేయగలిగిందేమిటి?

'పోనీ లలితా! మీ వాళ్లు అన్నారంటే, నీ మేలు కోరేకదా! యీ తర్కాలతో జరిగేదేమీలేదు. తర్కించిన కొద్దీ, మళ్ళీ పైకి రాలేని లోతులకు పోవటమే జరుగుతుంది ..జీవితాంతం ఆలోచించినా ఒక నిర్ణయానికి రాలేని సమస్యలివి... అన్నట్లు లలితా! ఇక నీవు వెళ్ళటం మంచిది...కారులో వొచ్చావా?'

'ఉహుం...నేను వెళ్ళగలను లెండి' అందామె.

ఇక ఆమెతో మాట్లాడుతూ కూర్చుంటే, తనకు పొయ్యేదేమీ లేక పోవొచ్చు కాని, లలిత ఎంతకష్టపడుతుందో గ్రహించలేని స్థితిలోలేడు తాను. అందుకని ఆమెను తొందరపెట్టే విధంగా దిక్కులు చూడసాగాడు.

'సరే...నేను వొస్తాను మాష్టారూ.' అందామె, లేచి నిలబడుతూ.

‘ఎప్పుడన్నా వొస్తూండు’ అని నోటిదాకా వొచ్చింది కాని, ఎలాగో అనకుండా ఉండగలిగాడు. చూస్తూచూస్తూ తనలాగే ఆమెనుకూడా అధఃపాతాళానికి లాగేందుకు మనసు ఒప్పలేదు.

ఒక్కసారి నమస్కరించి ఆమె చరచరా వెళ్ళిపోయింది. క్షణాల్లో జరిగిన యీ గాధనంతనూ మింగి జీర్ణంచేసుకోలేని స్థితిలో, తోడుగా సందుచివరకు కాదు కదా, గుమ్మందాకాకూడా ఆమెవెంట వెళ్ళలేదు. ఆపేక్షతో వొచ్చి నామెను, మెడబట్టి గెంటేసేవిధంగా ప్రవర్తించాడు తను. యీ సంగతి, అంతామించి పొయ్యాక గ్రహించాడు...ఐతే ఒక్కటే ధైర్యం: లలిత ఏనాటికీ తనను అపార్థం చేసుకోదు. తనే ఆమెను అపార్థం చేసుకున్నాడు.

యీ నేరానికిగాను ఆ రాత్రంతా తలగడ తడుస్తూనే వుంది. ఐతే అవి ఆనందబాష్పాలో, విషాద బాష్పాలో యీనాటికీ అర్థంకాని విషయమే!

## 22

రోజులు దొర్లుతూన్నవి. బతుకు భారమనిపించేవారికి రోజులు గడవటమే కావాల్సింది. ఐతే అవి తాము కోరినంత వేగంతో పరుగెత్తవు.

‘ఎందుకొచ్చిన ఖర్మ?’ అనిపించినప్పుడూ, పనిలో విసుగు కలిగినప్పుడూ, ఒక్కక్షణం కళ్ళుమూసుకొని ఆనాటి రాత్రి లలిత అన్న మాటల్ని మననం చేసుకొని, వెంటనే కొత్త ఉత్సాహంతో పనిసాగించటం పరిపాటయింది. రోగికి మందు వలె, కాదు - చికిత్సవలెనే ఆమె మాటలు పనిచేస్తున్నవి. కాని జీవితానికంతకూ సరిపడే మోతాదులో ఆ మందు తనకు లభ్యమయ్యే ఆశలు లేవు. దొరికినంతవరకే అనే తృప్తి మాత్రమే మిగిలింది.

లలిత తనకింక కనిపించదు. సమాజపు ఆంక్షలూ, ఒత్తిడీ తనకు తెలియనివి కావు. కొంతమంది వ్యక్తులుచేసే కొన్ని నేరాలను, కొంతవరకూ సమాజం పట్టించుకోదు. మరికొంతమంది చేసే చిన్న నేరాలుకూడా దుర్భిణిలోవలె, క్షమించరాని నేరాలుగా రూపొందుతవి; తను యీ రెండో తెగకు చెందినవాడు. లలిత మొదటి తెగకు చెందినప్పటికీ, తనతోటి స్నేహంవల్ల, ఆమె తన హక్కుల్నికూడా కోల్పోతుంది.

లలిత తనకు కనిపించకుండటమే మంచిది. ఎక్కడవున్నా ఆమె సౌఖ్యపడితే, తన దేవత యీ ప్రపంచంలోనే, తనకు దూరంగా ఉన్నప్పటికీ, దేవత్వాన్ని విడనాడకుండావుంటే; అదే పదివేలు. గత ఐదారు నెలలుగా ఆమె తనపట్ల, చూపిన అభిమానమే, మానవత్వం మీది తన నమ్మకాల్ని బలవత్తరంచేసింది. ఎన్ని గొప్ప గ్రంథాలు చదివినా, ఎంతతీవ్రంగా, విశాలంగా ఆలోచించినా దొరకని సారాన్ని ఆమె ఒక్క తియ్యనిమాటతో, పలకరింపుతో తనకు తేలిగ్గా అర్థమయేట్లు చేసింది.

తను యీ బోడి ఉద్యోగాన్ని స్వీకరించకుండా ఉంటే బాగుండేదనిపిస్తోందిప్పుడు. కాలేజిలోవుంటేఒకపక్క తన హీనత్వానికి కుంగిపోతూన్నప్పటికీ, మరో

వైపు లలితను చూస్తూ కొత్త శక్తిని పొందగలుగుతూండేవాడు. నిస్సారమైన తన బతుకు బాటను దివ్యజ్యోతితో వెలిగించగల వెన్నెలలను విరజిమ్మే ఆమె నవ్వు ఒక్కటే తనకు గొప్ప ఉత్సాహాన్నిచ్చేది. తను సుఖపడకపోయినా, సుఖపడేవాళ్ళను చూసి, వాళ్ళందరూ ఆనందంగా ఉన్నారు కదానని, తనకు తెలియకుండానే, తనూ తన ధోరణిని మార్చుకునేవాడు.

ఇదేవిధంగా మరో మూడేళ్లు తంటాలుపడి నట్లయితే, తను డిగ్రీపుచ్చుకొని, బహుశా ఆ కాలేజిలోనే ఉద్యోగం సంపాయించ గలిగేవాడు. అలాటి ఉద్యోగంలోతనకుఆసక్తివుండేది; పరమార్థమూ ఉండేది. కాని యీ జీవితాన్ని మూడేళ్ళ వరకూ గడపటం అసంభవ మనిపించిందప్పుడు. ఏళ్ళ తరబడి ఓర్చుకొని, అలవడిన జీవితమే ఒక్కక్షణంలో వెగటనిపించింది. ముందు రాబొయ్యే శాశ్వితత్వంకోసమై, అందుబాటులోవున్న తాత్కాలికొన్ని వొదులుకోలేక పొయ్యాడు. ఇప్పుడు ఆలోచిస్తే ఇంకోసారి జీవితంలో తప్పటడుగువేసి బోర్లాపడ్డాననిపిస్తోంది...కాని మళ్ళీ లేచి నిలబడేందుకు వీల్లేని కత్తెరబోనులో ఇరుక్కున్నాడు.

ఇలా ఎందుకనుకోవాలనేది సమన్వయించుకో లేకపొయ్యాడు. జీవితం చిక్కుపడిన దారపుబంతి లాటిది. ఓపిగ్గా ఆ ముడులన్నీ విప్పి చిక్కుతీసుకో గలగటమే జీవితానికి పరమావధి: తను సుఖపడి, ఇతరులను, ఆప్తులను సుఖపెట్టేమార్గం. కాని విసుగుపుట్టి దారాన్ని ఎక్కడికక్కడికి తెంచుకోవటంవల్ల చివరికి మిగిలేది ముక్కలు ...ఎందుకూ పనికిరాని ముక్కలు! ఎవరో అదృష్టవంతులకు చిక్కులన్నీ వాటంతటవే చాలా తేలిగ్గావొస్తవి. కాని తనలాటి అభాగ్యులకు మాత్రం ఆ వెధవముక్కలే దక్కుదల!

ఐందేమో ఐంది. ఐనదాన్నిగూర్చి విచారించి లాభంలేదు. మళ్ళీ ఇంకోసారి కత్తిరించుకోవటంవల్ల ఇంకోముక్క లభ్యంకావొచ్చు. అదీ నిష్ప్రయోజనమే కాగలదు. కనుక, ఇకముందన్నా యీ ఉన్నదాన్ని పట్టుకొని వేళ్ళాడటమే మంచిది. తన మొహానికి ఇంతకన్న మంచి ఉద్యోగం, ఇంతకన్న సుఖంగా ఉండగలిగేది కలలో మాత్రమే దొరుకుతుంది.

యీ విధంగాకూడా సరిపెట్టుకోలేకుండా ఉండటంవల్లే మనస్సు కలక్కుమంటూ వుంటుంది. కింద ముద్రణాలయంలో తిరిగే అనేక మరల్లాగే, పైన సంపాదకవర్గంలో వారుకూడా తిరుగుతున్నారు. ఐతే కిందవున్న యంత్రాలు చాలా వెల గలవి. మానవ యంత్రాల్లో మేధస్సువున్నప్పటికీ, దానివిలువ చాలా తక్కువే! అసలు ఆ మేధస్సును ఉపయోగించి కళలోని కొత్తరీతుల్ని పరిశోధించి, ఆలోచించి సృష్టించ వలసిన పనేమిటి? ఏదోవిధంగా పేజీలు నింపడమూ, కంపోజిటర్లకు పని కలిగించటమూ, కాగితాన్ని నలుపుచేయుటమే అవసరం. తనలోవున్న కళాహృదయమంటూ ఏమన్నావుంటే అది ఏనాడో ఆ సీసపు అచ్చుల బరువు కింద శాశ్వితంగా అణగారిపోయింది...నయం-అది పోయినా, తనింకా బతకగలిగాడు!

యీ మధ్య జన్మదినసంచిక వేసే హడావిడిలో క్షణంకూడా తీరిక ఉండటం లేదు. ఆలోచించి రాయటం మానుకొని చాలాకాలమైంది; రాసి అచ్చయిం తర్వాత ఆలోచించటం అసలే అనవసరం. సిరా ఎంత ఖర్చయిందో లెక్కకట్టుకో వటం మినహా మరేమీలేదు. యీ కారణంవల్లనే అమ్మను చూసేందుక్కూడా గత రెండు వారాలనుంచీ వెళ్ళటంలేదు. జీవితాన్ని సాధించుకునేందుకు చెరో కొన లోనూ వుండి కష్టపడుతున్నామనే అభిప్రాయంతో, ఎవరి కష్టం వారి కుండగా, ఒకరు మరొకరికి సానుభూతి చూపటం హాస్యాస్పదమని సరిపెట్టుకున్నాడు.

ఒకనాటి మధ్యాహ్నం, అడుగుల చప్పుడు విని తలెత్తి చూశాడు. ఎదురుగా నవ్వుతూ లలిత కనిపించేప్పటికి రాస్తూన్న కలం తనకు తెలియకుండానే జారి కింద పడింది. లలిత తనకోసం ఆఫీసుకు వొస్తుందని ఎన్నడూ అనుకోలేదు. ఐతే చీకటి పడ్డాక ఇంటికిరావటంకన్న, పట్టపగలు ఆఫీసుకు రావటమే చాలా మంచిది.

ఇప్పుడు లలిత పూర్వపు ఆరోగ్యాన్ని పొందింది. జీవితం బాధపడేందుకు కాదనే సత్యాన్ని నిరూపించేందుకు కొంతమంది వ్యక్తులు ఉంటారనేది నిజమైతే, లలిత అలాటి వ్యక్తుల్లో ఒకరని తేలిగ్గా గ్రహించవొచ్చు.

'చాలా తీవ్రంగా రాస్తున్నట్లున్నారే మాస్టారూ!' అందామె, నవ్వుతూ, తనకు ఎదురుగావున్న కుర్చీలో కూర్చొని.

'ఆఁ...ఏదో...' అని నీళ్లు నమిలాడు తను.

'ఎలావున్నారో, ఏంచేస్తున్నారో చూసిపోదామని వొచ్చాను'

ఎంత అల్పులకుకూడా ప్రపంచంలో ఎవరో ఒకరు భక్తులు, లేదా అనురాగాన్ని వర్షించగల వారుంటారనీ, వాళ్లు తోడునీడలవలె, ఒకకంట కనిపెట్టేవుంటారనీ లలిత మొదటినుంచీ రుజూ చేస్తూనే వుంది. కాని తన కృతజ్ఞతను వెల్లడించే అవ కాశం మాత్రం ఆమె ఏనాడూ ఇవ్వటంలేదు; ఒకవేళ ఇచ్చినా తాను ఉపయో గించుకోలేని నిస్సహాయస్థితిలో కూడా ఉన్నాడు.

'కాలేజి లేదా లలితా?' అన్నాడు, తను.

'నాకు క్లాసుకు వెళ్ళబుద్ధి కాలేదు. మిమ్మల్ని చూసి చాలా రోజులైందని ఇలా వొచ్చాను...మీ అమ్మగారు కులాసాగా ఉన్నారా?'

తను యీ మధ్య అమ్మనుగూర్చి ఆలోచించనందుకు సిగ్గుపడ్డాడు. లలిత అమ్మనుగూర్చి అడిగి, తన ఆత్మబాంధవికన్న అధికురాలనే అభిప్రాయాన్ని కలిగిం చింది. యీ విధంగా లలిత తనకు ఆప్తురాలవుతూండటం ఒక రకంగా ఆత్మతృప్తికి దోహదంచేసినా, మరోరకంగా ఏదో ప్రమాదానికి నాంది ప్రస్తావనగా తయారవు తుందేమోనని బెరుకుకూడా వుంది.

'...కులాసాగానే వుందనుకుంటాను. వెళ్లేందుకు నాక్కూడా తీరటంలేదు లలితా!' అన్నాడు.

కాస్సేపు ఆమె ఏమీ మాట్లాడలేదు. శర్మగారు భోజనానికి వెళ్ళి ఇంకా రాలేదు. ఆయన రాకముందే లలితను పంపేస్తే బాగుంటుంది. కాని వెళ్ళిపొమ్మని నోరారా ఎలా అనగలడు?

'మాష్టారూ! యీ మధ్య కథలు అసలు రాయటం లేదేం?' అంది లలిత.

ఆపుర్నా ఏడవాలనిపించింది; తను ఏడవటం చూడాలనే లలిత ఆ గాయాన్ని రేపిందేమో? తనెందుకు రాయలేక పోతున్నాడో తప్పకుండా లలితకు తెలిసివుంటుంది. ఐనప్పటికీ ఎందుకు అడిగింది? శూలంలాగు గుచ్చుకున్న ఆమె రిమార్కును ఎలాగో తట్టుకున్నాడు. కుంటి గుడ్డి జవాబులు లలిత ముందు పనికిరావని తెలుసు.

'ఏం రాసేది లలితా!' అన్నాడు దీనాతి దీనంగా 'యీ వెధవ పనిలో క్షణం తీరిక లేకుండా వుంది.'

ఆమె నిట్టూర్చి, దిగాలుపడి చూసింది. కళ్ళ ఎదుట కళాకారుడొకడు, అన్యాయంగా దహించుకొని పోతూండగా, ఆ మంటలవేడి, వెలుగు, ఆమె ముఖంలో ప్రతిఫలించినట్లే తోచింది తనకు. కాని ఆ మంటల్ని ఆర్పి కళను రక్షించగల దివ్య శక్తులేవీ తామిద్దర్లోనూ లేవనే సత్యంకూడా వెనువెంటనే తెలియవొచ్చింది.

'పోనీండి—మాష్టారూ! బతికి బాగుంటే సాహిత్యాని కేమొచ్చె?' అందామె, ఊరడింపుగా.

బతికి బాగుంటే! ఇది ఎన్నటికన్నా సాధ్యమా అనిపిస్తుంది తనకు! ఏమో లలిత ఆశించినట్లు సాధ్యమైతే, ఆనాటికి తనలోని కథకుడింకా బతికివుంటే, అప్పుడు చూసుకోవొచ్చు.

యీ ఆలోచనలో ఉండగానే శర్మగారు వొచ్చారు. తనకు ఎదురుగా ఒక సుందరాంగి ఉండటాన్ని చూసి ఆశ్చర్యపడి, ఆయన తప్పుకొని, తన గదిలోకి వెళ్ళబోయ్యాడు. ఇక బాగుండదని తను లేచి నిలబడి 'వీరు సంపాదకులు లలితా!' అని పరిచయం చేశాడు. లలిత నమస్కారాన్ని అందుకుంటూ శర్మగారు నిల్చబడి పోయ్యారు.

'నా క్లాస్ మేట్—లలిత!' అన్నాడు తను. లలిత అంతకన్న ఎంతో అధికురాలైనప్పటికీ, బైటి ప్రపంచానికి అంతకన్న తెలియనక్కరలేదనే జ్ఞానం వుంది తనకు. శర్మగారు నవ్వి తన గదిలోకి వెళ్లి పొయ్యారు.

పరాయివ్యక్తికి తమ సంభాషణ వినిపిస్తుందని లలితకూడా గ్రహించినట్లే వుంది. రెండుమూడు నిమిషాలసేపు మెదలకుండా వూరుకుంది.

'ఏమీ తోచటంలేదు మాష్టారూ! మీ దగ్గర ఏమన్నా పుస్తకాలుంటే ఇవ్వండి' అంది.

'ఇక్కడేమీ లేవు లలితా! రేపు తీసుకొస్తాను. గోపయ్యను ఇక్కడికి పంపరాదా?' అన్నాడు తను, ఆమె మళ్ళీ రాకుండా జాగ్రత్తపడే ధోరణిలో.

'అట్లాగే పంపుతాను లెండి... వెళ్ళొస్తాను, అని నమస్కరించి నిష్క్రమిం

చింది. లలిత మెరుపల్లేవొచ్చి, మెరుపల్లేనే మాయమైంది. ఎన్నో సంగతులు, రవణమ్మగారి ఆరోగ్యం మొదలూ, చిట్టి చదువువరకూ అడిగి తెలిసికుందామనుకున్నాడు. ముఖ్యంగా లలిత లెక్కల్లో ఏమన్నా ప్రోగ్రెస్‌చూపుతోందో-లేదో? ఏదీ అడిగే సావకాశమే లేదు.

నిట్టూర్చి, మళ్ళీపనిలో పడేందుకు సిద్ధపడే సమయంలో శర్మగారు నవ్వుకుంటూ వొచ్చారు.

'భలేపిల్లను పట్టావయ్యా!' అని తనను అభినందించా డాయన. అప్పుడే, ఆయిన మొహం పగలగొడదామన్నంత ఆవేశం వొచ్చిందికాని, తమాయించుకున్నాడు. ప్రపంచంలో తామిద్దరూ కలిసిఉండటం చూసిన వాళ్ళెవరైనా సరే అలాగే అంటారని తెలుసు. కాని విజ్ఞానవంతుడూ, విశేషించి సంపాదకుడుగా చలామణీ అవుతూన్న ఈయనే ఇలా మాట్లాడటం చాలా దారుణ మనిపించింది. మనుషులు తాము అనుకోకుండానే, తమకు తెలియకుండానే, ముందు వెనుకల ఆలోచనన్నా లేకుండా ఎంత పెద్దగాయాల్ని చేస్తారో? లలిత తనకు ప్రియురాలనే ఉద్దేశ్యంతోనే తానేదో ఘనకార్యం చేసినందుకు ఆయన అభినందించవొచ్చుకాని, దానివెనుక దాగిన నైచ్యం, లలితలాటి వ్యక్తిని అనవసరంగా, అన్యాయంగా దిగజార్చిన వైనం, ఆయన బుద్ధికి తోచకుండటం విచారించాల్సిన సంగతే!

'శర్మగారూ! ఆమెకూ నాకూ స్నేహం, అంతే.' అన్నాడు తలవొంచుకొని. దాదాపు కళ్ళనీళ్ళు తిరిగినవి. కలిగిన ఉద్రేకాలు తీరే సావకాశం లేనప్పుడు, అవి ఆ వ్యక్తినే బాధిస్తవి.

'సారీ! ఏమనుకోవోక—' అని శర్మగారు వెళ్ళిపొయ్యారు.

బాధపెట్టటం, దానికి సానుభూతి చూపటం సంస్కారుల పద్ధతి కాబోలు! ఐతే ఆయన తనమాటల్ని నమ్మలేదు; నమ్మిఉండడు. ఎవరు నమ్మగలరు? ప్రతి వార్నీ నమ్మించేందుకు తను ప్రయత్నంచేసి నెగ్గటం అసలే కుదరదు. బహు జనాభిప్రాయం, ఎంత అర్ధరహితమైన దైనప్పటికీ, దాని శక్తి తనకు తెలుసు; ఆ శక్తికి కట్టుబడని అసామాన్యుడా తనేమన్నా? ప్రపంచం తమ స్నేహాన్ని అపార్ధం చేసుకున్నప్పటికీ, దాని తీర్పును శిరసావహించక తప్పేదిలేదు. తన సంగతికాదు—లలిత సంగతే తనకు బాధగావుంది. యీ సారి లలిత కనిపిస్తే అసలు కలుసుకో నేవొద్దని చెపితే బాగుండని పించింది.

చేయదగిన పనులూ, చేయదగనివీ అని ప్రపంచం విభజించటంలో ఎంత పొరబడుతుంటుందో, దాని తీర్పులకు, అమాయకులుకూడా ఎలా శిక్షార్హులౌతారో బాగా తెలిసివొచ్చింది. ఇలాటి విషయాలకు ప్రక్రియలులేవు. ప్రపంచాన్ని తెలుసుకున్న కొద్దీ హృదయవేదన అధికమవటం తప్ప మరేం లేదేమో! ఒకపక్క ఎవరో కొంత మంది మహానుభావులు సమాజాన్ని మరామత్తు చేస్తూన్నప్పటికీ, మరోపక్క కుళ్ళుతూనేవుంది. అందరితోపాటు తను కూడా ఆ కుళ్లులోనే కాలం గడపాలి.

యీ రకం ఆలోచనలతో పనిసాగటంలేదు. మనసు బాగుంటేనే దేనిమీదన్నా నిలుస్తుంది; దానికి దెబ్బతగులుతే మొండికేసి, పాకుడు నేలమీద నడిచినట్లు జారిపోతూ వుంటుంది. అలాగని దాని గాయం మానే వరకూ విశ్రాంతి ఇచ్చే అవకాశం అసలేలేదు. ఏదో యాంత్రికంగా తనకు తెలియకుండానే కలం పాళీని కాగితాలమీద అరగదీయటంతో ఆ సాయంత్రంవరకూ గడిపాడు.

యీ మధ్య కాస్త తగ్గిన మనోవేదనంతా మళ్ళీ వేధిస్తోంది. మనిషిని ప్రశాంతంగా ఉండనివ్వకూడదనే భావమే, చుట్టూ వొత్తిడిచేస్తూన్నట్లు తోస్తుంది. యీ వేదనల్నీ, కష్టాల్నీ, సమస్యల్నీ ఏవగించుకుంటాం కాని, జాగర్తగా ఆలోచిస్తే అసలు ఇవే జీవితాన్ని ముందుకు సాగేట్లు చేస్తున్నవేమో ననిపిస్తుంది. ఇవేమీ లేకుంటే బతుక్కి అర్థంలేదు; అవసరంకూడా లేదు. ఏదో ఒక గురి లేకుండా విలువిద్య నేర్చుకోవటం లాటిదే అవగలదు.

అందుకని ఎంత వేదాంతి ఐనా కావాలని యీ బాధల్ని తెచ్చుకోలేడు; వొచ్చినవే వొదలక ఛస్తూంటే, రాలేదని ఏడుపెందుకు? యీ మనుషుల మధ్య బతకటం కన్న ఏ అడవిలోనో బతకటం హాయి అనిపిస్తుందంటే ఆశ్చర్యమేమిటి? అడవిలో వన్యమృగాలు ఉంటవి. దూరాన పులిని చూడగానే, పులి అని గ్రహించుకొని ప్రాణ రక్షణ కోసం ఏ చెట్టో ఎక్కవొచ్చు; సింహ మున్నదంటే దాని గర్జన వినగానే అది సింహమని ఇట్టే తెలుస్తుంది...కాని మనుషులుఅలాకాదు. వారికంఠ స్వరాల్లోనూ ప్రవర్తనలోనూ క్రూరత్వం ఏంతమాత్రమూ కనిపించదు. ఇక రూపాల్లో అసలేకనుక్కోలేం. పులులు ఉన్నవంటే అన్నీ ఒకే మాదిరిగా ఉంటవి. అన్నిటి నైజమూ ఒక్కటే. వాటిల్లో మంచివి, చెడ్డవి అనే భేదంలేదు కనుక ఒకోదాన్నే పరీక్షించి ఏరవలసిన పనిలేదు...మనుషులుకూడా ఉండటానికి అందరూ ఒకే మాదిరిగా వుంటారు కాని, వారి నైజాల్లో ఎంత భేదం! అందరూ పెద్ద మనుషులు నీతిపరులు, పరులకు హాని చేయనివారు, అన్యాయాల్ని ఖండించి, ఎదిరి నిలవగల వారుగానే కనిపిస్తారు. సమయం వొచ్చినప్పుడు కాని, వాళ్ళ నైజం బైటపడదు కదా! అడివిలో లాగు వీళ్ళను తప్పించుకొని తిరగటం ఎలా కుదురుతుంది? శర్మగారు ఎంత మంచివాడని తను అనుకున్నాడు! తీరా సాయంత్రం ఆయన, బహుశా తనకు తెలియకుండానే నోరు జారాడు. ఆయన తమాషాకు అని వున్నప్పటికీ, అది పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణ సంకటంగానే పరిణమించింది కదా!

—ఇదంతా తనకు సంబంధించినవిషయాలూ కావు నిజానికి! తన బతుకు వరకూ పరిధి ఏర్పరుచుకుంటే చాలా తేలిగ్గా, హాయిగా బతకవొచ్చు. ఏనాడైతే లలితతో పరిచయమైందో, ఆ పరిచయం క్రమంగా స్నేహంగా మారసాగిందో, ఆనాటి నుంచే ఆమెకు చెందిన సమస్యల భారంకూడా తనమీద పడుతోంది. తన బరువుతోనే కుంగిపోతూ, ఆమె బరువుకూడా మోయటం ఎంత కష్టం! దాన్ని వొదిలించుకోలేని అశక్తతలోనే రోజులు గడుస్తూన్నవి...తమాషా!-తను పొందే వేదన లాటిదే లలిత

కూడా పొందుతోంది. తన తోడి స్నేహంవల్లనే కదా ఆమెకు ఇంట్లో వొత్తిడి అధికమైంది! అంటే తన బరువుకూడా ఆమె మోయటం లేదని ఎలా అనగలడు? ఎవరికి వారుగా బతికేందుకేనా యీ సమాజం? సామాజిక జీవనమే లేకుంటే మానవుడు ఇంత ముందుకు సాగగలిగేవాడా? సమాజం కావలసిందే, కాని యీ ఉన్నది చాలా మార్పులు చెందుతేనే తప్ప లాభంలేదు...

తనదగ్గిర మొదలై, తననుతాను ఉద్ధరించుకోలేక, తన సమస్యలన్నిటినీ సమాజపరంగాచూసి, సమాజాన్నే ఉద్ధరించే విధానాల్ని అన్వేషించటం వరకూ వెళ్తున్నాడు. ఇలాకాకుండా ప్రతి చిన్న విషయాన్నీ తాను పెంచుకొని మెలితిరిగి పోతోంది? ఎవరు ఏమనుకోనీ, ఏది ఏమవనీ తన లక్ష్యాన్ని మాత్రమే దృష్టిలో ఉంచుకొని, దాన్ని సాధించుకుంటే సరిపోదా? అసలు ఆలోచనా రహితంగానే జీవితాన్ని గడపటం చాలా మంచిపద్ధతనిపిస్తుంది.. పశు పక్ష్యాదులకు మానవుల కున్నన్ని బాధలు లేవు కదా! వాటినుంచి వేరుపడే ఉద్దేశ్యంతో మానవుడు తన గొయ్యి తానే తవ్వుకుంటున్నాడేమో?...

అనేక నగ్నసత్యాల్నిగూర్చి ఆలోచిస్తూనే నిద్రపొయ్యాడు. భయానకమైన కలలేవో వొచ్చి, రెండుమూడుసార్లు నిద్రాభంగమైంది. కాని వాటినిగూర్చి ఆలోచించటం, మరింతబాధని తెలిసే వూరుకున్నాడు; ఊరుకో గలిగాడు!

## 23

మూర్తి ఆఫీసుకు బయలుదేరేవేళ గోపయ్య వొచ్చాడు. పుస్తకాలు ఇస్తానని గత సాయింత్రం లలితతో అన్నమాట చప్పున జ్ఞాపకం వొచ్చింది. ఇంకా నయం - లలితే రాలేదు.

కొన్నాళ్ళ చదివేందుకూడా తీరికలేక పడివున్నపుస్తకాల్ని తీసి దుమ్ముదులి పాడు. గోపయ్యను కుశలప్రశ్నలు వేశాడు. ఇంట్లో అందరూ బాగానే వున్నారట. చిట్టికిఇంకా మంచి మాష్టరు ఎవరూ దొరకలేదట. లలితమ్మగారు ఇదివరకంత తరుచుగారవణమ్మగారింటికి రావటం లేదట.

అంతా చెప్పి 'మీకు మంచి ఉద్యోగం దొరికిందంట బాబూ?' అన్నాడు వాడు.

వాడిదృష్టికి తనది చాలా గొప్ప ఉద్యోగమే మరి! తను కుర్చీలో కూర్చుని, పైన పంకా తిరుగుతూంటే కలంతో పనిచేయటమాయె! పారతీసుకొని నేల తవ్వటానికి పోల్చి చూసుకుంటున్నాడు వాడు... కాని తను పడే బాధ ఎవరికి తెలుసు?

'ఏదోలే!' అని చప్పరించి పుస్తకాలిచ్చాడు.

'వొస్తాను బాబూ!' అని వాడు వెళ్ళిపొయ్యాడు.

యీ పుస్తకాలిచ్చే వంకతో లలిత మళ్ళీ తనను వెతుక్కుంటూ వొస్తుందేమోనని భయంవేసింది. 'పుస్తకాలు నీవే తీసుకొనిరా'అని గోపయ్యతో చెప్పివుంటే బాగుండేది... కాని అంతా మించిపోయింది.

ఐనా లలితకు లేనిభయం, తనకెందుకు? తనకే తగినంత డబ్బువుంటే యీ

లలితను వేసుకొని పట్టణమంతా ఊరేగి, యీ జనాభామీద తన కసితీర్చుకునే వాడు కదా! అప్పుడు తానొక ఆదర్శజీవిగాకూడా పేర్కొన బడేవాడనేందుకు సందేహంలేదు. మనిషి వ్యక్తిత్వం అతని ప్రవర్తనమీద ఆధారపడి వుంటుందనుకుంటాం కాని, దూరం ఆలోచిస్తే ఎక్కువభాగం అతని సామాజిక స్థితిగతులమీద ఆధారపడి వుంటుందేమో?

యీ తర్కాలకూ, గడియారాలకూ సంబంధంలేదు కనుక త్వరత్వరగా ఆఫీసుకు వెళ్లాడు. సాధ్యమైనంతవరకూ శర్మగారిని తప్పించుకొని తిరగాలని నిశ్చయించుకున్నాడు. ఆయనమీద మండిపోతోంది కాని, పోట్లాడితే యీ ఉద్యోగం కాస్తాపోయి ఉభయభ్రష్టుత్వ మొస్తుందని చచ్చినట్లు పడివున్నాడు; కాదు—అలా నటించేందుకు సిద్ధమయ్యాడు.

తనను చూడగానే శర్మగారు 'అట్లా ఉన్నారేం?' అన్నాడు మృదువుగా. గాయపరిచినవాళ్ళు మరిచిపోయినంత తేలిగ్గా, గాయపడిన వారు మరువలేరని ఆయనకు తెలియదేమో?

'ఏంలేదు...' అని నసిగాడు తను.

ఆ తరువాత పనిలో నిమగ్నమయ్యాడు. జన్మదిన సంచిక కాదుకాని, అది తన స్మృతి సంచికలాగేవుంది. ఎంతరాసినా తరగదు. ఏం రాయాలో తెలియదు. తెలుసుకునే వ్యవధి లేదు. ఒకపక్క విరగతొక్కుకుంటూ రావాలి. అలాగే యీ బండను లాగసాగాడు.

నాలుగు రోజులయ్యాక, ఒకనాడు తను వొస్తూండగా అవతలి పేవ్‌మెంట్ మీద లలిత కనిపించింది. ఆమె నవ్వుతూ, జారిపోతూన్న పమిటను సరిచేసుకుంటూవుంది; ఆమె పక్కనే నవనాగరికుడైన యువకుడు ఉన్నాడు. వెళ్తున్న వాడల్లా ఆగి, ఆ దృశ్యాన్ని పరిశీలనగా చూశాడు ..సందేహం లేదు; లలిత అతన్ని రాచుకొని తిరుగుతోంది. ఆమె జీవితంలోకి వేరొక యువకుడొకడు ప్రవేశించాడని అర్థమైంది ..ఇద్దరూ చెట్టాపట్టాలు వేసుకొని, అల్లంత దూరంలోవున్న కారులో కూర్చున్నారు...కారు కదలిపోయింది. అదృష్టవశాత్తు ఆమె తనను చూడలేదు. ప్రపంచాన్నే మరిచి పోయినట్లుందామె!

నెత్తిన పిడుగుపడినట్లు, కుప్పగా కూలిపోయినట్లయింది, తనపని. ఎన్నడూ చూడనంత జాజ్వల్యమానంగా వుందీనాడు లలితమొహం...కాని, వాడు...ఆయువకుడే అందుకు కారణమై వుంటాడనేది తెలుసుకో లేనంత దద్దమ్మకాదు తాను!

—లలితమీద మనసు మండిపడుతోంది. లలిత - తన స్వంతమని, ఆత్మబంధువని నమ్మిన లలిత, తన కళ్ళఎదుటనే పరాయి సొత్తుగా మారిపోతుందని ఎన్నడూ అనుకోలేదు కదా! మగువలు తమ మనసుల్ని ఎంత తేలిగ్గా, అనవసరంగా మార్చుకుంటారు! లలిత ఆత్మీయురాలు కాదని తాను నిర్ణయించుకున్న అనేక సమయాల్లో, తన అభిప్రాయం తప్పుగా నిరూపించిందామె. అందుకనే తానా భ్రమకు లోబడ్డాడు: అదే ఇప్పుడు బాధావహమైంది.

కాని తను నిజంగా లలిత బాగునే కోరినట్లయితే, ఆమె తనకు దూరమవటమే కాకుండా, వేరొకరికి దగ్గరవటంకూడా అవసరమే! అలా జరిగినందుకు తాను ఆనందించాల్సిందిపోయి, యీర్ష్యతో కుమిలిపోతున్నాడు. ఇదివరలో ఆమెలో తాను చూడగలిగిన ఉన్నతాశయాలన్నీ నైచ్యంగా మారిపోతూన్నట్లే తోచటం, నిజానికి హాస్యాస్పదమే!

ఆమె తనకేమీ వాగ్దానాలు చేయలేదు; తననుంచి ఏ ప్రతిఫలాన్నీ ఆశించకుండానే తనలాటి నిరాధారుడికి అండగావుంది. ఆ నేరానికిగాను ఆమెను అపార్థం చేసుకొని తప్పుపట్టటం న్యాయమా? ఏమన్నా అర్థమున్నదా? తన ఇష్టప్రకారం చేసుకునేహక్కు ఆమెకు లేదా?

ఇలా ఆలోచిస్తూ నడిబజార్లో విగ్రహంలాగు నిలబడి పోవటం హాస్యాస్పదమనే సంగతి, తనను రాచుకుంటూ, తోసుకుంటూ చకచకా సాగిపొయ్యే మనుషులే జ్ఞాపకం చేస్తున్నారు. చప్పున తెలివి తెచ్చుకొని ఆఫీసుకు పరుగెత్తాడు. ఇక ఆనాడు ఏం రాశాడో తనకే తెలియదు; ప్రూఫుల్లో ఎన్ని తప్పులు దొర్లినవో, అసలు తనకింకా మతిపోకుండా ఎందుకున్నదో అర్థం కాకుండానే గడిపాడు.

ఆ రాత్రి మెదడు ఒక కురుక్షేత్రమే ఐంది. లలిత ఎలాపోతే తనకేం, బైటి ప్రపంచంలో ఎవరెలా ఛస్తే తనకేం, తనూ, తల్లీ యీ రెంటికీ ప్రాధాన్యతను ఇచ్చి ఉండాల్సింది. కాని లలిత తనను దూరంనుంచే ఆకర్షించి, అభిమానించి, తన ఆప్తురాలని అనేకసార్లు రుజూచేసి, మెరుపులాగు మెరిసి చేజిక్కకుండా పోవటాన్ని భరించలేకుండా వున్నాడు. ఎప్పటికప్పుడు ఆమె తనను విడనాడిందనుకోవటం, అంతలోనే ఆమె మళ్ళీ తనకు చేరువవటం, ఎండమావువలె దూగదూరంగా జరుగుతూ పోతూండటం పరిపాటయింది. ఒకనాటికన్నా యీ ఎండమావు, జలాశయమౌతుందనే నమ్మకం వుండేది; అదికాస్తా భగ్నమైపోయింది.

ఐతే వీటన్నిటినీ తను కల్పించుకున్నాడేకాని వేరుకాదు. పీసమెత్తు సత్యంమీద పర్వత సాదృశ్యమైన ఆశలు ఏనాటికైనా నేల కూలగలవని తనకు తెలియదా? తెలిసివుండీ యీ పద్ధతిని అనుసరించటం ఆనందాన్నిస్తుంది కనుకనే వొదులుకోలేకపోయ్యాడు. ప్రతి వ్యక్తికీ ఒకో మానసిక ప్రపంచం వుంటుంది. బాహ్య ప్రపంచంలో దొరకని, అందని అనేక వస్తువులు, తన ఇష్టానుసారంగా మానవికలోకంలో లభ్యమై, తన సృష్టిగా నిలబడి ఆకాస్సేపూ తనకేమీ తక్కువలేదనే భ్రమను కలిగిస్తవి. యీ ప్రపంచానికీ బాహ్యప్రపంచానికీ సంబంధం లేదనుకోవటం శుద్ధ పొరపాటు. ఎందుకంటే దీని పునాది బాహ్యప్రపంచంలోనే వుంది; అక్కడ సాధ్యమవనివి, అసంభవాలనుకున్నవాటిని సాధించేందుకే యీ కొత్త సృష్టి జరిగింది.

దాని పునాది ఏనాడైతే బాహ్యప్రపంచంలో కదిలిందో, మొత్తమంతా కూలి పోక తప్పదు. తన యీ పరిస్థితి ఇలాటిదే!

—కాని ఏం చేస్తాడు? ఎంత తంటాలుపడినా రాని పీటముళ్ళు వేసుకున్నాడాయె! యీనాడు లలిత ప్రవర్తనపట్ల ఇంత యీర్ష్య కలుగుతోందంటే, తానామెను ఎంత గాఢంగా ప్రేమించివున్నాడో తెలియచెపుతోంది. ఐతే అంతా తన పక్షాన్నే తరిచి చూసుకుంటున్నాడు కాని, లలితకూడా ఒక వ్యక్తిత్వ మున్నదనీ, ఆమె ప్రవర్తన వేరువిధంగా ఉంటుందనీ ఎందుకు అనుకోడు? అలా భావించేందుకు భయం! తన ఊహాల్ని ఖండించే వాటిని దరిజేర నివ్వకుండటం తన దౌర్బల్యం.

ఈ నాడు చూసిన దృశ్యం మరోవిధంగా ఆలోచిస్తే తన జీవితాశయాన్ని సాధించేందు కూడా ఉపకరిస్తుందేమో? ముందు తనతల్లి, తరువాత లలిత అని అనేకసార్లు మననంచేసుకుంటూనే ఉన్నాడు. యీ లలిత తక్కువ ప్రాధాన్యనత గలది పైదొలగుతే మిగిలేది, తన మాతృమూర్తే కదా! ఆమెను సుఖపెట్టట మనేదాన్ని రెట్టింపు బలంతో సాధించగలడు.

మానస ప్రపంచంలోని పూర్వపు బొమ్మలన్నింటినీ చెరిపి, తిరిగి కొత్త సృష్టిలో పడ్డాడు. యీసారి తనూ, తన తల్లీ తప్ప వేరొకరికి స్థానంలేకుండా చేసుకోసాగాడు. లలితను శాశ్వితంగా వొదులుకునేందుకు కారణాల్ని బలపరుచుకున్నాడు...ఎంత ప్రయత్నించినా వెధవ ఆశ—వెంట్రుకతో కొండను పెకలించేందుకూడా వెనుదీయని ఆశ, మిణుకు మిణుకు మంటూకూడా తనను లొంగదీసేందుకు ప్రయత్నిస్తూనే వుంది.

—ఇంతా ఏడుస్తే లలిత ఆ యువకుడి సొత్తయిందని తను అనుకోవటం అర్థంలేని సంగతేమో? ఒక యువతి, యువకునితో కలిసి బజార్లో కనిపించినంత మాత్రాన అంతా మించిపోయిందనీ, లలిత అతనిదై పోయిందనుకోవటం భ్రమే కావొచ్చు. నిజం ఏదైనప్పటికీ, ఇలా తలచటం కేవలం లలితను అవమానించటమే అవగలదు. తనతో లలిత మాట్లాడి, స్నేహం చేసినంతమాత్రాన తమకు తెలిసిన యావత్ ప్రపంచమూ తామిద్దరికీ సంబంధాలు కట్టినందుకు తనెంత ఎంత నొచ్చుకున్నాడు! యీ సహాజాన్ని దుర్మ్మార్తి పోశాడుకదా! మరిప్పుడు తనుకూడా అలాగే ప్రవర్తించటం ఏమిటి? ఇతరులపట్ల తాను చూసిన పొరపాట్లలాటివే, తానూ పడటం నిజంగా హాస్యాస్పదమే కాకుండా, నిరాధారంగా, అన్యాయంగా లలితను నీచపరుస్తున్నాడు.

తనమీద తనకే మండిపోయింది. ఒకవేళ లలిత స్నేహం ఆ యువకునిమీద ప్రణయమే ఐతే తను ఆనందించటం, కలకాలం వారిద్దరూ సుఖంగా ఉండాలని ఆశించి, ఆశీర్వదించటం తన కనీస బాధ్యత; ఏళ్ళ తరబడిగా సాధిస్తున్నా ననుకున్న తన సంస్కృతికి ఇదొక విషమ పరీక్ష. తనకు నిజంగానే లలితమీద అనురాగంవుంటే ఆమె సౌఖ్యపడటాన్నే కోరాలి.

ఈ రకం ఆలోచనలు తనకు మనశ్శాంతిని కూడా ఇవ్వగలవు. హృదయంలో పగిలిన అగ్నిపర్వతం తాలూకు లావాలు పూర్తిగా పొంగి పారిలిపొయ్యాక, శాంతే మిగులుతుంది...ఇప్పుడు మనస్సు కొంచెం తేలిగ్గావుంది. ఇకముందు కూడా లలితను గూర్చి తనకు అనుకూలంగా, పిచ్చి పిచ్చిగా ఆలోచించటం మూఢ్యమని మరోసారి అనుకోగలిగాడు. మానవుడు చేసిన తప్పుళ్ళే ఎందుకు చేస్తాడో తెలిసివొచ్చింది.

త్వరలోనే ఏదోవిధంగా అమ్మకు నచ్చజెప్పి ఆమెనుకూడా ఇంటికి తెచ్చుకుంటే తనకు తగినంత మనశ్శాంతి, తను పోరాడి గెలుచుకున్న ఆశయం, రక్తమాంసాలలో, తన శ్రమకు ప్రతిఫలంగా, బహూకరణగా ఎదుట వుంటుంది. ఏదో వొకమార్గం ఆలోచించి ఆమెను తీసుకొస్తే, ఇక లలితను గూర్చిన వెధవ ఆలోచనలూ ఉండవు...అమ్మనుగూర్చి ఆలోచిస్తూనే క్రమంగా నిద్రకు లొంగిపొయ్యాడు.

# 24

నిర్జీవమైన జీవితం, భారంగా కాలచక్రంలో తగులుకొని యీడ్చబడుతోందనిపించేట్లుగా రోజులు గడుస్తూన్నవి. లలితను ఆ నాడు యువకునితో చూడకముందు, ఎంతో ఉత్సాహంతో తనూ యీ ప్రపంచంలో ఏదో ఒక్క సత్కార్యాన్ని చేస్తున్నాననే కొత్తశక్తితో ఉన్నాడు; కాని ఆ దృశ్యంచూశాక దిగజారిపొయ్యాడు. మానవుడు రెండు విధాలుగా ఆలోచిస్తాడనే కొత్త విషయం తనపట్ల రుజువైంది. ఒకటి: తన జీవితాన్ని, ఇతరుల జీవితాల్తో పోల్చి చూసుకోవటం—ఇది పరిపాటే. కాని తన జీవితంలోని రెండు సంఘటనలను, లేదా ఇద్దరు వ్యక్తుల్ని తూచి ఆ భేదాన్నిచూసి జీవిత విధానమే మారిపోయినట్లు గ్రహించటం. తరిచిచూసుకుంటే తను తల్లికన్న, లలితకే ఎక్కువ ప్రాధాన్యతను ఇవ్వనట్లయితే, యీ దిగులుకు కారణమేమిటి?

దెబ్బతిన్నాక, క్రమంగా దానినుంచి కోలుకోవటమనేది మొదటినుంచీ తను అనుసరిస్తూన్న పద్ధతే. కాని ఇదేదో పిడుగుదెబ్బ వలెనే తోచటం, తన జీవితానికి సంబంధం లేదనుకొన్న దానికే బానిసైపోవటం విచిత్ర పరిణామమే కాని, దానికి తాను అతీతుడు మాత్రం కాదాయె. యీ వొచ్చే కష్టాల్ని భరించలే మనుకుంటాం కాని, మరోపక్క భరిస్తూనే వుంటాం. అసలు భరించలేని కష్టాలంటూ ఎవరి జీవితంలోనూ సామాన్యంగా రావు; అలా వొచ్చినవాళ్ళు ఆత్మహత్య చేసుకుంటూనే వున్నారు కదా మరి!

రోజులు గడుస్తూన్నా లలిత తనకోసం మళ్ళీ రాలేదు: ఆమె తనను మరిచిపోయిందనే సంగతి అంతరాత్మ ఘోషపెడుతూనే వుంది. పోనీ లెమ్మని ఎంత తీసిపారేదామన్నా మనసు వొప్పటంలేదు. చివరకు పుస్తకాలకోసం గోపయ్యకూడా రావటంలేదు. తన దగ్గిర్నుంచి తీసుకెళ్ళిన పుస్తకాలు తిరిగి పంపనూలేదు...నయం! అవి పంపినట్లయితే, లలితకూ తనకూ ప్రతి సంబంధమూ తెగిపోయినట్లే అయేది,

కనీసం తన పుస్తకాలన్నా ఆమె దగ్గరవుండి, తననేవాడు ఒకడున్నాడనే విష
యాన్ని జ్ఞాపకం చేస్తుంటవనే తృప్తన్నా వుంటుంది.

తనెంతో కలవరపడి పొయ్యాడు; లేకుంటే తాను ఎంతచెడ్డా, ఒక యంత్రం
వలెనే రోజులు గడపగలడా? పూర్వం యీ యంత్రానికి గొప్ప ఆలోచనా శక్తి
వుండేది... కాదు, దానికా శక్తి వున్నదనే విషయం మొదటిసారిగా లలిత పసికట్టి
తనకు తెలియపరిచి, దాన్ని సక్రమంగా పని చేయించగలిగింది. ఆమె దూరమైంది—
దాంతోపాటు తన మెదడుకూడా బండ బారిపోయింది. చివరకు అమ్మను చూసేందు
కూడా వెళ్ళ బుద్ధికావటం లేదు. ఆమె విచారంగా మాట్లాడుతే, తన గుండె
చెదిరిపోతుందని కాదు. ఎందుకంటే ఆ గుండె పగలటమనేది, ఎప్పుడో, ఎక్కడో,
తనకు తెలియకుండానే జరిగిపోయింది. ఆ సంగతి తాను స్పష్టంగా, లలిత పరాధీన
ఐపోయిందని తేల్చుకున్ననాడే తెలుసుకోగలిగాడు. దాన్ని అతకటమంటూ లేదని
తెలుసు; కొత్తది రాదనీ తెలుసు. యీ ఉన్న ముక్కల్లోనే జీవితం వెళ్ళబొయ్యాలి.
అందుకనే జీవితం నిస్సారమైంది. యీ నిస్సారంలోనే మధురమైన మాతృ హృద
యంమీది మమతకూడా సన్నగిలింది.

నెల పొడుగునా కాయకష్టంచేసి, రక్తాన్ని కన్నీరుగా, చెమటగా మార్చి
సంపాయించే కరుకు రూపాయిల్లో, నలభై దాకా బ్యాంకులో వేస్తూనేవున్నాడు.
పాసు పుస్తకం చూసినప్పుడల్లా, తన జీవిత చరిత్రే అంకెల్లో లిఖించబడిందనిపిస్తూ
వుండేది... కాని ఇప్పుడు ఆ సంతోషం కూడాలేదు. యీ విషమ పరిస్థితుల్నుంచి
తను బైటపడే మార్గమూ లేదు. అవి మారవు; అందుకని తనే మారాలి. ఎట్లా?
యీ చిన్నవిషయం తెలుస్తే ప్రపంచం ఇంతఘోరంగా, జీవితం ఇంత నిరాశామయంగా
ఉండేది కాదేమో? తను మారినా, జీవితం మళ్ళీ రంగు మార్చుకొని ఒక కొత్త
రూపంలో, కొత్త సమస్యగా మారుతూనే వుంది. కేవలం ఎడారిలోని ఎండమావుల
వలెనే జీవితం తయారైందని అనేకసార్లు తను అనుకున్నాడంటే, అకారణంగానే
అనుకోగలిగిన సాహసం ఏనాటికీ రాదు.

మనుషులందరూ విషపూరితులేననే అభిప్రాయం శుద్ధపొరబాటని లలిత రుజూ
చేసింది; ఆ నాటినుంచే మానవత్వంపట్ల తన విశ్వాసం పెరగజొచ్చింది... కాని, ఆ
లలితే తననిలా అన్యాయం చేస్తుందని అనుకోలేదు కదా! ఇది కారణంగా, తిరిగి
మానవుల్ని ద్వేషించటం అర్థరహితమైంది కావొచ్చు; కాని తాను పరిస్థితులకు తల
వొగ్గే మానవమాత్రుడు! సామాన్య మానవుడిలో వుండే రాగద్వేషాలూ, ఆశానిరా
శలూ, సుఖపడుదామనే ఆతృతా, మొదలైనవి హృదయాన్నీ, మెదడునూ, రక్తాన్నీ
తెకతెకలాడిస్తూనే వున్నది. పోతే తన చదువు సంధ్యలూ, సంస్కృతీ, తెలివి
తేటలూ, ముఖ్యంగా సమాజంలోని తన స్థానమూ తన ఉద్వేగాల్ని అణగ దొక్కి
వేస్తున్నవి. అందువల్ల ఆ చిచ్చు ఆరినట్లు పైకి కనిపించినా, తననొక పక్కనుంచి
దహించివేస్తోంది. ఆ వేడి బైటి ప్రపంచంలోకి పోకుండా, యీశ్వరుడు గర
ళాన్ని భరించిన రీతిగా, తనే భరిస్తున్నాడు.

ప్రపంచంలో ఏం జరుగుతోంది, తను ఎక్కడవున్నాడు, ఏం చేయాలనే భావనే మాయమైంది. మనుషుల్తో తప్పనిసరిగా మెలగవలసి వొచ్చినప్పుడు, కేవలం వ్యాపారరీత్యా ఎంతవరకూ అవసరమో అంతవరకే ఉంటున్నాడు. ఆనాడు శర్మగారు తనకూ లలితకూ ఏదో సంబంధమున్న దన్నట్లుగా మాట్లాడినప్పటినుంచీ, ఆయనమీద అసహ్యం కలిగింది. దాంతోపాటు తన పరిసరాల్లో వున్న వాళ్ళందరిమీదా ఏవ గింపే మిగిలింది. ఐతే దాన్ని సాహసించి బైట పెట్టలేదు కనుక, తలొంచుకొని తన పని తాను చేసుకొని పోతున్నాడు. యీ జరిగే, జరగబొయ్యే మార్పులు—అలాటివంటూ ఉంటే—అవి తనకోసం కాదు; ఒకవేళ తనూ ఆ మార్పుల్లో ఒక భాగమే ఐతే, అవి తనమేలుకూ కావు; తన కీడుకే. అందుకని జీవితమంటేనే 'ఇంటరెస్ట్' చచ్చింది.

'జీవితం వ్యాపారమా?' అని తనను తాను ప్రశ్నించుకున్నాడు. కాదనుకో లేకపొయ్యాడు. ప్రతి వ్యక్తీ, తన చుట్టు పక్కలవుండే వ్యక్తుల్ని తనకు అనుకూలంగా, తన సుఖంకోసం ఉపయోగించుకోవాలని మాస్తున్నాడు. ఉట్టి ఉడియంగా, ఎవరూ, ఎవరి జోలికీ రావటం లేదు. ఏదో నిగూఢ స్వార్థమే ప్రపంచంలోని మానవశక్తు లన్నిటినీ నడిపిస్తోం దనిపిస్తుంది. ఐతే, తను నిందించే యీ మనుషుల వలెనే, తనూ ప్రవర్తించటం లేదా?

లేదేమో ననిపిస్తుంది. దీనికి ఒకపక్క తన అసమర్థతే కారణం. మరోపక్క ఒంటరిగా జీవితాన్ని పోరడాలనే పట్టుదల; ఆశ్చర్యం ఏమంటే—తను శక్తిహీను డవుతూన్నకొద్దీ, యీ పట్టుదల పెరుగుతోంది—జూదరి ఓడుతున్నకొద్దీ పట్టుదలను పెంచుకున్నట్లు! యీ విధంగా తను ఇతరులకు ఉపయోగపడటమే కాని, ఇతర్లు తనకు ఉపయోగపడకపోగా, వెలివేసినట్లు దూర తీరాలకు తరుముతూన్నారు.

—కొస్త లోతుగా ఆలోచిస్తే, యీ తప్పుడు అభిప్రాయాలకు తనలో తానే సిగ్గుపడాల్సి వుంటుంది! తల్లి తనను ఏవిధంగా ఉపయోగించుకోవాలని నానా అవస్థలూ పడుతూ పెంచుకొచ్చింది? ఆమె తన సుఖాన్నే చూసుకొన్నట్లయితే, తనీపాటికి వీధుల్లో అడుక్కొని తినవలసి వొచ్చేది...ఇక లలిత, పరాయిస్త్రీ, తన నుంచి ఏం ఆపేక్షించి, తన దుర్దినాలలో అండగా నిలిచి, మనో ధైర్యాన్నిచ్చి, తనను ముందుకు సాగేట్లు చేసింది? ఏ కారణాన్నీ తను సరిపెట్టుకోలేదు. దీన్నిబట్టి జీవితాన్ని వ్యాపారమనుకుంటే, మానవులు సరుకులే అవుతారు! ఎంత హాస్యాస్పదం!...కాదేమో? జీవితంలో గెలిచినవారు, వ్యాపారంలో గెలిచినవారి వలెనే సంతోష పడుతున్నారు; ఓడినవారు అసలీ వ్యాపారాన్నే దుమ్మెత్తి పోస్తున్నారు. యీ రెండువిధాలా సరితూగలేనివారు, తమ అభాగ్యతకు ఏడుస్తున్నారు. తను యీ మూడో తరగతికే చెందాడేమో?

ఐతే లలిత తనను వ్యాపారవస్తువుగా చూసిందనుకోలేదు. అలా అనుకుంటే, యీ నాటిది ఒక సమస్యే కాదు. అవసరమైనంత వరకూ, తనను ఉపయోగించుకొని,

విసిరివేసిందనుకుంటే — అలాటి స్త్రీతో పేచీయే ఉండదు; అసలు అలాటి వ్యక్తికి ఎంత దూరానవుంటే అంత మంచిది కనుక, తానిప్పుడున్న దూరమే తనకు రక్ష!... కాని అలా కాదే! లలిత దేవకన్యనే అభిప్రాయాన్ని తాను విడనాడలేడే! అందుకనే కదా, మనసు ఇంత క్షోభిస్తోంది!

ఎంత నచ్చచెప్పుకున్నా ఆ వైరాగ్యమూ రాదు. ఎలా వొస్తుంది? వైరాగ్యానికి మనస్సే ప్రధాన మనుకోవటం పొరపాటేమో? మనసును మార్చుకో గలిగినా, మిగతా ఇంద్రియాలన్నీ పొందే అనుభూతులు, చుట్టూవున్న ప్రపంచం ఎరలుగా చూపే ఆశలు, ఆ వెధవ మనస్సును తేలిగ్గా మార్చగలవు. ఏళ్ళ తరబడి ఘోర తపస్సుచేసి, యీ ప్రపంచ విధానానికి దూరంగా ఉండగలిగిన విశ్వామిత్ర మహర్షి లాటివాడు కూడా, మనసు రాయిచేసుకున్నా ననుకున్న కఠినుడు సైతం, ఒక్క-క్షణంలో మేనక కాళ్ళముందు మోకరించాడనేది కాచి వడబోసిన సత్యం. ఇక మానవుడైన తన సంగతి వేరే చెప్పాలా? వాతావరణం మారినంత తేలిగ్గా మనసు మారకుండటమే వొచ్చిన ఇబ్బంది.

ఎలాగో తీరిక చేసుకొని అమ్మదగ్గరకు వెళ్లాలి. ఆమె కన్నీటితో, తనతాలూకు అనేక కల్మషాల్ని కడిగి పారెయ్యగలదు. ఆ దుఃఖం ముందు ప్రపంచంలో తాను అనుభవిస్తూన్న యీ కష్టాలు, తల వొంచేస్తవి. యీ విధంగా పోల్చుకోవటం వల్ల కూడా మనశ్శాంతి సాధ్యమౌతుంది. అమ్మకు ద్రోహం చేస్తున్నానని మనసారా పరితపించినట్లయితే, ఆ బాధలో మిగతావి మరి కనిపించవు.

యీ ఉద్దేశ్యంతోనే ఒకనాడు బయలుదేరాడు. ఎంత త్వరగా తెముల్చుకుందామనుకున్నా మైలాపూర్ జేరేటప్పటికే చీకటి పడింది. యీ సమయంలో రాత్రి భోజనాల హడావిడిలో తల్లి ఊపిరి తిరక్కుండా వుంటుందని తెలుసు. ఐనప్పటికీ ఎలాగైనా ఆమెను చూసి, పలకరించి, వికలమైన హృదయంతో రాత్రల్లా తలగడా తడిపివేస్తే, అదొక రకం ప్రాయశ్చిత్తమై, తనను సక్రమ మార్గాన నడిపించగలుగుతుంది. మానవుడు కనిపెట్టే అనేక విచిత్ర ప్రక్రియల్లో ఇదీ వొకటి.

అనుకున్నట్లుగానే, చాలా హడావిడిగా అమ్మ వొచ్చింది. అల్లంతదూరంలో వెలిగే విద్యుద్దీపపు కాంతి, బాదం చెట్టు కొమ్మలగుండా దూసుకొని పడుతూన్నప్పటికీ, మనిషి ఆకృతి తప్ప, ముఖ కవళికలు తెలియటంలేదు...కాని ఆమె తనకు దగ్గరవుతూన్నప్పుడే, ఎంతో చిక్కి-శల్యమైపోయిందనీ, అలసటతో, నలిగిపోయిందనీ, ...మత్యు ముఖంలోకి హడావిడిగా పరుగెడుతోందనీ అనిపించింది. అనుకున్న దానికన్న చాలా హీనస్థితిలోవున్న తల్లిని చూడగానే గుండె బేజారైంది. ఆమె ఏమన్నా అనుకోనీ-తన ఉద్యోగం సంగతి చెప్పేసి, యీ రాత్రే ఆమెను తనతో తీసుకొని వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు, తన ప్రపంచాన్ని తానే సృష్టించుకొని, తన ఆనందాన్ని తానే పొందాలి. బైటి ప్రపంచంలో తాను పొందగలిగినదానికన్న అంతర ప్రపంచంలోంచే పొందగలిగిన దివ్యానుభూతులకు ప్రాధాన్యత నివ్వాలి.

'నాయనా! ఇప్పుడొచ్చావేరా?' అందామె. ఆ కంఠస్వరంలోకూడా ఎంతో బలహీనత, నిరుత్సాహం కనిపిస్తోంది.

కారణం చెప్పాలనుకున్నాడు, కాని యీ సమయంలో చెపితే, ఆమె విని, భరించగలదా అనే సందేహం పీడిస్తోంది.

'ఏం లేదమ్మా-చూసి పోదామనుకున్నాను. అంతే!' అన్నాడు; ఏడుపాకలేక తక్కువని అమ్మ గ్రహించి ఉండాలి.

'అలా వున్నావేరా బాబూ?' అందామె, చప్పున కంఠస్వరాన్ని మారుస్తూ. ఆ తరువాత తను సరిగ్గా కనిపించనందువల్ల కాబోలు, చేతితో తడివి చూసింది.

'చిక్కిపొయ్యావేరా? చదువుతో రాత్రింబగళ్లు తీరిక లేకుండా వుందా యేం? తగినంత విశ్రాంతి లేకుంటే, మళ్ళీ ఏ మాయదారి జ్వరమో వొస్తుంది. ఆరోగ్యాన్ని జాగర్తగా కాపాడుకో, ఆ మధ్య జబ్బుచేస్తే ఎంత బాధపడ్డావో మరిచి పొయ్యావా?' అంది.

ఏం జవాబు చెప్పగలడు తను? తానింకా చదువుకుంటున్నాననే పిచ్చిభ్రమలోనే వుందామె. ఇప్పుడు అసలు సంగతి చెపితే, యీ స్థితిలో ఆమె గాభరాపడినా ఆశ్చర్యం ఉండదు...ఇక తన స్థితినిచూసి ఆమెకు కలిగే జాలి, ఆమె మీదనే ఆమెకు లేదు. ఆ జాలిని తను చూపాలన్నా ఆమె ఒప్పదు. యీ కసాయి దుకాణంలోనే ఆమె జీవితం అంతమౌతుంది...ఇదంతా తనకోసమని అనుకుంటే, ఆ నేరమంతా తానొక్కడే భరించాలి.

'మాట్లాడవేరా?' అందామె.

'ఏముందమ్మా మాట్లాడేందుకు? చూసి చాలా రోజులైంది కదానని—'

'అంతే కద!' అన్నది తేలికైన హృదయంతో మాట్లాడుతూన్నట్లు.

ఒక్క క్షణమయాక 'సరే నేను వెళ్తాను రాజా! బాబుగారు భోజనంచేసే వేళయింది... బాబూ! లలిత నన్నెప్పుడన్నా అడుగుతోందా?' అంది తగ్గు స్థాయిలో.

తననే మరిచిపోయిన లలిత, తన తల్లిని గుర్తుంచుకుంటుందా? అదంతా ఇప్పుడు, ఇక్కడ చెప్పగలడా? తన వలెనే తల్లికూడా ఏవేవో పిచ్చి భ్రమలు పెట్టుకుంది. తన కలలన్నీ ఎలాగూ చెరిగిపోయి భరించలేని కఠిన సత్యం మాత్రం మిగిలిపోయింది. ఆ సంగతి చెపితే, తల్లికూడా తనవలెనే ఆకాశంలోంచి భూమిమీద పడిపోతుంది. కనుక అబద్ధమాడన్నా సరే ఆమె ఆనందాన్ని పాడు చేయరాదు.

'ఎప్పుడూ అడుగుతూనే వుంటుందమ్మా!' అన్నాడు.

'అలాగే అనుకున్నాను రాజా! ఎంత మంచిమనిషి!' అందామె.

యీ లలిత విషయం వొచ్చినప్పటినుంచీ చీదరగానూ, అగ్గిమీద గుగ్గిలం పడినట్లుగానూ వుంది తనకు. ఇక అమ్మతో సంభాషణ సాగిస్తే, ఒక అబద్ధానికి ఇంకా అనేక అబద్ధాల్ని జోడించవలసి వుంటుంది.

'సరే పని చూసుకో అమ్మా! నేను వెళ్తాను—' అని మెల్లిగా జారుకున్నాడు. ఆమెకూడా ఏదో పెద్ద భారాన్ని మోస్తున్నట్లు, మెల్లిగా వంటింటివైపు వెళ్ళటాన్ని చూశాడు. పిశాచాలు వెంటాడుతూన్నట్లు స్వరక్షణార్థం నడకవేగాన్ని హెచ్చించక తప్ప లేదు.

ఇక యీ జన్మలో తన ఉద్యోగం సంగతి అమ్మకు చెప్పటం పడదా? ఎలాగైనా ఆమెను తోడు తెచ్చుకుంటే కాని, మిగతా వెధవ సమస్యలు, అల్పమైన విషయాల, బరువు భారాలు తనకు తగ్గవు. ఏదన్నా సమయం వొస్తుందేమోనని తాను చూస్తున్నాడు. కాని అది రావటంలేదు. నిజం చెప్పేందుకు తనే వొణికిపోతూంటే, ఇక తల్లి ఏమౌతుందనే బాధ పీడిస్తోంది. క్రమంగా ఏదో వొక సందర్భం రాక పోతుందాననే ఆశమాత్రమే మిగిలింది. మరోసారి వొట్టిచేతుల్తో అపజయాన్ని వరించి, తలవొంచి, మథనపడుతూనే తిరిగిరావటమైంది.

## 25

జీవితానికీ, జూదానికీ చాలా దగ్గిరి సంబంధమే వున్నట్లు తోస్తోంది తనకు. జూదరి అకారణంగా—తెలివితేటల ప్రస్తావనే లేకుండా, అదృష్టముంటే ఓడటం ఎంత సహజమో, తనుకూడా ఒకో పందెంలో ఓడటానికి, తన శక్తి సామర్థ్యాలు పోటీలోకి కూడా రాకుండా పోవటాన్ని గమనిస్తూనే వున్నాడు. మానవ ప్రయత్నాలన్నిటికీ మించిన అదృశ్య శక్తిఏదో పరిపాలిస్తూ జీవితాన్ని తన కంట్రోల్‌లో ఉంచుకొని నడిపిస్తోందని నమ్మేందుకు తగిన కారణాలు తనకున్నవి.

చదువుమాని తాను ఉద్యోగం చేస్తున్నాడు; ఇందువల్ల తాను సుఖపడి, అమ్మను సుఖపెడదామని ఆశ. కాని యీ రెండూ అబద్ధమే ఐనవి. అదే విధంగా లలిత జీవితాంతమూ తనకు తోడునీడగా వుంటుందని ఆశించాడు; కాదు—ఆమె ప్రవర్తనను తనలా అర్థం చేసుకున్నాడు; బహుశా ఆమె తప్పులేక పోవొచ్చు, కాని తన తప్పు మాత్రం ఏముంది? అదంతా తప్పుడభిప్రాయమని తేలిన తర్వాత కదా, తనిలా భావించ గలుగుతోంది? ముందుగానే తెలుస్తే, అనవసరంగా చేతులు కాల్చుకునేవాడు కాదుకదా! యీ పందెంలోనూ ఓడిపొయ్యాడు. జీవితమంతా ఓటమిలమీదనే దొర్లుతోందా అనిపిస్తుంది...ఇలా ఓడుతూండబట్టే, గెలుచుకోవాలనే ఉత్సాహం, ఆశయాన్ని సాధించాలనే పట్టుదల ఇచ్చే కొత్త శక్తితోనే, ముందుకు సాగ గలుగుతున్నాడేమో?

ఐతే తను జూదరా? సర్వస్వాన్నీ ఒడ్డి జూదమాడగల తాహతు తనకు వుందా? జూదం విలాసయుతమైనది; ప్రపంచంలో ఏ కొందరికో అది ఆనందాన్నివ్వగలదు. కాని తనలాటి నిర్భాగ్యులకు మాత్రంకాదు. తనకు ఇష్టమున్నా లేకున్నా-దాంతో సంబంధం లేకుండానే జీవితం జూదరంగమైంది. తను మిన్నకున్నా జీవితం తొడకొట్టి సవాలుచేసి తనను జూదరిని చేస్తూనేవుంది. కనుకనే ఓటమికి విచారించటం కన్న, ఓటమిని ఎదుర్కొని భరించటమే మిగిలింది.

పీటికి తోడు ఆఫీసు వ్యవహారాలు బాగున్నట్లు తోచదు. గతనెల జీతం పది రోజులు ఆలస్యంగా ఇచ్చారు. పత్రిక యజమానులైన ఇద్దరు సోదరులూ మొహాలు మొటమొట్లాడించుకుంటున్నారు. ఏవో గృహ కలహాలు, క్రమంగా మండి, ఆఫీసు వరకూ నాలుకలు చాచినవని అనుమానంగా వుంది. సంపాదక వర్గంలో వారు కలిపించుకోక పోయినా, వారి ధోరణిచూస్తే ఏదో పెద్ద ప్రమాదం వాటిల్లే సూచనలు కనిపిస్తూన్నవి. అంత త్వరలో కాకపోయినా, ఆ మంటల వేడికూడా క్రమంగా దగ్గరవుతోందా అనే అనుమానానికి తావుంది. అసలు విషయం ఏమిటని శర్మగార్ని అడగా లనుకున్నాడు; కాని, లలితనూ తననూ అపార్థం చేసుకున్నప్పటి నుంచీ శర్మగారితో చాలా ముభావంగా వుంటున్నాడు. ఇలాటి అనవసర విషయాన్ని ప్రస్తావిస్తే ఆయన ఏమన్నా అనుకుంటాడేమోననే భయంకూడా తనను దూరంగా వుంచేసింది. అయేది అవకమానదు కనుక, దుర్ఘటన సంభవించిననాడే చూసుకో వొచ్చని సరిపెట్టుకోక తప్పలేదు.

ఇలా వుంటూండగా ఒకనాటి సాయంత్రం—ఇక ఇంటికి వెళ్దామనుకునే సమయంలో ఆదరా బాదరాగా లలిత వొచ్చింది. మొహంచూస్తే చాలా ఆందోళన కనిపించింది. ఏదో ప్రమాదంలో చిక్కుకొని, తన సహాయంకోసం వొచ్చిందని తోచింది. మెట్లెక్కి వొచ్చిన ఆయాసంకూడా తీరకుండానే 'మాస్టారూ! వెంటనే బయలుదేరాలి—' అంది.

యీ మెమీద వున్న కసంతా తీర్చుకుందా మనుకున్నాడు, కాని అసలు సంగతేమిటో తెలుసుకోకుండా తొందరపడటం అర్థంలేదు.

'ఎక్కడికి? ఎందుకు? అసలేమిటి?' అన్నాడు.

జేబు రుమాలుతో మొహం తుడుచుకుంటూ ఆమె ఒక కార్డు టేబిల్ మీద పెట్టింది. అది చదువుకునేప్పటికి తనకు మతి పోయినట్లయింది. నిన్న మధ్యాహ్నం తనతల్లి, పొయిదగ్గిర పనిచేస్తూచేస్తూ, స్పృహలేకుండా పడిపోయిందట! వెంటనే రావలసిందని, ఆ ఇంటి యజమానులు కాలేజికి ఉత్తరం రాశారు. భూమి కంపిస్తూన్నట్లు, ఆకాశం విరిగి మీదపడుతూన్నట్లనిపించింది. భూమి సూర్యునిచుట్టూ ప్రదక్షిణ చేస్తుందనే శాస్త్రీయ సత్యం కళ్ళకు కట్టినట్లయింది. క్షణం సేపు నిశ్చలు డయాడు.

'భయపడకండి మాస్టారు!...ఇది ఇవాళ మధ్యాహ్నం వొచ్చివుంటుంది. కాలేజిలోని పోకిరీ కుర్రాళ్ళు, నామీదికి విసిరి పారేశారు! వాళ్ళకీ తెలుసు — మనిద్దరి స్నేహమూను!' అందామె.

తానింకా చదువుతున్నాననే భ్రమలోనే కాలేజి ఎడ్రస్‌కు ఉత్తరం రాసి వుంటారు. లలితనూ, తననూ ఏడిపించాలని విద్యార్థులు చేసిన యీ చిలిపిపని ఒక విధంగా మేలయింది. ఇప్పుడీ తర్కాలతో పనవదు. ముందు ఏం చెయ్యాలన్నా కాళ్లూ చేతులూ వొణుకుతూన్నవి...అసలు అమ్మ ఇంకా బతికివుందో, లేదో!

ఎదుటవున్న వస్తువులన్నీ బూజుబూజుగా కదుల్తాడుతున్నయ్. తన సర్వశక్తులూ క్షణంలో మటుమాయమైనయ్.

లలిత భుజంమీద చెయ్యివేసి కదుపుతూ 'మాస్టారూ! ఎందుకలా వొణుకుతారు? ముందువెళ్ళి అమ్మను తీసుకొనిరండి... నేను డాక్టర్ను తీసుకొని సరాసరి మీ గదికి వొస్తాను...భయపడకండి!' అని ప్రోత్సాహమిచ్చిందామె.

శాశ్వితంగా తన జీవితపథం నుంచి విరమించిందనుకున్న దేవతామూర్తి, తిరిగి కళ్ళఎదుట, తన సహాయార్థం వేచి ఉండటాన్ని క్షణంసేపు నమ్మలేక పొయ్యాడు. లలితను చూస్తే పోయిన శక్తులన్నీ వొచ్చినవి. ఏమైతేనేమి, ప్రపంచమంతా నాశనమైతేనేమి, లలిత ఉండగా తనకు భయమేమిటి? అంతరాత్మ పడగవిప్పి బుసలు కొడుతోంది. ఆ వేడితో తను ప్రపంచంలో సాధించలేని దేమిటనే మనోధైర్యం కలిగింది.

'బయలు దేరండి మాస్టారూ!' అందామె, బతిమాలే ధోరణిలో.

నిజానికి తను పొందవలసిన అనుభూతుల్ని, తనకన్న ముందుగా ఆమే పొంది, అద్దంలో చూసుకోగలిగిన తన ప్రతిబింబమా అనిపిస్తోంది. లలితపట్ల తనకు ఏర్పడిన దురభిప్రాయాలన్నీ క్షణంలో మాయమైనవి. యీ హడావిడంతా చూసి శర్మగారు కూడా వొచ్చారు. అంతాచూసి పెద్దగా, గోలగా, గుండెలవిసేట్లు ఏడవాలనిపించింది తనకు...కాని, అనుభూతుల్ని సంస్కారంచాటున దాచుకొని తీరవలసిన నాగరికతను అతిక్రమించే సాహసంలేదు. అదీగాక హృదయం దుఃఖపూరితమైనప్పటికీ, దానికింకా విడుదలరాక, భారమవుతోంది.

'అమ్మగారికి బాగాలేదు...నేను వెళ్తాను' అన్నాడు తను, వొణికి పొయ్యే కంఠస్వరంతో.

'అంతా విన్నాను-పదండి...నేనూ వొస్తాను—' అన్నాడు శర్మగారు.

'మీరు త్వరగా రండి...నేను డాక్టర్ కోసం వెళ్తున్నాను' అని లలిత వెళ్ళిపోయింది. యీ సమయంలో శర్మగారు చూపిన సానుభూతికి హృదయం ద్రవిస్తోంది. మానవులు కనీసం కొన్ని సమయాల్లోనన్నా, తమ మానవత్వాన్ని ప్రదర్శిస్తూంటారు కనుకనే యీ ప్రపంచం అనుకున్నంత దుర్భరమైంది కాదనే నమ్మకం కలుగుతూ వుంటుంది.

ఆ తరువాత ఏం జరుగుతోందోకూడా తెలుసుకోలేని స్థితిలో, తాను కేవలం నామమాత్రుడుగా ఉండిపొయ్యాడు. టాక్సీలో మైలాపూర్ వెళ్ళారు. తన యీ స్థితికి తనను తానే దూషించుకొనసాగాడు. ఒకపక్క శర్మగారు చాలా ధైర్యాన్నిచ్చే వేదాంతం మాట్లాడుతున్నారు. అదంతా సరిగా వినిపించకుండా, అర్థం కాకుండా వుంది. తన అంతరాత్మతో తానే సమాధానపడేందుకు విశ్వప్రయత్నం చేస్తున్నాడు. తానీవిధంగా నిర్లిప్తంగా ఉన్నట్లయితే, తన తల్లికి ఏం సేవచేయ

గలడు? తన బాధ్యతల్ని మనసారా ఎలా నిర్వర్తించ గలడు? యీ సమయంలో తనేమాత్రం ధైర్యాన్ని కోల్పోయినా, తనంత నీచుడు, పాపి, అసమర్థుడు, బల హీనుడు వేరొకడుండడు. దివ్యశక్తుల్ని నమ్ముకొని లాభంలేదు కనుక, ఒక్కసారిగా యీ ఊబిలోనుంచి బైటపడేందుకు వొళ్లు విదిలించుకున్నాడు. మామూలు మని షయేందుకు, మూడ్ మార్చుకునేందుకు, చేయవలసిన పనులన్నీ ఒక్కొక్కటిగా, సక్ర మంగా చేసేందుకు సిద్ధమయే స్థితిలోకి రాగలిగాడు.

టాక్సీ ఆగగానే ఇంట్లోకి పరుగెత్తాడు. ఏ దుర్ఘటనా జరగనట్లే చాలా మామూలుగా మనుషులు కనిపించారు. ఐనా తనవలెనే ప్రతివారూ విచారంగా ఉంటారని తనెందుకు అనుకోవాలి? ఒకరి ఆనందం వేరొకరికి ఎలా భరించదో, అదేవిధంగా ఒకరి విషాదం వేరొకర్ని బాధించదు.

ప్లీడర్‌గారు తనవంక ప్రశ్నార్థకంగా చూశారు.

'మా-అమ్మ!' అన్నాడు తను; ఆ పైన మాటలు పెగలలేదు.

'ఓ! నువ్వా—?' అని వేలుపెట్టి చూపుతూ 'ఆ గదిలో వున్నదామె. డాక్టర్ చూసి వెళ్ళాడు—' అన్నాడు.

సంధించిన బాణంనుంచి వెలువడే అంబువలె గదిలోకి పరుగెత్తాడు. అమ్మ ప్రశాంతంగా పడుకొనివుంది. కళ్లు తెరిచేవుంది కాని, అందులో జీవం ఉన్నట్లు తోచదు. అసలా కళ్ళు ఏమైనా చూడగలుగుతున్నయ్యో, చూసినా అర్థం చేసుకో గలుగుతున్నయ్యో తెలియలేదు.

'అమ్మా!' అన్నాడు, మంచంమీద కూలబడుతూ.

మెల్లిగా కళ్ళను తనవైపు తిప్పిందామె. చాలా శ్రమతో చేయెత్తింది. ఆమె చేతిని పట్టుకున్నాడు. మాట్లాడాలని ప్రయత్నించిందికాని, అది ఆమె శక్తికి మించి నట్లే తోచినట్లుంది. వొళ్లు కాగిపోతోంది. ఇన్నాళ్ళూ వొళ్లు విరుచుకొని పనిచేసి జీవితాన్ని సాధించాననుకొన్న యీ పిచ్చితల్లిని యీ నాడు జీవితమే జయించి, హేళనగా మొహంలో నవ్వుతూండగా, ఆమె కుంగిపోతున్నట్లు తోచింది...

అమ్మ మాట్లాడితే కొంతలో కొంత నయంగా వుండేది; కాని మాటకూడా పడిపోయిందేమో? అసలేం జబ్బో, దీనికి మందు మాకుంటూ యీ ప్రపంచంలో ఉన్నదో లేవో కూడా తెలియదు. అందులోనూ ఇలాటి విషమ సంఘటనను ఎదు రొక్కవటానికి తనకు ఇదే మొదలు.

పక్కనేవున్న శర్మగారు వొణికిపొయ్యే తన భుజంమీద చేయివేశారు. 'భయం లేదు...యీమెను తీసుకొని వెళ్దాం' అన్నారాయన. అప్పుడు కాని, యీమెను ముందు యీ నరకంనుంచి, దాటించెయ్యాలనే సంగతే గుర్తు రాలేదు. ఒకో సంఘ టనలో మానవుడు తన మతినే పోగొట్టుకొంటాడు. వేరొక రెవరైనా పక్కన వుండి, దారిచూపనట్లయితే, నడవలేడు. తన యీ దుస్థితిలో ఒకపక్క లలితా, మరోపక్క శర్మగారూ, రెండు రెక్కలవలె ఉండి ముందుకు సాగేట్లు చేయ గలుగుతున్నారు. వీరిద్దరి మేలుకూ తను జన్మంతా కృతజ్ఞత చూపవలసిందే.

యజమాని దగ్గిరికి వెళ్ళి 'అమ్మను తీసుకొని వెళ్తాను—' అన్నాడు తను.

'తీసుకెళ్ళండి...ఇక్కడ మాత్రం ఎవరున్నారూ ఆమెను చూసేందుకు?... ఏం లేదు—ఎంతో అలిసిపోయింది పాపం! నిజానికి యీ వయస్సులో ఆమె పొయ్యిదగ్గిర గంటల తరబడి పనిచేయ కూడదనుకోండి...వారం పదిరోజులు విశ్రాంతి వుంటే మళ్ళీ ఆరోగ్యాన్ని పొందుతుంది...బ్లడ్ ప్రెషర్ అన్నాడు, డాక్టర్!' అన్నాడాయన.

పాడిచ్చే పశువును, అది ఇక నిరుపయోగమని తెలుసుకున్నాక, కసాయి దుకాణానికి తోలేందుకు వెనుకాడని మానవ ప్రవృత్తి బాగా అర్థమైంది! అయినా ఏమనీ లాభంలేదు. తమ పరిస్థితులకు తలఒగ్గి తమ యీ దుర్భర స్థితికి తామే బాధ్యులనుకోవటం కన్న, మరో ఆలోచన ప్రస్తుతం అనవసరం. 'ఎద్దుపుండు కాకికిముద్దా?' అనే సామెత గుర్తొచ్చింది.

శర్మగారి సహాయంతో అమ్మను టాక్సీలో గదికి తీసుకొచ్చాడు. అప్పటికే లలిత గది గుమ్మందగ్గిర సిద్ధంగావుంది. తాళంతీసి, మసిబారిన లాంతరు వెలిగించి, చాపమీద పక్క వేసి తల్లిని తీసుకొచ్చి పడుకో బెట్టారు. యీలోగా శర్మగారు టాక్సీవాడికి డబ్బిచ్చి పంపేశారు; తనచుట్టూ కొంత మందన్నా మనుషులంటూ లేకుంటే ఏమయ్యే వాడో, యీ నాడు తలుచుకుంటేనే కంపర మెత్తుతూ వుంటుంది.

అమ్మ మాట్లాడేస్థితిలో లేదు. ఎవరేం చేసినా చూస్తూ వూరుకుంటోంది. దిగులుగా, తనకిక శక్తి లేనట్లు, ఏదో అదృశ్య శక్తికి లొంగి పోతూన్నట్లుగా కళ్లు తేలవేస్తూంటే, తనకు కంపర మెత్తుతూంది. లలితను చూడగానే ఆమె కళ్ళల్లోకి కొత్త వెలుగు వొచ్చినట్లయింది. చిరునవ్వు నవ్వాలనీ, ఏదో మాట్లాడాలనీ ప్రయత్నించింది కాని, పెదవులూ, నోరూ వొణకటం కన్న మరేమీ అవలేదు...అమ్మకు పక్షవాతం వొచ్చి ఒక పార్శ్వమే పడిపోలేదు కదా!

'మాస్టారూ! నేను వెళ్ళేటప్పటికి డాక్టర్ బైటికి వెళ్లాడు. రాగానే ఇక్కడికి రమ్మని చీటీరాసి ఉంచివొచ్చాను...మీరేం భయపడకండి' అందామె.

భయం తన సమస్యల్ని తీర్చలేదు సరికదా, ఉన్నవాటిని అతి భీకరంగా చూపుతుంది; అందుకని భయపడీ లాభంలేదు. ఏమౌతుందోననే ఆతృతవల్ల కూడా ప్రయోజనంలేదు.

రెండు నిమిషాలపాటు ఆ గదంతా నిశ్శబ్దంలో మునిగిపోయింది.

'యీమెకు విశ్రాంతే పరమౌషధం!' అన్నారు శర్మగారు. ఎంత మూర్ఖుడైనా ఆ సంగతి ఇట్టే చెప్పగలడు. సంవత్సరాల తరబడి బడలిక ఆమె ఫాలభాగం మీది ప్రతి ముడతలోనూ నాట్యమాడుతోంది. విశ్రాంతి ప్రస్తావనేలేని జీవితాన్ని గడపవలసిన అవసరం ఏర్పడిందామెకు! ఆమెమీద ఎవరికీ, చివరకు తనకుకూడా జాలిలేదు; ఇక ఆ విధికి జాలిలేదనుకోవటం దేనికి? ఒకవేళ పొరపాటున ఎవరైనా

జాలి చూపదలచినా ఆమె స్వీకరించలేదు. జీవితాన్ని ఒంటరిగా పోరాడాలనే ఆమె పట్టుదలే కారణం. ఆమె అడుగు జాడల్లో నడిచే తన ధోరణి ఇదే కదా!

మళ్ళీ నిశ్శబ్దం ఆవరించింది. లలిత అమ్మపక్కనే కూర్చొని, ఆతృతతో చూస్తూవుంది. లలితవుంటే అమ్మ చాలా త్వరలోనే ఆరోగ్యాన్ని పొందుతుందనే నమ్మకం వుంది తనకు. ఇదివరకు తనకు ప్రాణదానం చేసిందామె ... ఇప్పుడు అమ్మనుకూడా బతికించగలదు!

పావుగంటదాకా ఎలాంటి శబ్దమూ లేకుండానే గడిచింది. ఎవ్వరూ మాట్లాడటం లేదు; ఆ అవసరమూ లేదు. ఇలాంటి పరిస్థితుల్లో మాట్లాడే హక్కు ఒక్క డాక్టర్‌కే వుంది.

మరో పది నిమిషాలు గడిచాక, బైట కారుఆగిన శబ్దం కాగానే లలిత వెళ్ళి డాక్టర్ను వెంటపెట్టుకొని వొచ్చింది. డాక్టర్ కాళ్ళమీద పడదామనుకున్నాడు తను! కాని సభ్యత, తనూ ఒక మానవుడేననే హెచ్చరిక అడ్డి నమస్కరింప జేసింది.

డాక్టర్ వొచ్చి పరీక్షచేశాడు. నాడిచూశాడు; ఇంటి వాసాల్ని లెక్కించాడు... రెండు నిమిషాలయ్యాక వేడినీళ్ళు తెమ్మన్నాడు...చప్పున ఇంటి యజమానుల దగ్గర్నుంచి వేడినీళ్ళు తీసుకొచ్చాడు తను. సిరంజ్ అందులో ముంచి, ఇంజక్షన్ తీశాడు. తను లాంతరు పట్టుకోగా, లలిత సహాయంతో, డాక్టర్ ఒక ఇంజక్షన్ ఇచ్చాడు...ఇక తన పని ఐపోయినట్లుగా బ్యాగ్ సర్దుకున్నాడు.

డాక్టర్ ఏమీ చెప్పకుండానే వెళ్ళిపోతూంటే భయంవేసింది; ఇది మాట దక్కే కేసుకాదని తేల్చుకున్నాడేమో? లలిత మొహంచూసి వొచ్చాడు కాని, రేపటి నుంచీ తన మొహంచూసి వొస్తాడా? అసలు అమ్మ స్థితిఏమిటో - ఏదైనప్పటికీ - దాన్ని తెలుసుకుంటే యీ ఆతృతన్నా తగ్గుతుంది.

ఏం చెయ్యాలో తోచని స్థితిలో లలిత డాక్టర్ వెంట వెళ్ళింది. బైట ఏదో గుస గుసలు జరిగినవి; అల్లంతదూరాన, కత్తులు నూరుతున్నట్లుగా శబ్దం! తానా సంగతులన్నీ తెలుసుకొని తీరవలసిన అవసరం వున్నప్పటికీ, ఆ బాధ్యతలనుకూడా లలితే తీసుకుంది.. డాక్టర్ వెళ్ళి పొయ్యాక, వాడిపోయిన మొహంతో వొచ్చిన లలితను చూడగానే అమ్మ మృత్యువుతో పోరాడుతోందనీ, జయం యీమె పక్షంలో లేదనీ తోచింది. ప్రవాహ మధ్యంలో నిస్సహాయంగావున్న తనకు ఇంక దిక్కెవరు?

'మాష్టారూ!' అని ఆమె ప్రశ్నార్థకంగా తన మొహంలోకిచూసి బైటికి నడిచింది. తాను మాట్లాడబొయ్యేది అమ్మ వినకూడదని బహుశా ఆమె అభిప్రాయమై వుంటుంది. అమ్మ యీ మాటల్ని విని అర్థం చేసుకొనే స్థితిలో'వుందని లలిత పొరబడుతోందమో? పోతే శర్మగార్ని వొదిలెయ్యటం బాగాలేదు. ఆయన ఏమన్నా అనుకున్నా అనుకోవొచ్చు. ఇందులో ఆయన వినకూడని రహస్యాలు అసలేలేవు.

తాను ఎదుర్కోబోయ్యే ప్రమాదానికి అండగా ఉండేందుకు సిద్ధంగావున్న శర్మ గారిని గాయపరచటం తప్పని తోచింది. అదీగాక, ఆయన తన అనుభవంతో మంచి సలహా ఇవ్వగలుగుతాడు కూడాను.

అందుకనే శర్మగార్ని కూడా తనతోపాటు పిలిచాడు; ఆయనకూడా తనతో పాటే బైటికి వొచ్చాడు. రోడ్డుమీద వీధి దీపంకింద సమావేశం ఆరంభమైంది.

'ఏం లేదు మాష్టారూ! ఆమె బ్లడ్ ప్రెషర్ అధికంగానే వుంది. క్షణాల్లో తగ్గటం కష్టం. విశ్రాంతి అత్యవసరం...ఇదంతా ఇక్కడ కుదరదు కనుక, నర్సింగ్ హోంకు పంపరాదా అంటాడు డాక్టర్' అంది లలిత.

శర్మగారు త్వరపడి 'అదే మంచిది' అని అంటాడేమోనని భయంవేసింది. కాని ఆయన విని మెదలకుండా ఊరుకున్నాడు.

తనే ఆలోచనలో పడ్డాడు. పూర్వం తనను నర్సింగ్ హోంలో ఉంచారు: దానికైన ఖర్చంతా లలిత ఇచ్చింది. ఇక 'ఇప్పుడు అమ్మను బతికించుకునేందుకు నర్సింగ్ హోంకు తీసుకెళ్ళవొచ్చు; కాని తన దగ్గిరవున్న ఐదారు వొందలూ సరి పోతయ్యో, లేదో? పోనీ అన్నిటికీ అలితే ఉన్నదనుకోలే డిప్పుడు. తన లేమిని ఎత్తి చూపుతూ, తనకు సహాయం చేసేందుకు లలిత కానీ, ఇంకోరు కానీ ప్రయత్ని స్తూంటే ఇప్పటికే ఎంతగానో గాయపడిన అంతరాత్మ, గిలగిలా తన్నుకొని ఛస్తుం దేమో కూడాను. లేక అప్పుగా ఎక్కడన్నా పైకం తెచ్చేందుకు, తనకు ఇల్లా, వాకిలా, పేరా, ఊరా ఎవరన్నా ఇచ్చేందుకు? అలా ఇచ్చేందుకు ఎవరైనా సాహ సిస్తే, అది తిరిగి తమ చేతికి రాదనేసంగతి తెలిసే ఇస్తారు; ఒకవేళ వారలా భావించకున్నప్పటికీ, తను తీర్చలేడు కనుక, పర్యవసానం అదే అవగలదు. అందుకని యీ తీర్చలేని దానికోసం పరుగెత్తి, అభాసు కాలేడు. ఎంతకూ సాధ్యమైనంత వరకూ, తన దగ్గిరవున్న దాంట్లో ముడుచుకోవటమూ, లేనట్లయితే బాధపడి తనలేమి ఇతరులకు తెలియకుండా చేసుకోవటమే తాను చేయగలిగింది. అన్నిటినీ మించి లలిత ఆడకూతురు; తండ్రి చాటు యువతి; ఆమెకు స్వేచ్ఛలేదు; అందునా ఆర్థిక స్తోమతు, వ్యక్తిగతంగాలేదు. లోగడ ఆమె చెప్పినట్లు, ఇంట్లోకూడా వొత్తిడి ఆరంభమైందని తెలుసారుు! యీ పరిస్థితుల్లో తన బాధల్ని ఆమెకు అంటగట్టటం అర్థంలేని పని!

ఇదంతా క్షణంలో ఆలోచించుకొని, 'నర్సింగ్ హోంకు దేనికిలే లలితా! ఇక్కడే వుంటుంది' అన్నాడు.

లలిత కళ్ళు పెద్దవిచేసి తన అసమ్మతిని తెలియపరుస్తూ అంది: 'ఇక్కడ ఎవరు చూస్తారు మాష్టారూ? మీ దారిన మీరేమో ఆఫీసుకు వెళ్తారు కదా!' అంది.

లలిత చెప్పింది చాలా సబబే కాని, తనః స్థితిలో వున్నవాడికి మాత్రం కాదు. అందుకని ఏవిధంగా నన్నా నర్సింగ్ హోంకు తీసుకెళ్లేందుకు వీల్లేకుండా మాట్లాడాలి.

'చూద్దాంలే లలితా! నేనొక వారంరోజుల పాటు సెలవు తీసుకుంటాను -' అన్నాడు తను'

'అంతేలెండి...ఆ రాసే మాటర్ ఏదో ఇంటిదగ్గరే రాస్తే, కుర్రాడు వొచ్చి తీసుకొస్తాడు. ఎలాగో సర్దుకోవొచ్చు' అన్నాడు శర్మగారు.

శర్మగారుకూడా తన పక్షమే మాట్లాడేప్పటికి, లలిత ఒక్కతే ఐపోయింది.

'సరే — మీ ఇష్టం. నేనేం చెప్పేది? డాక్టర్ చెప్పిందాన్నిబట్టి అన్నాను-అంతే!' అందామె. ఆమెకు కోపంవచ్చిందని తేలిగ్గా అర్థం ఐంది. ఐనా తానది గమనించనట్లే నటిస్తే తప్ప లాభంలేదు.

'అన్నట్లు లలితా! డాక్టర్ ఏమన్నారు?' అన్నాడు.

'చెప్పానుగా...రోగివిషయం చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. ఇప్పుడిచ్చిన ఇంజక్షన్‌తో బహుశా తెల్లారేప్పటికి, బాగా తెలివి వొస్తుందన్నాడు. రేపు మళ్ళీ ఇంజక్షన్ చేస్తానన్నాడు. కొన్నాళ్ళ పాటు - బహుశా రెండు మూడు నెలలపాటు మంచం దిగకూడదన్నాడు. మంచి ఆహారమూ, విశ్రాంతీ చాలా ముఖ్యమన్నాడు...' అందామె.

డాక్టర్ ఆశ కనబరిచినందుకు, మొలబంటు దుఃఖంలో, మోకాటిబంటి సంతోషం కలిగింది. ఇక మిగిలిందంతా ఆ విధికే వొదిలి, శక్తి వంచన లేకుండా అమ్మకు తాను సేవ చేయటమే!

'—అన్నట్లు మరిచి పోయ్యాను' అందామె ఒక చీటీ అందిస్తూ 'ఇందులో వున్న మందు తేవాలి. యీ రాత్రంతా రెండేసి గంటల కొకసారి ఒకో డోసు వాడాలి. గ్లూకోజ్ నీళ్ళివ్వమన్నాడు...ఆమెకు నిద్రపడితే మాత్రం నిద్రనుంచి లేపవొద్దన్నాడు'

చీటీ అందుకున్నాడు తను.

'మీరు వెళ్ళి మందులు తీసుకొనిరండి మాష్టారూ! నేనుంటాను...మళ్ళీ ఆలస్యమైతే షాపులు కట్టేస్తారు' అంది లలిత.

నిజమే-రాత్రి ఎనిమిదిన్నర ఐ వుంటుంది. లలితను ఇక్కడ ఉంచటం ఏమీ సబబు కాదని తెలుసు తనకు. తన స్వార్థాన్ని చూసుకొని, ఇంతసేపూ ఆ సంగతే గుర్తు రాలేదు.

'లలితా! నువ్వెళ్ళు. చాలా పొద్దెక్కింది. నేను వెళ్ళి మందు తెస్తాను—' అన్నాడు.

'మీరు వెళ్లండి పాపం! చాలా ఆలస్యమైంది. నేను ఉంటాను' అన్నాడు, శర్మగారు.

యీ హెచ్చరికల్ని లలిత తోసిపారెయ్యలేక పోయింది. తనతోపాటే బయలుదేరింది. కొస్త దూరం వెళ్ళాక 'మాష్టారూ!' అంది రహస్యం చెప్పే ధోరణిలో. తక్కున ఆగి పోయ్యాడు; ఆమెకూడా ఆగింది.

'ఏంలేదు...మీకేమన్నా డబ్బు కావాలా ?' అంది, భయపడుతూనే.

తనకు మండిపోయిన మాట నిజమేకాని, యీ సమయంలో మంచితనాన్ని కూడా పరాభవించటం అవుతుందని పస్తాయించాడు.

'అక్కర్లేదు లలితా ! నా దగ్గరవుంది !' అన్నాడు కొంత విసురుగానే.

'ప్రస్తుతం నా దగ్గరా లేదనుకోండి...కాని అవసరమైతే మాత్రం అడగండి' అందామె.

'సరే...సరే !' అన్నాడు విసుగ్గా.

'మరోమాట మాష్టారూ !' అందామె చాలా ప్రశాంతంగానే 'పరిస్థితులు మీకు తెలుసుగా...ఇదవరకల్లే నేను బైటికి రాలేను. యీమధ్య నామీద సి. ఐ. డీలు కూడా పనిచేస్తున్నారులెండి. అందుకని పిలుచుకొని వొస్తూంటాను...అమ్మ గారికికూడా చెప్పండి...కాని నేను రోజూ రావటంలేదని మీరేమీ అనుకో కండేం !'

నిలువునా నీరైపొయ్యాడు తను. అది రోడ్డు ఐపోయింది కాని, లేకుంటే లలిత కాళ్లమీద పడి, కన్నీటితో ఆ పాదాల్ని కడిగేసినా, తాను ఆమెపట్ల తలిచిన అపచారాలకు ప్రాయశ్చిత్తం జరగదనిపించింది. యీ మధుర మూర్తినిగూర్చి, ఇక ముందు జీవితంలో ఏ విధమైన చెడును అంటగట్టినా, అది తనను పతితుణ్ణే చేస్తుంది !

'అందుకనే మాష్టారూ ! నర్సింగ్ హోంలో ఉంచమన్నాను—' అందామె, తానేదో నేరంచేసి, సంజాయిషీ చెప్పుకుంటూన్న ధోరణిలో. తనకా నోటమాట రాక స్తబ్ధుడవుతున్నాడు.

ఇది వీధి అనీ, తామిద్దరూ ఒకపక్కగా ఇలా నిలబడి మాట్లాడటం చూసే వాళ్ళకు చాలా విచిత్రంగానూ, అసహ్యంగానూ ఉంటుందనీ తోచింది.

'లలితా ! నీ వసలు రావొద్దు...ఏం ఫర్వాలేదు. నీవు రానంతమాత్రాన, నిన్ను అపార్థం చేసుకుంటా ననుకున్నావా ?' అన్నాడు తను.

'అది కాదు మాష్టారూ...'

ఆమెనిక మాట్లాడనిచ్చి, సంభాషణ పెంచటంవల్ల ఆమెకూ, తనకూ కూడా ఆలస్యమాతుంది. ఏమన్నా ఫిర్యాదులూ, సంజాయిషీలూ వుంటే వేరొక సమయంలో చూసుకోవొచ్చు. ముందు యీమెను పంపేసి, మందులు తీసుకొని అమ్మదగ్గిరికి వెళ్లాలి. ఆ తరువాత తీరిగ్గా ఉన్నప్పుడు లలిత విషయం ఆలోచించవొచ్చు.

'లలితా తర్వాత మాట్లాడుకుందాం.. ఆ రిక్షా పిలుస్తాను ... వెళ్ళు!' అన్నాడు. ఆమె మెదలకుండా రిక్షా ఎక్కి కూర్చుంది. రిక్షా కదలగానే 'వొస్తాను మాష్టారూ! అమ్మను కొంత కనిపెట్టి ఉండండి' అని నమస్కరించింది.

క్షణంసేపు నేలమీద పాతివేయబడిన శిలా విగ్రహంవలె అయింది తనపని ! యీ లలిత లేకుంటే జీవితం ఏనాడో అంతరించి ఉండేదనేది గొప్ప సత్యమేనని ఇప్పుడు అర్థమాతోంది., యీమెకు తను జీవితంలో కృతజ్ఞతను చూపగలడా ?

యీమెను గూర్చి ఆలోచించే సమయమిది కాదనే అంతరాత్మ హెచ్చరికను పాటించి, వేగంగా బజారువైపు వెళ్ళాడు. జేబులో ఇరవై రూపాయిలున్నవి. మందులషాపువాడు ఒకసారి చీటీ చూసి, తన మొహంలోకి ఒకసారి చూసి 'ఆరు రూపాయిలు అవుతయ్—' అన్నాడు.

మెదలకుండా డబ్బు చెల్లించి మందులు తీసుకొన్నాడు, ఇంత ఖరీదైన మందులు తన బోటి వాడికి తలకు మించినవే కాని మరి మార్గంలేదు. అందులోనూ తన ఏకైక బాంధవిని రక్షించుకునేందుకు ఇవి ఉపయోగపడాలే కాని, తన దగ్గర వున్నదంతా ఖర్చుపడినా విచారించాల్సింది లేదు!

ఆదరా బాదరా గదికి జేరాడు. శర్మగారు కునికిపాట్లు పడుతూ తన కోసం ఎదురు చూస్తున్నారు. తాను వెళ్లినప్పుడు ఎలా వుందో, అమ్మ అదే విధంగా వుంది.

వొచ్చాక మందు ఇద్దామని ప్రయత్నించాడు. కాని ఆమె నోరు తెరిచి మింగే స్థితిలో లేదని తెలుసుకోగానే కొద్దిగా కూడగట్టుకొన్న ధైర్యం కాస్తా దిగజారి పోయింది. చేసేదిలేక విచారంగా కూర్చున్నాడు.

శర్మగారు ఇంటికి వెళ్లేందుకు తొందర పడుతున్నారని తోచింది తనకు. ఇప్పటికే చాలా పొద్దెక్కింది; రాత్రి పది గంటల పైనే వుంటుంది. ఆయన్ని ఇక్కడ ఉండమనటం భావ్యంకాదు. ఇప్పటికే ఆయనలేని పోని శ్రమంతా తనకోసం పడ్డాడు. తానొక్కడికే యీ దుర్ఘటనను ఎదుర్కొనే శక్తిలేని మాట నిజమే కాని, యీ కష్టాలు శక్తి సామర్థ్యాను సారంగా రావు మరి.

'మీరు వెళ్లి రండి—శర్మగారూ!' అన్నాడు తను వొణికి పొయ్యే కంఠంతో.

'ఆమెను విశ్రాంతి తీసుకోనివ్వండి. బహుశా రేపు ఉదయానికి కొంత రిలీఫ్ రావొచ్చు' అని శర్మగారు వెళ్ళేందుకు సిద్ధమై, 'రేపొచ్చి చూస్తాను...మీరు ఆఫీసుకు రాకండి. ఏమన్నా అవసరమైన పని వుంటే ప్యూన్ చేత కబురు చేస్తాను...' అని ఆయన జారుకున్నాడు.

## 26

ఏళ్ల తరబడిగా ఒంటరిగా వుంటూన్న తనకు యీనాడు, యీగది భయంకరమైన ప్రదేశంగా తోచింది. అమ్మ వొస్తే ప్రశాంత జీవితంలో పడవొచ్చనుకున్నాడు; కాని అమ్మను యీ స్థితిలో తీసుకొని రావాల్సి వుంటుందని కలలోకూడా అనుకోలేదు కదా!

కళ్ళు తెరిచివున్నా ఆమె చూసి గ్రహించగలుగుతోందో లేదో అర్థంకావటం లేదు. నిలువు గుడ్లు వేయటమంటే ఇదేనా? ప్రమాదావస్థలోవున్న రోగులు, పక్కనున్న వార్ని ఎంత భయపెడతారో, జీవితంలో మొదటిసారి తెలుసుకున్నాడు. ఏమౌతుందని కాదు; ఆ అయేదాన్ని తాను ఏ విధంగానూ ఆపలేడు. కాని ఏమౌతుందోననే భయంతో వొణికి పోతున్నాడు.

అనేక సార్లు దేవుడు లేడనే విషయాన్ని తనలో తాను తర్కించుకొని తృప్తి పడుతూ వొచ్చాడు... కాని యీ సమయంలో దేవుడున్నాడనీ, వాడి మీదనే యీ భారాన్ని వేయటం మినహా మరో మార్గంలేదనీ తోచింది. మానవుడు తన శక్తికి అందని వాటన్నిటినీ దివ్య శక్తులమీద వేస్తూంటాడనేది తన పట్ల రుజూ ఐంది.

అమ్మ అలా నిర్జీవమైన చూపులు చూస్తుంటే తాను భరించలేక పోతున్నాడు. తానీ వెధవ చదువు సాగించకుండా ఏ ఉద్యోగమన్నా చేసుకుంటే, ఇదివరకే తల్లిని తీసుకొచ్చినట్లయితే, ఆమె యీ స్థితిలో ఉండేది కాదు. తన కోసం ఎముకలు విరగ్గొట్టుకొని చావు బతుకుల పొలిమేర్లలో పడిందీమె! ఒకనాడు తనను మృత్యుదేవత కబళిస్తూంటే, అడ్డుపడి, బైటపడేసిందీమె! అలాటి యీమెకు తాను కృతజ్ఞత చూపగలడా? యీ జన్మలో యీమె ఋణాన్ని తీర్చుకోగలడా?

కొద్ది కాలం క్రితం తను జ్వరపడి నప్పుడు, అనుభవించిన బాధంతా గుర్తొచ్చింది. ఆ తెకతెక, ఆశ నిరాశాల మధ్య కొట్టుమిట్టాడే ప్రాణం, దిగ జారిపోయినట్లే వుండి, అంతలోనే మళ్ళీ మెలకువ రావటం-మొదలైన యమయాతననే అమ్మ ఇప్పుడు అనుభవిస్తోందా అనిపించింది...

కాదేమో? ఆమె ఏమో చెప్పాలనుకుంటోంది కాని, చెప్పలేక పోతూన్నట్లు తోస్తుంది. దీనంగా, జాలిగా, బాధగా ఆమె చూడటంలో, ఆమె బాధ కన్న తన బాధ అధికమవుతోంది. తానా నిస్సహాయ స్థితిలో వున్నాడు. తాను పూర్వం పొందిన బాధ కన్న, బాధపడే తల్లిని చూసి పొందే బాధ భరించలేనిదిగా వుంది.

తలుచుకుంటే కంపించి పోతున్నాడు. కళ్ళ ఎదుటి యీ నరకానికి అంతమెప్పుడో? ఏడుద్దామంటే గొంతులో కొట్టుకులాడే దుఃఖం, శరీరాన్నే దహించి వేస్తోంది.

గంట గడిచాక, అమ్మ కళ్ళు మూసుకుంది. బహుశా నిద్ర పోతూండి ఉండొచ్చు; లేక...లేక...ప్రాణం పోయిందా? ఆత్రుతతో దగ్గిరికి వెళ్ళి చూశాడు. ఆమె బరువుగా గాలి పీలుస్తోందని తెలుసుకున్నాక, కాస్త కుదుట పడ్డాడు...

ఇక జరగ వలసిందేమిటి? తన శక్తి వంచన లేకుండా యీమెకు సేవ చేస్తాడు; తనుకూడ బెట్టిన డబ్బంతా యీమె చికిత్సకై వినియోగిస్తాడు. అంతకన్న తనుచేయగలిగిం దేమిటి?

లలిత గుర్తొచ్చింది...ఆమెను తాను అపార్థం చేసుకోవటం మరోసారి జరిగినందుకు, తనను తాను నిందించుకున్నాడు. నిండు హృదయంతో తనకు తోడునీడగా నిలబడే ఏకైక వ్యక్తి అమ్మ తరువాత లలితేనని మరోసారి యీనాడు రుజువైంది. ఇక జీవితంలో ఎప్పుడూ లలితను తాను వేరుగా భావించటం ఆత్మవంచనే కాగలదనే నిశ్చయాని కొచ్చాడు.

ఇది వరకల్లే ఇప్పుడామె అండ తనకు లేదు. లలిత యీనాడు ఇంత సహాయం చేయకుండా ఉన్నట్లయితే, యీ విచారమే తనకు కలిగేదికాదు. ఒకపక్క తనమీద ఎంతో ఆపేక్షను, సానుభూతిని చూపుతూ, మరోపక్క పూర్వంవలె తాను సహాయపడలేక పోవొచ్చనే అనుమానాన్ని వెలిబుచ్చింది. ఆమె నుంచి ఇప్పటికే తాను అకారణంగా ఎంతో సహాయాన్ని పొంది ఉన్నాడు. ఇక కోరటంకూడా భావ్యం కాదు. ఆమె మాటన్నది—యీ కష్ట సమయంలో అది పదివేలు!

పూర్వంవలె తాను బాధ్యతలేని జీవితాన్ని గడపటం లేదిప్పుడు. తల్లిపట్ల తనకెంత బాధ్యత వుందో, తాను చేసే యీ ఉద్యోగంపట్ల అంతకన్న ఎక్కువ బాధ్యతే వుంది. అందునా కాలం విలువ పత్రికల్లో ప్రతిఫలిస్తూనే వుంటుంది. కాలచక్ర గమనంతో రొప్పుతూ రోజుతూ ఐనా సరే పరుగెత్తి తీరాలి. తన అశక్తత బైటపడిన నాడు, తననా ఉద్యోగంకూడా విడనాడుతుంది.

యీ బోడి ఉద్యోగాన్ని తానొకపక్క ద్వేషిస్తూనే వున్నాడు. కాని ఇలాటి కష్టసమయంలో తాను సంపాయించకుంటే కాలం వెళ్ళదు. కనీసం ఇందుకన్నా తన యీ చాకిరీ ఉపయోగపడుతోంది. ఇదన్నా లేకపోతే తనేంచెయ్యేవాడో?

ఇప్పుడు అమ్మ స్థితి ఎలావున్నా, తాను పత్రికకు చాకిరీ చేయటం తప్పదు. వికలమైన మనస్సుతో భుజబల నియామకుడు కూడా కలం సాగేట్లు లేదు. మెదడు చలన రహితమైతే తప్ప రాయలేడు. యీ ఇబ్బంది ఎలానా అనే బాధ ఉండనే వుంది.

—అమ్మకు మెళుకువొస్తే బాగుండు. కొత్త మందిచ్చి చూడొచ్చు. కొంతసేపు విశ్రాంతి తీసుకుంటే ఆమెకు కొంతలో కొంత కులాసా చిక్కవొచ్చనే ఆశకూడా వుంది. ఆమెను అలాగే చూస్తూ, కన్ను తెరుస్తుందేమోనన్న ఆశతో మేలుకూర్చోవటం తప్పదు.

తమాషా! ఇంత వేదనలోనూ నిద్ర కమ్ముకు వొస్తోంది. వేదన అధికమై, శరీరం ఇక దాన్ని భరించలేక విశ్రాంతి కోరుతుందేమో? ఇక నిలవలేక, తనకు తెలియకుండానే మైకం కమ్మినట్లు కళ్ళు మూతలు పడినవి.

మళ్ళీ మెళుకువొచ్చేప్పటికి తెల్లగా తెల్లవారింది. జ్ఞానేంద్రియాలన్నీ పని చేయటం హఠాత్తుగా మొదలయ్యేప్పటికి, నిద్రలో తెలియని కంపరమంతా ఆరంభమైంది. విషాద సంఘటన తెగిన కొన గుర్తొచ్చింది.

అప్పటికే అమ్మకూడా మెలుకూ వొచ్చింది. తను లేచి కూర్చోగానే ఆమె కష్టంతో చెయ్యెత్తి పిలిచింది. రాత్రికన్న కొంచెం నయమనిపించింది, తనకు.

తను దగ్గిరికి వెళ్ళగానే 'మంచి నీళ్లు' అన్నట్లు సైగ చేసింది. చప్పున తను మంచి నీళ్ళు నోట్లో పోస్తే తాగింది.

'అమ్మా! ఎలా వుందే?' అన్నాడు, తను.

'కొంచెం నయమే!' అన్నట్లు ఆమె సైగ చేసింది. మాట్లాడే ప్రయత్నం చేసినా, మాట్లాడ లేక పోతోందేమో? ఏమైనా వ్యాధి తిరుగు ముఖం పట్టినట్లు అంచనా వేసుకోగలిగాడు తను. తనపట్ల ఆ అదృశ్య దివ్యశక్తులు కొంతలో కొంత నన్నా ఇంకా జాలి చూపుతూన్నవి. మానవుడంత అల్పసంతోషి ఎవడుంటాడో!

అమ్మను ప్రశ్నించి లాభం లేదని, బైటికి వెళ్ళి కాఫీ తెచ్చాడు. ఆమె దగ్గిర కూర్చొని, తల నిమురుతూ కాఫీ గొంతులో పోశాడు; ఆమె తాగింది; తాగ గలిగి నందుకు ఎంత సంతోషించాడని! డాక్టర్ వొచ్చి మరి కొంత ధైర్యం చెపితే బాగుండు.

కాల కృత్యాలు తీర్చుకొని, గదంతా చిమ్మి, డాక్టర్ రాక కోసం వేచికూర్చు న్నాడు. ఎంతకూ డాక్టర్ రాకుంటే మరోపక్క ఆతృత ఎక్కువైంది. డాక్టర్ కోసం వెళ్ళి వొచ్చేందుకు, తనొక్కడూ! అమ్మను యీ స్థితిలో వొదిలి వెళ్ళటం ఎలా? ఒక వేళ తను ఇటువెళ్తే, డాక్టర్ అటొస్తే, అమ్మ మాట్లాడలేని స్థితిలో డాక్టర్ ఏం చేస్తాడు? అందుకని విధిలేక డాక్టర్ కోసం ఎదురు తెన్నులు చూడ సాగాడు.

తొమ్మిదింటికి కాబోలు శర్మగారు వొచ్చారు. ఆయన్ని చూడగానే, తన ఒంటరి తనం సగం పోయినట్లనిపించింది.

'ఎట్లా వుంది?' అన్నాడాయన.

తను అంతా చెప్పాక, శర్మగారు అమ్మనుచూసి 'చాలానయం...డాక్టర్ రాలేదా?' అన్నాడు.

'ఆయన కోసమే చూస్తున్నాను'

'నేనిక్కడ వుంటాను...పోనీ మీరు వెళ్ళి పిలుచుకు రాకూడదా?' అన్నారు శర్మగారు.

కొంచెం సేపు ఆలోచించాక, డాక్టర్ దగ్గరకు వెళ్ళి రావటమే మంచిదనిపించింది. ఎందుకంటే నిన్నటిపరిస్థితికీ నేటికీఏమీ సంబంధంలేదు. నిన్నలలితే స్వయంగా డాక్టర్ను తీసుకొచ్చింది; లేనట్లయితే ఆయన తన బాధ్యతను గుర్తించి ఉండేవాడే కాదు. ఇక యీనాడు కేవలం తన శక్తి సామర్థ్యాలే మిగిలినవి. వాటిని చూసే డాక్టర్ రావాలి; కనుక వెళ్ళటం తప్పదు.

ఆతృతతోనే వెళ్లాడు. డాక్టర్ 'ఎలా వుంది?' అని అడిగాడు. అంతా చెప్పి 'తమ రొకసారి వొచ్చి చూడాలి' అని అర్థించాడు తను.

డాక్టర్ కొంచెం ఆలోచించి 'రోజూ అక్కడికి రావటమూ అదీ కుదరదు. ఇక్కడ నర్సింగ్ హోంలోనే ఉంచరాదా?' అన్నాడు.

'నాకంత తాహతు లేదు' అన్నాడు తను.

డాక్టర్ ఒకసారి పరీక్షగా తనను పైనుంచి కిందిదాకా పరిశీలించి చూసి 'సరే—మళ్ళీ ఇంజక్షన్ ఇద్దాం—' అని, ఇంజక్షన్ పేరు రాసిన కాగితం చేతికిచ్చి 'ఇది కొనుక్కొని మీరు ఇంటి దగ్గర ఉండండి. నేను ఒక గంటయ్యాక వొస్తాను' అన్నాడు.

ప్రిస్క్రిప్షన్ తీసుకొని వొస్తూండగా, డాక్టర్ చిటికె వేసి వెనక్కు పిలిచి అన్నాడు: 'మిస్టర్! నేను వొచ్చినప్పుడల్లా మూడు రూపాయిల ఫీజు అవుతూ ఉంటుంది.'

క్షణం సేపు నీరై పొయ్యాడు తను; డాక్టర్లు డబ్బు తీసుకుంటారనీ తెలుసు; పెద్ద వాళ్లు ఎక్కువ పుచ్చుకుంటారనీ తెలుసు. కాని ఈయన ఇంత సూటిగా మాట్లాడటం కష్టమనిపించింది. తన ఆత్మబంధువు ప్రాణంతోనే చెలగాటం ఆడుతున్నాడని తోచింది. కాని తానేమనగలడు? నోట మాటకూడా రాక 'సరే' నన్నట్లు తలవూపి జారుకున్నాడు.

దగ్గర్లోనే తన ఆర్థిక బలహీనతకూడా బెదిరిస్తూ వుంది. తన దగ్గర వున్నదంతా ఖర్చు పెట్టేందుకు సంసిద్ధుడే! కాని, దాంతోనే అమ్మ ఆరోగ్యాన్ని పొందగలదా అనే అనుమానం వేధిస్తోంది.

ఇంజక్షన్ నాలుగు రూపాయిలైంది. వెనకా ముందూ ఆలోచించే సమయం కాదు కనుక, లెక్క చెయ్యలేదు. ఇది వరకు తనకు జబ్బు చేసినప్పుడు లలితే ఖర్చంతా భరించింది కనుక, తెలియలేదు కాని, నిజంగా ఆ భారమే తనమీద పడినట్లయితే, బతకటంకన్న చావటమే చాలా తేలికైనదిగానూ, చౌకగానూ కనిపించేది.

ఇంటికి రాగానే శర్మగారు 'ఇక నేను వొస్తాను. రేపు పత్రిక పూర్తి చేయాలి కదా?' అన్నారు.

'మీరు పదండి... నేను రాయాల్సింది ఏమన్నా వుంటే, పంపులే ఇక్కడే రాస్తాను' అన్నాడు తను.

సరేనని శర్మగారు వెళ్ళి పొయ్యారు.

గంట దాటాక కాని డాక్టర్ రాలేదు. పరీక్ష చేశాక 'ఫర్వాలేదు... త్వరలోనే కోలుకుంటుంది' అన్నాడు. డాక్టర్ చూపిన సంతృప్తికి ఎంతో ఆనందమైంది.

డాక్టర్ ఇంజక్షన్ చేశాక 'మందు ఇస్తున్నారా?' అని అడిగాడు.

'రాత్రి తాగలేక పోయింది...ఇవ్వాళ ఇంకో ఇవ్వలేదు' అన్నాడు తను.

'ఇవ్వండి...మళ్లీ రేపొద్దున వొస్తాను. మరో పది ఇంజక్షన్లన్నా ఇవ్వాలి' అని డాక్టర్ వెళ్లేందుకు సిద్ధపడ్డాడు. ఆయన చేత అడిగించుకోకుండానే తను మూడు రూపాయిలూ చెల్లించి డాక్టర్ని సాగనంపాడు.

తరువాత మందుకూడా తాగించ గలిగాడు. మొత్తంమీద,నిన్నటిలాగు మనస్సు వికలం చెందలేదు; నిన్న ఛిన్నా భిన్నమైన ముక్కల్ని తిరిగి కలేసు కుంటున్నాడు.

బారెడు పొద్దెక్కింది. రాత్రికూడా ఏమీ తిననందువల్ల చాలా నీరసంగా వుంది; ఆకలి దహించుకొని పోతోంది. చప్పున బైటికి వెళ్ళి టిఫిన్ చేసి వొచ్చాడు; కాని అది అంతగా సయించ లేదు.

తను తిరిగి వొచ్చేప్పటికి ఆఫీసు కుర్రాడు వేచి వున్నాడు. యీ సమయంలో కూడా తనకు పనిచేయటం తప్పనందుకు కష్టమనిపించింది కాని, డబ్బు విలువ ముందు, మానవత్వపు విలువలు తలలు వంచటమనేది తన జీవితానుభవమే కనుక, మెదలకుండా రికార్డు తీసుకున్నాడు.

'సాయంత్రం వొస్తాను సార్' అని ఆఫీసు కుర్రాడు వెళ్ళి పొయ్యాడు.

ఒకే మనసుకు సందర్భాన్నిబట్టి రంగురంగులు వేయటం ఎంత కష్టమో తెలిసి వొచ్చింది. నరకమంటే ఇంకెక్కడో వుంటుందని ఘోషించే పెద్దల సూక్తులు ఎంత సత్యదూరమో అర్థమైంది. మనిషికన్న యంత్రం నయం; యంత్రం తనలో ఏ కాస్త లోపం జరిగినా, పనిచేయనని మొండికేస్తుంది; కాని మనిషి అలా అనేందుకు వీల్లేదు. తనలో జరిగిన లోపాలతో ప్రపంచానికి, ముఖ్యంగా డబ్బుకు పనిలేదు. డబ్బుకుదాస్యం చేయుసాగాక, ఆ దాస్యపురూపం ఏవిధంగా వున్నా మెదిలేందుకు అవకాశమే లేదు.

—ఇలా ఆలోచిస్తూ కూర్చుంటే సాయింత్రానికి యీ చెత్తంతా రాయటం వినట్లే! గుడ్డిలో మెల్లయేమంటే తను ఇంటిపట్టునే వుండి పనిచేసేందుకు శర్మగారు ఒప్పుకోవటం!

ఐనా దీన్నిగూర్చి కష్టపడట మెందుకు? ఇన్నాళ్ళూగా రాస్తూంటే తన చర్మమే మొద్దుబారింది. ఏదో వొకటి రాసిపారేస్తే చదివేజనం ఉన్నారు; వారు చదవకున్నా, చదివి తిట్టినా తను గమనించవలసిన పనే లేదు. ఆధైర్యంతోనే కలం కదిపాడు.

మధ్యలో అమ్మవైపు చూసుకుంటూ, రాసుకు పోతున్నాడు. కాస్సేపు ఆమె ఇదంతా గమనించి, ఆ తరువాత తిరిగి నిద్రకు ఉపక్రమించింది. మరి కొంత మనశ్శాంతితో, ఎంత త్వరగా యీ పని వొదులుతుందా అనే ఆతృతతో చాలా వేగంగా రాసుకొని పోసాగాడు.

నానా అవస్థపడి సాయంత్రం నాలిగింటికల్లా పూర్తిచేశాడు. మరో అర గంటయ్యేప్పటికి ఆఫీసు సుబ్రాడు హాజరయ్యాడు. ఆ కాగితాలు వాడి మొహానకొట్టి, వాడు తెచ్చిన కొత్తకాగితాలు అందుకున్నాడు. అవి తెల్లారేప్పటికి కావాలని సుబ్రాడు ఆదేశించాడు. తనకు విసుగూ, కోపమూ, అసహ్యమూ కలిగినవి కాని, వాటిని తొక్కిపట్టుకొని సుబ్రాణ్ని సాగనంపాడు.

అమ్మకు మళ్లీ మెలకువ వొచ్చింది. మందిచ్చాడు.

'అమ్మా! ఎలావుంది?' అన్నాడు.

'ఫర్వాలేదు—' అందామె, కొంచెం కష్టం మీద.

ఇక యీ జన్మలో అమ్మ మాట్లాడదేమో ననుకొన్న తనకు పరమానంద మైంది. డాక్టర్ ఇచ్చినమందులూ, తన అదృష్టమూ ఇంకా ఎదురు తిరగలేదు.

'ఆకలి' అందామె.

రోగికి ఏం ఇవ్వాలో తనకు తెలియదు. శరీరోష్ణం లేదు. వొంటిమీద చెయ్యివేస్తే ఆమెలో కలిగే ఏదో ఆవేశం తరుముతూన్నట్లుగా రక్తం ప్రవహిస్తూన్న సంగతి తెలుస్తూనే వుంది. సామాన్యంగా రోగికి పళ్ళూ, రొట్టె, కాఫీ ఇస్తారనే జ్ఞాపకం, స్వానుభవంనుంచి తెచ్చుకున్నాడు. చప్పున బజారువెళ్ళి పళ్ళూ, రొట్టె, కాఫీ తెచ్చాడు.

ఆమె పళ్ళు తిన్నది; కాస్త రొట్టెకూడా తిన్నది. కాఫీ తాగింది; తృప్తిగా త్రేన్చింది.

'లలిత ఏదీ?' అన్నది ఉన్నట్లుండి.

లలితనుగూర్చి తనేం చెప్పగలడు? అమ్మ ఊహా సౌధాలను నేలగూల్చటం, అదీ, యీ సమయంలో అసలే కుదరదు. అందుకని 'వొస్తుందమ్మా!' అన్నాడు. ఆమె తనకు తెలియకుండా నవ్వాలనుకుంది కాని, ఆ ప్రయత్నం కొనసాగ లేదు.

అమ్మ అనవసరపు విషయాల్ని ప్రస్తావిస్తుందేమోననే భయంతో 'నువ్వు పడుకోవే - డాక్టర్ విశ్రాంతి ఎక్కువ అవసర మన్నాడు' అన్నాడు.

తన తల నిమురుతూ, ఆమె ఆలోచనలో పడింది; ఆలోచనలు ఎలాటివై ఉంటవో తనకు తెలియటంలేదు కాని, ఆమె కళ్ళనుంచి ఏక ధారగా నీరు ప్రవహిస్తోంది. అది వ్యాధితాలూకు బాధతోనో, లేక తమ యీ నిర్భాగ్య జీవితాన్ని సింహావలోకనం చేసుకుంటూన్నందువల్లనో తెలియలేదు.

'ఎందుకేఅమ్మా ఏడుస్తావ్? నేనున్నానుగా!' అన్నాడు తను; తనకు తాను ధైర్యం చెప్పుకోలేని స్థితిలో, తనలాటి మరో ప్రాణికి ధైర్యాన్ని నూరిపోయ గలుగుతూండటం ఆశ్చర్యమే! కాని కష్టాలనేవి మానవుని ఓర్పును, సాహసాన్ని, ధైర్యాన్ని, నిబ్బరాన్ని రుజువుచేస్తవంటే, అందులో అబద్ధమేముంది?

'ఏంలేదురా బాబూ!' అందామె, కళ్ళుమూసుకుంటూ, మెల్లిగా చేతిని

కూడా, తన తలమీదినుంచి లాక్కొని, ముడుచుకొని పడుకుంది. అదే ఆమెకు ఓదార్పు; తనకూ నేమో?

ఇక మృత్యుభయం మాత్రంలేదు. కాని మరి కొన్నాళ్లపాటు యీమె ఆరోగ్యాన్ని కాపాడాలి. ఆమె మరి జీవితంలో వొళ్లు విరుచుకోవాల్సిన అవసరం లేదు. తన బాధ్యతల్ని తీర్చుకొనే సమయం రానే వొచ్చింది. కాని యీ మందులూ, డాక్టర్ ఫీజులూ వగైరా తన శక్తికి చాలా మించినవిగానే ఉన్నవి. రోజూ కనీసం ఎనిమిది రూపాయిలన్నా అయేట్లుంది.

బ్యాంకులో ఐదొందలున్నవి. యీ పైకం సరిపోతుందా అనే భయంకూడా ఆరంభమైంది. అంగబలమూ లేక, అర్థబలమూ లేక తను అన్యాయమై పొయ్యాడు. దీనికి ఎవర్నని ఏం ప్రయోజనం?...ముందు రేపు బ్యాంకులోంచి పైకం తీసుకొని రాకుంటే, తను దమ్మిడీకి మారడు.

—లలిత వొస్తే బాగుండు. ఇప్పుడు లలిత వొచ్చి తనకు కొత్తగా ధైర్యాన్ని వ్వక్కర్లేదు. ఎందుకంటే ఒంటరిగా తానీ వాతావరణానికి అలవడ్డాడు. కాని అమ్మ లలిత ఏదని అడిగింది. కేవలం రోగి మనస్సు నిర్మలంగా ఉండేందుకు, ఆమె ఆశలు ఆరకుండా ఉండేందుకు లలిత రాక అవసరం. లలిత ఒక్కసారి వొచ్చి అమ్మను పలకరిస్తే చాలు ... కాని, అంతా తన ఇష్టాయిష్టాలమీద నడవటం లేదు కదా!

పూర్వంవలె ఆమె రాలేదని తనకు తెలియకనా, మనసు కష్టపెట్టుకున్నది? అందులో గత సాయింత్రం ఆమె అంతా విశదంగా చెప్పిందాయె! వినా తానామె రాకను కోరటం ఏ విధంగానూ సమర్థనీయంకాదు. అది కేవలం తన స్వార్థం, ఇతరులనుంచి మానవుడు కోరే త్యాగం!

చీకటి పడుతూండగా శర్మగారు వొచ్చారు. అమ్మ మాట్లాడిన సంగతి విని చాలా సంతోషించాడు. వెళ్తూవెళ్తూ 'రాత్రికి రాత పూర్తిచెయ్యండి. రేపు కంపోజుకు ఏమీలేదు' అని హెచ్చరించి మరీ వెళ్ళాడు.

చుట్టూ చీకటి పేరుకుంటోంది. తాను దాదాపు నిశ్చేతనుడుగా చాలా సేపు ఉండిపొయ్యాడు. ఏమిటి తనకీ కష్టాలు? కాస్సేపు మనశ్శాంతి ఉండకుండా తనచుట్టూవున్న శక్తులన్నీ ప్రయత్నిస్తూన్నవా అనిపిస్తూ వుంటుంది. రాక్షసులు పీక్కుతినేందుకే,తనకీమానవజన్మ వొచ్చివుంటుందా అనే అనుమానం కలగటంలో ఆశ్చర్య మేమిటి?

ఈ చీకటికి ఇప్పుడు భయం వెయ్యటం లేదు; బతుకులోని చీకటికి తాను అలవడినాడు. యీ అలవాటువల్లనే తాను జీవితాన్ని సాగించ గలుగుతున్నాడేమో! ఆ భయానికి మారుగా ఒక్కటే వ్యథ, మనసు పొందే రంపపు కోతమాత్రం మిగిలింది,

'నాయనా!' అంది అమ్మ గొంతు, బొంగురుపోయి. తను ఉలిక్కి పడ్డాడు; ఆమె కూడా చాలా సేపటినుంచీ మేలుకొనే వుందేమో? నిశ్శబ్దంగా తన వలెనే దుఃఖిస్తూండి ఉండొచ్చు; అందుకనే ఆమె కంఠస్వరంలో అంత మార్పు వొచ్చి వుంటుంది.

ఇది గ్రహించాక, తనలోకూడా అలాటి మార్పులే వొచ్చివుంటవనే అనుమానం కలిగి, క్షణంలో తనను తాను సంబాళించుకొని 'అమ్మా! లాంతరు వెలిగిస్తాను—' అని; అచీకట్లోనే తడివి, మొత్తం మీద మసిబారిన లాంతరు వెలిగించాడు. ఆగుడ్డివెలుగులో ఒకర్నొకరు చూసుకొన్నారు; తనకు మనసారా ఏడవాలనిపించింది; అలా ఏడుస్తేనన్నా యీ వేదన కొంత బైటపడి తేలికవుతుందని ఆశ.

'రాజా! ఏమి టాలోచస్తున్నావ్?' అందామె.

'ఏం లేదమ్మా నీకేమన్నా ఆహారం ఇస్తాను; మందు కూడా మరో మోతాదు వుంది; తాగెయ్!' అన్నాడు.

ఆమె మాట్లాడ లేదు. మందు తాగించి, కొస్త రొట్టె పెట్టాడు. అమ్మ మనస్సేమీ బాగాలేదు; ఎలాగైనా ఆమెను సంతోష పెట్టాలని ఆలోచించాడు.

'అమ్మా! ఇందాక లలిత వొచ్చిందే!' అన్నాడు; ఇంత పచ్చి అబద్ధం జీవితంలో ఆడి ఎరగడు; అందునా తల్లితో.

'ఆఁ. మరి—'

ఆమె మాట పూర్తిగాకుండానే 'నీ వప్పుడు నిద్రపోతున్నావ్. నిన్ను అనవసరంగా మేల్కొల్పడ మెందుకని వూరుకున్నాను. నేను లేపుదా మనుకొంటే, లలితే వొద్దన్నదే' అన్నాడు.

'లేపక పొయ్యావా!...ఏమన్నది రాజా?'

'అనేందుకు ఏమున్న దమ్మా? ఇక తగ్గుతుందని అన్నది. యీ గాడిద చాకిరీతో యీ విధంగా అయ్యావు. సరే ముందు పెద్ద గండం గడిచింది' అని నిట్టూర్చాడు తను.

'ఆ సంగతి పోనీరా—' అందామె విసుగ్గా.

'ఇప్పుడు ఏ సంగతీ వొద్దు లేవే అమ్మా! రెండు మూడు రోజులయ్యాక అన్నీ మాట్లాడుకోవచ్చు. నువ్వెక్కువ మాట్లాడకూడదని డాక్టర్ అన్నాడు. ఇక పడుకోవే!' అని దుప్పటి సరిగ్గా కప్పి దూరంగా జరిగి కూర్చున్నాడు.

ఆమె ఎంతో మాట్లాడా లనుకున్నట్లుంది; కాని ఆమె లలితను గూర్చే మాట్లాడుతుంది; తాను ఆ విషయాన్ని మొట్టమొదటే ఒక పెద్ద అబద్ధం పునాదిగా నిర్మించ సాగాడు; ఇక పైన జరిగే నిర్మాణమంతా ఒకదానికి తోడుగా మరికొన్ని అబద్ధాల సహాయం అవసర మౌతుంది. అవి ఒకదాని కొకటి అతకవని తెలుసు. అందుకనే తెలివిగా తప్పించుకున్నాడు.

అమ్మ మెదలకుండా పడుకుంది; లలిత సంగతి చెప్పినప్పటినుంచీ ఆమె మొహంలో కాస్త కళ వొచ్చింది. ఎంత పిచ్చిది అమ్మ! వెధవ ఒక అబద్ధంలో ఆమె మనస్సు ఎంత తేలికయింది! ముందు ముందు ఇదంతా నిజం కాదని తెలిసినా బాధ లేదు. ఎందుకంటే కఠిన సత్యాన్ని భరించే శక్తి సామర్థ్యాలు ఆమెకు అప్పటికి కలుగుతవి.

మానసికంగానూ, శారీరకంగానూ చాలా అలసి ఉండటం వల్ల, ఆ రాత్రి తనకు వొళ్ళు తెలియనంత నిద్ర పట్టింది.

## 27

మర్నాటికి ఆమెకు చాలా తేలికయింది; డాక్టర్ కూడా రోగస్థితికి తృప్తి కనబరిచాడు; కాని నెలల తరబడి మందులూ, ఇంజక్షన్లూ అవసరమౌతవని అన్నాడు. తనకు మరోదారి లేదు కనుక, బ్యాంకులోని పైకం వంద తీసుకొచ్చాడు.

ఆరోజు కూడా ఆఫీసుకు వెళ్ళకుండా, ఇంటి దగ్గిరే పత్రికలు నింపేందుకు గాను చెత్త తయారుచేయ సాగాడు.

'నాయనా! నా క్కాస్త తేలిగ్గానే వుంది-నీవు కాలేజికి వెళ్ళరాదా?' అందామె.

వెధవ చదువు మానినందుకు తన కెప్పుడూ కలగనంత విచారం కలిగిందీ సమయంలో. నిజం చెపితే, తన జీవితమంతా కష్టించి నిర్మించిన రమ్య హర్మ్యం, కళ్ళముందే కూలటాన్ని మూసి, తల్లికి గుండె పగులుతుందేమో నన్నంత బాధ కలిగింది, తనకు. తనకే ఎంతో వ్యధగా వున్న యీ విషయాన్ని కప్పిపుచ్చేందుకు మరో పెద్ద అబద్ధం ఆడాడు. అబద్ధాలు కూడా మానవజీవితంలో, వ్యాధులకు ప్రక్రియలుగా కాకపోయినా, కనీసం ఔషధాలుగా నన్నా ఉపయోగ పడుతవని ఎన్నడూ అనుకోలేదు.

'రెండు రోజులాగి వెళ్తానమ్మా!' అన్నాడు.

'ఆ అబ్బాయి, కాగితాలూ అవీ పట్టుకొస్తాడు ఎవర్రా?... మొన్న వచ్చి నాయన ఎవరూ?' అందామె.

'పత్రికాఫీసు వాళ్ళమ్మా! చదువుకుంటూ, వారికి పనిచేయటం వల్ల కొద్దిగా ముట్టుతూంటుందిలే' అన్నాడు.

అప్పటి పరిస్థితికి తాను చెప్పింది అతికింది కనుకే తల్లి మరి మాట్లాడ లేదు.

ఆహారం విషయంలో చాలా శ్రద్ధ తీసుకోవాలనీ, పాలూ, పళ్ళూ విశే షంగా ఇవ్వాలనీ డాక్టర్ చెప్పాడు. యీ ఖర్చు చూస్తే, తన దగ్గరవున్న మొత్తమంతా సరిగ్గా రెండు నెలలు కూడా వొచ్చేట్లు లేదు. ముందుగ తేమిటనే ఆలోచన ఇప్పుడే ఆరంభమైంది. ఆరోగ్యవంతంగా వుండే మనుష్యులైతే, కడుపునిండే దాకానే తినగలరు; కాని అనారోగ్యాన్ని పోషించటం మాటలా?

ఐతే కొంతలో కొంతగా, తాను పడే యీ శ్రమకూ, సేవకూ తల్లి తిరిగి ఆరోగ్యాన్ని పుంజుకో గలదనే ఆశ వుంది. ఇక యీ మెను తిరిగి యీ ఇంటినుంచి బైటికి పోనివ్వరాదు; కలో గంజో, ఉన్నంతలోనే ఇముడ్చుకొని రోజులు వెళ్ల బుచ్చాలి. యీ నిశ్చయాలు ఎప్పుడో చేసుకున్నవి; వాటిని మరిచి పోకుండా మననం చేసుకోవటం అవసరమనిపిస్తూ వుంటుంది మరి!

నాలుగు రోజుల వరకూ తను ఆఫీసుకు వెళ్ళకుండానే గడిపాడు; ఆఫీసుకు వెళ్లలేదని యజమానులు ఏమన్నా అనుకుంటున్నారేమోననే భయం వుంది. ఒక్కగా నొక్క కొమ్మను పట్టుకేళ్ళాడే తను. అందులోనూ యీ స్థితిలో, ఆపట్టు కాస్తా తప్పితే ఒక అధోగతే!

ఒకనాడు డాక్టర్ ఇంటినుంచి తిరిగి వొస్తూండగా శర్మగారు కనిపించారు. అమ్మకు ఎలా వుందో విచారించాక 'ఇక ఆఫీసు కొచ్చేందుకు వీలవుతుందా? ఆఁ ఏం లేదు—పైనెలలో ప్రత్యేక దిన సంచిక వేయాలట. ఇప్పట్నుంచే పని ప్రారంభం కావాలి—' అన్నా రాయన.

యీ ప్రత్యేక సంచికల తంతు, కేవలం ప్రకటనల్ని గుంజుకు కేందుకేనని తనకు తెలుసు. యజమానులు ప్రత్యేక లాభాలను పొందినా, అందుకు కృషిచేసిన వారికి దమ్మిడీ కూడా ఎక్కువ ఇవ్వరు. ఎంత అన్యాయాన్ని, అక్రమాన్ని తాను భరించ వలసి వొస్తోందో తలుచుకుంటే, గుండెల్లో విసట్లు వుంటుంది. కాని దాన్ని ప్రతిఘటించి తను బతకలేడు కనుక, తల వొంచటం తప్పని సరవుతోంది.

మర్నాటి నుంచీ వొస్తానని శర్మగారికి చెప్పాడు. ఇంటికి వొచ్చాక కూడా, ఆఫీసూ, అమ్మకు సేవా, రెండూ ఎలా కుదురు తయ్యా అనే ఆలోచనలో పడ్డాడు. ఇమడని అనేక విషాలను తాను తాగాడు; హరించుకున్నాడు. ఇవొక లెక్కా—?

'రేపటి నుంచీ కాలేజికి వెళ్తానమ్మా!' అన్నాడు.

'వెళ్ళు... నేను లేచి నా పనులు చేసుకోగలను' అందామె.

నిజానికి ఆమెలో త్రాణ బొత్తిగా లేదు. రక్తంకూడా చాలా తక్కువగా ఉన్నదని డాక్టర్ ఇంజక్షన్లు ఇస్తున్నాడు. కొన ఊపిరితో ఉన్నప్పటికీ, పట్టుదలను

వీడని అమ్మ, తనకోసం చివరి రక్తకణాన్ని కూడా ఆహుతి చేసేందుకు సిద్ధమైన అమ్మకు; తను ఎన్ని జన్మాలెత్తి ఋణాన్ని తీర్చుకోగలడు?

అనుకున్న కార్యక్రమం ప్రకారం, మర్నాడు ఉదయమే వంటచేసి, అమ్మకు మందు తెచ్చి, అమ్మ భోజనానంతరం, తనుకూడా ఇంత నంజి ఆఫీసుకు పరుగెత్తాడు. తిరిగి జీవితాన్ని మరోగాడిలో వేసినట్లు వుంది. ఇలా ఎన్నిసార్లు యీ 'గాడి' మార్చినా అది గాడి తప్పటం, తిరిగి మరో పద్ధతికి మార్చటం జరుగుతూనే వుంది.

నెల జీతాలు పదిరోజులు ముందుగానే అంది వుండవలసింది; ఇంత వరకూ ఆ ఊసే ఎత్తినవారు లేరు. తనా నోరు తెరిచి అడగలేదు. ఏమన్నా జీతాలిచ్చే ఆశ లున్నవేమోనని క్రింది ప్రెస్‌లోకి వెళ్తే, అక్కడ సోదరు లిద్దరూ మూతులు ముడుచుకొని కూర్చొని వుంటారు; వారిని పలకరించటం అంత క్షేమకరంగా తోచక మానేశాడు. ఆఫీసు కుర్రాడు కూడా 'సార్! జీతాల సంగతేమిటి?' అని తనను అడుగుతాడు. తనకే తెలియని సంగతి, వాడికెలా చెప్పటం?

ఇక ఆగలేక శర్మగారికి చెప్పుకున్నాడు తను.

ఆయన నవ్వి 'నేనూ అదే చూస్తున్నాను. వాళ్లంతట వాళ్ళే పిలిచి జీతాలిస్తారేమోనని ఎదురు చూస్తున్నాను. కాని వాళ్ళ వ్యవహారాలు బొత్తిగా బాగున్నట్లు లేదు. డబ్బులేక కాదనుకో; ఏవో మనస్పర్థలు పెంచుకుంటున్నారు. మధ్య మన చావుకు వొచ్చింది' అన్నారాయన.

ఇంకా ఎదురు చూడటంలోనే పరిస్థితి ఆగింది.

బ్యాంకులో వున్నదాంతో ప్రస్తుతానికి ఇబ్బంది లేకుండా గడుస్తుంది కనుక, తను సరిపెట్టుకో వొచ్చు. ఆఫీసులో ఉన్నంతసేపూ ఇంటిమీదనే ధ్యాస. అక్కడికీ, పూర్వంకన్నా వేగంగా రాస్తున్నా కంపోజుకు కాగితాలు అందటం లేదు. మధ్యలో అడ్డం వొచ్చే ప్రూఫులు మరికొంత ఇబ్బంది కలుగజేస్తున్నవి. ఒకనాడు విసుగెత్తి మిగతాపని ఇంటిదగ్గర చేసుకుంటానని శర్మగారికి చెప్పి వొచ్చేస్తున్నాడు. శర్మగారు 'ఎవరెట్లా చచ్చినా సరే' అన్నట్లు, పట్టించీ పట్టించుకోకుండా తల వూపుతున్నారు.

ఇప్పుడు రోజు విడిచి రోజు డాక్టర్ వొచ్చి ఇంజక్షన్లు ఇస్తున్నాడు. అమ్మనే డాక్టర్ దగ్గిరికి తీసుకొని వెళ్తే ఇంత ఖర్చు వుండనిమాట నిజమే కాని, అక్కడ పడివుండటం, ఎండదెబ్బ తినటం, యీ శ్రమంతా ఆమె భరించ లేదు. అందుకని ఖర్చును తగ్గించుకోగలగటం ఇప్పట్లో అయేదిగా తోచలేదు.

యీ మందులకు తోడుగా, బలవర్ధ కౌషధాలు కూడా అవసరమైనవి. మనిషి విలువలు, అతని జీవితమంతా ప్రతి విషయంలోనూ, ఏదో విధంగా డబ్బుతో లంకె వేయబడే వుంది. ఆ డబ్బు లేనినాడు తనెవరో, యీ ప్రపంచానికి సంబంధ మేమిటో ప్రపంచమే కఠినంగా ప్రశ్నించి, పరీక్షించి, అంతు కనుక్కుంటుంది. కనుచూపు మేరలోనే అలాటి ఘోర పరిస్థితి వున్నదేమో ననే కంపరం కూడా ఆరంభమైంది.

వారం రోజులు గడిచాక—

ఒకనాడు సాయంత్రం, దీపాలు పెట్టేవేళ ఇంటికి వొచ్చాడు తను. రోజూ కన్నా చాలా సంతోషంగా వుంది అమ్మ. జీవితభారంతో కుంగిపోతూన్న తనకు, ఆమె మొహం కళకళ్ళాడుతూ వుంటే ఎంతో ఆనందం కలిగింది. ఒక్క పూటలో ఆమె ఎంతో ఆరోగ్యాన్ని పొందిన చిహ్నాలు కనిపించినవి. ఐతే ఇదంతా డాక్టర్ మహిమ, మంగుల ప్రభావం ఐ వుంటుందని తను అనుకోలేక పోయ్యాడు. కారణాన్ని తను ఊహించే శ్రమ లేకుండానే ఆమె చెప్పింది.

'బాబూ! ఇవాళ లలితమ్మ వొచ్చిందిరా—' అందామె.

యీ మధ్య అసలు లలితను గూర్చే తను తలవటం లేదు. జీవిత ప్రవాహంలో ఆమె ఎంతో దూరం కొట్టుకొని పోయింది. తిరిగి అమ్మ చెబుతూన్నప్పుడు ఆ పాత గాథంతా ఒక్కసారిగా స్మృతిపథంలో మెరిసింది.

'చాలాసేపు కూర్చుంది రాజా! నీవు రాలేదు...ఇంతకుముందే వెళ్ళిపోయింది'

చాలాసేపు కూర్చున్న లలిత అనేక విషయాలు అమ్మతో చర్చించివుంటుంది. మామూలు సంగతులైతే తను పట్టించుకోనక్కర్లేదు కాని, తన ఉద్యోగం సంగతీ, చదువు మానేసిన విషయమూ చెప్పి వుంటుందేమోనని భయం వేసింది. ఐతే లలిత ఏం మాట్లాడిందో; అమ్మ చెప్పేవరకూ తను మెదలకుండా ఉండటం తప్ప మరో మార్గం లేదు.

'నాయనా! నీవు చదువు మానావట కదా? ఉద్యోగం చేస్తున్నావట!' అందామె.

గతుక్కుమన్నాడు, తను. దేన్ని గూర్చయితే తను భయపడుతున్నాడో ఏదైతే తల్లికి తెలియకుండా రహస్యంగా ఉంచాలని తను ప్రయత్నిస్తున్నాడో, అదే ఆమెకు తెలిసిపోయింది. కనుక ఆ ఆతృత మరిలేదు. నిర్లిప్తంగా కళ్ళెప్పగించి అమ్మవేపు నిస్సహాయంగా చూశాడు.

'నాతో మాటమాత్రమైనా అనలేదేరా బాబూ! చదువు మానేశావంటే మొదట్లో నాకు ఎంతో కష్టమనిపించింది; కాని లలితమ్మ చెప్పాక, అంతా నిజమేననీ, మనబోటి వాళ్ళకు పెద్ద చదువులు అనవసరమనీ అనిపించింది. నీవు చేసినపని, సబబైనదిరా రాజా!'

తల్లిని తనైతే ఇంత తేలిగ్గా సమాధానపరిచి ఉండేవాడు కాదు. లలిత చెప్పబట్టే అమ్మకు ఎంతో తృప్తి కలిగింది. ఒక గండం గడిచి, తన మనస్సు కూడా చాలా తేలికయింది. మొదట్లో యీ సంగతులు అమ్మకు చెప్పినందుకు లలితంటే తనకు కోపం వొచ్చింది కాని, ఇంత తెలివిగా తేలిగ్గా, అందరికీ సమాధానంగా చెప్పగలిగిన ఆమె కౌశలాన్ని మెచ్చుకోకుండా ఉండలేక పోయ్యాడు.

'ఏం నాయనా! ఇంకా విచారంగానే ఉన్నావ్!' అందామె, కొత్తగా తానుకూడా విషాదానుభూతిని పొందుతూన్న దానివలె. 'వెధవ చదువు పోతేనేం? బతికిన నాలుగురోజులూ కష్టాలేనా? మనసు కష్టపెట్టుకొని బతకటం కష్టం కదా!'

అమ్మను ఊరడించవలసిన తను, అమ్మచేత ఊరడించబడవలసి వొచ్చినందుకు నొచ్చుకున్నాడు. చప్పున మూడ్ మార్చుకుంటూ 'అదికాదమ్మా! నీవు బాధపడి పోతావని భయం వేసింది. నిజానికి లలిత యీ సంగతులన్నీ చెప్పవలసిన సమయం కాదిది. అదే ఆలోచిస్తూండి పొయ్యాను' అన్నాడు.

'రాజా! నాతో చెపితే నేనేమన్నా అంటానా? నీవేమన్నా చిన్నవాడివా? బాధ్యతలు తెలిసిన వాడివాయె. నీకు తోచిందిచెయ్యి బాబూ! ఒకవేళ నాకు తెలియక, ఏమన్నా అన్నా పట్టించుకోకు. లలితమ్మ చెపుతూంటే అంతా కళ్ళకు కట్టినట్లు, నిజ మనిపించింది. నిజాన్ని నిజంగా తెలుసుకునేందుకూ కూడా, కొంత మంది సహాయం అవసరమని నేనెప్పుడూ అనుకోలేదు.'

ఏమైనా లలిత యీ చిక్కుల్ని ఇంత తేలిగ్గా విడదీయ గలిగినందుకూ, ముఖ్యంగా తల్లికి ఎంతో సంతోషంగా వున్నందుకూ ఆనందం కలిగింది. కాని ప్రతి విషయానికీ తనకు లలిత సహాయం అవసరమేనా? చివరకు లలిత, అమ్మ ఆరోగ్యాన్ని పొందేందుకూ కూడా కారణ భూతురాలయింది! యీ లలిత, జీవితంలో తనకు తోడు నీడగావుంటే-! యీ తలపు రాగానే ఒక్కసారి వొణికిపోయి, తమాయించుకొని, తిరిగి తాను ఊబిలోకి దిగబడి పోతున్నాననే జ్ఞానం కలిగింది. అదృష్టవశాత్తూ చీకటి నలుమూలలా వ్యాపించి ఉండటంవల్ల, తనలో కలిగిన యీ అవస్థను అమ్మ గ్రహించేందుకు అవకాశం లేకపోయింది.

తను చదువుమానటం మీద చర్చలేకుండా పోవటం, తలమీద పాలు పోసి నట్లే! లాంతరు వెలిగించి, అమ్మకు భోజన పెట్టాకు ఎవ్వరూ మాట్లాడటం లేదు. ఎవరి తలపుల్లో వారున్నారు. ఆ తరువాత తనుకూడా కాస్తనంజి, రాత పనికి పూనుకున్నాడు.

లలిత ఇంకా యే విషయాలు అమ్మతో మాట్లాడి వుంటుందో అడగాలని వుంది కాని, సిగ్గుపడి ఊరుకున్నాడు. ఆమె తనంతట తానుగా చెప్పినా పట్టించు కోనట్లు ఊరుకోవాల్సి వుంటుంది; ఎందుకంటే, తల్లి అభిప్రాయాలను (అవి ఏ రూపంలో ఉన్నవో తెలిసిన తను) బలపరిచినట్లు కనిపించటం వల్ల, ఆమె అడియాసల పాలయే అవకాశాన్ని కలిగించినట్లవుతుంది. అందుకనే కావాలని మౌనం వహించాడు. అమ్మ నిద్రపొయ్యేక కాని, దస్త్రం కట్టివేయలేదు.

## 28

మూడు వారాలు గడిచినయ్. యీలోగా అమ్మ కొంత ఆరోగ్యాన్ని పొందింది; కాని, ఆఫీసు వాతావరణంలో చాలా అనారోగ్యం గడ్డకట్టి, ఎప్పుడో,

ఏ క్షణానో, హఠాత్తుగా బద్దలయేట్లుగా వుంది. రెండో నెల జీతంకూడా రావలసిన సమయమైనా ఎవ్వరూ మాట్లాడటం లేదు. యజమానుల తగవులు, పనివాళ్ళ ప్రాణానికి ఎసరు పెట్టేవిగా తయారైనవి.

అమ్మ తిరిగి పరిపూర్ణారోగ్యాన్ని పొందేందుకు మరో నెలనాళ్ళు పట్టేట్లు వుంది. బ్యాంకులో డబ్బుకూడా దాదాపు ఐపోతూన్నది. కట్టుగుడ్డలతో తనూ, తల్లీ, మిగిలిపోతే, గతేమిటి? యీ సంగతులన్నీ అమ్మకు చెప్పకుండానే, ఏదో విధంగా తను సమర్థించుకొని రావాలి.

—కాని, యీ అమ్మ, అందరి అమ్మలవలె పట్టించుకోకుండా, యీ వయసులో కూడా సుఖపడుదామనే జ్ఞానం లేని వెర్రిది. కనుకనే ఒకనాడు 'నాయనా! నేను మళ్ళీ పనిలోకి వెళ్తాను. కూర్చుని తింటే అవుతుందా?' అన్నది.

ఆ మాటలు విన్న తనకు, తన రాక్షసత్వపు వేరొక రూపం కళ్ళముందు కదిలింది. ఆరు నూరుకానీ, ఇక తల్లిచేత చాకిరీ చేయించకూడదు.

'నీకేమన్నా, మతి పోతోందా అమ్మా? మరో రెండు నెలలనాళ్ళు నీవు విశ్రాంతి తీసుకోవాలని డాక్టర్ అన్నాడు...ఇంకా నీరసంగానే ఉన్నావాయె!' అన్నాడు తను.

'డాక్టర్లు చెప్పటానికేరా బాబూ! డబ్బున్న వాళ్ళకు, మందులూ, అనారోగ్యాలూ, డాక్టర్లూ, విశ్రాంతీను. మనకెలా కుదురుతుంది? అదీగాక, నాకిప్పుడు బాగా కులాసాగా కూడా వుందాయె!' అందామె.

'ఆ సంగతి నాకు తెలుసే. నేనేదో సంపాయిస్తూంటిని. ఇప్పుడు కాదు; ఇంకెప్పటికీ నీవా ఇంటి చాయలకే వెళ్ళవలసిన పని ఉండదు. ఉన్నదాంట్లోనే తింటూ ఇక్కడే వుండు. ఐనా నే నిప్పుడు చదువుకోవటం లేదు కనుక, ఇదివరకల్లే సంపాయించక్కర్లేదు.—'

'—ఐతే మాత్రం?' అందామె 'యీ మందులకూ, మాకులకూ ఎంతో ఐవుంటుంది. మళ్ళీ అదంతా కూడబెట్టి...' ఆ తరువాత ఆమె కళ్ళు మూసుకొని, బహుశా ఊహాప్రపంచంలో వేరొక జీవితాన్ని, కొడుకు కోడళ్ళ మధ్య తాను సుఖపడటాన్ని ఆలోచించుకొని మురుస్తూండి వుంటుం దనిపించింది, తనకు.

'పెద్ద ఎత్తుల్లో ఆలోచించటం తేలికే కాని, ఆలోచించిన దాంట్లో అవ నిజంగానైనా జరక్కపోవచ్చు. నీకీ వయస్సులో ఎందు కిదంతా? ఏదో ఇంతతిని నీడను పడి వుండవే—మిగతా సంగతులు నేను చూస్తాను' అన్నాడు, తను.

ఆమె కాస్సేపు మాట్లాడ లేదు. ఉత్సాహకరమైన ఆలోచనల పొంగు ఆమె ముఖరేఖలో పూర్తిగా చల్లారిన చిహ్నాలు కనిపించినవి. ఐనా తను లెక్కచేయకుండటమే ఉభయులకూ క్షేమకరం కనుక, పెదలకుండా వూరుకున్నాడు.

తను ఆఫీసుకు బయలు దేరుతూండగా—'అన్నట్లు మరిచి పోయ్యాను రాజా! బాబుగారి దగ్గిర నేనో రెండొందలు దాచాను. పోయి తీసుకొని రారాదా?' అందామె.

తన కిప్పుడు పెన్నిధి దొరికి నట్లయింది. ఆర్థిక దుస్థితి ఆరంభమయే సూచనలు ప్రస్తుతానికి వాయిదా వేయబడినట్లే అనిపించి 'సాయంత్రం వెళ్ళొస్తాను' అన్నాడు.

ఆ సాయంత్రం ఎలాగో పీలు చూసుకొని, మైలాపూర్ వెళ్ళాడు; కాని బాబుగారికోసం రాత్రి ఎనిమిదింటిదాకా వేచి ఉండాల్సి వొచ్చింది. ఆయన వొచ్చాక 'ఎట్లా వుం దిప్పుడు?' అన్నారు.

'కాస్త నయమే' అన్నాడు తను.

'మళ్లీ పనిలోకి వొస్తుందా?'

ఇలాటి ప్రశ్నలు తనకు శూలాల్లా తగులుతూన్నప్పటికీ భరించ వలసే వుంటుంది.

'చెప్పలేను. బహుశా రాక పోవొచ్చు'

ఆయన ఏదో చెప్పాలనుకొని, విసుక్కొని రెండొందలూ ఇచ్చాడు.

'వొస్తానండీ—' అని చెప్పి, అప్పటికే చాలా ఆలస్యం కావటం వల్ల, తను ఉరుకులు పరుగుల్తో ఇంటికి వొచ్చి పడ్డాడు.

'నాయనా! ఇంత ఆలస్యమయిందేం? ఇవాళ మళ్లీ లలిత వొచ్చి వెళ్లింది. ఆమె వొచ్చినప్పు డల్లా నీవు ఇంట్లో ఉండవాయె. నిన్ను చూడాలని ఆమె ఎంతో అనుకుందిరా'—అందామె.

తాను విడనాడినా, లలిత తనను విడనాడ లేదు. ఇప్పుడు యీ విషయాల్ని గూర్చి ఆలోచించే తీరిక తనకు లేదు. మరో ఉూహంటూ లేకుండానే, కలం పాళీ లను అరగదీయటం మొక్కటే తన యావ. ఇక తల్లి దగ్గిరికి లలిత వొచ్చి వెళ్తూండ టంలోని ఆంతర్యం తనకు తెలియదు. ఏదో రహస్యం వుంటుందనికాదు కాని, ఆమె అమ్మతో మాట్లాడే విషయాలు మాత్రం ఏముంటయ్ కనుక? బహుశా తన కోసమే వొస్తూండి ఉండొచ్చు. అలా రావటం ఎవరికీ క్షేమకరం కాదు సరికదా, ఆమె చాలా నష్టపడగలదు. వినప్పుడు యీ దుస్సాహసం జోలి లలితకు ఎందుకు? ఏనాడన్నా పరిస్థితులు చక్కబడితే, అది వేరు సంగతి.

యీ సంగతులన్నీ అమ్మకు తెలియవు; తనా చెప్పలేదు; చెప్పినా ఆమెకు అర్థం కావు. లలిత వొచ్చి వెళ్ళటాన్ని గూర్చి, మిగతా ప్రపంచం వలెనే అమ్మ కూడా వేరు ఉద్దేశ్యాన్ని అంటగట్టి ఉండొచ్చు. తను పట్టించు కోకుండా ఉండే నట్లు నటించటమే సర్వోత్తమమైన పద్ధతి.

'బాబుగారి దగ్గిరికి వెళ్లి డబ్బు తెచ్చానమ్మా' అని మాట తప్పించాడు తను.

'ఆఁ......ఏమన్నారు నాయనా! ఇంటూమె కనిపించారా? నన్ను గూర్చి అడిగారా?' అని అమ్మ ఎంతో ఆత్రుత కనబరిచింది.

నిజంగా అక్కడ జరిగింది చెపితే, అమ్మ ఎంత విచారిస్తుందో తను తేలిగ్గా ఊహించ గలడు. తనకున్న విశ్వాసమే, తన యజమానుల కూడా వుందనుకునే అమాయకురాల్ని, అనవసరంగా క్షోభ పెట్టటం దారుణమే అవగలదు. అందుకని ఏదో బొంకి ఆమెను సంతోష పెట్టాలనుకున్నాడు.

'నీ ఆరోగ్యం సంగతి అడిగారమ్మా! అడిగామని చెప్పమన్నారు. కాస్త కులాసా చిక్కాక, ఒక్కసారి రమ్మన్నారు—' అన్నాడు.

అమ్మ తృప్తికరంగా వున్నట్లు కనిపించింది. ఎంత ప్రపంచానుభవం వున్నా, మానవుడు తిరిగి తిరిగి అవే పొరపాట్లు చేస్తూంటూ డనేది తన కిప్పుడు స్పష్టంగా కనిపించింది.

యీ లోకాన్ని అర్థం చేసుకోవటం ఎన్నటికీ కుదరదు; అర్థం చేసుకున్నామని అనుకోవటంలో ఎంత ఆత్మ వంచన! తనను తాను కావాలని, తెలిసివుండే మోసం చేసుకోవటం జరుగుతూంటుందో, ఇదంతా ఆత్మ తృప్తి కోసమే జరుగుతూన్నదని ఏమరి వుండటం సంభవమో తాను తెలుసుకున్నాడు. కఠిన సత్యాన్ని యధాతథంగా అంగీకరించి, భరించలేని మానవుడు, చివరకు అబద్ధాల మీదయినా సరే, ఆశల్ని నిర్మించుకోవాలని వ్యర్థ ప్రయత్నం చేస్తూనే వుంటాడు; ఇందుకు అమ్మ మినహాయింపు లేదు.

'రాజా! నేనొకసారి మైలాపూర్ వెళ్ళి వొస్తారా' అందామె, ఏదో గొప్ప ఆహ్వానాన్ని అందుకున్నంత సంతోషంతో.

ఇప్పుడే తిరిగి అమ్మను నిరుత్సాహ పరచట మెందుకని 'అలాగే నే! పది రోజులయ్యాక, నే నే తీరుబాటు చేసుకొని తీసుకు వెళ్తాను' అన్నాడు తను.

ఆమె అడ్డు చెప్పలేదు.

ఇప్పటికే చాలా ఆలస్యం కావటంవల్ల, త్వరగా అమ్మకు భోజనం పెట్టాడు. మధ్యలో ఆమె తిరిగి లలిత ప్రస్తావన ఎత్తింది.

'లలిత మళ్లీ చదువులో వెనకబడుతోందట. నీ దగ్గర ట్యూషన్ చెప్పించుకున్నప్పుడు, మంచి మార్కులు వొచ్చేవట!' అందామె.

తనేమీ సమాధానం చెప్పలేడు. యీ సంగతులేవీ కూడా అమ్మ తనకు చెప్పకుండటమే తాను కోరుకున్నాడు. తను మాట్లాడితే ఆ చర్చలు చాలా దూరం, వికృత మార్గాల్లో నడుస్తవనే భయంతోనే నిర్లిప్తంగా ఊరుకున్నాడు.

'అవతెల్లుండి ఆదివారం సాయంత్రం వొస్తానంది రాజా! నిన్ను తప్పకుండా ఇంట్లోనే వుండమందిరా!' అన్నదామె.

'సరే—అలాగే!' అని సంభాషణను అంతటితో ఆపు చేయించాడు.

తరూ భోజనానంతరం తీరిగ్గా మళ్లీ లలిత తాలూకు ప్రకరణాన్ని దుమ్ము దులిపి, మనసులో సింహావలోకనం చేయసాగాడు. ఆమె అమ్మను చూచి పొయ్యే వొంకతో, తనకోసమే వొస్తోంది. అదృష్టవశాత్తూ ఆమె తనకు కనిపించకుండానే వెళ్ళిపోతోంది. ఇప్పుడు ఆదివారం నాడు తనను ఉండమని ఆశించింది. చిరకాల స్నేహాన్ని పరామర్శ చేసుకోవటం మినహా జరిగేదేమీ లేదు.

కాని ప్రపంచం వేరొకవిధంగా అర్థం చేసుకుంటుంది. ఆ సంగతి ఆమె కూడా తెలిసినప్పుడు, ఎందుకొచ్చిన స్నేహమిది? అన్నిటినీ మించి తాను క్రమంగా దరిద్రదేవత కొలువుకు వెళ్తున్నాడు. యీ స్థితిలో లలిత కంటబడటం తనకు ఏ మాత్రమూ ఇష్టం లేదు. చివరకు ఆమె, నిస్సహాయ స్థితిలో కూడా, కన్నీరు కార్చి, సానుభూతిని ప్రకటిస్తుంది. అది తన కష్టాల్ని, భూతద్దం కింద చూపినట్లు చేయటమే! అమ్మ తప్ప మరో ప్రపంచం తనకు లేదనుకున్నప్పుడు, లలిత మధ్యలో తన ఆదర్శాలను భంగం చేసే దేవకన్యల్లే, మెరిసి, చిక్కకుండా, దాటిపోవటం దేనికి ?

ఆమె ఉద్దేశ్యాలన్నీ కలుషితం కానివే కావచ్చు. కాని ప్రపంచానికి అదంతా పట్టదు. తనకే నిర్లక్ష్యంగా వుందిప్పుడు. ఇంతకూ ఆదివారం నాడు ఆమె కోసం ఉండటమా, ఏదో వొంక పెట్టి బయటికి పోవటమా అనే ఆలోచన తెగలేదు.

ప్రమాదమని తెలిసివున్నా, దాని నుంచి తప్పించుకోనేందుకే నిశ్చయించుకోవటం విజ్ఞుల లక్షణమేకాని, తను కావాలనే యీ ప్రమాదాన్ని ఎదుర్కోనేందుకు సంసిద్ధుడవుతూన్నట్లు తోచింది; యీ పోరాటంలో గెలుపు తన పక్షమవుతుందనే ఆశ ఏకోశానా లేదు; కాని యీ సమావేశంలో తిరిగి తాను క్షతగాత్రుడవటం, ఆ గాయాన్ని చూసుకొని, మధురానుభూతుల్ని మననం చేసుకోవటానికి మరి కొంత అవకాశం ఏర్పడుతుంది. కేవలం ఊహా ప్రపంచంలోనే మానవుడు ఎంత తృప్తి పొందగలుగుతున్నాడు!

ఇంకా వ్యవధి ఉన్నది కదానని సమాధానపరుచుకొని, రాత పనిలో నిమగ్నమయ్యాడు.

ఎటూ తేల్చుకోకముందే ఆదివారం వొచ్చి పడింది. సాయంత్రమయ్యేప్పటికి లలిత కూడా వొచ్చింది. అంతస్సంఘర్షణ ఆగి, తాను తప్పించుకోనే అవకాశం

లేకుండానే పరిస్థితిని ఎదుర్కోవాల్సి వొచ్చింది. నిజానికి తన అంతరాంతరాల్లో లలితను చూడాలనీ, ఆమెతో మాట్లాడాలనీ, దిగజారిపోతున్న ఆత్మ శక్తిని తిరిగి ఆమె ప్రసాదించగలదనే ఆశ లేకపోలేదు.

'బాగున్నావా లలితా?' అన్నాడు ఆమెను చూడగానే.

'ఇలా వున్నాను...మీ వొంట్లో యెలా వుంటుండీ?' అంది లలిత అమ్మపక్క మీద కూర్చుంటూ.

'నాకూ బాగా కులాసాగానే వుంటమ్మాయ్' అని, 'ఇప్పుడే వొస్తా—' అంటూ అమ్మ బైటికి వెళ్లిపోయింది.

అమ్మ మీద ఎప్పుడూ కలగనంతకోపం, యీనాడు తనకు కలిగింది. ఆమె ఏమనుకుంటోంది! అసందర్భంగా ఇలా బైటికి జారుకోవటంలో ఆమె ఉద్దేశ్య మేమిటి? మానవుడు ఊహించటం వల్ల తన స్వార్థాన్నే చూసుకుంటున్నాడు కాని, ఆ ఊహవల్ల ఇతరులకు ఎంత నష్టమో ఆలోచించటం లేదు.

లలిత తలెత్తకుండానే నేల మాపులు చూడసాగింది. బహుశా మాట్లాడే విశేషాలు ఏమీ ఉండి ఉండవేమో! కాని ఇలా శిలాప్రతిమలవలె ఉండటం ఎంత హాస్యాస్పదం! అనుకుని తనే, ఏదో మాట్లాడాలని 'చిట్టీ వాళ్ళూ బాగున్నారా లలితా?' అన్నాడు.

'బాగానే వున్నారు మాష్టారూ! వాళ్ళింటికి వెళ్ళికూడా పదిరోజులైంది. చిట్టి మిమ్మల్ని కలవరిస్తోంది—' అందామె చిరునవ్వుతో.

తిరిగి ఆరోజులన్నీ కళ్ళముందు మెదుల్లాడినయ్. అది ఎంతో ఆనందదాయకమైన కాలం! తనను తాను మరిచిపోగలిగిన ఆ రోజులు. తనలో ఉత్సాహం పెల్లుబికి ఎన్నో రచనలను ప్రోత్సహించిన ఆ దినాల్ని తను జన్మలో మరువగలడా?

ముందేదో ఉజ్వల భవిష్యత్ ఉన్నదని ఉరకటంలో, వెనుక జారవిడుచుకున్నది, ఇప్పుడు కాని తెలిసి రావటం లేదు. ఇవన్నీ ఆలోచిస్తూ ఖేదపడటం జరిగేదేమిటి? ఐనది కాకుండా చేయటం బ్రహ్మతరం కాదు: అవబోయేదీ తన చేతులో లేదు. విధి చేతి కీలుబొమ్మవలె, నామమాత్రుడుగా జీవితాన్ని వెళ్ళబుచ్చుతూ తనొక నిష్ప్రయోజకుడుగా, వ్యక్తిత్వహీనుడుగా మిగిలిపోతున్నాడు.

'మేష్టారూ! పుస్తకాలేమన్నా ఇవ్వండి' అంది లలిత.

చప్పున ఆలోచనల్లోంచి బైటపడి 'ఆ పెట్టెలో ఉన్నాయ్-తీసుకో లలితా!' అన్నాడు తను.

లలితలో కూడా ఉత్సాహమేమీ లేదు. ఏదో వొత్తిడికి నలిగిపోయి, తేరుకోలేక బాధపడుతున్నట్లు తోచింది. అదంతా అడిగి తెలుసుకో దలచలేదు. బాధలకన్న, బాధల్ని తప్పుకోవటం వల్ల వాటి వికృత స్వరూపాలు భయానకంగా మారుతవని తనకు తెలియక పోతేగా?

రెండు పుస్తకాలు తీసుకొని, వాటిని అటూఇటూ తిప్పుతూ, లలిత చాలా అన్యమనస్కంగా కూర్చుంది. ఆమె ఏదో మాట్లాడాలని అనుకుంటోంది కాని, మాట్లాడలేక పోతోందని తను అర్థం చేసుకున్నాడు. నిజానికి తనుకూడా ఏం మాట్లాడాలో తోచక కొట్టుమిట్టాడుతున్నాడాయె! ఎంత వేగంగా యీ సంఘటన అంతమైతే, అంత మంచిది!

'మాష్టారూ! యీ పరీక్షలకు బహుశా కూర్చోనేమో!' అందామె విచార సూచకమైన కంఠస్వరంతో.

'ఏం-ఎందుకని?'

'ఏమో, కూర్చున్నా పాసవుతానన్న ధైర్యం లేదు...మావాళ్ళు నా చదువు మానిపిద్దామని కూడా అనుకుంటున్నారు!'

లలిత పరిస్థితి చాలా ఇన్‌డైరెక్టుగా తెలియపరిచింది; తనకు పూర్తిగా అర్థమైపోయిందని ఆమె భావించి ఉన్నట్లయితే, ఆమె పొరబడ లేదు. ఆడపిల్ల చదువు మానిపించటమంటే, త్వరలోనే ఆమె గృహిణి పాత్రను స్వీకరించ బోవటమని తనకు తెలియక పోలేదు. చదువు మానేస్తున్నందుకు, బహుశా, అప్పుడే పెళ్ళి కూతురయ్యేందుకూ లలిత విచార పడుతూండవొచ్చు. పూర్వం తను కూడా చదువు మానేసినప్పుడు ఎంతగా బాధపడలేదు కనుక! అప్పుడు యీ లలితే తనకెంతో మనోనిబ్బరాన్ని కలిగించింది. స్నేహ ధర్మంలో తనుకూడా ఇప్పుడామెకు ఓదార్పుగా మాట్లాడాల్సిన బాధ్యత వుంది.

—కాని, ఏం మాట్లాడగలడు? ఆమెను ఎలా ఓదార్చటం? తనకు తానే సలహాలిచ్చుకోలేని అసమర్థుడు తను! అందునా ఇలాంటి విషమ పరిస్థితిలో, భరించ మనటంకన్న తనేమీ చెప్పలేడు; చెయ్యలేడు. అది బాధాకరమే మరి! తనక్కూడా మనస్సు కలుక్కుమన్నది.

ఇదంతా ఎందుకొచ్చిందో కూడా తను తేలిగ్గా ఊహించగలడు. చదువు సంస్కారాలున్న కుటుంబంలోంచి వొచ్చిన లలిత, పెద్ద చదువులకు వెళ్ళాలనే మొదట్లో వాళ్ళ వాళ్ళ ఉద్దేశ్యం. కాని తనామె జీవితంలో ఎదురైన నాటినుంచీ ఆమెకే కష్టాలు ఆరంభమైనవి. తానామె జీవిత ప్రవాహాన్ని వేరొక దిక్కుకు మార్చాడు; అంతకన్న. ఆమె తన జీవితాన్ని మార్చగలిగింది. ఐతే ఇప్పుడామె తననూ తప్పుపట్టి, తనవల్లనే ఆమె యీ చదువు మానుకోవాల్సిన పరిస్థితిలో పడిందని అనదు. ఆమె హృదయం విశాలమైనది...కాని, తను బాధపడక పోవటంలో అర్థం లేదు.

లలిత చిరునవ్వుతో హెచ్చరించింది.

'ఏమిటి మాష్టారూ! తీవ్రంగా ఆలోచిస్తున్నారు?'

ఆమె మొహం చూసేప్పటికి, తను పడే - వేదనకు అర్థం లేదని తోచింది. మొదట చెప్పేటప్పుడు ఆమె కూడా చలితచెందినట్లే తనకు కనిపించింది, మరు క్షణం

లోనే ఆమె ఎంత తేలిగ్గా 'మూడ్' మార్చుకో గలిగింది! లలితలాటి వ్యక్తులు జీవితంలో సుఖపడేందుకు ఎక్కువ అవకాశాలుంటవి. ఎందుకంటే విచారము నేది ఆమె మనసులో ఎక్కువసేపు కాపరం చేయలేదు; తనను తానే సంబాళించుకొని, కుంగ పోకుండా కాపాడుకో గలుగుతుంది.

'ఏం లేదు లలితా!...ఏం లేదు—' అన్నాడు తను.

అమ్మ వొస్తే బాగుండు ననిపిస్తోంది. లలిత వినగా ఆ మాటలన్ని గూర్చి చర్చించ వలసిన పనిలేకుండా, ఆమే అనేక అల్పవిషయ ముచ్చట్లు తోసి పారేసింది. ఆ భయం లేదు కాని, ఎంత త్వరగా యీ సంఘటన నడుస్తే, ముఖ్యంగా లలిత ఇక్కణ్ణుంచి వెళ్ళిపోతే అంత మంచిది; తనకూ, ఆమెకూ కూడా.

'లలితా! చాలా ఆలస్యమైనట్లుంది—' అన్నాడు, తనే సూచనగా.

'వెళ్తున్నాను మేష్టారూ! అమ్మగారు—' అని మళ్ళీ ఏదో ఆలోచించి, ఒక్క సారి దీనంగా తన ముఖంలోకి చూసి 'వొస్తాను మాష్టారూ!' అని మెల్లిగా బైటికి వెళ్ళింది.

తను అచేతను డయ్యాడు. కనీసం గుమ్మందాకా ఆమెను సంపిరావలసిన తన బాధ్యతను కూడా మరచి పొయ్యాడు. తీరా ఆమె వెళ్ళిపోయ్యాక, తనను తాను నిందించుకున్నాడు.

తను జీవితంలో యీ మాత్రంగా, ఒక వ్యక్తిత్వంతో నిలబడ గలిగాడంటే, అందుకు కారణం తన తల్లి, లలిత: తల్లి తనను పెంచి కంటిని రెప్పవలె కాపాడింది; లలిత తనకో విశిష్ట వ్యక్తిత్వాన్నిచ్చింది. యీ ఉభయులూ ఇచ్చిన ఆవేశాలతోనే తను గర్వించదగ్గ మనిషిగా తయారయ్యాడు.

జీవితం ఒక నదిలాటిది; నది ఎంత పెద్దదై, గొప్పదైనా, జన్మస్థలంలో చీల మండలు తడిసేపాటి లోతుగానే వుంటుంది. ముందుకు రాను రాను, చిన్న చిన్న వాగులెన్నో కలవటం వల్ల నది గొప్పదవుతోంది. యీ గొప్పతనానికి వెనుక వున్న ఉపనదుల్ని గూర్చి ఎవ్వరూ గమనించరు. అదేవిధంగా ఒకో మనిషికి వెనుక, ఉపనదుల మాదిరి వుండే వ్యక్తుల సహాయం వుంటుంది. జీవితం నదికి పోల్చుకుంటే, తల్లీ, లలితా తన జీవితానికి పెద్ద ఉపనదులే!

ఆలాటి వాటిల్లో ఒకటి చాలా త్వరలోనే తన జీవితం నుంచి విరమించ బోతోంది. ఇదివరకు ఎప్పుడైనా కనిపించి, లలిత పలకరిస్తూండేది; తన కష్టాలకు హృదయపూర్వకమైన సానుభూతి లలిత నుంచి లభిస్తూండేది. ఇక ఆమె ఒక ఇంటిదై శాశ్వతంగా వేరొకరి సొత్తయి పోతుంది. ఇంతకు పూర్వం స్నేహితు రాలుగా నన్నా ఆమెను ధ్యానించుకొనే అవకాశం తనకుండేది; ఇప్పుడసలు ఆమెను గూర్చి తలిచే హక్కుకూడా తనకు లేదు.

లలిత అందరు స్త్రీల వలెనే కాపరం చేసుకుంటూ పిల్లల తల్లయి సుఖపడా లనే తను కోరుతున్నాడు. తనకిందువల్ల జరిగే అపకారం మాత్రం ఏముంది?

రెండు పుస్తకాలు తీసుకొని, వాటిని అటూఇటూ తిప్పుతూ, లలిత చాలా అన్యమనస్కంగా కూర్చుంది. ఆమె ఏదో మాట్లాడాలని అనుకుంటోంది కాని, మాట్లాడలేక పోతోందని తను అర్థం చేసుకున్నాడు. నిజానికి తనుకూడా ఏం మాట్లాడాలో తోచక కొట్టుమిట్టాడుతున్నాడాయె! ఎంత వేగంగా యీ సంఘటన అంతమైతే, అంత మంచిది!

'మాస్టారూ! యీ పరీక్షలకు బహుశా కూర్చోనేమో!' అందామె విచార సూచకమైన కంఠస్వరంతో.

'ఏం-ఎందుకని?'

'ఏమో, కూర్చున్నా పాసవుతాననే ధైర్యం లేదు...మావాళ్ళు నా చదువు మానిపిద్దామని కూడా అనుకుంటున్నారు!'

లలిత పరిస్థితి చాలా ఇన్‌డైరెక్టుగా తెలియపరిచింది; తనకు పూర్తిగా అర్థమైపోయిందని ఆమె భావించి వున్నట్లయితే, ఆమె పొరబడ లేదు. ఆడపిల్ల చదువు మానిపించటమంటే, త్వరలోనే ఆమె గృహిణి పాత్రను స్వీకరించ బోతట మని తనకు తెలియక పోలేదు. చదువు మానేస్తున్నందుకు, బహుశా, అప్పుడే పెళ్ళి కూతురయ్యేందుకూ లలిత విచార పడుతూండవొచ్చు. పూర్వం తను కూడా చదువు మానేసినప్పుడు ఎంతగా బాధపడలేదు కనుక! అప్పుడు యీ లలితే తనకెంతో మనోనిబ్బరాన్ని కలిగించింది. స్నేహ ధర్మంలో తనుకూడా ఇప్పుడామెకు ఓదార్పుగా మాట్లాడాల్సిన బాధ్యత వుంది.

—కాని, ఏం మాట్లాడగలడు? ఆమెను ఎలా ఓదార్చటం? తనకు తానే సలహాలిచ్చుకోలేని అసమర్థుడు తను! అందునా ఇలాంటి విషమ పరిస్థితిలో, ధరించ మనటంకన్న తనేమీ చెప్పలేడు; చెయ్యలేడు. అది బాధాకరమే మరి! తనకూ కూడా మనస్సు కలుక్కుమన్నది.

ఇదంతా ఎందుకొచ్చిందో కూడా తను తేలిగ్గా ఊహించగలడు. చదువు సంస్కారాలున్న కుటుంబంలోంచి వొచ్చిన లలితా, పెద్ద చదువులకు వెళ్ళాలనే మొదట్లో వాళ్ళ వాళ్ళ ఉద్దేశ్యం. కాని తనామె జీవితంలో ఎదురైన నాటినుంచీ ఆమెకే కష్టాలు ఆరంభమైనవి. తానామె జీవిత ప్రవాహాన్ని వేరొక దిక్కుకు మార్చాడు; అంతకన్న ఆమె తన జీవితాన్నే మార్చగలిగింది. ఐతే ఇప్పుడామె తనను తప్పుపట్టి, తనవల్లనే ఆమె యీ చదువు మానుకోవాల్సిన పరిస్థితిలో పడిందని అనదు. ఆమె హృదయం విశాలమైనది...కాని, తను బాధపడక పోవటంలో అర్థం లేదు.

లలిత చిరునవ్వుతో హెచ్చరించింది.

'ఏమిటి మాస్టారూ! తీవ్రంగా ఆలోచిస్తున్నారు?'

ఆమె మొహం చూసేప్పటికి, తను పడే వేదనకు అర్థం లేదని తోచింది. మొదట చెప్పేటప్పుడు ఆమె కూడా కలతచెందినట్లే తనకు కనిపించింది, మరు క్షణం

లోనే ఆమె ఎంత తేలిగ్గా 'మూడ్' మార్చుకో గలిగింది! లలితలాంటి వ్యక్తులు జీవితంలో సుఖపడేందుకు ఎక్కువ అవకాశాలుంటవి. ఎందుకంటే విచారము నేడు ఆమె మనసులో ఎక్కువసేపు కాపరం చేయలేదు; తనను తానే సంబాళించుకొని, కుంగిపోకుండా కాపాడుకో గలుగుతుంది.

'ఏం లేదు లలితా!...ఏం లేదు—' అన్నాడు తను.

అమ్మ వొస్తే బాగుండు ననిపిస్తోంది. లలిత ఆనాటి మాటలన్ని గూర్చి చర్చించవలసిన పనిలేకుండా, ఆమే ఆనాడే అల్పవిషయ మన్నట్లు తోసి పారేసింది. ఆ భయం లేదు కాని, ఎంత త్వరగా యీ సంఘటన మరుస్తే, ముఖ్యంగా లలిత ఇక్కణ్నుంచి వెళ్ళిపోతే అంత మంచిది; తనకూ, ఆమెకూ కూడా.

'లలితా! చాలా ఆలస్యమైనట్లుంది—' అన్నాడు, తనే సూచనగా.

'వెళ్తున్నాను మేష్టారూ! అమ్మగారు—' అని మళ్ళీ ఏదో ఆలోచించి, ఒక్కసారి దీనంగా తన మొఖంలోకి చూసి 'వొస్తాను మేష్టారూ!' అని మెల్లిగా బైటికి వెళ్ళింది.

తను అచేతనుడయ్యాడు. కనీసం గుమ్మందాకా ఆమెను పంపిరావలసిన తన బాధ్యతను కూడా మరిచి పోయ్యాడు. తీరా ఆమె వెళ్ళిపోయాక, తనను తాను నిందించుకున్నాడు.

తను జీవితంలో యీ మాత్రంగా, ఒక వ్యక్తిత్వంతో నిలబడ గలిగాడంటే, అందుకు కారణం తన తల్లీ, లలితా; తల్లి తనను పెంచి కంటికి రెప్పలా కాపాడింది; లలిత తనకో విశిష్ట వ్యక్తిత్వాన్నిచ్చింది. యీ ఉభయులూ ఇచ్చిన ఆవేశాలతోనే తను గర్వించదగ్గ మనిషిగా తయారయ్యాడు.

జీవితం ఒక నదిలాంటిది; నది ఎంత పెద్దది, గొప్పదే ఐనా, జన్మస్థలంలో సీల మండలు తడిసేపాటి లోతుగానే వుంటుంది. ముందుకు రాను రాను, చిన్న చిన్న వాగులెన్నో కలవటం వల్ల నది గొప్పదవుతోంది. యీ గొప్పతనానికి వెనుక వున్న ఉపనదుల్ని గూర్చి ఎవ్వరూ గమనించరు. అదేవిధంగా ఒకో మనిషికి వెనుక, ఉపనదుల మాదిరి వుండే వ్యక్తుల సహాయం వుంటుంది. జీవితం నదికి పోల్చుకుంటే, తల్లి, లలితా తన జీవితానికి పెద్ద ఉపనదులే!

అలాంటి వాటిల్లో ఒకటి చాలా త్వరలోనే తన జీవితం నుంచి విరమించుబోతోంది. ఇదివరకు ఎప్పుడైనా కనిపించి, లలిత పలకరిస్తూండేది; తన కష్టాలకు హృదయపూర్వకమైన సానుభూతి లలిత నుంచి లభిస్తూండేది. ఇక ఆమె ఒక ఇంటిదై శాశ్వతంగా పరాయి సొత్తయి పోతుంది. ఇంతకు పూర్వం స్నేహితురాలుగా నన్నా ఆమెను ధ్యానించుకొనే అవకాశం తనకుండేది; ఇప్పుడసలు ఆమెను గూర్చి తలిచే హక్కు కూడా తనకు లేదు.

లలిత అందరు స్త్రీల వలెనే కాపరం చేసుకుంటూ పిల్లల తల్లయి సుఖపడాలనే తను కోరుతున్నాడు. తనకిందువల్ల జరిగే అపకారం మాత్రం ఏముంది?

లలిత తనకు దక్కుతుందనేది ఎండమావుల్లాటి ఒక కల మాత్రమేనని తనకు తెలుసు! ఐనప్పుడు తను విచారించటంలో అర్థం లేదు.

—కాని, ఆ ఎండమావులకే ప్రాధాన్యతను ఇవ్వగల మనస్సు, ఊబి నేలను అంబరచుంబిత మహా సౌధాన్ని నిర్మించగల మనస్సు, తనను జీవితమంతా మోసం చేయగలుగుతూనే వుంది. సాధారణ బలహీనతలకు లొంగని అతీతుడు కాడు తాను! యీ పాడు మనసును విసిరి వేద్దామన్నా, అది తనలోని ఒక భాగంగానే వున్నదాయె. అందుకనే యీ ద్వంద్వ భావాల ఘర్షణ తప్పటంలేదు.

చీకటి నలుమూలలకూ విస్తరించింది. జీవితంలోని చీకటికన్న ఇది ఘోరంగా లేనందువల్ల తనకు అగుపించనే లేదేమో? అమ్మ గొంతు వినేదాకా, ఆలోచనలు కూడా తెగలేదు.

'నాయనా! లలిత వెళ్ళిపోయిందా? లాంతరన్నా వెలిగించ లేదేరా?' అందామె.

ముఖ కళలను బట్టి అమ్మ తన స్థితి గ్రహిస్తుందేమోననే భయంతో, మొహం తుడుచుకొని, గొంతు సవరించుకున్నాడు. మెల్లిగా లేచి లాంతరు వెలిగించాడు. అమ్మ అడిగిన ప్రశ్నలకు తను జవాబు చెప్పలేదు: చెప్పేందుకు మాత్రం ఏముంది? ఆమె కూడా మరేమీ మాట్లాడ లేదు.

మామూలుగా భోజనాలయినవి. ఏదో యాంత్రికంగా అన్ని పనులూ సక్రమంగా చేసుకోవటమే కాని, ఆ పనుల్లో ఉత్సాహం, కుతూహలం మాయమై చాలా కాలమైంది. ఇంత ఆహారం పడేస్తే, శరీరం మూలగదు; ఒక బాధ తప్పుతుంది కనుక, ఆ పని చేయటం. ఇక రుచుల సంగతీ, ఆ రుచుల్ని పెంచుకుందామనే జ్ఞానమూ అసలేలేవు. ఎందుకొచ్చిన బతుకనుకుంటూ ఒక పక్క నిరుత్సాహ పడుతూనే, మరో పక్క ముందు రోజులు మంచివి కావొచ్చనే ఆశతో; ఓపికతో సాగిపోతోంది. కాని తనలాటి నిర్భాగ్యుని జీవితం ముందెలా ఉంటుందో, యీనాడే స్పష్టంగా చూడగలుగుతున్నాడు. ఐనా తను చావలేదు కనుక, బతకవలసిందే!

ఒక రాత్రివేళ మెలుకూ వొచ్చింది. అమ్మ మూలుగుతూ ఏడుస్తోంది. అదిరిపోయి లేచాడు. అమ్మను కదుపుతూ 'అమ్మా! ఎందుకే ఏడుస్తావు?' అన్నాడు.

ఆమె తనను తాను సంబాళించుకుంటూ 'ఏంలేదురా బాబూ! ఏవేవో సంగతులు గుర్తువొచ్చి—' అంది.

ఆ సంగతులేమిటో తనకూ తెలుసు. అందుకనే అడగలేదు. దుఃఖ భారం ఏడుస్తేనే కానితీరదు. కనుక, ఆమెను ఓదార్చ ప్రయత్నించ లేదు. ఆ ఓదార్పులో తను కూడా ఆమెతో పాటే శ్రుతి కలుపుతే; ఇక్కడ మూడో మనిషి మరి లేదు!

## 29

ఆ తరువాతి రోజులు తను ఊహించనంత దుర్దినాలుగా పరిణమించినవి. ముఖ్యంగా అమ్మ ఆరోగ్యం చెడిపోయింది. ఆమె తగినంత విశ్రాంతి తీసుకుంటున్నా తనదగ్గరున్న కొద్దిపైకాన్నీ లెక్క చేయకుండా మందు మాకులకూ, ఆహారానికీ ఖర్చుపెట్టినా, మళ్ళీ ఆమెకు 'ఫిట్' వొచ్చింది. క్రితం సారికన్న దెబ్బతీసింది. ఎడం ప్రక్క స్పర్శజ్ఞానం సగం పోయింది. డాక్టరు అన్నట్లు పక్షవాతానికి మొదటి రెండు మెట్లు దాటింది.

ఆఫీసులో రెండు నెలల జీతం రావాలి. అక్కడి పరిస్థితులు మరింత అధ్వాన్నంగా తయారైనవి. పత్రిక క్రమం తప్పింది. అన్న తమ్ముణ్ణీ, తమ్ముడు అన్ననూ బెదిరించుకుంటున్నారు. వాళ్ళు ఎట్లా చచ్చినా, ముందు తన అవసరాలకూడా డబ్బు అందటం లేదు.

ఒక పక్క తల్లికి సేవచేయటం, మరోపక్క ఆఫీసు పనికీ తూగకుండా వుంది. ఆఫీసులో ఉన్నంత సేపు ఇంటిమీదనే దృష్టి. అందులోనూ, మంచంలోంచి దిగి, తన పనులు తాను సరిగా చేసుకోలేని స్థితిలో కూడా తాను అమ్మదగ్గిర ఉండలేక పోతున్నాడు.

డబ్బుకున్న విలువలేమిటో జీవితారంభంనుంచీ తనకు తెలుసు. ఎంత జాగ్రతగా వాడుకున్నా, ఈనాడు తను అనుభవిస్తున్న లేమి చాలా బాధాకరమైంది. లేకపోతే తినటం మాని నాలుగైదు రోజులు ఓర్చుకోవొచ్చు... కాని అమ్మమందులు కొనివ్వలేని దారుణస్థితి వొచ్చిపడింది.

ఇన్నాళ్ళూ తన పేదరికం ఇతరులకు తెలుస్తుందేమోనని ఎంతో భయపడేవాడు; ఒకర్ని అడగటమనేది ఎన్నడూ లేదు. పైపెచ్చు ఎవరైనా సానుభూతి చూపుతే, తనను హేళన చేస్తున్నట్లు బాధపడేవాడు. తనను పరిపూర్ణంగా, అర్థం చేసుకున్న లలిత తనకు సహాయపడటాన్ని కూడా నిరసించాడు.

అలాంటి తను, యీనాడు ఎవరినైనా అర్థించి తీరవలసిన పరిస్థితి ఏర్పడింది. తనకు ఎవరున్నారు? ముందుగా లలిత గుర్తుకొచ్చింది కాని, తన ప్రాణం పోతున్నా కూడా ఆమె దగ్గరికి పోకూడదని నిశ్చయించుకున్నాడు. ఇప్పటికే ఆమెనుంచి ఎంతో ఉపకారాన్ని పొందిన తను, ఆమెకు అపకారమే చేశాడు. అదీగాక, ఆమె వొచ్చి కూడా రెండువారాలైంది. అసలీపాటికి అత్తవారింటికూడా వెళ్ళిందేమో తెలియదు.

మిగిలిన వాళ్ళల్లో తను అడగగలిగింది రమణమ్మగారిని మాత్రమే! ఏమని అడిగేట్లు? ఎట్లా? కాని అంతకన్నా మరోమార్గమనేది లేనప్పుడు, మానవుడు తెలిసే చేసే నీచమైన పనుల్లాగే, దీన్ని కూడా నిర్వర్తించాలి.

సిగ్గుపడుతూనే రమణమ్మగారి దగ్గరికి వెళ్ళాడు. పూర్వం వలె ఆమె ఆప్యాయంగా పలకరించ లేదు; కనీసం తను అనుకున్నంత అపేక్ష చూపలేదు. దూరమైపోయిన బంధువుల్ని మర్యాదకు పలకరించినట్లు తోచింది.

'ఎలా వుంది వుద్యోగం?' అన్నదామె.

'అనుకున్నంత బాగా లేదండీ' అన్నాడు. ఆమె ప్రశ్నలో తను తొందరపడి వెళ్ళినందుకు హేళన ధ్వనించింది.

చిట్టి చదువు సంగతీ అదీ అడిగాడు. పద్మనాభం గారు కానీ, చిట్టి కానీ ఇంట్లో ఉండని సమయంలోనే తనామె దగ్గిరికి వెళ్ళాడు. అంతమంది వుంటే తన బాధను అపుర్ను ఏడ్వగలడే కాని, చెప్పుకోలేడు. రమణమ్మగారి తరహా చూశాక, బహుశా ఆమెకూడా, లలితకు తానేదో ద్రోహం చేసినట్లే భావించి వుంటుందనీ, అందుకనే పూర్వంవలె అనురాగ పూరితంగా, సానుభూతిగా మాట్లాడటం లేదనీ తనకు అర్థమైంది. చివరకు ఆమెను అడగకుండానే వొస్తే బాగుండుననికూడా అనిపించింది. కాని తనకు మరో దిక్కు లేదాయె.

చివరకు ఎలాగో కళ్లు మూసుకొని 'అమ్మకు బొత్తిగా బాగాలేదు...మందులకూ వాటికీ నా దగ్గిర డబ్బేమీ లేదు .' అని పూరుకున్నాడు.

ఆమె ఏం జవాబు చెపుతుందో, ఆమె ముఖ భంగిమ ఏమిటో చూసే ధైర్యం కూడా లేక, తాను కేవలం నామ మాత్రుడుగానే నేల చూపుల్ని సారించి, శిలా ప్రతిమవలె ఉండి పోయ్యాడు.

రమణమ్మగారు కూడా కాస్సేపు మాట్లాడ లేదు. ఇక లాభం లేదు కనుక ఆ ప్రదేశం నుంచి పారిపోదామని పిస్తోంది.

లోపలి కెళ్ళి ఇరవై రూపాయలు తీసుకొచ్చి ఇచ్చిందామె. పైకం తీసుకుంటూ, నమస్కరించి, ఒక్కసారి ఆమె ముఖంలోకి చూశాడు. ఆమెకూడా యీ బెడద ఇంతటితో వొదిలింది కదాననే భావాన్ని వ్యక్తపరుస్తోంది. ఎంతో బాధ పడుతూ ఎలాగో బైట పడ్డాడు.

జీవితంలో ఇదే మొదటిసారి తన గౌరవ మర్యాదల్ని వ్యక్తిత్వాన్ని వెలకట్టి అమ్మటం-అదీ ఇరవై రూపాయలకు! ఇంతకన్న తక్కువ విలలకు అమ్మే వారు లేరని కాదు కాని, యీ నీచపు పనికి తన అంతరాత్మ గిల గిలా కొట్టుకుంది. తనకు అప్పిచ్చే వాళ్లూ లేరు; ధర్మానికిచ్చే వారు అంతకు ముందే లేరు! అడుక్కుతినే వాళ్ళను చూసి తనే ఎంతో అసహ్యించు కుంటూండే వాడు; ఇతరులు తననా స్థితిలో చూసి అసహ్యించు కోవటం మానుతారా?

అయిందేమో అయింది-కాని యీ ఇరవై రూపాయలూ, మహా వొస్తే నాలుగైదు రోజులు. ఆ తరువాతి గతేమిటి? తన పాలిట ఏ దైవమన్నా ప్రత్యక్షమై, వరాలిస్తే తప్ప యీ సమస్యల్ని ఎదుర్కొని పరిష్కరించటం తన శక్తికిమించి పోయింది.

ఇది పని కాదని, తనకు రావలసిన చోట ఆఫీసులోనే పీఠం వేసుకూర్చున్నాడు. శర్మగారు కూడా డబ్బుకు బాధ పడుతూనే వున్నారు. ఆయనే వెళ్ళి యజమానులతో మాట్లాడి వొచ్చి నిట్టూర్చి అన్నాడు: 'వాళ్ళ దగ్గిరైతే డబ్బువుంది;

కాని ఇప్పుడిచ్చే ధోరణి లేదు. మన బాధలు వాళ్ళకు పట్టలేదు. వాళ్ళ పోట్లాటలు ఇప్పట్లో తెగనూ తెగవు...'

'నాకు పైకం చాలా అవసరం. యీ ఉద్యోగాన్ని వొదిలేసి వెళ్ళమన్నా వెళ్తాను—కాని ఇంత వరకూ నాకు రావలసింది పారితోష్యమని చెప్పండి' అన్నాడు తను అమితోద్రేకంతో.

తనలాటి సాధు జీవి ఇంత కారంగా మాట్లాడేప్పటికి శర్మగారుకూడా ఒక్క క్షణం చకితుడయ్యాడు. ఆయన చెప్పే సలహాకూడా ఏమీలేదు. వెళ్ళి యజమానుల్నే అడగమన్నాడు.

ఇప్పుడు తనకి ఉద్యోగం పోతుందనే బాధ కానీ, భయం కానీ లేవు. మానవుడు తోటి మానవుడికి చేస్తున్న అన్యాయాన్ని ఎదుర్కొని, చేతనైతే జయించటం లేదా బలికావటం చేసేందుకు కంకణం కట్టుకున్న మహోన్నతుని ఆవేశం ఒక్కటే తనను నడిపిస్తోంది.

పరాశరి యజమానుల దగ్గరికెళ్ళి పడ్డాడు.

'ఎక్కవుంట్ చూడాలి' అన్నాడు ఒకడు.

'చూడండి...నిలబడి ఉంటాను' అన్నాడు, తను.

'ఇప్పుడవుతుందా?'

'నాకు ఎంత రావాలని అనుకుంటున్నారో, కనీసం రెండు నెలల జీతం రావాలని తమకు తెలుసు, అందులో ఒక్క నెలదన్నా ఇప్పుడు ఇప్పించండి—' ఆవేశాన్ని, దైన్యం జయిస్తోంది. ఏ సాధనంతోనైనా సరే, కాలంతోపాటు సాగి పొయ్యేందుకు, మానవుడు చేసే విశ్వప్రయత్నానికి ప్రతి రూపాలివన్నీ.

'మేమేం పారి పోమయ్యా—'

'అయ్యా! రోగిష్టి తల్లికి మందులు కొనాలి. చేసిన చాకిరికి డబ్బు ఇమ్మనటంలో మిమ్మ అనుమానించిన భావం వుందా?'

'ఇస్తామయ్యా స్వామీ! ఇప్పుడెళ్ళి పని చూసుకోండి' అన్నాడు పెద్దాయన కసురుకుంటూ.

'నేనింక పని చెయ్యను, నా లెక్క చూసిస్తే, ఇటు నుంచి, ఇటే వెళ్తాను...'

'అట్లాగా?' అన్నాడు చిన్నాయన, 'ఆ పద్ధులో ఉంటే అసలే ఇవ్వరు. ఇది పత్రికాఫీసా, పళ్ల దుకాణమా? మీకు వెళ్ళాలని వుంటే, మరో మనిషి వొచ్చే దాకా ఆగి వెళ్ళ వొచ్చు—'

మానవుడి స్వార్థం, ఇతరుల బాధల్ని గుర్తించని స్థితిలోకి దిగి ఎంత భయానక రూపాన్ని ప్రదర్శిస్తుందో తెలిసి వొచ్చింది.

'ముందు నాకు పైకం కావాలి. అది లేకుంటే నేను ఇంటికి వెళ్ళి చేసేది కూడా ఏమీ లేదు. మీరు దయఉంచి కొంతన్నా ఇవ్వండి—'

క్షణంలో తను ఎంత దిగజారి పోయ్యాడు! డబ్బుకోసమై యీ ప్రపంచంలో చేసే నీచకార్యా లనేకం ఉన్నవంటే, వాటి వెనుకవున్న అవసరాలు, ఒక్కో సమయంలో ప్రాణగండాలే కారణమేమో?

ఇంత ప్రాధేయపడినా ఫలితం లేదు. అన్న దమ్ములు ఒకరి మొహం మరొకరు చూసుకున్నారు. చివరకు యీ పీడ వొదిలించు కునేందుకు, పది రూపాయలిచ్చాడు, పెద్దాయన.

'కనీసం నెల జీతమన్నా ఇప్పించండి... నేను చాలా బాధల్లో ఉన్నాను-దయ చూపండి.'

కన్నీరు రాక్కపోతే తక్కువ. ఐనా కూడా 'దయ' అనేది 'ధన' రూపం ఎప్పుడైతే దాల్చిందో, దాని విలువలే వేరు; అంత విరివిగా ప్రపంచంలో దొరుకుత వనుకునేవాడు, ప్రపంచాను భవం లేనివాడే!

'రేపు చూస్తాం—వెళ్ళవయ్యా...ఇక్కడకు పెద్ద మనుషు లొస్తూంటారు; నీవు తగాదా వేసుకోదలుస్తే, కైటికి వెళ్ళు...మర్యాదగా వెళ్ళు' అన్నాడు హుంకరిస్తూ చిన్నవాడు.

లోకాన్ని దోచుకుందామని, పత్రికలు నడిపే వ్యాపారస్థుల మనస్తత్వం ఎలాటిదో, యీనాడు పరిపూర్ణంగా తెలిసి వొచ్చింది. ఇంతకు పూర్వం తనకు తెలిసిన ప్రపంచం వేరు; ఇప్పుడు యీ ప్రపంచంలోనే తనకు పనికలిగినా, తెలుస్తూన్నది వేరూను!

తన మాన మర్యాదల్ని పణంపెట్టినా ప్రయోజనం లేదు. మెదలకుండా విచారంతో నిండిన హృదయంతో బైటపడ్డాడు.

## 30

ఎంత క్షోభతో కొంపజేరినా, తన ఆందోళనా, భయం, నిరాశా మొదలైన అనుభూతులేవీ అమ్మకు తెలియకుండా విశ్వప్రయత్నం చేస్తున్నాడు. జీవితంలో ఎన్నడూ అనుభవించని కొత్త ఆనంద మేదో చేజిక్కినప్పుడు కలిగే ఖుషీలాటి దాన్ని ఊహించుకొని, గాలి మేడల సహాయంతో జీవితంలో చేసున్న దిగమింగ గలిగినట్లు నటిస్తున్నాడు. పిచ్చి తల్లి—అదంతా నిజమే ననుకొని నమ్ముతోంది.

తన జేబులో వున్న ముప్ఫయి రూపాయల్తో, తనూ తల్లీ, ఎంతకాలం జీవితాన్ని సాగించగలరో తనకు తెలుసు! తా మిద్దరే గాక, ఆమె వ్యాధి పెద్ద సద్దుగా తనను బెదిరిస్తూ వుంది. తా నీవరకు అనుభవించినవే కష్టాలనుకునే వాడు; అంతకన్న

ఇప్పుడు పడుతూన్న యీ కష్టాలూ, ముందు ముందు తా నెదుర్కోవాల్సినవీ భయానకమైనవై ఉంటవనేందుకు తన కన్నో తార్కాణా లున్నవి.

ఇప్పుడు తనకు ఒక్కటే ఆలోచన: ఏదో విధంగా ముందు డబ్బు సంపాయించాలి; లేకపోతే ఒక్కక్షణం గడవదు. ఇక పద్మనాభం గారింటికి వెళ్ళటం కుదరదు. అమ్మ పని చేస్తున్న యజమానుల దగ్గిరికి వెళ్తే ఏమౌతుందో తనకు తెలుసు; పద్మనాభం గారింట జరిగిన సత్కారం లాటిదే ఎదురవక తప్పదు. అన్నిటినీ మించి, తనకు రావలసిన జీతం రాళ్ళు కూడా తెచ్చుకోలేక పోయ్యాడు; మరి ఇంకేం దారి?

సమస్యలు తేలనీ, తేలకుండనీ, కాలం ఎవరికోసమూ ఆగదు. తెల్లవారింది. మనసంతా పాడై పోయింది. కడుపులో చెయ్యిపెట్టి దేవుతూన్నట్లు, వికారంగా వుంది. మళ్ళీ ఎందుకు తెల్లారాలి? రాత్రిపడిన బాధే ఎంతో నయమనిపిస్తోంది. కాని కాలం ముందుకు తోసుకొని పోనట్లయితే, యీ జీవితాలకు, అంతమేమిటి? అందునా ఘోరంగా, కష్టభూయిష్ఠంగా వుండే జీవితాలకు, ఎప్పటికి నిజంగా తెల్లారుతుంది?

యీనాడు ఆఫీసుకు కూడా వెళ్ళ బుద్ధి కాలేదు. తనను ఆదరించకుంటే మానె—చెమటోడ్చి కష్టపడినంత వరకు కూడా తనకు న్యాయంగా రావాల్సిన డబ్బు ఇవ్వని వారి సేవ తన కెందుకు? వాళ్ళ కంత అవసర మనుకుంటే, వాళ్ళే కబురు చేస్తారు. అప్పుడే నిలబెట్టి వసూలు చేయగల స్థోమతా, అవకాశమూ తనకు లభిస్తవి; ఆ సమయం కోసమన్నా తను వేచి ఉండాలి.

అమ్మకు మందు తెచ్చాడు; భోజనానంతరం తను వెళ్ళకపోవటం చూసి 'నాయనా! ఇవ్వాళ సెలవా!' అందామె.

ఔనని తలూపాడు; యీ మధ్య ఆమెతో చాలా ముభావంగా ఉంటున్నాడు; నిజమైన పరిస్థితి ఆమెకు చెప్పకూడదని కాదు; అందువల్ల ఉపయోగం లేకపోగా, ఆమె మనసుకూడా వికలమౌతుంది.

సాయంత్రం దాకా ఇంట్లో ఉన్నాక, ఏమీ తోచని స్థితిలో పడ్డాడు. మరోవారానికే తన బతుకు బజారు పాలవుతుందనే భయం వొణికింప జేస్తోంది. ఏమైతే అదే అవుతుంది, ఒకసారి మైలాపూర్ వెళ్ళి రావాలనుకున్నాడు.

'ఇప్పుడే వొస్తాను' అని అమ్మకుచెప్పి, మైలాపూర్ బయలు దేరాడు. తను వెళ్ళేప్పటికి బాబు గారింకా రాలేదు. ఇల్లాలు మాత్రం 'ఎట్లా వుందయ్యా! అమ్మకు?' అంది.

'ఇంకా సరిగా లేవటం లేదండీ...' అని కాస్త ఆలోచించి, యీ చేదును తను ఏనాడైనా దిగమింగక తప్పదు కనుక, ఎంత తొందర్లో అది గడుస్తే అంత మంచి దని నిశ్చయించుకొని 'డబ్బుకు చాలా ఇబ్బందిగా వుంది...మిమ్మ ఏమన్నా అడిగి తీసుకు రమ్మంది—మీ ఋణం ఉంచుకోము' అన్నాడు కన్నీరు ఒక్కటే తక్కువ ఆ ప్రార్థనలో.

గృహిణి కాస్సేపు తేరిపార చూచింది. ఆ తరువాత ఏమనుకుందో, లోపలి కెళ్లి యాభై రూపాయలు తీసుకొచ్చింది; పైకం ఇస్తూ 'ఆయనకు తెలుస్తే కోప్పడు తారు. పని చేసినందుకు బాగానే ముట్టచెప్పాం...ఇక రావొద్దు...ఏదో మహా బాగా వంట చేసేదని...' అంది.

ఆ డబ్బు తీసుకొని బైటపడ్డాడు. తన పలుకు బడులూ ఐనవి; అమ్మ పలుకు బడి కూడా ఐపోయింది. అమ్మ వంట బాగా చేస్తుంది—ఔను; తన రక్తమాంసా లనే పొయిలో వేసిన వేడితో, వంటకాలు తయారైతే, వాటి రుచి తినే వాళ్ళకే తెలుస్తుంది; మానవుడి రక్తమాంసాలు ఇంత రుచికరమైనవి కనుకనే, దాసదాసీ జనాలున్న వారు సుఖపడుతున్నారు. ఎక్కడో మనుష్యుల్ని తినే మనుష్యులున్నారని తను పుస్తకాల్లో చదివాడు; యీ ప్రపంచంలో తన కళ్ళెదుటనే అలాటి మానవు లున్నారు. ఐతే వీరు ప్రాణం పొయ్యేవరకూ తినరు; తినటం పూర్తవుతుందేమో నని భయంతో కొద్ది కొద్దిగా నంజుకుంటూంటారు—అంతే తేడా!

యీనాడు ప్రపంచమంటేనే అసహ్యం వేస్తోంది; తన అసమర్థతకు తన మీద తనకే ఎంతో అసహ్యం కలుగుతోంది. ఐతే తానీనాడు ప్రాపంచిక విధా నాల్ని మార్చలేడు; వాటికి అనుగుణంగా కదులుతూ జీవితాన్ని సాగించే మార్గమూ లేదు.

ఇంటికి వెళ్ళ బుద్ధిగాక, అటూ ఇటూ తిరిగి, చాలా ఆలస్యంగా చేరాడు. వెళ్తూనే ముఖభంగిమలు మార్చుకోక తప్పలేదు.

అమ్మ మేలుకొనే వుంది. కొత్త ఉత్సాహమేదో ఆమె మొహంలో మెరు స్తోంది. బహుశా...లలిత వొచ్చి ఉండా లనుకున్నాడు. తను అడక్కుండానే అమ్మ చెపుతుంది కనుక ఊరుకున్నాడు.

'నాయనా! ఇంత ఆలస్యమైందేం?' అన్న దామె.

తను మాట్లాడ లేదు.

'లలిత చాలాసేపు కూర్చుంది'

ఆ మాటలకూ తను చలించ లేదు.

'పుస్తకాలేవో ఇచ్చి, మరో రెండుపుస్తకాలు తీసుకెళ్ళింది రాజా!'

'సరే—' అన్నాడు తను.

ఆర్థిక సమస్య ముందు, మిగతావన్నీ యీనాడు అత్యల్పమైనవిగా తయారై నవి. నిజపరిస్థితి తెలియని అమ్మ పొందే కొద్ది ఆనందాన్ని తను అడ్డగించ లేదు కాని, తెలిసివుండే తాను మాత్రం ఎలా సంతోషంగా ఉండగలడు?

అమ్మ ఏమేమో చెప్పాలనుకుంది; కాని తను నిరుత్సాహాన్ని కనబరిచినందు వల్ల, ఆమె పెద్దగా నిట్టూర్చి ఊరుకుంది. గొప్ప ప్రమాదం సంభవించబొయ్యే ముందు, దానికి సిద్ధపడేందుకు గాను నిశ్శబ్దమే శరణ్యమనే అభిప్రాయం ఇద్దరికీ కలిగి ఉండాలి.

ఇప్పుడు ఆలోచిస్తూంటే ఇంత క్రూరమైన ప్రపంచంలో అమ్మ ఎలా బతికిందో, తనకు యీ ప్రపంచమే అర్థం కాకుండా ఎలా కడుపులో పెట్టుకొని కాపాడిందో ననిపిస్తుంది. సత్ప్రవర్తనులూ, మెతక మనుషులూ, ఎవరికీ ఏ హానినీ తలపెట్టనివాళ్ళు, నిజంగా సుఖపడటం లేదు, పైపెచ్చు అనేక కష్టాల పాలవుతున్నారు. ఏది న్యాయమో అర్థం గాక తికమక పడుతున్నారు. ఎక్కడో నరకమున్నదంటారు కాని, అది యీ పృధ్వీమీదనే ఉన్నదనే నమ్మకం కలుగుతోంది తనకు.

తనలాగే అమ్మకూడా నిద్రలేకుండా బాధపడుతోందని తెలుసు. ఆమెకు నిద్ర ఎంతో ముఖ్యమనీ తెలుసు. కాని నిద్రపోగలిగేవారే ప్రపంచంలో నిజంగా అదృష్ట వంతులు. తమకా అదృష్టం లేదు.. అందుకనే ప్రపంచంలో చాలామంది శాశ్వత నిద్ర పొందాలని అప్పుడప్పుడన్నా కుతూహల పడుతూంటారు!

మర్నాడు—ఇవాళన్నా ఆఫీసు నుంచి మనిషి వొస్తాడేమో నని కూర్చున్నాడు. ఉదయం డాక్టర్ వొచ్చి ఇంజక్షన్ ఇచ్చి వెళ్ళాడు కనుక, తనకు మరో పని లేదు. కాని మధ్యాహ్నాని కూడా ఎవ్వరూ రాలేదు. అమ్మ ఒకటి రెండు సార్లు ఆఫీసు సంగతి హెచ్చరించినా తను మౌనం వహించాడు.

సాయంత్రానికి ఇక ఉండబట్టలేక, ఆఫీసు వైపు బయలు దేరాడు; తన ఉద్యోగం పోయిందనే చింతకన్న, తనకు న్యాయంగా రావలసింది, రాబట్టుకోలేక పోయ్యాననే బాధే వేధిస్తోంది.

తీరా ఆఫీసుకు వెళ్ళేప్పటికి పెద్ద పెద్ద తాళాలు రెండు వేసి వున్నవి. ఆ తాళాలమీద కోర్టు ముద్రలూ, సీళ్ళూ ఉన్నవి. అనుకున్నంతా ఐంది—అన్నదమ్ములు కోర్టు కెక్కారు; అది తేలేదాకా, యీ తాళాలు తుప్పుపట్టినా, తెరిచేందుకు వీల్లేదు. ప్రపంచంలో లక్ష్యం కాలేదనుకునే న్యాయం, యీలోకంలోనే ఒక భాగమైన కోర్టులో దక్కుతుం దనుకొని పోవటంలో ఎంత అర్థం వుంటుందో తను తేలిగ్గా ఊహించుకోగలడు.

మతం వేసన్నా సరే తన కూలి డబ్బులు వసూలు చేసుకుందా మనుకున్న ఆశలు అడియాసలైనవి. యీ డబ్బుమీద మిణుకు మిణుకుమనే ఆశ పూర్తిగా ఆరిపోయింది. ఎవరిమీద మండిపడితే ఏం లాభం?...తన వలెనే శర్మగారు, పిల్లలు గలవాడు కూడా నానా అవస్థ పడుతూంటాడు!

రోజురోజూకూ దిగజారుతూన్న ఆశల్తో కొంప జేరాడు. తను ఉద్యోగానికి పోకపొయ్యేందుకు, అమ్మకు చెప్పవలసిన కారణాన్ని కూడా వెతికి పెట్టుకున్నాడు.

'సెలవు పెట్టాను—' అన్నాడు.

'నాకొక్క స్త కులాసాగానే వుందికదా! సెలవు దేనికీ?' అందామె.

'నాకు సెలవు వుందమ్మా! అది వృధా పోతుందని'—అని జవాబు చెప్పాడు.

ఆమె మరి మాట్లాడ లేదు.

యీ ప్రపంచంలో సామ్రాజ్యాలు స్థాపిద్దామనే ఆశయా లున్నవాళ్ళున్నారు; లక్షలు గడిద్దామని ఏ పని చేసేందుకైనా సిద్ధపడుతూన్న వారున్నారు. తను అంత పెద్దకోరికల్ని ఊహించలేదు కూడాను! తనూ అమ్మా, యీ రెండు ప్రాణులూ సుఖంగా బతుకుతే చాలు. ఇంత చిన్న కోరిక కూడా నెరవేరని యీ లోకంలో, తన బతుక్కి అర్థం లేకుండా పోతుందేమో?

తను అమ్మకు ఎదురుగుండా ఇంట్లో ఉండటం చాలా ఇబ్బందిగా వుంది. ఆమె ఏ విషయమైనా ప్రస్తావిస్తుందేమో నన్న భయం కూడా వేధిస్తోంది. ముఖ్యంగా లలిత సంగతి ఎత్తుతే తను ఏడవాల్సిన పరిస్థితి ఏర్పడ గలదు.

లలిత! ఆమె నిన్న మొన్న కూడా వొచ్చి వెళ్ళింది. బహుశా ఇంకా ఆమెకు పెళ్లయి ఉండదేమో? ఏదో ముఖ్యవిషయాన్ని తనతో చెప్పాలని ప్రయత్నిస్తూండి ఉండాలి. అది ఎంత ముఖ్యమైనప్పటికీ, ఇప్పటి తన సమస్య వేరు కనుక, తనకేమీ 'ఇంటరెస్ట్' లేదు. యీ సారి లలిత వొస్తే తను కనిపిస్తాడు; తప్పించుకోవాలంటే, ఆమె రాక ముందుగా తెలియదాయె!

తను అడుక్కు తినే స్థితికి దిగాడని రమణమ్మగారు లలితకు చెప్పిందేమో? పరువు పోవటం ఒక ఎత్తయితే, ఆ సంగతి నలుగురికీ తెలియటం మరో ఎత్తు! లలిత తన పట్ల స్నేహభావాన్ని ప్రదర్శించటం కన్న, విరోధం పూనటమే మేలు! అందువల్ల ఆమె వినా బాగు పడుతుంది.

అసలే డబ్బు ఐపోతుంది; తిని కూర్చునేందుకు కుదరదు. మరో తావులో ఉద్యోగం సంపాయిద్దామని వుంది కాని, తన కెవరు ఉద్యోగ మిస్తారు? తన కన్న వృత్తి ధర్మాల్ని పాటిస్తూన్న వారే సుఖపడు తున్నారు. చదువుకున్న వాడికన్న చాకలి మేలన్న సామెతలో ఎంత సత్యం వుంది!



వారం రోజులు గడిచినయ్. తన దగ్గరున్న డబ్బుతో మరి కొద్ది రోజులే గడుస్తయ్. యీ మధ్య అమ్మకు టెంపరేచర్ కూడా వొస్తోంది. ఆతృత అధికమై డాక్టర్ను అడుగులే 'మరేం లేదు—' అని చప్పరించాడు. మందు ఖర్చుల్తోపాటే ఆమె అనారోగ్యంకూడా పెరుగుతోందనిపిస్తోంది.

లలిత ఒకనాటి సాయంత్రం వొచ్చింది. కాస్సేపు సానుభూతి వాక్యాలు దొర్లించింది. ఆమె కూడా చాలా నిరుత్సాహ పడినట్లు మొహంలోనే కనిపిస్తోంది. యీమె స్నేహమే తనకు లేనట్లయితే, బాధ వుండేది కాదు.

'మాష్టారూ! మీ పత్రిక రావటం లేదేం?' అందామె.

తను అదిరి పడ్డాడు; యీ సంగతులన్నీ అమ్మకు తెలుస్తవనే భయం!

'ప్రత్యేక సంచిక వెయ్యాలని—' అని సర్ది చెప్పాడు; కాని లలిత నమ్మినట్లు కనిపించ లేదు.

'మాష్టారూ! మంచి పుస్తకాలేమన్నా ఇవ్వండి—' అందామె.

'ఆ పెట్టెలో వున్నయ్—తీసుకో లలితా! నాకిప్పుడు చదివే తీరుబాటుకూడా లేదు; అందుకని ఏవి మంచివో తెలియదు. నువ్వు చదివి చెప్పు—' అన్నాడు.

లలిత మూడు పుస్తకాలు వెతికి తీసుకుంది.

అమ్మదగ్గిర సెలవు తీసుకొని, 'వొస్తాను మాష్టారూ!' అని బయలు దేరింది. సాగనంపేందుకు తనూ బైటికి వెళ్ళాడు.

'మాష్టారూ! మీ పత్రిక ఆగిపోయిందా?' అందామె.

'ఔను లలితా! అమ్మకు యీ సంగతి తెలుస్తుం దేమోనని, సెలవు పెట్టానని చెప్పాను—'

'మరి ఉద్యోగం?'

తనేమీ మాట్లాడ లేదు. యీ సానుభూతి వాక్యాలు తన క్షోభను బైటికి తవ్వుతయ్. మనసులో ఉన్న విషయాన్ని దాచుకోలేని లలిత, రమణమ్మగారు తనకు ధర్మం చేసిన సంగతి బైట పెడుతుం దేమోనని అదొక భయం; వుండు మానినా, మచ్చ మానదు; అసలు అదింకా మచ్చగా మారలేదు; వుండును కెలికినట్లే అవుతుంది. నిజంగా లలితకు ఆ సంగతి తెలిసినా, తెలియనట్లే నటిస్తే తను గాయపడడు; ఆమెకు తెలియలేదు లెమ్మని తనను తాను వంచించుకో గలడు కూడాను!

'నా దగ్గిరా డబ్బేమీ లేదు మాష్టారూ!—' అందామె, నీళ్ళు నములుతూ.

ఎవరడిగారు? లలిత అసలిటు వైపు రాకుంటేనే మేలు. తన బాధను, ఆమె బాధగా భావించగలిగి నప్పటికీ, తనకు కంటకంగానే వుంది. తన లోతుపాతుల్ని తెలుసుకొనేందుకు లలిత ప్రయత్నించటం, యీ స్థితిలో తన కసలు గిట్టదు.

ఆమెను అలాటి మాటలనొద్దని కసరుదా మనుకున్నాడు కాని, ఆమె చేసిన నేరం ఏమీ లేనందువల్ల, కఠినంగా మాట్లాడలేక పొయ్యాడు.

'లలితా! నా గూర్చిన బాధ పడొద్దు. ఇటు రావటం మంచిది కాదని చెప్పినా నీవు వినటం లేదు—' అన్నాడు.

'మీ కోసం కాదు మాష్టారూ! అమ్మగారు ఎలా వుందోనని చూసేందు కొచ్చాను—' అందామె, తీవ్రంగా, ప్రతిఘటిస్తూ.

లలిత ఇలా కఠిన స్వరంలో మాట్లాడటం ఇదివర కెన్నడూ వినలేదు. నిజమే —ఆమెపట్ల తాను చూపిన నిరాదరణకు, తాను చేయని నేరానికి తప్పు పట్టే వాళ్ళను చూస్తే, ఆమె మండి పడటంలో అబ్బుర మేమిటి! ఐనా తానిప్పుడు యీ ధర్మాధర్మాల చర్చలు సాగించి, యీ విషయాన్ని పొడిగించటం అనవసరం. అదీ గాక దిక్కులేని తననూ తన తల్లినీ చూసి వెళ్ళేందుకు, పలకరించేందుకు రాగల సహృదయను తను గాయ పరిచాడు; ఆ మాత్రం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలన్నా లేని బతుకును, లలిత అసహ్యించుకొనే ఉండాలి.

'అది కాదు లలితా!' అని మెత్తగా మాట్లాడాడు. 'నేనెందు కంటున్నానో నీకు తెలుసు...'

'పోనీండి మాష్టారూ!' అందామె వెంటనే ప్రసన్నతతో 'నేను వొస్తాను-' అని చరచరా వెళ్లి పోయింది. క్షణాల్లో రకరకాలుగా మారిన అనుభూతుల తాకిడికి నివ్వెర పొయ్యాడు తను.

తీరా ఇంట్లోకి వెళ్లేటప్పటికి, మంచంలో కూర్చొని అమ్మ భోరున ఏడుస్తోంది. ఎన్నో కష్టాల్ని భరించి, మనోధైర్యాన్ని కోల్పోకుండా, జీవితంతో ఒంటరిగా పోరాడిన అమ్మను, ఇలాటి స్థితిలో తానెన్నడూ చూడలేదు. యీకాస్త వ్యవధిలో ఏయే విచిత్రానుభూతులు ఆమెను పట్టి పీడించినవో అర్థం కాలేదు. ఆమెను ఓదార్చుదామంటే, తనుకూడా దాదాపు అదే స్థితిలో ఉన్నాడాయె!

'అమ్మా! అమ్మా!' అంటూ ఆమె దగ్గిరకి జేరాడు.

తన తల నిమురుతూ ఏమీ మాట్లాడకుండా వెచ్చని కన్నీరు కారుస్తోందామె.

'అమ్మా! ఎందుకే ఏడుస్తావ్? ఇలా బాధపడితే నీ ఆరోగ్యం సంగతేమిటే—?' అన్నాడతను.

ఆమె తనను తాను సంబాళించుకునేందుకు ప్రయత్నిస్తూ 'మరెట్లాగురా?' అంది.

'ఏమి టెట్లాగు—?'

'నాయనా! నీ ఉద్యోగం పోయె-!'

యీ సంగతి అమ్మకెలా తెలిసిందో అర్థమవలేదు. బహుశా పత్రిక రాలేదేమని లలిత అన్నప్పుడే, ఆమె గ్రహించి ఉండాలి. యీ సంగతి ఎటూ అమ్మకు తెలిసి పోయింది కనుక, దీనిమీద చర్చించటం మంచిది కాదు. ఎలాగైనా అమ్మను సమాధానపరిచి, ఓదార్చేందుకే ప్రయత్నించాలి.

'అమ్మా! నీ ఆరోగ్యం ముందు ఇవన్నీ ఒక లెక్కా-?' అన్నాడు, అదెంత అల్పవిషయమో తెలియ చెప్పాలని!

'నా ఆరోగ్యాన్ని గూర్చిన చింత కాదు రాజా! యీ వ్యాధి ఇక తిరుగుముఖం పట్టదు. జీవితమంతా పోరాడి, ఎంత అలసి పొయ్యానో ఆ పరమేశ్వరుడికే తెలుసు. ఇక బతకాలనే ఆశ కూడా నాకు లేదు. బాబూ! నా రోజులు దగ్గిరవుతున్నయ్యని తెలుసు. ఒంటరి వాడివై నీ వెలా బతుకుతావో నన్నే నా విచారం .. ఇంత అన్యాయం జరుగుతుం దనుకో లేదు—'

నిలవ తొక్కుకోవాలని చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమై పోయినవి. ఇంత నిరాశతో అమ్మేనా మాట్లాడేనని ఆశ్చర్యమూ, నిజంగానే తన స్థితి ఇంత దిగజారి పోయిందని తెలుసుకొన్నప్పుడు కలిగే నిర్వేదమూ ముంచెత్తినవి. ఐనప్పటికీ గుండెల్లో లేని ధైర్యాన్ని, మాటల్లోనన్నా చూపుదామని మరోసారి ప్రయత్నించాడు.

'అలా నిరాశపడితే ఏమౌతుందమ్మా? డాక్టర్ చాలా ధైర్యం చెప్తున్నాడు-'

మాట మధ్యలోనే అడ్డొచ్చి 'పిచ్చి రాజా! డాక్టర్ మాత్రం నాకు తెలియదనుకున్నావా? నా జబ్బుకింద ఇక ఒక్క దమ్మిడీకూడా ఖర్చు పెట్టొద్దు...నిన్ను ఒక ఇంటి వాణ్ని చేసే వరకన్నా, దేవుడు నన్నుంచడు. ఏ జన్మాన చేసుకున్న పాపమో తెలియదు—' అని ఆమె కంట నీరు పెట్టింది.

'ఏమిటమ్మా యీ పిచ్చంతా? ఇప్పుడా విషయాలన్నీ దేనికి? వినా నన్ను గూర్చిన బాధ యీ స్థితిలో నీవు పడట మేమిటి—?' అని మందలించాలని చూశాడు తను.

'రాజా! నీకు బాధలంటూ ఉంటే అవన్నీ నావేరా నాయనా! సంతానాపేక్ష నీకూ తెలుస్తుంది?' అని రొమ్ముల్ని గుద్దుకుంటూ అందామె: 'యీ గుండెల్లోని రక్తాన్ని పాలుగా మార్చి నీకిచ్చానురా బాబూ! అందుకనే నా గుండెలోని భాగమే నీ గుండెగా మారింది; నీ గుండెలో ముల్లు గుచ్చుకుంటే, ఆ బాధ నీది కాదు—నాది!'

మాతృత్వ మంటే ఏమిటో తెలియచెప్పింది ఆమె. కాని ఆమె మాటల్నిబట్టి చూస్తే, యీ అమృతంకూడా తనకు ఎక్కువ రోజులు దక్కేట్లు లేదు. మానవుని విశ్వ ప్రయత్నం ముందు, విధితాలూకు వికటాట్టహాసం తలవొంచక తప్పుతుందా?

'అమ్మా! నీవుకులాసాగా ఉంటే అదే నాకు పదివేలు. కూలిచేస్తూ నిన్ను పోషించగలను. మనకు డబ్బు లేకపోయినా శక్తివుంది; ధైర్యం వుంది. వాటినే డబ్బుగా మారుద్దాం. ఇంత లోకానుభవం వున్న నువ్వే అధైర్య పడితే, నాబోటి వాడు ఎంత నిరుత్సాహ పడుతాడో ఆలోచించు—'

ఆమె పైకి ఏడవటం లేదు; కాని వేడినిట్టూర్పులతో, వెక్కిళ్లతో తన ఆవేదనను వెళ్లడిస్తూనే వుంది.

యీ అమ్మకూడా తనకు దక్కదేమోననే కొత్త భయం పట్టుకుంది తనకు. అకాత్తుగా అమ్మ ఇలా మాట్లాడటంతో దడ పట్టుకుంది. గుండె వేగం హెచ్చుతూ, చెమటలు కారుతున్నవి. ఇంత ఆర్తతను తనెప్పుడూ అనుభవించ లేదు.

'అమ్మా! నీకు విశ్రాంతి చాలా అవసరమని డాక్టర్ అంటున్నాడు; నీవేమో ఏవేవో ఆలోచించి ఇలా బాధపడుతుంటివి—' అన్నాడు తను, ఎలాగైనా ఆమెను ఊరుకో బెట్టి తనను తాను సంబాళించుకోవాలని.

'ఔను...నాయనా! నాకు కావలసింది శాశ్వతమైన విశ్రాంతి. నాకు ఆ స్మశానంలోనే ప్రశాంతత లభ్యమౌతుంది. కాని — నీ బతుకిలా తెల్లారుతుం దనుకో లేదు' అని బావురు మన్నది.

ఇక యీమెను సమాధాన పరచటం తనకు తలకు మించిన పని. అసలీ ప్రదేశంలో వుంటే, ఆమె తలపుల్లో నాట్యం చేసే దెయ్యాలూ, భూతాలు నిజాకృతు లను పొంది, ఇప్పుడే సజీవుల్ని విరుచుకొని తింటవి.

అందుకని బైటికి వెళ్లాడు. ఎటు వెళ్తున్నాడో తెలియకుండానే కాళ్ళు లాగిన వైపు నడక సాగించాడు. వీధుల్లో జనసమ్మర్దం బాగా తగ్గింది. అలా వెళ్ళి వెళ్ళి, ఎదురుగా సముద్రం కనిపించేప్పటికి ఆగిపోయ్యాడు. తానీ ప్రదేశానికి రావలెనను కోలేదు; అందులో యీ మానసిక వేదనతో బాధపడుతూ! దూరాన బీచ్‌లో చంద్రుణ్ణి చూస్తూ, సముద్ర తరంగాలమీద నిలవని వెన్నెల్ని తిలకిస్తూ అక్క డక్కడ మనుషు లున్నారు.

అమ్మ భావించినట్లే శాశ్వతమైన శాంతి కొరకు ఏనాటికైనా తనరాకకై యీ సముద్రం వేచి ఉండగలదు. ఐతే చావటమంటే ఎంత భయమో, బతికట మన్నా అంతే భయంగా వుంది. ఇప్పుడు అమ్మను ఎవరు చూస్తారు? ఏమో — మంచిరోజులు వస్తవనే తనూ వేచి ఉన్నాడు; కాని రోజులు గడిచే కొద్దీ అవి మరింత భయానకంగా మారుతూన్నవి. తానెంత వొళ్ళు విరుచుకున్నా, తన చేతుల్లో ఏమీలేదని, ఏదో అదృశ్య శక్తులే జీవితాలను నడిపిస్తున్నవనే భావన కలిగే వరకూ దిగజారి పోయ్యాడు.

తన పరిస్థితే ఇలా వుంటే, వార్ధక్యంలో, వ్యాధితో, నిరాధారంగా, వున్న తల్లి సంగతేమిటి? విధి ఒకో జీవితాన్ని మూడు పువ్వులు ఆరు కాయలుగా తయారు చేయటం, మరికొన్ని జీవితాలను క్షోభతో కుమల చేయటం — కొంతమందికే నవ్వే అవకాశా లివ్వటం, మరి కొంతమందికి కన్నీళ్ళు పంచటం ఎందుకని? తాను చేసిన నేర మేమిటి? యీ ప్రశ్నలు ఎవర్నడిగి తాను జవాబు తెలుసుకో గలడు? ఎన్ని జీవితాలు జీవించినా జవాబులు తెలుస్తయ్యనే ఆశ ఏమిటి?

చాలాపొద్దెక్కి ఉండాలి. ఒకపక్క మంచు పడుతోంది. సముద్రపు టొడ్డున తానొక్కడే ఉన్నట్లు తెలుసుకున్నాడు. భయం వేయలేదు కాని, తానింతసేపు ఇక్కడ గడుపుతే, అమ్మ ఎంత గాబరా పడుతూంటుందో తలుచుకుంటే వొళ్ళు గగుర్పొడుస్తోంది.

తన విధులను ఏమరిచినందుకు, తనను తాను దూషించుకుంటూ, చకాచకా నడక సాగించాడు. ఇటు వొచ్చినప్పుడు తెలియలేదు కాని, వెనక్కు వెళ్తున్న ప్పుడు ఇంతదూరం అర్థం లేకుండా ఎలా రాగలిగాడో అనిపించింది.

ఇంటికి వెళ్ళేప్పటికి అమ్మ నిద్ర పోతోంది; తడి ఆరని కన్నీరు ఆమె చెంపలమీది నుంచి జారుతోంది.

## 31

ప్రాణవ జీవితంలో పట్టుకున్నదల్లా బంగారమయ్యే రోజులంటూ ఉంటవనీ, అదే విధంగా పట్టిన బంగారమల్లా మన్నయ్యే రోజులుకూడా ఉంటవనే నగ్న సత్యంలోని, రెండవ అనుభవం, తీవ్రంగా ఎదుర్కొంది. ఒకటి కాకుంటే మరోటి- ఏదీ కలిసి రాలేదు. ఇప్పుడీ దైన్యావస్థలో ధన సంపాదన మార్గమూ తెలియదు. ఇల్లు కదిలి బైటి ప్రపంచంలోకి కాలు పెట్టేందుకే తల్ల డిల్లి పొయ్యేంత బాధ, తొట్రుపాటు కలుగుతోంది. అందుకని ఇంట్లోనూ ఉండలేదు, రోగిష్టి తల్లికి ఎదురుగా నిస్సహాయ స్థితిలో, దీప శిఖ బారి నుంచి పారిపోలేని శలభ మయ్యాడు.

ఏం చెయ్యాలి? ఎట్లా? ఎలా రోజులు గడుస్తవి? మొదలైన సవాలక్ష ప్రశ్నలు ఉక్కిరి బిక్కిరి చేసినయ్. గొప్ప యుద్ధం జరిగి జరిగి, అకాస్మాత్తుగా ప్రశాంతత ఏర్పడినప్పుడు, యీ మార్పు భరించలేనంత బాధను కలగ జేసినట్లు, ఒక రకం ప్రశాంతతంటూ నాలుగు గోడల మధ్యా వేళ్ళాడు తూన్నప్పటికీ, నిశ్శబ్ద వాతావరణం వెనుక దాగివున్న భీకరత్వం, క్రూరత్వం తనకు గుర్తుకు రాకుండా ఉండటమూ లేదు.

విశాల విశ్వంలో తనకెవ్వరూ లేరు; మానవులు, మానవ జాతికి ఏమన్నా చేసి వుంటా రనుకోవటం శుద్ధ పొరపాటు; ఆ చేసుకున్నా మనుకున్నది, తమకు తామే చేసుకున్నారు; కాని ఇతరులకు కాదేమో? యీ నాటి తన ఏకాకితనానికి, తాను మహా సముద్రంలో మునుగుతూంటే, గట్టుమీద నిలబడి, వినోదించే ప్రపంచం ఎంత బాధావహమో అర్థమైంది... కాదేమో? యీ నాడు ప్రపంచం తనకు సహాయపడ లేదని, తనను రక్షించ లేదని, యీ పిచ్చి ఊహలకు తావిస్తున్నాడేమో? ఎందుకంటే తన నుంచి పీస మెత్తు సహాయాన్ని ఆపేక్షించకుండా, జీవిత సర్వస్వాన్నీ ధార పోసిన మాతృ మూర్తి ఎదురుగా వుంది; అదే విధంగా పరోక్షంలో లలిత వున్నది. చూస్తూ చూస్తూ ప్రపంచాన్నే దుమ్మెత్తి పోయటం, తన బలహీనత్వం గాక మరేమిటి?

యీ రెండు రోజుల్లోనూ అమ్మ ఎంత దిగజారి పోయిందో చూస్తుంటే, పిచ్చెక్కుతూన్నట్లని పిస్తోంది. ఆమె తన ఆరోగ్యం కన్న, కొడుకు ఎలా బతుకుతాడనే మీమాంసతో మానసికంగా పతనమై పోతోంది. ఇలాగే మరి కొద్దిరోజులు గడుస్తే, తిరిగి కోలుకో గలదా అనే అనుమానం వేధిస్తోంది. ఐతే తాను ఏం చేసి, యీ కష్టాలను గట్టెక్కగలడు?

పూర్వం ఆఫీసంటూ ఉండి, బాధ్యతల్లోనన్నా మార్పంటూ ఉండటంవల్ల, మనసు పొందే పీడనలో కాస్త భేదమంటూ ఉండేది. కాని ఇప్పుడు అమ్మకు ఎదు

రుగా ఇరవై నాలుగ్గంటలూ గడపటం, క్షణక్షణానికీ, జీవితం మీద వెగటు పుట్టేట్లు చేసుకోవటంగానే రూపొందుతోంది.

మూడోనాడు సాయంత్రం లలిత వొచ్చింది: తనను పలకరించకుండానే, అమ్మ దగ్గిర కూర్చొని ఆ మాటా యీ మాటా మాట్లాడింది; పూర్వం అమ్మలో కలిగిన నిరాశ లలిత ఉన్నంత సేపూ కనబడదు. కాని అమ్మను బతికించుకునేందుకు, లలిత సహాయాన్ని, వ్యక్తిగతంగానూ, ఆర్థికంగానూకూడా తాను కోరలేదు. తనకు అందని ఆనందం మధ్య మధ్య నమూనాకు దొరకటం ఎంతో బాధావహమైనది. అసలు లలిత ఇటువైపు రాకుండా ఉంటే, యీ కూపంలోనే కుళ్లి తాడోపేడో తేల్చుకోవటం జరుగుతుంది; ఆమె రాకవల్ల కొత్తగా తాత్కాలికంగా, వాతావరణంలో మార్పు వొచ్చినా, మెరుపుల్ని నమ్ముకొని తెలియని భయంకరారణ్యంలో ప్రయాణించటం లాటిదే అవుతుంది కాని వేరు కాదు గదా!

చీకటి పడుతూండగా లలిత వెళ్ళేందుకు సిద్ధమైంది. చాలా సేపటి నుంచీ తానామెను పరిశీలించి చూడలేదు కాని, ఇప్పుడు చూస్తే, ఆమెనుకూడా ఏదో వ్యథ బాధిస్తూనే వున్నదనిపించింది. తనలాగే బాధ పడుతూన్న వాళ్లను, తను తేలిగ్గా గుర్తించగల స్థితిలో ఉన్నాడు. ఐతే యీ బాధల్ని ఎవరికి వారుగానే అనుభవించటం అత్యుత్తమ పద్ధతని కూడా తనకు తెలుసు. కిందటిసారి ఆమె రావటాన్నిగూర్చి కాస్త గట్టిగా మాట్లాడటం వల్ల, తనను పలకరించకుండా తన మీద అలిగి వుండొచ్చు. తన ప్రస్తుత సమస్య ముందు మిగతావన్నీ అల్పాలవటం వల్ల, దాన్నిగూర్చి పట్టించుకోలేదు. పూర్వంవలె లలిత వొచ్చిందంటే ఆనందంతో హృదయం గంతులు వేయటం, ఏదో పెన్నిధి దొరికినట్లు భావించగలిగే స్థితికి తానిప్పుడు అతీతుడయ్యాడు.

వెళ్ళబోతూ లలిత 'మాష్టారూ! మీ పుస్తకాలు తేవటం మరిచిపొయ్యాను-' అంది, చేసిన తప్పును మన్నించమనే ధోరణిలో.

అసలే తనకు చిరాకుగా వుంది. అందులోనూ పుస్తకాల సంగతి తానిప్పుడు పట్టించుకోలేదు. ఈ వొంకతో లలిత మరోసారి తుఫానల్లే వొచ్చి పడుతుందేమోననే కొత్త భయంకూడా పీడించసాగింది. ఏదో విధంగా యీమెను ప్రస్తుతానికన్నా వొదిలించుకోవాలనీ, ఈ నాలుగు గోడల మధ్య జరిగే జీవిత పోరాటాన్ని మిగతా ప్రపంచానికి సంబంధించనిదిగానే ఉంచాలనీ, ముఖ్యంగా లలితకు తన యీ దైన్యావస్థ తెలియకూడదనీ పట్టుదల ఎక్కువయింది. అసమర్థులు కూడా, ఒక్కొక్కప్పుడు తామెంతో సమర్థులమని తెలియచెప్పుకునేందుకు ప్రయత్నించటంలో వింత లేదు.

తానీ ఆలోచనల్లో మునిగి ఉండటంతో, ఆమె మాటలకు వెంటనే జవాబు చెప్ప లేదు.

'రెండు మూడు రోజుల్లో తెస్తాను మాస్టారూ! అవి అత్యుత్తమ గ్రంథాలు. ఇప్పుడు మీకు తీరుబడిగా వుంది కనుక, తప్పకుండా చదవండి—' అందామె.

'సరే లలితా! చదువుతాను!' అన్నాడు కఠినంగానే; తనకలా అనిపించిందేమో కాని, లలితకు ఆ జవాబు కఠోరంగా ఉండి ఉండదు; అందుకు తార్కాణంగా ఆమె చిరునవ్వుతో 'వొస్తానండీ!' అంది.

తన భావాల్ని గ్రహించ లేదో, లేక గ్రహించినా, దొంగ ఎత్తు వేస్తూన్నదో అర్థం కాలేదు. ఏమైనా పూర్వం కన్న గట్టిగా మందలించినట్లయితే' యీమె వ్యవహారం తొందర ముదిరి ఊసర విల్లిగా తయారు కావొచ్చు. అందుకనే తొందర తొందరగా ఆమెతోపాటే తనూ బైట పడ్డాడు.

వీధిలో గోడల నీడల్లో ఆమెను ఆపి 'లలితా! లోగడ ఎన్నోసార్లు చెప్పాను కదా! ఇటు రావటం మానవు ఎందుకని?' అన్నాడు తను.

ఆమె నిర్ఘాంత పోయినట్లు కనిపించింది. మాస్టారు ఆతాత్తుగా ఇంత కఠినంగా మాట్లాడుతారని బహుశా ఊహించి ఉండదు.

'ఏం—రాకూడదా?' అందామె, మొండికేసినట్లు 'నాకూ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనేవి ఉన్నవని అనుకునేందుకన్నా వొస్తూండాలి. మీ గూర్చి రావటం లేదని ఆ మధ్య చెప్పాను; మరి మీకు కష్టం దేనికి?'

లలిత వ్యక్తిత్వం గలదని తనకు తెలుసు; ఆమెను కదిపి వాదించినందు వల్ల తన ఓటమిని కోరి వరించినట్లవుతుందనీ తెలుసు. ఐతే ఆమెకు అర్థమయేట్లు, ఇదంతా ఆమె మేలు కొరకేనని తెలియ చెప్పేందుకు, తనకిప్పుడు శక్తి చాలదు. అదీగాక, తెలియని వ్యక్తులకు తెలియ చెప్పవొచ్చుకాని, తెలిసికూడా, తెలియనట్లు నటించేవారికి చెప్పటం మాటలా?

అందుకనే 'లలితా! నీకన్నీ తెలుసు. ఇక్కడికి రావటంలో ఎంత కీడు ఉన్నదో నేను చెప్పనవసరం లేదు' అన్నాడు.

'పోనీండి... నేనంత తెలిసిన దాన్నన్నారు కనుక, ఆ కీడేమిటో నే భరిస్తాను' అని విసిరి కొట్టిందామె!

నిర్ఘాంత పోవటం యీసారి తన వొంతయింది. ఏం మాట్లాడేందుకూ తోచ లేదు. ఆమె కూడా కసి తీర్చుకున్న అలసటతో, శ్రమయేట్లు గాలి విడుస్తూన్నది. రెండు నిమిషాలపాటు వారి నీడలు కదలకుండా పాతుకొని పోయినవి.

'మాస్టారూ!' అందామె, ఎంతో మృదువుగా. ఇంద్ర ధనుస్సులోని రంగులన్నీ యీమె వ్యక్తిత్వంలో ప్రతి ఫలించటాన్ని మరోసారి గమనించి, అంత త్వరగా—మారలేని తన అశక్తతను అర్థం చేసుకునేందుకు ప్రయత్నించాడు.

'మాస్టారూ! డబ్బెలా తెస్తున్నారు?' అందామె. తన మేలు కోరే ఏకైక ప్రాణి, లలిత రూపాన ప్రత్యక్షమైన ఇలవేల్పుగా తాను నమ్మేట్లు చేస్తోంది. కాని

తానెలా జవాబివ్వగలడు? లలిత ముందు తన అల్పత్వం బైట పడటాన్ని ఎలా సహించగలడు? ఆమె తన లోపాలకూ బలహీనతలకూ నవ్వక పోవొచ్చు. కాని, వాటిని తెలియ రాకుండా దాచుకుందామనే వ్యర్థ ప్రయత్నం వేధిస్తూనే వుంది. గాఢంగా వున్న వనుకొనే తన బాధ అన్నిటినీ వెలికి లాగి, చికిత్స చేసేందుకు సహృదయంతో లలిత ప్రయత్నించినా, కనీసం, ఆమె తనను ఓదార్చేందుకు చూసినా వాటన్నిటినీ యీ స్థితిలో తాను భరించలేడు.

'కొంత నిలవ వుంది—' అన్నాడు, పొంగివొచ్చే దుఃఖాన్ని ఎలాగో తొక్కిపట్టుకుంటూ. వెంటనే మరో అనుమానం మెరిసింది; తాను రమణమ్మగారి దగ్గర ధర్మానికి తెచ్చిన డబ్బు సంగతి లలితకు తెలిసిందేమో? అందుకనే యీ ప్రశ్నల్ని వేసి, తనచేత నిజం కక్కించి, అంతకన్న సభ్యమైన మార్గం—అంటే తోచిందీ, చేతనైందీ, తనే ధర్మం చెయ్యాలని చూస్తోందేమో! ఇదంతా సద్బుద్ధితో చేసినప్పటికీ, తానెంత దిగజారి పోతున్నాడో లలిత తెలుసుకో గలుగుతే, అసలామె ఇటు రాకుండా ఉంటే, అదే పదివే లనిపిస్తోంది.

'మాస్టారూ! మిమ్మల్ని చూస్తే జాలి వేస్తుంది. ఏం చెయ్యను? కొంతమంది సుఖపడేందుకుగాను అబద్ధా లాడుతారు; కాని మీరు అబద్ధాలాడైనా సరే, మీ కష్టాల్ని మీరే భరించాలని ప్రయత్నిస్తారు!' అందామె.

తానేమని జవాబు చెపుతాడు? కళ్ళనీళ్ళ పర్యంతమైంది. అమ్మ పుట్టింటిని గూర్చి, మేనమామల దగ్గర చెప్పేవాడి స్థితి ఏర్పడింది.

'మొన్న శర్మగారు కనిపించారు' అంది లలిత 'ఆయన కూడా పాపం చాలా బాధలు పడుతున్నారు. ఆయనకూ బోలెడు జీతం రావాలట. 'పాపం! రాజా రావెలా ఉన్నాడో!' అన్నారు. మరో ఉద్యోగం కోసం కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరుగుతున్నా రాయన; పిల్లలు గలవాడు కూడాను!' అంది లలిత.

తన నిజస్థితిని లలిత తెలుసుకో గలిగిన విధాన మేమిటో ఇప్పుడు పూర్తిగా అర్థమైంది. మానవత్వాల్ని అగౌరవ పరచి, బాధించి వేధించిన యజమానులమీద మండి పోయింది. అన్నిటికన్నా, తానిప్పుడు ఏదుపాక్కులే తక్కువగా లలిత ముందు నిలబడి పొయ్యాడు.

'నా దగ్గరా డబ్బులేదు మాస్టారూ!' అందామె 'కాని...' అని చెప్పేందుకు సందేహించినట్లు ఆగిపోయింది. అదేమిటో చెప్పమని తను అనాలి; కాని అలా అనబుద్ధి కాలేదు. పైపెచ్చు 'నీవనుకునేటంత హీనస్థితిలో లేను లలితా' అన్నాడు; అబద్ధ మాడేప్పుడు కలిగే నరాల బలహీనతను, బలవంతంగా తొక్కిపట్టుకుంటూ.

'నాకు తెలుసు మాస్టారూ! ఇంట్లో కొగిలి వుంచుకున్నప్పుడు, నిరుద్యోగి, ఇతర ఆధారం లేకుండా ఎంత అవస్థ పడతాడో నేను ఊహించ గలను...ఒక పని చేస్తారా మాస్టారూ!' అందామె ప్రాధేయ పూర్వకంగా.

'ఏమిటి?—'

'నా మెడలో బంగారు గొలుసు వుంది...ఇది తీసుకెళ్లి అమ్మెయ్యండి—తర్వాత చూసుకుందాం!' అందామె.

'లలితా!' అని పెద్దగా అరిచాడు. ఒక పక్క ఆమెకు కలిగిన ఆలోచనకు చకితు డయ్యాడు; ఆడదానికి ఇంత సాహసమా అనే ఆశ్చర్యం కలిగింది; మరో వైపు తనెంత హీనస్థితిలో వున్నా, తనకు ఏమీకాని స్త్రీ తాలూకు సొమ్ము (అదీ ఆమెదికాదు; పెద్దల చాటున పెరిగే అబల!) అమ్ముకోవాల్సినంత హీనుడని లలిత ఎందుకు అనుకుంది? ఒక వేళ ఇదంతా ఆమె తనపట్ల చూపదలుచుకున్న దయే కావొచ్చు కాని; ఇలాటి దాన్ని తాను అంగీకరిస్తాడని ఆమె తలచటం దుస్సాహసమే అవగలదు.

'మాష్టారూ!' అందామె, ఆ కేకకు హడలి పోకుండా, పైపెచ్చు, తనను సంబాళించేంత హెచ్చరికను చేయగలుగుతూ.

'లలితా! ఇలాటి మాటలు నాదగ్గర ఇక ముందెన్నడూ అనవొద్దు. నిజంగా నీ దగ్గర డబ్బు ఉన్నప్పటికీ, నీవిచ్చినా నేను తీసుకోను. ఇదే చివరిసారి చెప్తున్నాను: నా కూడా కొద్దో గొప్పో ఆత్మాభిమానం వుంది. చివరకు అది కూడా నీవు కొనిపారేసి నన్నొక జీవచ్ఛవంగా తయారు చేయాలనుకుంటే నేనందుకు లొంగను—' ఇంతకన్న కటువుగా తనిక చెప్పలేడనిపించింది.

'మాష్టారూ! మీరు అనుకున్నట్లు నేనందుకు ప్రయత్నించటం లేదు. నేనలాటి నీచురాల్నని మీరు కలలో కూడా అనుకోకండి. ఆత్మాభిమాన మనేది ప్రతి వ్యక్తికీ ఉండవలసిందే! కాని ఒకో పరిస్థితిలో బతకటం, ఎలాగైనా చావు నుంచి తప్పించుకోవటం కోసం; మానవుడు తాత్కాలికంగా ఆత్మాభిమానాన్ని ఏమరిచి ఉండొచ్చు. బతికి వుంటేనే కదా, ఆత్మాభిమానానికి విలువ! అందుకని ఆ రెంటినీ తూచి నట్లయితే—'

'లలితా! నాకు నీతులు ఉపదేశించకు. ఇంటికి వెళ్ళు. నాపట్ల నీవు చూపదలిచిన జాలికి కృతజ్ఞుణ్ణి. ఇప్పటికే మానసికంగా ఎంతో గాయపడి ఉన్నాను; నీకు ఋణపడి ఉన్నాను. వొస్తాను...' అంటూ చకచకా ఇంట్లోకి వెళ్ళబోయి, వెళ్లలేక, గది ముందు, గోడను ఆనుకొని కూర్చున్నాడు.

ఆకాశంలో తళుకు తళుకున మెరిసే తారలు పరిహసిస్తూన్నట్లున్నవి. లలితకు తనంటే ఎంత ప్రేమ! ఆ ప్రేమను ఏ రూపంలో నన్నా సరే, బైట పడెయ్యాలని, ఎంతెంత ప్రయత్నాలు చేసింది! తానామె ప్రణయానికి అయోగ్యుడు కనుకనే, తెలివిగా తప్పుకున్నాడు. అనరాని మాటలని ఆమెను గాయపరిచాడు! తానూ గాయపడ్డాడు. 'భగవాన్! ఎంత అధోగతికి తోశావ్!' అనుకున్నాడు. అంతా సింహావలోకనం చేసుకొని రాత్రి చాలా పొద్దు పొయ్యేవరకూ నిశ్శబ్దంగా ఖేదించాడు.

# 32

'కష్టాలు ఒంటరిగా రావు' అనే సామెత తన నిత్య జీవితంలో ఇంత ఘోరంగా ముందెన్నడూ రుజువు కాలేదు. గత వారం రోజుల్లోనూ అమ్మ స్థితి బొత్తిగా బాగా లేదు. ఉండి వుండి, ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లు అదిరి పడటం, కొంతసేపటి దాకా వొణికి పోవటం, అప్పుడు తనకేమీ దిక్కు తోచక, కాళ్లు చేతులాడక అలాగే ఆమెను పట్టుకోవటం, తెలివి తెచ్చుకొని అమ్మను ఒంటరిగా వొదిలి, డాక్టర్ దగ్గిరికి పరుగెత్తటం, ఆయన ఇచ్చిన మందుల్ని, సంజీవికోసం పర్వతాన్ని పెకలించు కొచ్చిన హనుమంతుడల్లే రివ్వు రివ్వున తెచ్చి వాడటం, నిత్యా జరుగుతూనే వుంది. డాక్టరు దగ్గిర అమ్మను చూసేందుకు రమ్మనే ధైర్యం తన కిపుడు లేని కారణం, జేబు బరువుగా లేకుండుటమే!

తా నివ్వగలిగిన కొద్ది ఆహారం కూడా అమ్మకు ఇమడటం లేదు; యీ పరిస్థితంతా చూసి, తనకూ తిన్నది ఇమడకుండా వుంది; అసలు కావలసినంత తినటం మానుకొని పది రోజులైంది. అందువల్ల తాను ఆదా చేయగలిగిం దెంతని కాదు కాని, అంతకన్న మరో మార్గమూ లేదు. చివరకు కూలిచేసి సంపాయించేందుకైనా, అమ్మను చూసే వాళ్ళేరి?

మహాసాగరంలో ఉండగా ఒకనాడు లలిత కూడా విడిగా వొచ్చింది. మళ్ళీ యీమె వొచ్చినందుకు తనెంతో నొచ్చుకున్నాడు. అమ్మను మాత్రం పలకరించి తన చేతిలో పుస్తకం ఇస్తూ 'మాష్టారూ! కష్ట సమయాల్లో ధైర్యంగా ఉండండి. యీ పుస్తకం తప్పక చదవండి. జీవితమంటే ఏమిటో, మానవత్వమంటే ఏమిటో తప్పక అర్థమౌతుంది' అంది. అదెంత ఉద్గ్రంథమో లలిత తెలియ చెప్పినప్పటికీ, యీ సమయంలో తానామె మాటల విలువను గ్రహించ లేదు; అథవా గ్రహించినా జీవితంలో ప్రవేశపెట్టనూ లేదు. మాటవరసకు 'సరే' నని మాత్రం తల వూపాడు.

వెళ్లబోతూ లలిత పుస్తకం విషయం మరోసారి హెచ్చరించింది. 'తప్పకుండా చదువుతాను లలితా!' అని తనచేత వాగ్దానం చేయించింది కూడాను. సాగనంపేందుకు యీసారి బైటికి వెళ్తే, మళ్ళీ ఆమె ఏం మాట్లాడుతుందో, తనెంత బాధ పడాల్సి వొస్తుందోనని, మెదలకుండా ఊరుకున్నాడు. అదృష్టవశాత్తూ ఆమె కూడా ఎంతో తొందరపడి, వెళ్ళి పోయింది.

[లలిత ఆ నాడన్న మాటల విలువ యీ నాడు తన వొళ్ళో వున్న యీ పుస్తకం తెలియ చెపుతోంది. తన జీవిత సర్వస్వాన్నీ పదుపులో దాచుకోగలిగిన యీ పుస్తకం, మానవత్వపు విలువను నిరూపించగల దనటం నిస్సందేహం. ఆనాటి దాని విలువవేరు! యీ నాడది నిర్ధనమే!]

తానా శాస్త్రాన్ని యథాస్థానంలో పడేశాడు. కేవలం సాహిత్యమూ, నీతులూ, గొప్పలూ ఇవన్నీ తనకి క్షణంలో దమ్మిడీకి కొరగావు. ఆకలితో గిరికీలు తిరిగే వాడికి, ఉపవాస మహాత్మ్యం ఎంత గొప్పదని వివరించినా లాభం లేదు కదా!

ఇప్పుడు అమ్మ దాదాపు ఏమీ మాట్లాడటం లేదు. తనకు చూస్తూ ఒకో కప్పుడు కంటనీరు పెడుతూంటుంది; తను ఓదార్చటం మానుకొన్నాడు. ఒకోక సమయంలో తన పక్కనే కూర్చొపెట్టుకొని వొళ్ళు నిమురుతుంది. ఆమె ఏం చెప్పదల్చుకొందో, తన అనురాగ సాగరం ఎంతని గణనా చేయాలని ప్రయత్ని స్తోందో తను తేలిగ్గా గ్రహించ గలడు. జాగ్రఫీ మాత్రమే చదివి, సప్త మహా సముద్రాలే ఉన్న వనుకునే విద్యార్థికుడైన మూర్ఖుడు కాదు తాను: వీటిని మించిన వేరొక మాతృవాత్సల్యమనే అనంతమైన సముద్రాన్ని గూర్చి కూడా తనకు తెలుసు.

మంద గమనంతో సాగేకాలం, పోనుపోను ఘోరమైన వాతావరణాన్నే సృష్టిస్తోంది. మనసు కీడును శంకిస్తోంది, దాని రూపం ఏమిటో, తనకు ఒక్కగా నొక్క ఆత్మబాంధవి కూడా దూరమవటంగా పరిణమిస్తుందో, ముందుగా చూడ గలిగి, భీతిల్లి పోతున్నాడు. కానున్నది కాక మానదనీ, తన అధీనంలో ఏమీలేదనీ, వీటన్నిటికీ తాను కర్త గాగాక, కర్మగానే ఉండిపోతున్నాడనీ తెలుసు. ఐతే యీ మహత్తర విషయాలు ప్రశాంతంగా ఆలోచించ గలిగినప్పుడు, కథల్లో రాయగలిగి నప్పుడూ వాటి అర్థాలూ, తాత్పర్యాలూ వేరు. ఆ ఆశయాల్ని నిత్య జీవితంలో ప్రవేశపెట్టి తట్టుకో గలగటం, ఏ కొద్దిమందికో, కొంతవరకూ సాధ్యపడితే కావొచ్చు: కాని తనకు మాత్రం తలకు మించిందిగానే వుంది.

—మరోవారం తిరక్కుండానే మనసు శంకించిన కీడు కనుచూపు మేరలో పడింది. ఉదయభానుడు అవతరిస్తూండగానే ఆమె చలితో వొణికి పోతూన్నట్లు గజగజ లాడింది. పూర్వం వలెనే మళ్లీ ఫిట్ వొస్తోందని సరిపెట్టుకోవాలని తాను చూశాడు కాని, అది మృత్యుదేవత జాపిన హస్తం తాలూకు బలమే నని గ్రహించే ప్పటికి, రెండు గంటలన్నా గడిచింది...

ఫలితంగా ఆమె మాట్లాడలేని స్థితిలో వుంది. శరీరం కాగిపోతూ, లోని రక్తనాళాల్లో ఎంత వేగంగా రక్తం ప్రవహిస్తోందో, పైన తాకితేనే అర్థమా

తోంది. దిక్కుతోచక, తడబడే కాళ్ళను రోడ్డుమీద బలవంతాన ఆడిస్తూ, డాక్టర్ దగ్గరికి పరుగెత్తాడు. యీనాడు తాను అనుకున్న ఆత్మాభిమానాలు, గౌరవాగౌరవాలు అన్నీ వొదులుకున్నాడు; అవసరమైతే—డాక్టర్ కాళ్ళు పట్టుకోగలడు; ఆయన ఋణం తీర్చుకునేందుకు ఊడిగం చేయగలడు. డాక్టర్‌గారి ఇల్లు చేరక ముందే ఇలాటి అల్పవిషయాల్లో ఒక నిర్ణయాన్ని ఏర్పరుచుకోగలిగాడు.

'డాక్టర్‌గారూ!' అన్నాడు దీనాతిదీనంగా 'ఒక్కసారి వొచ్చి చూడాలి... మీ కాళ్లు పట్టుకుంటాను—'

డాక్టర్ జాలిగా నవ్వాడు.

'మిస్టర్! వొస్తాను. మళ్ళీఫిట్ వొచ్చి వుంటుంది.' అని ప్రిస్క్రిప్షన్ రాసిస్తూ 'యీ ఇంజక్షన్ తీసుకొనిరా—వెళ్దాం' అన్నాడు.

ఆ చీటీ తీసుకొని వీధిన పడ్డాడు. కాని ఏం పెట్టి మందులు కొంటాడు? కిందటి రోజునుంచీ మంచి నీళ్ళమీదనే బతకటం కూడా సాధ్యమని తాను రుజూ చేసుకుంటున్నాడు. డాక్టర్ ఇంత తేలిగ్గా వొస్తాడని అనుకోలేదు. మరి మందో?

తా నెరిగిన యావత్ ప్రపంచమూ, ఒక్కసారి రంగులరాటం వలె తన కళ్ళ ముందు తిరిగింది; తనకు పనికిరాని వస్తువులూ, అక్కరకురాని మనుషులే అందరూ! మరి మార్గ మేమిటి? ఆనాడు లలిత గొంతునొక్కి స్థానంలే, తను నీలిగాడు. 'ఆత్మాభిమానం' లాటి పదప్రయోగం చేసి, లేనిపోని వేషం గొప్పను ప్రకటించుకోవాలని కేవలం తన స్వార్థాన్ని మాత్రమే దృష్టిలో పెట్టుకున్నాడు. యీ స్వార్థానికీ, తనను కన్నతల్లి ప్రాణానికీ, లంకె వున్నదని అనుకోలేదు. ఇలాటి ఆత్మాభిమానాన్నే తల్లి కూడా ఆదర్శంగా పెట్టుకున్నట్లయితే, పరుల ఇంట చాకిరీచేసి, తనను పోషించ గలిగేదా? జీవితం నుంచి తాను నేర్చిన అనుభవం సమయానికి కొరగాకుండా పోయింది!

దిక్కు తోచక ఇంటికి వొచ్చాడు. అమ్మ మూలుగుతూ పడుకొని వుంది. ఎన్నో ప్రశ్నలు వేశాడు. ఆమె అస్పష్టంగా కూడా జవాబు చెప్పలేక పోయింది. మాట్లాడాలని వ్యర్థప్రయత్నాలు చేసిందంతే! మొత్తంమీద ఇదేదో ప్రమాదకరమైన పరిస్థితులకు దారి తీసేట్లు వుంది. కనీసం డాక్టర్ రాసిన ఇంజక్షనన్నా తెస్తే ఉపయోగ పడుతుంది.

ఇల్లంతా కలయ జూచాడు; ఏదీ విలువైనది, కనీసం ముందు ఖరీదు తెచ్చేది కనిపించలేదు. చివరకు పుస్తకాలమీద దృష్టినిలిచింది. తానురక్తాన్ని ఢబ్బుగామార్చుకొని, ఆ డబ్బుతో కొనుక్కొన్న పుస్తకాలవి! వాటి విలువను, తిరిగి ధనరూపానికి మార్చుకోవాలి. బతికి బాగుంటే ముందెప్పుడన్నా మళ్ళీ కొనుక్కోవచ్చు.

ముందు వెనుకలు ఆలోచించకుండా ఆ పుస్తకాలన్నీ మూట కట్టాడు. కనీసం పాతిక రూపాయలన్నా రావొచ్చనే అంచనా వేసుకున్నాడు. పుస్తకాల్లోని విషయాల తాలూకు విలువతో ఇప్పుడు లెక్కలేదు; తూకంతోనే!

'అమ్మా! ఇప్పుడే వొస్తాను' అన్నాడు. ఆమె ఏమీ మాట్లాడ లేదు. ఏ భావమూ అర్థం కానట్లుగా, శూన్యదృక్కుల్ని ప్రసరించింది. ఆమె ఏ బాధల్ని అనుభవిస్తోందో ఆలోచిస్తూ కూర్చుంటే ఏమౌతుంది? డాక్టర్ని తీసుకొచ్చి, మృత్యువుతో పోరాడేందుకు, ఆయన సహాయాన్నే అర్థించాలి.

పుస్తకాలు బుజాన వేసుకొని మూర్ మార్కెట్‌కు బయలు దేరాడు. అసలే నిన్నటి నుంచీ భోజనం లేదేమో, నీరసంగా వుంది; దానికితోడు పుస్తకాల బరువొకటి! పుస్తకాల బరువు కష్టంగా వున్నా, యీ బరువుకు తగిన ప్రతిఫలం రాకలదనే ఆశ కొత్తశక్తి నిచ్చి నడిపించింది.

తను మామూలుగా పుస్తకాలు కొనుక్కునే అంగడికి వెళ్ళాడు. వాడు తిరగా బోర్లా వేసి అంచనాలు కట్టాడు. మొత్తంగా పది రూపాయిలకు అడిగాడు. తనకు తల తిరిగి పోయింది; ఇదంతా నిలువు దోపిడి వ్యవహారంగా, అన్యాయమంటే ఎంత నిశితంగా ప్రయోగించవొచ్చో తెలుసుకుంటూన్నట్లు అనిపించింది. ప్రపంచం ఇంత నీచమైనదా? అందునా తానున్న దీనావస్థలో, తనను మొత్తేందుకే వీళ్ళందరూ కుట్ర పన్నుతున్నారా? ఇదంతా పైకి వాగటం వల్ల ప్రయోజనం లేదు సరికదా, తిట్లుకూడా తిని గెంటించ బడతాడు.

కావని మరో అంగడికి వెళ్ళాడు. వాడు ఎనిమిదే ఇస్తానన్నాడు. వీళ్ళంతా ఏం మనుషులు! కొన్నప్పుడు కొరివిగానూ, అమ్మేప్పుడు అడివిగానూ ఉండటమంటే ఇదేనేమో! మరికొన్ని కొట్లు తిరిగాడు. ఎవ్వరూ ఎక్కువ అడగ లేదు. ఒకడు మాత్రం పన్నెండు కైతే తన దగ్గరకి రమ్మన్నాడు; అంతకన్నా ఎక్కువ వొస్తే అమ్ముకోవచ్చన్నాడు; తన దగ్గిర బేరాలు పనికి రావన్నాడు; తను చాలా ఋచ్చితం కనుక, ఆలోచించుకో మన్నాడు. ఇంకా వాడు వాగిన అనేక ధర్మపన్నాలు కంపరంగా ఉన్నవి.

ప్రాణ సమానంగా చూసుకొనే యీ సాహిత్యాన్ని ముష్టి పన్నెండుకు అమ్మెయ్యటమా, లేక ఇంటికి మోసుకొని పోవటమా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు. పుస్తకాలమ్మే వాడికి సాహిత్య సేవకునివలె అభిమానం ఏం వుంటుంది? పదిమందీ అడిగేదే విలువైనదని వాడి అభిప్రాయం.

—యీ ఆలోచనలకు అంతేమిటి? ప్రాణ సమానమైన సాహిత్యం కన్న ప్రాణమే ఐన అమ్మను బతికించుకోవాలి. కాలం విలువ వొత్తిడి చేస్తోంది. గుండె ధైర్యం చేసుకున్నాడు; చేయరాని పని చేసేప్పుడు, అవసరమైన తర్కాన్ని చెప్పుకొని మనసు సమాధాన పరుచుకొన్నాడు. పుస్తకాలు కట్టగా వాడికిచ్చి, పన్నెండు రూపాయిలూ తీసుకొని బైటికి ఉరికాడు.

సరాసరి డాక్టర్ దగ్గిరికి వెళ్దా మనుకున్నాడు; కాని ఇల్లు వొదిలి కనీసం రెండు గంటలన్నా అవుతుంది; అమ్మ నొకసారి చూసి వెళ్లటం మంచి దనిపించింది. జేబులో వున్న డబ్బు జీవితంలో పిరికి పడిపోతూన్న తనకు, కొంతబలాన్ని కూర్చింది.

హుటాహుటిగా గదిలోకి జొరబడ్డాడు; అమ్మ దగ్గిరికి వెళ్ళాడు. ఆమె నిద్ర పోతోంది. కాస్సేపు ఆలసట తీర్చుకుంటూ ఆమె దగ్గిర కూర్చున్నాడు...ఒక్కసారి ఆమెను పలకరించి మరీ వెళ్దా మనుకున్నాడు. నిద్ర నుంచి లేపటమా, మానటమా అని ఆలోచించాడు. ఆమె వైపు చూస్తే, శరీరం మీద అక్కడక్కడ రక్తం కనిపించి అదిరి పోయ్యాడు. పరిశీలించి చూస్తే చర్మంలో నుంచి బైటపడిన సన్నని రక్తపు కాల్వలు ఎండిపోయి ఉన్నవి. అటుపక్క చీమలు కూడా ఎక్కినవి. శరీరం ముట్టుకుంటే మంచుగడ్డంత చల్లగా వుంది. ఆమెను కదిపాడు; ఎంతో ఆత్రుతగా 'అమ్మా! అమ్మా!' అని పిలిచాడు. ఆమె శాశ్వత నిద్రకు లోనయిందని నిర్ధారణ చేసుకు నేప్పటికి, కనీసం నాలుగు నిమిషాలన్నా పట్టి వుంటుంది.

అసలేమీ అర్థం గాకుండా, గజిబిజిగా వుంది. ఏడ్పు కూడా రానంతగా దిమ్మెరపొయ్యాడు. తాను కలగన నంత ఘోరం, కీడు జరుగుత వనుకో లేదు. యీ షాక్ కు తోడు ఆహార మెరుగని శరీరానికి శోష వస్తూన్నంత పనవుతోంది.

ఆ మగత నుంచి విదిలించుకొని బైటపడ్డాడు. మళ్ళీ అంతా అర్థం చేసుకుంటున్నాడు. తనెంత దురదృష్టవంతుడు! చివరకు కన్నతల్లి కడసారి గడియల్లో కూడా ఆమె దగ్గిర ఉండలేక పొయ్యాడు. ఆమె తనకోసం గదంతా వెదికి వుండాలి. మాటపడి పోయింది కనుక, అంతరాంతరాల్లో ఘోషించి, తన దీనాలాపనలకు గాలి తను వుంటుం దేమోనని నిరాశతో అంతటా కలయజూచి ఉండాలి. తనను యీ లోకానికి వొదిలి పోడలేక, ఎంత బాధపడి ప్రాణం విడిచి వుంటుందో! లేక తనను కడసారి చూచేందుకని, ఆమె ఆత్మ ఇంకా యీ గదిలోనే తారట్లాడుతూండే వుందా! యీ తలపు రాగానే పిచ్చిగా, కంటికి కనపడని ఆ ఆత్మకోసం, ఆశతో గదంతా కలయ జూచాడు. అదే పిచ్చి నమ్మకంలో మాతృశవ పాదాలమీద తల ఆన్చి వెక్కి వెక్కి ఏడ్చాడు.

విధి ఇంతకన్న కఠినంగా తనపట్ల ప్రవర్తించ లేదు; ఇక ఆ విధి అంటే ఉండవలసిన భయం, తాను లెక్క చెయ్యవలసిన అవసరం మరి ఉండదు. ఈ ఫిరంగి దెబ్బకు తను ఎప్పుడైతే బతికి ఉండగలిగాడో, మిగతా తుపాకి దెబ్బలు ఒక లెక్కలోవి కానేరవు!

మాతృమూర్తి ముందు తనెంత అల్పుడు! తనకీ ప్రపంచంలో మరి బాధ్యత ఒకేవి లేకుండా, ఆమె యీ కష్ట భూయిష్ట ప్రపంచం నుండి విరమించింది. ఒక విధంగా అమ్మ అదృష్టవంతురాలే! ఒకపక్క యీ బీదరికంతో కుళ్లుతూ, ముఖ్యంగా తన ముద్దుల కుమారుని దీనస్థితికి కుంగిపోతూ, ముసలితనంతో ఆమెబతికి సుఖపడే దేమిటి? కేవలం తనే దురదృష్టవంతుడు; చివరకు అమ్మకు వైద్యం కూడా చేయించలేని అసమర్థుడు. తన స్వార్థం కోసమై, ఆమె ప్రాణాల్ని బలిపెట్టిన నీచుడు. తనను తాను భరించుకో గలగటం, ఆశ్చర్యంగానే వుంది.

సరిగ్గా ఇరవై సంవత్సరాల క్రితమే అమ్మ కడుపులోంచి తాను ప్రపంచంలోకి పడ్డాడు. కాని ప్రపంచం తనను ఇనప ముక్కుల్తో పొడవనివ్వకుండా, అమ్మ

కడుపులోనే దాచుకుంది. ఇప్పుడు అమ్మ యీ ప్రపంచాన్ని వీడటంతో, తనకీ కొత్త జన్మనొచ్చింది. ఆమె బతికి వున్నన్నాళ్ళూ ప్రపంచం ఎంత ఘోరమైనదో తనకు తెలియనివ్వ లేదు; అందుకని బతికేందుకు అవసరమైన శక్తి సామర్థ్యాలను తాను పొందలేక పొయ్యాడు. ఇప్పుడు ఆమె మరణంతో తాను ఒంటరిగాడై ప్రపంచంలో పోరాడి గెలుచుకోనే తీరాలి; లేదా ప్రపంచాన్నే వీడాలి...

యీ ఉదయం కూడా అమ్మ బతికి వుంది; ఇంతలోనే చనిపోయిందంటే నమ్మ శక్యం గాకుండా వుంది. కానీ కళ్ళ ఎదుట కనిపించేదాన్ని నమ్మకుండా ఉండట మెలా? మెదడు తెక తెక లాడుతూ అసలేమీ అర్థం కానంత గందర గోళంలో వేగిపోతున్నాడు. అసలే నీరసంగా ఉండటం వల్ల, కళ్ళముందు చిక్కని చీకట్లు జారుతూన్నవి. తానేదో అగాధాల్లోకి పడిపోతున్నట్లు, ఎదురాడి పైకి వొచ్చే శక్తిలేక, లొంగిపోవటమే మేలని నిర్ణయించుకున్నట్లూ తెలుస్తోంది... అలాగే మైకంలో పడి పొయ్యాడు.

## 33

తనకు మెలుకూ వొచ్చేటప్పటికి సాయంత్రపు నీరెండ కిటికీలోంచి గదిలోకి జొరబడుతోంది. సూర్యాస్తమయ సమయమై వుంటుంది. యీమధ్యలో జరిగినదంతా క్రమంగా గుర్తుకు రాసాగింది. ఎండిపోయిన గొంతుకలో కాసిని నీళ్ళు పోసుకున్నాడు.

—అమ్మ కదలక, మెదలక పడి వుంది. ఆమె శాశ్వతనిద్ర పోయింది; తాను తాత్కాలిక నిద్రనుంచి మేల్కొన్నాడు. మధ్యాహ్నం దుఃఖం అధికమై, ఆ వత్తిడికి బైట పడలేదు. ఇప్పుడీ ప్రపంచంలో తానేమి కోల్పోయాడో, తన స్థితి ఏమిటో బాగా అర్థమైంది. తాను పొందిన విశ్రాంతిలో దుఃఖమంతా ఒక పక్కకు జేరి, విపరీతమైన వొత్తిడితో బైటపడేందుకు సిద్ధంగా వుంది.

తనకు తెలియకుండానే పెద్దపెట్టున ఏడ్వసాగాడు.ఏడ్పు,లాభంలేదనీ,భరించక తప్పదనే జ్ఞానమే లేదు...ఆ ఏడ్పుకు ఇంటి యజమానుల సంసారమంతా అక్కడకు జేరింది.ఏమైందని అడిగారు కాని,తానుజవాబు చెప్పకపోయినా వారుగ్రహించారు.

ఇంటాయన ఎన్నో ఓదార్పు మాట లన్నాడు. కాని తనను ఓదార్చ గలిగిన ఒకే ఒక్క జీవి—అమ్మ, యీ ప్రపంచాన్ని వీడింది. ఇక మిగతా లోకాన్ని తాను ఎప్పుడూ లెక్క చేయవలసిన అవసరం లేదు. ఆ స్వల్ప విషయాన్ని కూడా సమాజం ఎన్నటికీ అర్థం చేసుకో లేదు.

అమ్మ బతికి ఉండగా, ఒక్కనాడన్నా, వొచ్చి చూసివెళ్ళిన పాపానపోని యీ పెద్దమనుషులు, ఆమె చనిపొయ్యాక చూపే సానుభూతి—మొసలి కన్నీరే నని తెలుసుకోలేని మూర్ఖుడు కాదు తాను!

చీకటిపడేదాకా ఏడ్చాడు; ఇక ఏడ్చే ఓపిక కూడా లేదు. అమ్మ కాకుండా తాను చనిపోయివుంటే—యీ పాటికి అమ్మకూడా చనిపోయి ఉండేది. మృత్యువును వరించిన అమ్మ, తనను బతికేందుకే ఆదేశించి, సాధించింది.

'కూర్చొని ఏడ్చి ఏం ప్రయోజనం?...మిగతా కర్మకాండ సంగతి చూడండి' అన్నాడు ఇంటాయన.

బతికుండగా భరించలేని అమ్మ, చచ్చి ప్రపంచానికి మరింత బరువైంది.

తానేమీ మాట్లాడ లేదు. హైరానై పోయి, యీ క్షణానో మరుక్షణానో నేలవాలే పరిస్థితిలో ఉన్నట్లు తోచింది.

'రాజారావుగారూ! యీ కష్టాలు అందరికీ వొస్తవి. శవాన్ని ఇంట్లో పెట్టుకొని కూర్చుంటామా?' అని హెచ్చరించాడా ఇంటాయన.

తానేమీ మాట్లాడ లేదు; గుడ్లప్పగించి చూస్తూ కూర్చున్నాడు.

'దహనానికి ఏర్పాట్లు చేయించండి'

యీ ప్రపంచం ఇన్నాళ్ళూ తనను బాధిస్తూంటే, ఇదంతా అమ్మ కోసమని భరించేవాడు; కాని ఇప్పుడు తాను ప్రపంచం మీదనే తిరగబడ గలడు! తాను అర్థించినదాన్ని విధి ఏనాడైతే ఇవ్వలేక పోయిందో, అలాటి విధిని తాను లెక్క చెయ్య వలసిన పనే లేదు. ఎవరెల్లా చేసుకున్నా తనకేమిటి?

తాను జవాబు చెప్పకుండటం చూసి 'ఏం చేస్తాం! పాపం ఒంటరివాళ్లు... సరే...పైక మేమన్నా వుంటే ఇవ్వండి. మేమే చూస్తాం—' అన్నాడా దయామయుడు: తన కొంపలో శవాన్ని ఉంచుకునేందుకు ఇష్టం లేక.

తనకు మండిపోయింది; కాని యీ మంటల తాలూకు వేడి తననే దహిస్తూంటుంది కనుక, దాన్నించి తప్పించుకోవటం కుదరదు.

జేబులో వున్న పన్నెండు రూపాయలూ, అమ్మను బతికించేందుకు ఉపయోగ పడకున్నా, ఆమె అంతిమ యాత్రకు ఉపయోగపడేట్లున్నయ్. విసిరి పారేశాడు.

'ఇంతేనా? సరిపోతుందా?' అన్నాడా ఇంటాయన.

'నా దగ్గిర ఇంకేమీ లేదు—'

ఇంటాయన మరి మాట్లాడ లేదు. తన గదిలో చుట్టూ మూగిన జనాన్ని చూస్తే, శక్తిలేదుకాని ఒక్కొక్కర్నే బాదితే బాగుండు...యీ ప్రపంచంలో కొంత మందే తనకు అన్యాయం చేసి ఉండొచ్చు. కాని అందర్నీ సాధించాల్సిందే! ప్రతి ఒక్కర్నీ ఏ కాస్త అవకాశం చిక్కినా బాధపెట్టి పిండవలసిందే! తనకు అభ్యమవని సానుభూతి, దయ—ఇతరుల పట్ల తాను ప్రదర్శించా లనుకోవటంలో అర్థం లేదు. కాని ఇదంతా సాధ్యమయేది—కలలో మాత్రమేనేమో?

యీ కలిగిన ఉద్రేకాలకు తిరిగి తట్టుకోలేని స్థితి వొస్తోంది. మళ్ళీ మగత, అగాధంలోకి పడి పోతూన్నట్లనిపించింది. బహుశా మూర్ఛపోయి ఉండొచ్చు.

తిరిగి తెలివి వొచ్చేటప్పటికి, ఇంటామె పక్కను కూర్చొని వుంది. ఆమె కూతురు కూడా కాపలాగా వుంది. పాత సంగతులన్నీ గుర్తుకొచ్చి, అమ్మకోసం

గదంతా కలయ జూచాడు. ఆమె లేదు...యీ గదే కాకుండా, దానితోపాటు ప్రపంచం కూడా ఒక పెద్ద శూన్యాకారాన్ని కళ్ళ ముందు కట్టింది.

'అమ్మ ఏదీ?' అన్నాడు పిచ్చిగా, దీనంగా.

'చెప్తాను. ముందు...యీ మజ్జిగన్నం కాస్త తినండి' అందా ఇల్లాలు.

వికారంగా వుంది. ఆకలి అవుతూన్నది కాని, తిన బుద్ధి కావటంలేదు. వినా స్వాభావసిద్ధమైన అవసరాలకేవి ఇష్టాయిష్టాలతో పని లేకుండానే తీరుతూంటవనేది రుజూవైంది.

ఆ తర్వాత ఆ ఇల్లాలు 'కాస్సేపు నిద్రపో నాయనా! ఏదో ఒక నాడు మనమూ దాటవలసిన వాళ్ళమే!' అంది.

ఏమైందో తాను గ్రహించాడు: ఆమె వెళ్ళిపోయింది. ఇల్లా, స్మశానమా అనిపిస్తోంది. తనను కంటిని రెప్పలా కాపాడిన అమ్మను, చివరకు రుద్రభూమి వరకన్నా సాగనంపని క్రూరుడు తాను! అయ్యో! ఇంతకన్న దుర్దినాలకేవి జీవితంలో తనకు మరి రాగలవా? వొచ్చినా తను ఎదుర్కోగలడు!

తన జ్ఞాపకార్థం అమ్మ యేమీ విడవలేదు. సంవత్సరాల తరబడి ఆమె కృషితో పెరిగిన యీ శరీరమే, ఆమె వాత్సల్యాన్ని, అనురాగాన్ని క్షణ క్షణమూ జ్ఞాపకం చేస్తూ వుంటుంది.

తను కూడా చనిపోతే!...యీ తలపు రాగానే భయం వేసింది. అమ్మ భూతమై తనను వెంటాడుతుందేమోననే చిత్రమైన భీతి కంపరాన్ని కలిగించింది. గది మూలల్లో నుంచి ఆమె ప్రేత రూపాన తనను పిలుస్తుందేమో?.. ఛీ ఛీ! ఏమిటీ పాడు ఆలోచనలు! నిజంగానే అమ్మ దెయ్యమైతే, తన సేవచేసుకునేందుకే అలాటి వికృతావతారాన్ని దాలుస్తుంది.

—కాని తను బతికి సాధించేదేమిటి? పునర్జన్మ మీద నమ్మకం లేని తను కూడా ఆమెను కలుసుకుంటే! ఐతే వేరొక లోకాల మీద కూడా తనకా నమ్మకం లేదు.

మృత్యువు ఎంత విచిత్రమైనది! హృదయపు లోతుల్ని గాలించి, చూపగల సామర్థ్యం ఒక్క మృత్యువుకే ఉంటుందేమో! ఇంత లోతున్న హృదయాన్ని తానెలా భరించగలుగుతున్నాడు!

అమ్మ మరి లేదు. ఆ మధురానుభూతుల్ని తానెలా మరవగలడు? తన బతుక్కు అర్థమేమిటి? ఇన్నాళ్లూ ఆమె కోసమై బతుకుతున్నాననుకుని సరిపెట్టుకొనే వాడు. ఇప్పుడు తన కోసమే తను బతకాలి... ఎంతభారం! తన కష్టసుఖాలను పంచుకొనే వారు వేరొక్కరుంటే బాగుండు! తనుచస్తే ప్రపంచానికి ఏం లోటు? ఉన్నందువల్ల మేలు మాత్రం ఏముంది?

ఈ రకంగా ఆలోచిస్తూంటే తన అల్పత్వాన్ని భరించటమూ కష్టమే! అమ్మ అత్యుత్తమురాలు. ఆమె తన శక్తి వంచన లేకుండా మాతృత్వపు ఆశయాలన్నిటిని నెరవేర్చింది; తానే ఎందుకూ కొరగాకుండా మిగిలాడు.

ఆత్మహత్య చేసుకుందామనే తీవ్రవాంఛ కలిగిస్తోంది. కాని మరోపక్క—భయం! మిణుకు మిణుకుమనే ఆశ, మెరుపులా దూరాన మెరుస్తోంది. ఏదో సుఖం-ఏమిటా సుఖం! తను సుఖిస్తే ఎంత, సుఖించకుంటేఎంత! సుఖానికి అర్థం, తల్లి బతికివుంటే వేరొక రకంగా ఉండేది! సుఖమైనా తాను సంపాయిస్తే కద! ఎలా సంపాయించటం?

అనేక ఊహలు ఒక్కుమ్మడిగా వొచ్చి పడినయ్. దొంగతనం మొదలూ, హత్యలు చేయటం వరకూ తనెందుకు పాల్పడ రాదు? ఎలాగైతే నేం ఆ ధనాన్ని చేజిక్కించుకొని, యీ ప్రపంచాన్నే మాడ్చి పారేస్తేనే కాని తనకు మనశ్శాంతి ఉండదు!

ఏమిటీ పిచ్చి? తనెవరి మీద ఎగిరి పడతాడు? ఒక విధంగా చూస్తే తాను ఊపిరిపోసే యీసమాజమే, తనను బతక నిచ్చింది; ఇన్నాళ్ళూ తను పెరిగేందుకు అవకాశాల్నిచ్చింది. తన దురదృష్టం కల్ల కలిసి రాకుంటే అదెవరి తప్పు?

ఈ మానవుల్లోనే ఎంత ఉత్తము లున్నారు! ముఖ్యంగా లలిత—ఆమె గుర్తుకు రాగానే, అమ్మ మరణశయ్య దగ్గిర కనీసం ఆమెనా్న వుంటే ఎంత బాగుండే దనిపించిది! ఆమ నుంచి తాను ఎంతో సహాయాన్ని పొందాడు. యీ జన్మలో తానామె ఋణాన్ని తీర్చ లేడు!

ఐనా, అమ్మ లేని తర్వాత ఇక యీ లలితల్లాటి వాళ్ళను గూర్చి తను ఆలోచించట మేమిటి? ఆత్మహత్య కూడా అర్థం లేనిదే! ఆ పని చేస్తే ఎప్పుడో చేసి ఉండాలి; ఇంత దిగజారాక, ఇంకా కిందికి పోతామనే భయమేమున్నది కనుక?

—కాదు; యీ కష్ట పరంపరలతా ఒక్కసారిగా వొదిలించు కునేందుకు ఆత్మహత్యే శరణ్యం. ఆత్మహత్య చేసుకునే వాళ్ళు పిరికి పందలని తనొకప్పుడు అను కునే వాడు కాని, అది నిజం కాదు. ఎంత ధైర్యం వుంటే అది సాధ్యం! తన కిప్పుడా ధైర్యం లేకనే వెనుక ముందు లాలోచిస్తున్నాడు!

నిజంగానే ఇది తన పాలిట కాళరాత్రి! తనను బతకా నివ్వదు; చావా నివ్వగు. అసలు యీ రాత్రికి పగలున్నదా? అనేక సమస్యలు తనను బాధించినవి కాని, ఇంతగా కుత కుత లాడ లేదు.

జీవితమే మిథ్య. నిస్సారం. ఏమిటో అంతా మనం ఊహించుకుంటామే కాని, లోతులకు పోయి చూస్తే ఏముంది? యీ రకం వేదాంతం కూడా మనశ్శాంతి నివ్వటం లేదు.

అలసట ఒక్కటే తనను కాపాడింది; ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియదు.



ఎవరో తట్టి లేపు తూండగా మెళుకూ వొచ్చింది. అప్పటికే ఉదయపు ఎండ కిటికీ లోంచి దూకుతోంది. తనను నిద్ర నుంచి మేల్కొల్పె దెవరో చప్పున గుర్తు పట్ట లేక పొయ్యాడు. నిన్నటి రోజున యీ ప్రపంచంలోని అన్ని వస్తువులూ, అన్ని విష యాలూ కలగాపులగమై పోయి, ఒకే ముద్దగా తయారైనవి. వాటిని విడదీసుకు నేం దుకూ, తిరిగి తాను మామూలు వ్యక్తయేందుకూ చాలా కాలం పట్ట వొచ్చు.

'నేను బాబూ!...గోపయ్యను!' అన్నాడా ముసలివాడు.

ఔను—గోపయ్య! గోపయ్యతో పాటు, పద్మనాభం గారింటికి వెళ్ళి తాను ట్యూషన్ చెప్పిన రోజులు, నిర్విచారంగా గడిపిన దినాలు, ముఖ్యంగా లలిత స్నేహం—మొదలైనవన్నీ గుర్తొచ్చినయ్. ఆ రోజులు మళ్ళీ రావు; రాక పోతే మానె—కాని ఆ దివ్యానుభూతులన్నా మరిచి పోగలుగుతే ఎంత బాగుండు! జీవితంలో యీ ఎగుడు దిగుళ్లను సరిమానుకుంటేనే కాని, అర్థం చేసుకోలేమేమో!

మళ్ళీ నిన్ననే—ఎప్పుడో నా-గత సాయంత్రమే అమ్మ పరలోకానికి వెళ్ళి పోయిందనే తలపు రాగానే, కడుపులో కలిచివేసి నట్లయింది. యీ వికారం, జీవితమంటే రోత తనను నిలవ నివ్వటంలేదు. తానీ దీనావస్థలో ఉన్న విషయం లలితకు తెలుసో, తెలియదో? ఏమైతే నేమి, యీ అనుభూతుల్ని పొందటమే వ్యక్తిత్వాన్ని రూపొందిస్తూంటుంది కాబోలు!

'ఏం గోపయ్యా!' అన్నాడు, యీ ప్రపంచంలోకి పడి.

'ఏం లేదు...బాబుగారు అర్జంటుగా పిలుచుకు రమ్మన్నారు—'

బహుశా మళ్లీ ట్యూషన్ సంగతి మాట్లాడేందుకే ఐవుంటుందనుకున్నాడు. కాని తానీ స్థితిలో ప్రపంచంలో ఏం చేయాలో నిర్ణయించుకో లేదు సరికదా, అసలు ఉండటమా? ఊడటమో కూడా తేల్చుకోలేదు. అందుకని బ్రహ్మదేవుడు కబురు చేసినా తాను పట్టించుకో నవసరం లేదు.

యీ సంగతులన్నీ గోపయ్యకు చెప్పటం అనవసరం. అందుకని 'గోపయ్యా! నిన్న అమ్మ చనిపోయింది!' అన్నాడు, ఆపుర్న వొచ్చే ఏడ్పును బలవంతాన తొక్కిపడుతూ.

'ఎప్పుడు బాబూ!' అన్నాడు వాడు.

'నిన్న మధ్యాహ్నం!'

'పాపం' అని గోపయ్య మౌనంగా కూర్చున్నాడు.

కాస్సేపాగి 'బాబుగారు మిమ్మల్ని తీసుకురమ్మన్నారు బాబూ!' అన్నాడు వాడు.

తనకు విసుగెత్తినమాట నిజమే కాని, తానీ ప్రపంచం నుంచి విరమించ దలచనంత కాలం, ప్రాపంచిక విషయాలకు అతీతుడు కాలేడు. అప్పుడే బాబుగారి గొప్పతనం, తన తక్కువతనం గుర్తొస్తున్నాయ్. ఆయన మాటల విలువను, తన బోటి నిర్భాగ్యులు పాటించి నిర్ణయిస్తున్నారు.

'గోపయ్యా! ఇప్పుడు రాలేను...'

'కాదు బాబూ! వెంట పెట్టుకొని రమ్మన్నారు!'

గోపయ్యకు తన స్థితి అర్థం కావొచ్చు కానీ, పద్మనాభం గారికి—బహుశా తెలుసుకుంటే ఏమైనా అర్థ మౌతుందేమో?

'బయలు దేరండి బాబూ!' అన్నాడు గోపయ్య లేచి నిలబడుతూ.

ఇక తనకు తప్పదు; బలశాలురు, బలహీనుల ముక్కులకు తాళ్లు వేసి నడిపించటమే లోకంలో జరుగుతుంది. యీ బలహీనులు బతక దల్చుకుంటే, శాశ్వత దాస్యమే కాని వేరు దారి లేదు...

ఇంత అర్థాంతరంగా పద్మనాభం గారు తన నెందుకు పిలిపించి ఉంటారో అర్థం కాలేదు; అమ్మపోయిన దుఃఖంలో తాను తీవ్రంగా ఆలోచించలేదు కూడాను. మంత్ర ముగ్ధునివలె, గోపయ్యను అనుసరించాడు. దారిలో ఎవ్వరూ మాట్లాడ లేదు.

పద్మనాభం గారు కాళ్లు కాలిన పిల్లివలె తోటలో పచార్లు చేస్తున్నారు; ఆయన వాలకం చూస్తే ఏదో తీవ్రమైన సమస్యతో ఊపిరాడిగట్లుంది. అల్లంత దూరంలో చెట్ల నీడలో పడక కుర్చీ వేసుకొని రమణమ్మగారు మామూలుగానే కలలు కంటున్నారు. ఆమెను నిద్ర నుంచి లేపటం తనతరం కాదని అనుభవపూర్వకంగా తెలుసు కనుక చూసి వూరుకున్నాడు.

తా నాయనకు నమస్కరించాడు. ఆయన కోపంతో రైలు ఇంజన్లా ఊపిరి వొదిలి, బుస కొట్టాడు.

'రాత్రి...అమ్మపోయింది!' అన్నాడు తనే ముందుగా. తనకు సానుభూతి ఎక్కడ దొరుకుతుందా అని గాలిస్తున్నాడు.

ఆయన వాలకంలో కోపం కొంత తగ్గింది. తనకు తాను సంబాళించుకుంటూ 'సరే...' అని కాస్త ఆగి 'లలిత ఎక్కడుంది!' అన్నాడు.

లలిత! ఎక్కడుండట మేమిటి? ఏమిటో అయోమయంగా వుంది తనకు; అసలు ప్రశ్నే అర్థంగాక, గుడ్లు తేలేసి పద్మనాభం గారి వొంక చూశాడు.

'ఎక్కడున్నది? చెప్పు—' అన్నాడాయన కఠోరంగా.

'నాకేం తెలుసు? లలిత నాకు కనిపించే చాలా రోజులైంది...'

'అబద్ధం!' అన్నారు పద్మనాభం గారు 'నాకంతా తెలుసు. వెధవ వేషాలు వేయవొద్దు...అది నీతోనే లేచిపోయి ఉండాలి. దాన్నెక్కడ దాచావో చెప్పు---' అన్నారు, ఉద్రేక పూర్వకంగా.

లలిత! లలిత లేచి పోయిందా? ప్రపంచంలో జరగ కూడనివి జరుగుతూంట వనేందుకు, తల్లి చనిపోవటం ఒక ఉదాహరణైతే, ఇది రెండోది! లలిత అలాటి పని చేసి ఉంటుందంటే తాను, కలలో కూడా నమ్మలేడు. ఐతే వీళ్ళందరూ పొరబడటమే జరిగి ఉండొచ్చు. పోతే ఆమె ఒక వేళ నిజంగానే అంత నీచానికి వొడిగట్టి

నట్లయితే, ఆ అదృష్టం తనలాటి వాడికి పట్టదు. ఎందుకంటే తన బతుకూ, యోగ్యతకూ లలిత తనను ప్రేమిస్తుందంటే, ఎండమావులో నీళ్ళు దొరికినట్టే!

'మాట్లాడవేమయ్యా! ఎక్కడ దాగావ్!' అన్నారు పద్మనాభం గారు కోప తీవ్రతను సూచిస్తూ.

ఇంత విషాదంలోనూ తనకు నవ్వొచ్చింది.

'నేనా?' అన్నాడు వికటంగా నవ్వి 'నా బతుక్కి ఆమెను దాయ గలగటమా?'

'అదీ ఆలోచించాను...ఆమె పొట్టి చేతుల్లో వెళ్ళలేదు. పది పన్నెండు వేల విలువగల ఆభరణాల్తో నే వెళ్ళింది. నీ దరిద్రమంతా తీరేందుకు అవి చాలు!'

ఇంతకన్న అభాండం ఏముంటుంది? తన బోటివాడు బతకటమే సమాజానికి భారమైతే, వధించటం వల్ల అటు తనకూ, ఇటు సమాజానికీ కూడా మేలు కల గొచ్చు. అంతే కాని యీ చిత్రవధ దేనికి?

'పద్మనాభం గారూ! నా కంత తెలివి తేటలూ, యోగ్యతా లేవు. లలిత విషయం నాకేమీ తెలియదు!' అన్నాడు. వాదించి లాభం లేదు. తన వాదనలోని సత్యం కన్న, ధనవంతుల ఆలోచనలోని అసత్యమే బలవత్తర మైనది.

పద్మనాభం గారు చప్పున చల్లబడి పోయ్యారు. మెత్తగా మాట్లాడ సాగారు.

'నీకు డబ్బు కావాలంటే తీసుకో...కాని ఆమె ఎక్కడున్నదో చెప్పు' అన్నా డాయన.

డబ్బుతో తను తల్లిని బతికించుకోగలననుకున్నాడు; తీరా ఆమె పొయ్యాక, ఆ డబ్బు స్వరూపం ఎలాటిదో ఎంత నీచానికి మానవత్వాన్ని దింపగలుగుతుందో తను తెలుసుకో గలుగుతున్నాడు. అంతే కాదు; ధన సంపాదన ఎంత కష్టసాధ్య మని తాను భ్రమించాడో, ఇప్పుడు అంత సులభసాధ్యంగా తోస్తోంది...కాని తాను, మానవుడు: కేవలం మానవుడుగా బతక గలుగుతే చాలు. యీ సమాజం ఆ అవకాశాన్నయినా తనకు ఇవ్వలేదా?

'నాకేం తెలియదు...నన్ను బాధ పెట్టకండి' అన్నాడు తను రోతవేసి.

'చూడు మిస్టర్' అన్నా డాయన 'ఆమె పరువు ప్రతిష్టలున్న వంశంలోది; పెళ్ళి కావలసింది. తెలిసో, తెలియకో కాలు జారినా, ఆమెను పతితను చేసేం దుకు నీకు చేతు లెలావొచ్చినయ్...ఐనా ఇప్పుడంతా మించి పోలేదు. నీకు నాలుగు వేలిస్తాను. ఇంతవరకూ పోలీస్ రిపోర్టు కూడా ఇవ్వలేదు. ఇవ్వను కూడాను. ఐన దానికి నిన్నేమీ అనను...ఆమె ఎక్కడున్నదో చెప్పు. మా అవస్థ మేం పడి తీసు కొచ్చుకుంటాము' ప్రార్థనా పూర్వకంగా.

పరువు ప్రతిష్ఠలనేవి, డబ్బుకు అమ్ముడయ్యేవీ, డబ్బుతో కొనగలిగేవీ కూడా నన్నమాట! తన దగ్గిరా డబ్బులేదు కనుక, తనకా పరువు ప్రతిష్ఠలు లేవు; లేని దాన్ని నిలబెట్టుకోవలసిన అవసరం అసలె లేదు. ఆ పెద్ద మనిషి తరిచేదంతా నిజమై నప్పటికీ, యీ గొప్పింటి రహస్యాలు ఎంత నీచస్థితిలో ఉంటవో అర్థ మౌతోంది.

'అయ్యా! నాకేమీ తెలియదు. నా సమస్యల్తోనే నేను ఛస్తున్నాను. నిన్ననే అమ్మ పోయింది; ఆ విచారంలో వున్న నన్ను మీరిలా వెంటాడటం—[illegible] ఆయనకు కోపం వచ్చింది. మధ్యలోనే అందుకొని 'మెత్తగా అడుగుతే అవుతుందా? సరే పో...పోలీసులే నీ పని పడతారు...కాకపోతే గోలవుతుందని ఊరుకున్నాను. కానీ ఏం చేస్తాం...బీదరికం ఎంతెంత ఘోరాల్ని చేయిస్తుంది!' అన్నాడాయన.

తన హృదయం లోని అగ్నిగుండం ప్రజ్వరిల్లుతోంది. మరి ఆయన అన్న మాటలు 'బీదరికం'లోని నీచత్వం సంగతి! మరి ధనికుల్లో వున్న నీచత్వ మేమిటి? ఇంతకు ముందే, తాను లలితను లేవదీసు కెళ్ళాడని భ్రమించి, తనలాటి అల్పుని కాళ్ళు పట్టుకునేందుకూ, తనకు లంచ మిచ్చేందుకూడా ఆయన సిద్ధపడ్డాడు కదా! మరి ధనికుల గొప్పతనం ఎక్కడ? యీ ఎక్కువ తక్కువలు మానవత్వాన్ని బట్టి గాక, ధనాన్ని బట్టి ఉంటవనేది ఎంత హాస్యాస్పద మైనదో తనకు తెలుసు. ఒకవేళ బీదరికం ఘోరాల్ని చేయించగలిగే దయితే, ధనికులు తమ చేతుల్ని మలినం చేసుకునే అవసరం లేకుండా బతికిపోగలుగుతున్నారు. యీ బురదంతా తలా కాస్తా పంచుకొని, వొంటికి పట్టించుకునేందుకు బీదలు సర్వదా సిద్ధంగానే వున్నారు. ఇంత మేలు చేస్తున్న బీదల్ని, ధనికులు ఎందుకు ద్వేషిస్తారు?

తానేమో చెప్పనూలేడు; చెప్పినా ఆయన నమ్మేట్లూ లేడు. అదీగాక, ఏ నేరమూ చేయని తనను బెదిరించే వరకూ దిగాడు. న్యాయమనేది ఎక్కడన్నా వుందేమో? తనకు మాత్రం కనుచూపు మేరలో లేదు. ఐనా తను మథనపడట మెందుకు?

'నేను వొస్తానండీ!' అన్నాడు నమస్కరిస్తూ.

రమణమ్మగారు చప్పున మేలుకుంది. ఒక్కసారి కళ్లు బాగా తెరిచి అసహ్యం ఉట్టి పడేట్లుగా తనను చూసి, యీ పాడు ప్రపంచంతో తనకేమిటని అలిగినట్లు, వెంటనే తన స్వప్నసీమల్లో కరిగిపొయ్యేందుకు కళ్ళు మూసింది. నిజంగా యీమె ఎంత అదృష్టవంతురాలు! ప్రాపంచిక విషయాలకూ యీమెకూ వున్న సంబంధం, తామరాకుకూ నీటికీ వున్న స్నేహాన్ని గుర్తుకు తెస్తోంది.

'సరే వెళ్ళు-' అన్నాడాయన చీదరించుకుంటూ 'పోలీసులు విరగ్గొడితేనే కాని నీ నోటినుంచి నిజం రాదు!'

అదెంత అల్పవిషయమో అర్థమైంది. నిజమనేది బలాత్కారం వల్ల వొస్తుందేమో? ఏమో, తనూ కథలు విన్నాడు; ఏమైనా తాను చేయగలిగిందేమిటి?

దారి పొడుగునా ఆలోచిస్తూనే వున్నాడు. లలిత ఇంత ఘోరాని కెలా వొడిగట్టింది? యీనాడు ప్రపంచం తనను అనుమానించటం మరీ అర్థం లేనిదేమీ కాదు. ఆమె స్నేహం తనతో కాక, ఆమె తాహతుకు సరిపోయిన వారితో ఐతే ఇంత రభస జరిగేదీ కాదు; యీ అపవాదులు తన మీదింత తేలిగ్గా ప్రయోగించబడేవీ కావు.

లలిత ఒక నైచ్యానికి పాల్పడిందంటే, ఆమె వెనుక మహత్తర దుష్టశక్తు లుండి ఉండాలి. ఆ శక్తు లేమిటో, వాటి విశ్వరూపం ఎలాటిదో తనకు తెలుసు. కాని లలితకు తెలియలేదు; తెలిసినా తనను తాను వంచించుకొనివుంటుంది. ఆమెమీద ఎవ్వరూ సానుభూతి చూపరు. ముందున్న మాధుర్యాన్ని చూసి ఆమె భ్రమించింది కాని, దానివెనుక వున్న హాలాహలాన్ని చూడలేని మైకంలో పడి పోయింది. 'లలితా! ఎంత అగాధంలో పడ్డావు! నిన్ను రక్షించేందుకన్నా నాకు శక్తిలేక పోయింది కదా!' అనుకున్నాడు. నిన్నా, ఇవాళ జరిగిన రెండు దుస్సంఘటనల విషాదంతో కడుపు నిండి పోయింది.

## 34

కొన్ని స్వప్నాలు నిజమైతే ఎంత బాగుండునోనని మానవుడు భ్రమిస్తుంటాడు; అలాగే కొన్ని నిజాలు, కేవలం కలలై, స్వాప్నికానుభవం వలె అలలల్లే కరిగి పోతే ఎంత బాగుండోననీ అనుకుంటాడు; ఇప్పుడు తానీ రెండో దిశలో కొట్టు మిట్టాడుతున్నాడు.

ప్రపంచంలో తమ కొంత ప్రశాంతంగా వుండే స్థలం మేనన్నా వుందంటే తన గదే! కాని, ఇప్పుడీ గది నరక సమానంగావుంది. తన మనసులోలేని శాంతి బైటి ప్రపంచంలో ఎక్కడో వున్నదని వెతకటం ఎంత నిష్ప్రయోజనం!

ఒకే దుస్సంఘటన జరుగుతే, ఒకపక్కకు వొరిగి పోవటం జరిగేదేమో? కాని రెండు దుస్సంఘటనలు, కావిడి కుండవలె తనను అటు ఇటు కూడా కుంగదీస్తున్నవి. తానింకా కవుని రథంవలె భూమిలోకి కుంగిపోలే దెందుకనో!

లలిత!—ప్రపంచంలో లలిత ఒక్కతే అమ్మ తర్వాత తనను అర్థంచేసుకున్న దని భ్రమించాడు. ఆమె సంస్కారాన్ని తాను అపార్థం చేసుకున్నాడు. ఇలాటినై చ్యాన్ని తాను ఆమోదించగలడా? చివరకు తన స్నేహం కోరిన సమయాల్లో కూడా తాను లలితను హెచ్చరించి, దూరానికి నెట్టాలని ఎంత ప్రయత్నించలేదు కనుక? తన మనసేమిటో ఆమె అర్థంచేసుకున్నట్లే కనిపించింది. కాని, తీరా ఇప్పుడు బంధు మిత్రులందర్నీ విడనాడి, ఎక్కడో దాక్కొనేందుకు పారిపోయిందంటే, తాను ఏ విధంగా కారకు డవుతాడు? బైటి లోకం తనను నమ్మకపోతే నమ్మలేక పోవొచ్చు. కాని, కనీసం తన అంతరాత్మకన్నా తాను నచ్చచెప్పుకొనే స్థితిలో లేడాయె. నిజానికి తానామె పరువు ప్రతిష్ఠన్ని సమాజంలోని ఆమె స్థాయిని కావా లని విశ్వప్రయత్నం చేశాడు. కాని అందర్నీ, చివరకు తనను కూడా కించ పరిచే విధంగా ఆమె ప్రయత్నించింది!

ఆడ దాన్ని నమ్మ కూడదనే కథలు విన్నప్పుడు తన మనసు నొచ్చుకునేది. కొంతమంది పని గట్టుకొని ఆడ జాతిని తక్కువ చూపు చూసేందుకు గాను, ప్రచా

రానికి అలాటి కథల్ని సృష్టించారనుకుంటూ ఉండేవాడు. కాని...అలాటి కథలన్నీ సత్యమనేది ఒక్కొక్క సమయంలో నూటికి నూరు పాళ్లుగా వున్నదని నమ్మ వలసిన పరిస్థితి ఏర్పడింది—

కాదేమో? రెండో వైపు కూడా ఆలోచిస్తే, 'తనకు లలిత మీద వుండే అను రాగ కారణంగా కొంత పక్షపాతంతో చూసి ఉండొచ్చు— ఆమె కారణాలు ఆమెకు ఉండొచ్చు. అవి ఏమిటో పైవాళ్లకు, తనకూ కూడా తెలియదు; ఆమె చెప్పినా అర్థంకావు; ఆమె చెప్పలేదేమో కూడాను. ఐతే ప్రతి నీచ కార్యానికీ, కర్తకు తగిన కారణాలే ఉంటవి. అంతమాత్రాన అది నీచకార్యం కాకుండా పోతుందనటం కన్న హాస్యాస్పదమైన విషయం ఏమిటి?

లలిత తెలివి గలదే—కాని, సమయానికి ఆ తెలివి తేట లామెకు ఉపయోగ పడి ఉండవు. ఎన్ని విద్యలు నేర్చినా సమయానికి అవి ఉపకరించకుంటే ఏంప్రయోజనం? తాను సమాజంనుంచి బైటపడి, స్వేచ్ఛా జీవనం కొరకు ప్రయత్నిద్దామనే స్వాతంత్ర్యేచ్ఛ ఆమెను తరిమి ఉండొచ్చు. కాని బతికినంత కాలమూ యీ ప్రపంచానికి తనతోనూ, తనకీ ప్రపంచంతోను సంబంధమనేది విడివడదనే నగ్నసత్యం ఆమెకు తట్టి ఉండదు. చూస్తూ చూస్తూ అగాధంలో పడి పోయింది. తాను మరో అగాధంలో ఉన్నాడు. తామిద్దరూ ఒకే స్థితిలో వున్నా, ఒకరికొకరు దూరమయే పోయ్యారు!

ఐనా లలితను గూర్చి తానెందుకు బాధ పడాలి? తనమీద యీఘోరాపవాదు వేసేందుకు వీలయేట్లుగా ప్రవర్తించింది. లలిత తన కసలు జీవితంలో ఎదురు పడినట్ల యితే, ఆ జీవిత విధానమే వేరుగా ఉండేది. కొన్నాళ్ల క్రితం తనకు టైఫాయిడ్ జ్వరం వొచ్చినప్పుడే, తా నీ ప్రపంచాన్ని శాశ్వతంగా వొదలటం వల్ల బతికి పొయ్యేవాడు! అలా జరక్కుండా తనకూ, అమ్మకూ ఎంతో మేలుచేసే దేవకన్యల్లే వొచ్చి, తనపాలిట దెయ్యమై విరమించింది. బహుశా తనను ఇరుకున పడేద్దామనే దురుద్దేశ్యం ఆమెకు లేకపోవొచ్చును. కేవలం స్వార్థంతోనే ఆమె యీ దుస్సాహసము చేసి ఉండొచ్చు. కాని ఎవరి స్వార్థాన్ని వాళ్ళు చూసుకొని, ఎవరి సుఖం కోసమై వాళ్లు యత్నించివుంటే, మానవుల మధ్య యీ స్నేహాలూ, త్యాగాలూ, సానుభూతులూ ఉండేవా? తన స్వార్థాన్ని చూసుకొని, పద్మనాభం గారు అనుమానించినట్లు, లలితను చెడుమార్గాన నడిపినట్లయితే, యీ అభాండం తాలూకు బాధన్నా తప్పేది. కాని తానలా చేయలేదే! మరి లలిత, తన సంబంధీకుల కష్ట సుఖాలను ఆలోచించకుండా, ఇంత తొందరపాటుతో ఎందుకు సుడిగుండంలో పడింది?

లలితఎక్కడున్నదో తెలుస్తే, వెళ్ళి, ఆమె పాదాలపై పడయినాసరే, ఆమెను తిరిగి ఇంటికి తీసుకొని రాగలడు. కాని యీ విశాల ప్రపంచంలో ఎక్కడని! అర్థ

బలం, అంగబలం వున్న ఆమె కుటుంబీకులకే ఆమె అంతు చిక్కలేదు. ఇక తనలాటి ఏకాకికా ఆమె కనిపించేది? యాదృచ్ఛికంగా తనకు ఎదురైతే, జీవితంలో ఒక్క సత్కార్యాన్ని చేయగలిగాననే ఆత్మతృప్తి పొందేందుకైనా సరే, ఆమెను బతిమాలి, భంగపడి, వాళ్ల వాళ్ళకు అప్ప చెప్పతాడు.

తనకెందుకీ లోకసేవ? ఎవరో చేతులు కాల్చుకునే వాళ్ళకు అడ్డం పడటం వల్ల తన చేతులే కాలుతవి. తానామెతో మాట్లాడటాన్ని సమాజం సహించదు. దాని వెనుకవున్న సదుద్దేశ్యం సంగతి ఎవరికీ అక్కర్లేదు; చీకటిని చూడ గలిగినంత స్పష్టంగా వెలుగును చూడలేక పోవటం సమాజం తాలూకు లోపమే, కాని, తానాలోపాన్ని సరిచేయ లేదు.

ఇప్పటి వరకూ అమ్మ బతికివుంది. యీ సంగతి విన్నట్లయితే, గుండె పగిలి మరణించేది. ఒక విధంగా ఆమె అదృష్ట వంతురాలు. తనబాధ్యతల్ని సక్రమంగా నెరవేర్చి కన్నుమూసింది. ఇక తనెలా బతికినా, ఎన్ని అగచాట్లు పడినా, ఎన్ని అపనిందల్ని భరించినా, తనకోసం కన్నీరు కార్చే ప్రాణిలేదు కనుక, ఆమె బాధపడుతోందే అనే బాధ తప్పుతుంది: తన బాకును తనకే అప్పగించిం దామె!

తనెక్కడ వున్నాడో తనే పూర్తిగా ఇంకా, తెలుసుకోకముందే ఎదుట రెండువిగ్రహాలు ప్రత్యక్షమైనవి. కళ్లెదుట కమ్మి ఉండటంవల్ల అమ్మనూ, లలితనూ మనసు ఒక్కక్షణం భ్రమించింది కాని, కళ్లుపూర్తిగా తెరిచిచూస్తే, ఒకరు ఇంటి యజమానీ, రెండోవారు ధర్మాన్ని నాలుగు పాదాల మీదా నిలబెట్టేందుకు పూనుకున్న రక్షక భటుడూను!

'ఈయనే...' అన్నాడు ఇంటి యజమాని.

'లేవవయ్యా! ఇనస్పెక్టర్ గారు పిలుచుకు రమ్మంటున్నారు'-అన్నాడుపోలీసు కటువుగా. తానేదో గొప్ప నేరం చేసినట్లే పోలీసులు అనుమానించటం కాదు-నమ్మటమే-అందుకు తగినట్లుగానే వారు ప్రవర్తిస్తారు.

నిజానికి మొదటిసారి పోలీస్ స్టేషన్ కు వెళ్ళట మంటే తను వణికిపోయి ఉండ వలసింది; తను నిర్దోషి ఐనప్పటికీ, దోషిగా నిలబడేందుకే వెళ్ళాడ వలసింది కాదు. కాని ఇప్పుడు యీ రెండు దుస్సంఘటనల ముందూ, మిగతా విషయా లన్నీ అత్యల్పాలుగా ఉన్నవి.

తనన్ను చూస్తూనే ఇనస్పెక్టర్ హుంకరించాడు. అదృష్ట వశాత్తు ఇన్ స్పెక్టర్ తెలుగు వాడవటం వల్ల కొంత మేలైంది.

'తెలుసుగా-గోళ్ళు ఊడగొడుతాము...ఎక్కడుందో చెప్పేస్తే, పెద్దమనిషిగా వొదులుతాను' అన్నాడు ఇనస్పెక్టర్.

వికటంగా నవ్వాడు తాను. 'నాకెలా తెలుస్తుంది? నిన్నల్లా అమ్మ శవం ముందు పడి వున్నాను. ఇవాళ తెల్లారి లేచినప్పటి నుంచీ లలిత ఎక్కడున్నదని నన్ను అడుగు తున్నారు...'

ఇనస్పెక్టర్ ఒక్క క్షణం ఆలోచించాడు.

'లోపల వేయిస్తాను—తెలిసిందా?' అన్నాడు.

'మహా ప్రసాదం ఇనస్పెక్టర్ గారూ!' అన్నాడు తను. 'జీవితం మీద ఏవగింపు కలుగుతోంది. జైల్లో నన్నా వుంటే ఆత్మహత్య చేసుకునే దుస్సంఘటనన్నా సంభవించకుండా వుంటుంది'

క్షణంలో కరిగి పోయ్యాడు ఇనస్పెక్టర్. 'కూర్చో' అన్నాడు. ఎదురుగా వున్న బెంచీ మీద తను కూర్చున్నాక, టేబిల్ మీదనుంచి వొంగి 'అదే కాదయ్యా! నిజంగా నీకు తెలుస్తే ఆ అమ్మాయి ఎక్కడుందో చెప్పేసెయ్...యీ ప్రేమా, గీమా అన్నీ వొట్టి మాటలు. వాటిని నమ్మ వొద్దు. నిప్పుమీద ఎంత మమకారం వున్నా, కాలకుండా వుంటుందా?... చెప్పేసెయ్. మాఅవస్థ మేంపడి ఊరంతా తెలియక ముందే సర్దేస్తాము. నీవంటే నాకు జాలికలుగుతోంది. నిన్న నీవు ఇంట్లోనే ఉన్నట్లు కూడా తెలుసనుకో. ఐతే నేం, అవతల పలుకుబడి వున్న పెద్ద మనుషుల మాటల్ని నమ్మకుండా ఎలా ఉండేది! చెప్పు...ఆమె నీ కోసం ఎక్కడో ఉండి ఎదురు చూస్తూ వుంటుంది. ఆచోటు తెలియజెయ్—చాలు!'

'నాకోసమా? లలిత నాకోసం ఎదురు చూస్తూ వుంటుందా?' అని నవ్వి 'అలాటి పేదవాన్ని సౌభాగ్య మనుకుంటే ఆ స్వర్గంలోనే సాధ్యం!' అన్నాడు.

'చూడు—నాతో కవిత్వం మాట్లాడొద్దు. నేను బాధ్యతనున్న ఆఫీసర్ని. ఐనా చెపుతున్నాను. నీకు నిజంగా లలిత మీద ప్రేమవుంటే, ఆమె చెడిపోయేందుకు ఒప్పుకోవు. ఆమె పరువు ప్రతిష్ఠల్ని కాపాడుతావు. కనుకనే అనురాగానికి ఇదొక పరీక్ష తెలిసిందా?—'

'నాకు అనురాగాలే అక్కర్లేదు; అలాటప్పుడు పరీక్ష లెందుకూ? ఆమె చెడిపో కూడదనే నేను మనస్ఫూర్తిగా కోరుతున్నాను. కాని నేను కోరేవి నిజంగా జరిగేందుకు నాశక్తి సామర్థ్యాలు చాలవు.' అన్నాడు తను.

బహుశా యీ మెతకతనం లాభం లేదనుకున్నాడేమో, ఇనస్పెక్టర్ అన్నాడు: 'తీరా చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే లాభంలేదు. ఇదిచాలా పెద్దనేరం. ఒక పక్క కిడ్నాపింగ్; రెండోపక్క దొంగతనం! ముందు వృద్ధిలోకి రావాల్సిన యువకుడివి. ఒక్కసారి క్రిమినల్ కేసులో శిక్షపడిందో మళ్ళీ తలెత్తలేవు. నీ మేలు కోరి చెపుతున్నాను...ఆమెను ఎక్కడ కలుసుకునేందుకు నిర్ణయించుకున్నారో చెప్పేసెయ్. నీకు అపకారం జరక్కుండా చూసే బాధ్యతనాది!'

'నిజాన్ని నమ్మించటం కూడా కష్టం ఇనస్పెక్టర్ గారూ! నన్ను జైల్లో పడెయ్యండి. ఆమె నాకోసం ఎక్కడో నిరీక్షిస్తోందనే అనుమానంలో ఉన్నారు కనుక, నేను రాకపోవటం చూసి ఆమె నాకోసం సరాసరి ఇక్కడికైనా వొస్తుంది; లేదా ఇంటికన్నా వెళ్తుంది కదా!' అన్నాడు తను.

ఇనస్పెక్టర్ దిమ్మెర పోయ్యాడు. బహుశా మరి మాట్లాడేది కూడా ఏమీ లేదేమో? నిట్టూర్చాడు; విసుక్కున్నాడు. టోపీ నెత్తిన పెట్టుకొని, చిరాగ్గా, మళ్ళీ టేబిల్ మీద పెట్టాడు.

'మిష్టర్! నీవు కథలూ అవీ రాస్తావటగా?' అన్నాడు.
'ఔను-'

'మరి యీ ఖర్మ ఏమిటీ? యీ అపవాదులు నీకు చుట్టుకోవట మేమిటీ? ఇంతో అంతో చదువుకున్న వాడివి, ఏదో విధంగా పొట్ట పోసుకోక, యీ ధనిక కుటుంబాలతో స్నేహా లేమిటి?'

'ఏం చెప్పమంటారు ఇనస్పెక్టర్ గారూ! నా జీవితం నాకే అర్థం కాని అయోమయాల్లో అగాధాల్లో పడి పోయింది. మనం కోరేవి జీవితంలో సిద్ధించకుంటే మానె కోరనివి, కలలో కూడా తలవనివి వొచ్చి పడుతూంటవి: వాటిని తట్టుకునేందుకు సిద్ధంగా ఉండం కనుక, తలక్రిందులవుతూ వుంటాం' అన్నాడు తను.

కష్టాలనేవి ఎంతజ్ఞానాన్ని ప్రసాదించి, సత్యం తాలూకు లోతుల్ని స్పష్టంగా చూసేందుకు అవకాశాల్ని కలిగిస్తూంటవో అర్థమౌతోంది కాని; సత్యంసంగతి దేవుడి కెరుక, దానికొరకై కష్టాల్నిపడేందుకు ఎవరు సిద్ధపడగలరు? ఐతే కోరకుండానే విరుచుకుపడే బరువుల తాకిడికి బుర్రలో మెరుపులు మెరుస్తూంటవి కనుక, వాటి సారాన్ని గ్రహించటం జరుగుతోంది.

'సరే...నీవు వెళ్ళొచ్చు...' అన్నాడు ఇన్స్పెక్టర్.

ఇంత తేలిగ్గా తాను బైటపడతా ననుకో లేదు. అసలు యీప్రదేశంనుంచి వెళ్ళాలనీ లేదు. అందుకనే తను కదల లేదు.

'మిష్టర్! మీరు వెళ్ళొచ్చు-'

యీసారి ఇన్స్పెక్టర్ చాలా గౌరవాన్ని ధ్వనింప జేశాడు; ఐనా తాను. కదల్లేదు.

'వెళ్ళమన్నాగా! వెళ్ళండి—'

'ఎక్కడికి వెళ్ళేది ఇన్స్పెక్టర్ గారూ? ప్రపంచలో నాకు చోటులేదు; నాకెవ్వరూ లేరు. యీబతుక్కు అర్థమేమిటి? నన్ను జైల్లో వేయించండి—' అన్నాడు తను; కన్నీరు కమ్మటంవల్ల ఇన్స్పెక్టర్ మొహం స్పష్టంగా కనిపించ లేదు కాని, ఆయన నిట్టూర్చటం చాలా స్పష్టంగా వినిపించింది.

'ఏం చేస్తాం-జీవితంలో కష్టాలురాకుండా ఉంటవా? ఓర్చుకోవాలి మిష్టర్! ఓర్చుకోవాలి' అన్నాడాయన.

'ఓర్పు! నాకింక ఓర్పులేదండీ!' అన్నాడు తాను, కళ్ళు తుడుచుకుంటూ 'నాకిక ఆశయాలుకూడా లేవు కనుక, బతకటం అనవసర మనిపిస్తోంది!'

'కాదు...కాదు...' అన్నాడు ఇన్‌స్పెక్టర్ 'మిష్టర్! నీకింకా భవిష్యత్తు వుంది. ముందు ఎలావుంటుందో ఇప్పుడనుకోవటంలో అర్థం లేదు. ఆశయాలు ఉంటేనే బతకాలంటే, చాలా మందికి బతికే అర్హతకూడా ఉండదు, తెలిసిందా?'

'నాకే భవిష్యత్ మీద నమ్మకం లేదు. వర్తమానం బాగుండనప్పుడు, భవిష్యత్‌ను గూర్చి కలలు కంటాం. ఐనా జీవితమంటే ఇంటరెస్ట్ లేదు.'

'ఇప్పుడు లేదు అనండి-అంతే! కవులంటే నాకో గొప్ప అభిప్రాయం వుంది వాళ్ళు మానవజీవిత చిత్రణలో, జీవితాన్ని విడదీసి అర్థమయ్యేట్లు చేయగలుగుతారు. కాని మీరే ఇలా జారిపోతారేమిటి? భయంలేదు; కాస్తనిలదొక్కుకోండి' అన్నాడాయన, తన భుజంమీద తడుతూ.

కరుగ్గా ఉండవలసిన పోలీస్ ఆఫీసర్ మానవత్వాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తూ, ఇంత సానుభూతితో మాట్లాడుతాడని తాను నమ్మలేక పోయ్యాడు. మళ్ళీ ప్రపంచమంటే, నివసించదగింది కాదనే అభిప్రాయం మారుతోంది. ఒకో సమయంలో ఒకోరు, మరొకరిని ఉద్ధరించేందుకు ఎంతగా ప్రయత్నించి, జీవచ్ఛవాలకు జీవంపోసి ప్రమాదాన్ని తప్పించగలిగే కౌశలం వుండగలదో ననిపిస్తోంది.

'నిలదొక్కుకునేందుకు నేను ఊబిలోవున్నాను సార్! ఒక్కపూట కూటికూడా లేని స్థితిలో వున్నాను. నేను బతకటం, నాకూ సుఖం లేదు; నాచుట్టూవున్న సమాజానికూడా భారమే అవుతాను కదా!'

'ప్చ్.. ప్చ్' అన్నాడు ఇన్‌స్పెక్టర్ 'భయపడకండి. మా ఇంటికి రండి... మీసంగతి నేను చూస్తానుగా!' అని అభయ మిచ్చాడాయన. సింహంకూడా ఒకొక్కప్పుడు సాధువవుతుందంటే ఆశ్చర్య మేమిటి?

తనేమీ మాట్లాడలేదు. శిలా ప్రతిమలాగ ఉండిపోయ్యాడు. ఆ మధ్యాహ్నం ఇన్‌స్పెక్టర్ తనను వెంటపెట్టుకొని ఇంటికి తీసుకువెళ్ళాడు; తనతోపాటే భోజనం పెట్టించాడు; తనగదిలో పడుకోమన్నాడు. ప్రస్తుతం ఆయన భార్య పురిటికిపోయి ఉండటంవల్ల ఇబ్బంది కలగ లేదు.

'మీరు విశ్రాంతి తీసుకోండి. జీవితానికి మరికొద్ది రోజుల వ్యవధి ఇవ్వండి. గాడితప్పిన బళ్ళు, తిరిగి గాడిలోకి పడతయ్.' యీరకంగా ధైర్యాన్ని నూరిపోసి, తనను కనిపెట్టి ఉండమని ఆర్డర్లీకి ఆదేశించి ఆయన డ్యూటీకి వెళ్ళిపోయ్యాడు.

జీవితం ఎంత చిత్రమైంది! ఎన్నిరకాల మనుషులు, జీవితానికి ఎన్నిరకాల రంగుల్ని వేస్తారు! ఒకరు నీచులు; ఆనీచత్వాన్ని కప్పిపుచ్చేందుకు మరొకరు ఉత్తములు. మొదటివారిని చూసి క్షోభించిన మనసుకు, రెండోవారు వికాసాన్నిచ్చి ఉత్సాహ పరుస్తారు. కనుకనే జీవితం అనుకున్నంత అధ్వాన్నమూ కాదు; సౌఖ్యమయమూ కాదు.

ఆలోచిస్తే, ఒకవేళ లలితను పట్టుకొనేందుకు గాను తనను, సంరక్షించే ప్లాను లోనే ఇన్‌స్పెక్టర్ ఉన్నాడేమోననే అనుమానం కలుగుతోంది. కాని లలిత తనను ప్రేమించలేదు కనుక, ఆమె తనకొరకై రాదు; ఆయన ప్లాను వ్యర్థం. తనకొచ్చిన నష్టంలేదు కాబట్టి, దాన్నిగూర్చి ఆలోచించ నక్కర్లేదు.

మానసిక కల్లోలాలు తనకు మైకాన్ని ప్రసాదించినవి. ఆ పడుకోవటం రాత్రి ఎనిమిదింటికి కాని మెలకువ రాలేదు. అప్పటికైనా ఇన్‌స్పెక్టర్ వొచ్చి, తనను భోజనానికి లేపాడు.

భోంచేసి తిరిగి పడుకున్నాడు. ప్రశాంతమైన నిద్ర ఎలాపట్టిందో చెప్పలేము కాని, మర్నాటికి మాత్రం తనకు చాలా తేలిగ్గానూ, ఉత్సాహంగానూ వుంది.



మర్నాటినుంచీ ఇన్‌స్పెక్టర్ మరింత దగ్గరయ్యాడు; ఆయనకు కవులంటే వుండే అభిమానంతోనే కావొచ్చు; సాహిత్యాన్నిగూర్చిన చర్చలతో తనకు సన్నిహితుడవుతున్నాడు.

తను అడక్కుండానే లలిత విషయంకూడా ఆయన చెప్తున్నాడు. పోలీసు దళాలు చాలా గాలించినవి; కాని ఆమె కనిపించలేదు. ఆమెతో స్నేహం చేసిన మరొక యువకుడు కూడా కానరావటం లేదు; అందుకని ఆమె వాడితోనే ఉడాయించి వుంటుంది. వారం తిరక్కుముందే, తనమీదపడిన అపవాదు నామరూపాలు లేకుండా పోయింది.

'చూశారా?' అన్నాడు ఇన్‌స్పెక్టర్ 'ఆనాడే ఏ ఆత్మహత్యో చేసుకొనివుంటే, యీ అపవాదు మీ మీదినుంచి తొలగిందనే సంగతికూడా తెలిసేది కాదు. ఒకోరు బతకటం వారికి ఉపయోగపడకపోవొచ్చు; కాని సమాజానికి, కనీసం-మరికొంత మందికి ఉపకరిస్తుంది. వొట్టి నిరాశే కనిపించినా, దాని వెనుక ఎక్కడో కంటికి కానరాని దూరాన ఆశవుండొచ్చు. అదేమిటో, దాని రూపేమిటో ఎవరికీ తెలియదు. తెలుసుకునేందుకే బతకాలనేది!'

ఏమిటా ఆశ! అసలు తన జీవితంలో అర్థంలేకుండానే పోయింది. కొంతమంది ఇతర్లకోసమన్నా బతుకుతారు; మరికొంతమంది తమ సుఖంకోసమైనా బతుకుతారు. తాను యీ రెండు తెగలకూ సంబంధించని వాడు. తేలుకుట్టాకపడే బాధ, ముల్లు గుచ్చుకున్నప్పుడు పడేబాధకు అనేకరెట్లనే జ్ఞానంకూడా తనలో నశించింది. యీనాడు జీవితంలో ఎంతగొప్ప ఆశంటూ వున్నప్పటికీ, అది తనకు మానసికానందాన్ని ఇవ్వదు.. తాను ఇన్నాళ్ళనుంచీ ప్రయత్నించింది, మానవునిలాగు బతకగలగటమొక్కటే! అదీ సాధ్యపడలేదు. ఇకముందు అంతవరకూ సాధించగలగ వొచ్చు. ఆపైఅంతస్తుల్ని అందుకున్నా, అవి తనకొక లెక్కలోవి కావు.

ఇన్‌స్పెక్టర్ మాటలకు చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు తను. ఆయన అన్న మాటల అర్థం వేరు; అవి తనకెలా వర్తించవో, తానే చెప్పి ఆయనకు అర్థమయేట్లు చేయలేదు.

లలితను గూర్చి మరి ఆలోచించవలసిన పనిలేదు. సమాజం తనకేదో అన్యాయం చేసిందనే కసితో తనమెడకుతానే ఉరితాడు వేసుకుంది. ఒకనాటికి ఆమె విచారిస్తుంది; కాని అప్పటికే అంతా మించిపోయి ఉండటం వల్ల ఏమీ ప్రయోజనం లేదు. ఒకసారి సమాజాన్ని ఎదిరించి, దాన్ని తన్ని బైటపడ్డాక, సమాజంలోనే బతకవలసి రావటాన్ని గుర్తించి, తిరిగి దాని శరణుజొచ్చితే అది క్షమించదు. కసికొద్దీ నలిపి పారేస్తుంది. యీవిషయాలన్నీ యీనాడు ప్రపంచంలో కొత్తవి కావు. ఏమాత్రం ఇంగిత జ్ఞానంవున్న వారికైనా ఇట్టే అర్థంకాగలవి.

—మరి లలిత ఇంత అనాలోచితంగా ఊబిలోపడి పోయింది! ఏనాటి కన్నా తనకు అవకాశమంటూ ఏర్పడితే, ఆమెను ఉద్ధరించేందుకు, కనీసం శేష జీవితాన్ని సుఖంగా గడిపేందుకు సహాయపడగలడు. ఏమిటీ వెర్రి ఆలోచన? ముందు తనను తాను ఉద్ధరించుకుంటే, తరువాత పతితల సంగతి చూడొచ్చు.

ఇన్‌స్పెక్టర్ ఆదరణవల్ల తాను మళ్లీ మనిషవుతున్నాడు. కాని ఆయన దయాధర్మాలమీద తానిలా ఎంతకాలం జీవిస్తాడు? బైటిప్రపంచానికి భయపడి ఎన్నాళ్లిలా అజ్ఞాతవాసం చేస్తాడు? తానూ ఒక మనిషేనని లోకానికి ఋజువు చేసుకోకపోతే మాని-తనకు తాను రుజూ చేసుకోవాల్సిన కనీసపు అవసరమన్నావుంది కదా! యీకష్టాలన్నీ కలిసి, ఇంతకన్న కష్టాలేవి మరిరావనే మనోధైర్యాన్నిచ్చి, ఒకరకం మొండితనాన్ని స్థాపించినవి. ఆ మొండితనమే తనకిప్పుడు ఆధారంగానూ ముందుకు నడిపించే మహత్తర శక్తిగానూ తోస్తోంది.

అందుకనే ఎలా జీవించటమనే దానికి పెద్దగా ఆలోచించ నక్కర్లేదు. తన ఆదర్శాలన్నీ ఏనాడో మంటగలిసినవి. కనీసం బతికేందుకన్నా ఉపయోగపడని ఆశయాలు దేనికి? అధవా వాటిని పట్టుకొని వేళ్లాడినా, అవి ఎంత నిరుపయోగమైనవో, తనచుట్టూవున్న ప్రపంచం రుజూచేసి, తన మూర్ఖత్వానికి మొహంలో నవ్వింది. చాలు-జరిగిన యీపరాభవం చాలు. కనుక చివరకు కూలినాలిచేసుకొని బతుకుతే మాత్రమేం?

ఒకనాడు ఇన్‌స్పెక్టర్‌తో అన్నాడు: 'ఇన్నాళ్ళూ మీరు చూపిన ఆదరణకు కృతజ్ఞుణ్ని. ఇకనేను వెళ్లొస్తాను సార్!'

'ఎక్కడికి వెళ్తారు? ఏంచేయ దల్చుకున్నారు?' అన్నారాయన. తాను ఆలోచించింది చెప్పాక, ఇన్‌స్పెక్టర్ నొచ్చుకొని 'అంతకిందికి దిగజారకండి...నాకో మిత్రుడు, చిత్రనిర్మాత ఉన్నాడు. అతనికి మీరు తప్పక ఉపయోగ పడగలరు. రేపే పరిచయం చేస్తాను' అన్నాడు.

తనేమిటి-చిత్రానికి రాయటమేమి టనిపించింది. తనకా సామర్థ్యం లేదేమోననే సందేహం కూడా కలిగింది. కాని తాను రాయలేకపోవట మేమిటి? తాను ప్రపంచంలో చేయలేని పనంటూ ఉండేందుకు వీల్లేదు. ఆపట్టుదలా, ఆత్మవిశ్వాసం

# 35

బాధ్యత అంటూ ఉన్నప్పుడే జీవితానికి క్రమవిధానం వుంటుందని తాను ఒకప్పు భ్రమ పడ్డాడనే విషయం, ఆ తరువాత సంఘటనలు రుజూ చేస్తున్నవి.నిజంగా తనకు బాధ్యత లున్నప్పుడు వాటిని నిర్వహించలేక సతమత మయ్యాడు. ఇప్పుడు తెగించి, మరొక ఆధారంలేకుండానే, ఏమైతే అదే అవుతుందనీ, లెక్క చేయకుండా ఉండటమంత అత్యుత్తమమార్గం మరొకటిలేదనీ నిర్ణయించుకొని ముందుకు సాగితే, ఆశ్చర్యంగా సంఘటనలు వాటంతటవే తనకు అనుకూలంగా మారినవి. కేవలం తాను మాత్రం నామమాత్రుడుగా ఉండిపోయ్యాడు.

తను చాలా మారాడు; మొదట్లో సినీమాకని తాను చెప్పిన కథల్ని నిర్మాత ఒప్పలేదు. ఆయన తన స్వంత కథను, ఏపది పన్నెండు కథలనుంచో సంఘటనలు ఏరి, దాన్ని నానా రథసాచేసి ఒక కథను అల్లాడు. అదెలావున్న దన్నప్పుడు, తనకు నిజంగా నవ్వొచ్చింది. తలాతోకాలేని ఆ కథను, అసలు కథగా ఒప్పుకోవ టం ఎలా? ఐతే తాను ఒప్పుకోనందువల్ల తనకే నష్టం. తాను ప్రతిఘటించినందువల్ల యీసాహిత్యం రాకనూ మానదు. కనుక, తనపనేదో పూర్తిచేసుకుంటే సరిపోతుంది.

నిర్మాత చెప్పిన అతుకులబొంత కథను, యాంత్రికంగా ఒక పద్ధతికి పెట్టాడు. తన గొప్ప ఐడియాలకు ఒక క్రమరూపం వొచ్చినందుకు నిర్మాత చాలా సంతోషించాడు. ఆతరువాత డైలాగులూ, పాటలూ- తాను చిటికె పొయ్యేక. తన అంతరాత్మ కూడా నజ్జునజ్జయి ఉండాలి; అందుకనే అదిప్పుడు తిరగబడటం లేదు. సాహిత్య పిపాసకు అంతరాత్మ చెవి కోసుకోవటం లేదు. సాహిత్యం పేరిట జరిగే వ్యాపార సరళిని మాత్రమే అది కూడా గమనిస్తూ పడివుంది.

చేయరాని, చేయకూడని పనులు చేసినంతమాత్రాన, మనశ్శాంతి ఉండదనే భ్రమ పటాపంచలైంది. ప్రపంచంలో అనేకులు అనేక అన్యాయాల్ని చేస్తూకూడా, ప్రశాంతంగా ఎలా ఉండగలుగుతున్నారో నని పూర్వం వేదన పడేవాడు; ఇప్పుడు అదంతా తన అనుభవంలోకి వొచ్చింది. తెలిసివుండే చేసిన అన్యాయం కన్న-దాన్ని గూర్చిన ఆలోచనే మనిషిని కుంగదీస్తుంది. అలాటి బాధక ఆలోచనల్ని రానీకుండా వుంటే, మనశ్శాంతికి భంగం వాటిల్లదు. ఇప్పుడు తాను కళకు తీరని కళంకాన్ని కూర్చుతున్నప్పటికీ, తాను చేస్తున్న పనిని గూర్చి ఆలోచించే తీరిక కూడాలేదు, అన్నిటినీమించి తాను ఇంకా ఆ ఆదర్శాలను పట్టుకొనివేళ్ళాడితే సంతోషించే వారుమాత్రం ఎవరున్నారు కనుక?

•ఈకొత్త ఉద్యోగంలో చేరాక దినదిన గండమనటూలేదు. సుఖంగా కాలం గడుస్తోంది. కాని ప్రతిరాత్రి లలితనుగూర్చి, అమ్మనుగూర్చి తలపోసుకుంటూనే ఉంటున్నాడు. నిజంగా అమ్మబతికి వుంటే ఎంత సంతోషించేదో ఆమెకా అదృష్టంలేదు; తాను దురదృష్టవంతుడు. లలిత అండర్ గ్రౌండ్‌కు పోకుండావుంటే తానీ బాధపనులు చేసేవాడుకాదు. ఆమె ప్రోత్సహించే ఆదర్శాలకోసం మాడి

చచ్చేందుకూ, అగ్నిగుండాల్లో దూకేందుకూ సంసిద్ధుడయ్యేవాడు. తనను తాను ఉద్ధరించుకోలేని లలిత, తన సాహిత్యాన్ని మాత్రం ఏం ఉద్ధరించ గలిగేది? ఏది మంచో, ఏదిచెడో తెలుసుకోవటం వేరూ; ఆచరణలో పెట్టటం వేరూ అనే సంగతి లలిత స్పష్టపరిచింది.

ఏమైనా తిరిగి జీవితంలో లలిత కలుస్తే, ఆమె ఏ స్థితిలో ఉండనీ, సమాజమంతా ఆమెను చీడపుర్గును తరిమినట్లు తరమనీ, తానుమాత్రం ఆత్మీయురాలుగానే భావించి, ఆదరించగలడు. బిడ్డ అలిగి, పారిపోయ్యాక, ఏమయ్యాడని వెతికి పట్టుకున్నప్పుడు, వాడిమీద తల్లిదండ్రులకు కలిగిన కోపమంతా, క్షణంలో జాలిగామారినట్లే, లలితపట్ల తన అభిప్రాయంకూడా మారింది. ఏమో తప్పు చేసిందేమో? ఐనప్పటికీ తానామెను భరించ గలడు. కానీ ఆమె కనిపిస్తుం దనేమిటి?......

ఇప్పుడిప్పుడు ఒక కృత్రిమ వాతావరణంలో, కృత్రిమ జీవితానికి అలవడి పోతున్నాడు. లౌకికజ్ఞానం బాగా అలవడింది. ఎవరితోనూ వాగ్వాదాలు చేయడు. పని ముగించుకునేందుకు గాను, తప్పుల్ని కూడా ఒప్పులుగానే దాటేయటంవల్ల, చిత్ర నిర్మాణంలోని మిగతా వారందరికీ చాలా ఇష్టుడయ్యాడు. ఏదో పొడిచేద్దామని బయలుదేరినవాడు, ప్రపంచాన్ని తలక్రిందులు చేయగలనేమోననే భావన గలవాడు, అదంతా కలలోకూడా జరగదని తేల్చుకున్నాడు. తాను తలక్రిందులై లోకం తలకిందులైనట్లు కనిపించుగాక; అంతమాత్రాన అయేదేమీలేదు. అంతకన్న తన విధానాన్ని మార్చుకొని లోకాన్ని దూషించక, తానుకూడా బాగా అర్థంచేసుకున్నట్లుగా నటించి, టోపీవేయటం అత్యుత్తమ మార్గం. ఏ ధనలేమి తనను నానా అగచాట్ల పాలుచేసి- ముఖ్యంగా అమ్మ ప్రాణాన్ని కూడా బలిగొన్నదో, ఆ ధనాన్ని సంపాయించి, తానుకూడా ఒక బలవంతుడు కావటమే, మిగతా ఆశయాల నన్నిటినీ కిందికి తోక్కేసింది.

రోజులు కలిసొస్తే ఎవరాప గలరు? ఆరు నెలలయ్యేప్పటికి, తాను పనిచేసిన చిత్రం అమోఘంగా వున్నదనే జనవాక్యం వినవైంది. ఇందులో తన ప్రతిభ (ఆ మాటతలుచుకుంటే వొంటిమీద గొంగళీపురుగులు పాకుతున్నట్లనిపిస్తుంది. యీ చెత్త రానినందుకు అప్పుడప్పుడు తనను తాను కించ పరుచుకుంటూనే ఉన్నాడు. దాన్ని ప్రతిభగానే ప్రపంచంచూస్తే, తాను కనీసం ప్రపంచమంత పిచ్చి వాడు కాలేదనే ఆత్మతృప్తినా మిగులుతోంది!) ఎంతవరకో తెలియదు; కాని నిర్మాతలు మాత్రం తనను ఆకాశానికి ఎత్తారు.

కీర్తితో తాను మూర్ఛపోలేదు. యీకీర్తిని ప్రపంచం గుర్తించగలిగే ధన రూపానికి మార్చేందుకు, ముందువెనుకలు ఆలోచన అనవసరం. ఇలా సంపాయించిన డబ్బంతా ఏంచెయ్యాలనే ప్రస్తావనే లేదు. నిజంగానే తాను అనుభవించడు: అదెలాగో కూడా తెలియదు. అనుభవించేందుకు తనకు ఆత్మీయులు లేరు. ఐనా కూడా ధనం కూడబెట్టటమే ఒక ఆశయంగా పెట్టుకున్నాడు.

సంవత్సరం తిరక్కుండానే చేతినిండా పని తగిలింది. రెండు, మూడు చిత్రాలకు రాస్తున్నాడు రోజురోజుకూ మార్కెట్ రేటు పెరుగుతోంది; దాంతోపాటు తనలోని కళాపిపాసి దిగజారుతున్నాడు కూడాను. ఇక తన గౌరవం మేరుపర్వత ప్రమాణంలో పెరుగుతోంది. తనకు తెలియని అనేకమంది తనను చూడగానే నమస్కరిస్తారు. తాను ఎంత అల్పుడని ఇదివరకు అనుకుంటూండే వాడో, ఇప్పుడంత అధికుడయ్యాడు! యోగ్యతా యోగ్యతల్తో పనిలేదు. అదృష్టదేవత గుడ్డిదేమోమరి-వెతుక్కొంటూవొచ్చి తనను వాటేసుకొని గగనమార్గానికి లాగింది. బలవంతాన కూడా ఆపట్టును తాను విడిపించుకోలేడు.

కాలం చాలా విచిత్రమైనది; అందుకనే దానిమీద మానవులూ ప్రపంచమూ ఎన్నో ఆశల్ని మోపుతున్నారు. కాలం సాగిన కొద్దీ ఏవో మార్పులు-మంచివి కానీ-చెడ్డవి కానీ రాకతప్పవు. తన జీవితం తాను గుర్తుపట్ట లేనంతగా మారినట్లే, తన పరిసరాల్లో జీవించే కొందరి జీవితాలు కూడా మారిపోయినవి. ముఖ్యంగా లలిత కుటుంబీకులు. వ్యాపారంలో దివాలా తీశారు. ఆ ఐశ్వర్యమూ, మేడలూ, కార్లు అన్నీ పోయినవి. ఎక్కడో మారుమూల, అజ్ఞాతవాసం చేస్తున్నారట! పండంటి సంసారం అలా చితికి పోతుందని ఎవరనుకున్నారు? ఓడలు బళ్లూ, బళ్లు ఓడలూ అవుతవంటారు. అదే జరిగింది. తానిప్పుడు కార్లలో తిరుగుతూంటే, సకలసౌఖ్యాలూ అనుభవించిన లలిత కుటుంబీకులు గుమ్మాలో దొర్లుతున్నారు. ఇక లలిత సంగతే తెలియ రావటం లేదు, తాను ఎవరినని విచారిస్తాడు? ప్రమాదవశాత్తూ ఎక్కడనా లలిత కనిపిస్తుందేమోనని భావిస్తుండేవాడు.

ఒకనాడు స్టూడియోలోని మేకప్ రూంలోంచి వొస్తున్న పదిమంది స్త్రీలలో లలిత కూడా వుండటం చూశాడు. అసలామె లలితేనా? కాదా? అనే సందేహం కలిగింది. మనిషిని బోలిన మనిషి ఉండొచ్చు. తన మనస్సు లలితను వెతుకుతోంది కనుక, ఏకాస్త పోలికవున్నా పొరపడనూ వొచ్చు. ఆమె లలితే ఐనట్లయితే, ఎంత మారిపోయింది! జీవితరాత్రిని బరువంతా మీదపడినట్లుగా ఎంత కుంగిపోయింది! జీవచ్ఛవం వలె, ఎంత నీరసంగా కదులుతోంది!

పలకరిద్దామనుకున్నాడు; ఆ పలకరింపులో ఎక్కువ తక్కువలు ధ్వనించకుండా అనురాగం ఉట్టిపడేట్లే పలకరించాలి. ముందు ఆమె లలితేనని నిర్ధారణ చేసుకోందే పలకరించట మెలా? ఆమె కూడా తనను చూసింది కాని, నిర్లిప్తంగా ఆమందలో పడి సెట్‌లోకి వెళ్లిపోయింది. లలితే ఐతే కనీసం చిరునవ్వైనా నవ్వదా? లలిత కాదేమో?

మనసు మాత్రం లలితేనని హెచ్చరిస్తుండటం వల్ల, సెట్‌లో కూడా కాస్సేపు కూర్చున్నాడు. అదొక గ్రూప్ డాన్సు సీను కావటంవల్ల, లలితను పరీక్షగా చూసే అవకాశం లేకపోయింది. ఎవరినన్నా అడిగేందుకు సిగ్గుపడి ఊరుకున్నాడు. ఆమె నిజంగా లలితయినా, సెట్‌లో పలకరిస్తే, నలుగురు ఏమనుకుంటారో? యీ ఆలో

చన రాగానే తనను తాను నిందించుకుంటున్నాడు. డబ్బుకోసం తన విజ్ఞానంతోపాటు, సంస్కారాన్నీ, మానవత్వాన్నీ కూడా బలిపెట్టుకోవలసివచ్చిందనీ, తనకు తెలియకుండానే జరిగిపోతున్నాడు. ఇలాంటి భావనే లలిత ఉచ్ఛదశలో ఉన్నప్పుడు, ఆమెలో కలిగివుంటే, తన నసలు కన్నెత్తి చూసేదా? తను చావు బతుకుల మధ్య వున్నప్పుడు సకలసేవలూ చేసేదా? తనపట్ల, అమ్మపట్ల, యీ ప్రపంచంలో ఎవరైనా ఆ రోజుల్లో మానవత్వాన్ని నిష్కల్మషంగా ప్రదర్శించివుంటే, లలితతప్ప వేరెవ్వరూ లేరు. ప్రపంచం ఏమనుకుంటూన్నదో నన్న ఆలోచన లేకుండా, ఆమె తన స్నేహాన్ని వాంఛించింది. అలాంటి లలితను గూర్చి, ఆమెను యీ స్థితిలో పలకరించటం వల్ల, తన గౌరవ మర్యాదలు పోతయ్యేను కోవటం ఎంత నైచ్యం! యీ వెధవ నడమంత్రపుసిరి తననీ పతనావస్థలోకి లాగుతుందని కలలోకూడా అనుకోలేదు కదా!

ముందసలు ఆమె ఎవరో తెలుసుకోవాలి. ప్రొడక్షన్ మేనేజర్ను పిలిచి అడిగాడు. అతను 'ఎవరో ఎక్‌స్ట్రామ్మండి! వీళ్ళకు పేర్లేమిటి? ఊర్లేమిటి?' అన్నాడు.

మనసు, చివుక్కుమంది. కాలం కలిసిరాక, ఎంతోమంది పెద్దింటి పడుచులు కూడా, జీవితంలో ఒకే ఒక్కసారి కాలు జారిన నేరానికి, ఎక్‌స్ట్రాలుగా తయారై ఉండొచ్చు. వాళ్ళందరినీ ఒకే జాతిగా, ఒకే తరగతిగా, బజారు సరుకు అనటం ఎంత దురన్యాయం! ఏమో- ఆమె లలిత కానట్లయితే, మిగతా ఎక్‌స్ట్రాల వలెనే ఆమెను కూడా తాను ఆతరగతికే జేర్చి, ప్రొడక్షన్ మేనేజర్ మాట్లాడినట్లే మాట్లాడే వాడేమో?

అశాంతితోనూ, అతృప్తతోనూ, బాధపడే మనస్సుతో ఆప్రాంతాల్లోనే కాస్సేపు తారట్లాడాడు. ఆమె అప్పుడప్పుడు తన వైపు చూస్తోంది కాని, తాను లలితనే నన్న విషయాన్ని తనకు నిస్సంకోచంగా సూచించటం లేదు. అందులో ఆ లైట్ల వెలుగులో మేకప్‌లో అందరూ దేవకన్యల్లాగే ఉంటారు కనుక, తాను తేల్చుకోవటమూ కష్టమే! తన ప్రయత్నాలు మరి లాభం లేదని, షూటింగు సాగుతున్నప్పటికీ, తను ఆనాటికి ఇంటికి వెళ్ళిపొయ్యాడు.

తీరా ఇల్లు జేరాక, తాను మరికొంత ప్రయత్నంచేసి ఉండాల్సిందనీ, పలకరించి ఉండవలసిందనీ అనిపించింది. ఒక వేళ ఆమె లలితే ఐతే, తాను కనీసం పలకరించ నందుకు ఎంత నొచ్చుకొని ఉంటుందో? తను నిజంగానే గట్టిప్రయత్నంచేసి ఉంటే, ఆమెభోగట్టా, తెలియటం ఏమీ కష్టమయేది కాదు. ఇప్పుడు ఏమనుకొని ఏంలాభం? ఆమె స్టూడియోనుండి వెళ్ళిపోయి వుంటుంది కూడా.

ఇది జరిగిన ఏడెనిమిది నెలలకు ఒకసారి ఆమె బస్ స్టాండ్‌లో నిలబడివుంది. తానుకారులో వెళ్తూవెళ్తూ చూశాడు. చప్పున కారు ఆపించి, తాను నడచి, ఆమె దగ్గిరికి జేరాడు. ఇప్పుడు సహజ కాంతిలో చూస్తే ఆమె లలితేనని స్పష్టంగా తెలుస్తోంది. తనకీ ప్రపంచంలో మరే ఆధారము లేదని తెలిసిన వ్యక్తి, మొండి తనంతో బతుకు భారాన్ని మోయటం లాటిది ఆ మూర్తిలో తనకు గోచరించింది.

ఆమెను సమీపిస్తూ దీనంగా 'లలితా!' అన్నాడు. ఆమె పలకరించేవరకూ, తనను చూడలేదు. ఉలిక్కిపడి చూసి, ఆశ్చర్యపడి, మాట్లాడుదామని పెదవులు కదిలించింది. కాని మరుక్షణం లోనే ఆమె మొహం నల్లనయింది. ఏదో భయానక రూపాన్ని చూసినట్లుగా బెదిరిపోయింది. తనను తాను సంబాళించుకొని క్షణంలో మళ్ళీ నిర్లిప్తతను ప్రదర్శించగలిగింది. ఎవరో కొత్త వ్యక్తిని చూసి, అతనితో మాట్లాడటం ఇష్టం లేనట్లుగా, ఒక్కసారి యీసడింపుగా చూసి, తనను పట్టనట్లు వేరొక దిక్కు చూడసాగింది.

లలిత ఇంత విచిత్రంగా ప్రవర్తిస్తుందనుకోలేదు. 'లలితా!' అన్నాడు మళ్ళీ.

'ఏం?' అన్నట్టు, కళ్ళు రెండు సాధ్యమైనంత పెద్దవిగా తెరచి ఉరిమి చూసింది.

'లలితా! కారులో వెళ్దాం రా!' అన్నాడు తను బలిమాలుతూన్నట్టు.

'రాను—మీరు వెళ్ళొచ్చు.'

లలిత ఇంత దారుణంగా, కఠినంగా ఎందుకు మాట్లాడుతోంది? తనమీద అంత కోపం వొచ్చేందుకు తాను చేసిన నేరమేమిటి? లలిత యీ స్థితికి దిగినందుకు జాలిగా కూడా తను మాట్లాడి ఆమెను గాయపరచ దలచలేదు; ఎందుకంటే సాను భూతి ఒక రకంగా పాత విషయాలన్నిటినీ తవ్వటమే అవుతుంది. కనుక అసలీ మధ్యలో ఏమీ జరగనట్లుగానే నటిద్దామని తాను నిర్ణయించుకున్నాడు. బహుశా ఆ సంగతి ఆమెకు తెలియక, తానుచేసిన పాడుపనికి, కేక లేస్తాడని అనుకుంటుందేమో?

అందుకని 'లలితా! నాతో రా. ఇక్కడ యీ జనంలో మాట్లాడటం బాగుండదు' అన్నాడు రహస్యం మాట్లాడుతున్నట్లు.

'బాగుండదు!' అన్నదామె వికృతకంఠ స్వరంలో 'అందుకనే మీరువెళ్ళండి'

'అదికాదు లలితా!...' అని ఇంకేదో చెప్పబోతూండగా, మరోకారువొచ్చి, ఆమెకు కొస్త దూరంలో ఆగింది. అందులోంచి ఒకయువకుడు కారుదిగబోతూ, అను మానించి అందులోంచి లలితవైపు చూశాడు. లలిత చిరునవ్వుతో, చకచకా వెళ్ళి ఆ కారులో ఎక్కింది. తన నసలు గమనించనట్లే ప్రవర్తించిందామె! కనీసం మాట వరసకన్నా, మరోసారి కలుస్తానని అనలేదు. ఒక విధంగా కావాలని తనను అవ మానించింది. ఆమె చేత అవమానితుడయేందుకు తానుచేసిన దుర్మార్గ మేమిటి?

ఐనా సరే, తనకామె మీద అసహ్యంకానీ కోపంకానీ రాలేదు. పిల్లలు చేసే తప్పుల్ని క్షమించలేని పెద్దతన మంటూ ఉండదు కదా! మరొక అవకాశం వొస్తే ఆమెను

చివరకు ప్రార్థించయినా సరే తనతో తీసుకొని వెళ్ళాలి. ఆమె చెప్పకపోయినా ఎంత అధ్వాన్నపు దశలో వున్నదో, కృత్రిమ జీవితంలో, మొహానికి ఇంత పౌడర్ పులుముకొని, కులుకుతూ నిలబడిందో, ఏ విధంగా జీవితాన్ని గడుపుతోందో తాను తేలిగ్గా గ్రహించగలడు.

ఆ ఇంకో అవకాశం కోసం తను వేచి ఉండట మేమిటి ? ఇప్పుడామె ఆ కారులో ఎక్కడికి వెళ్తోందో ? తాను వెంటాడి కనుక్కోవాలి. యీ నిశ్చయంతో కారులో కూర్చొని, ముందుపొయ్యే కారును వెంబడించాలని డ్రైవర్‌ను ఆజ్ఞాపించాడు.

కొంతదూరం వెళ్లాక, ఆ పని ను వెంటాడటం, ఆమె రహస్యాన్ని కనుక్కొనేందుకు ప్రయత్నించటం ఎంత దురన్యాయమో ననిపించింది. పూర్వం - తాను చదువుకునే రోజుల్లో లలిత ఇలాగే తనను వెంటాడింది; అప్పుడు తానెంత బాధ పడ్డాడు ! తన బతుకును తాను బతుకనివ్వని యీ సమాజాన్ని ఎంత దూషించాడు! ఇప్పుడు తాను చేస్తున్న యీ పనికి లలిత ఎంతగా బాధపడుతుం దో. అసలు, మరొక సమయంలో తనను కలుసుకోవాలను కున్నదేమో? ఎందుకంటే తామిద్దరి మధ్య ఒక ఆత్మీయతంటూ లేదంటే, తాను కలలో కూడా నమ్మలేడు. అలాంటప్పుడు కాని సమయమని ఆమె భావించి ఉండొచ్చు. కనుకనే మనసు కూర్చుకొని, కారు తిప్పించాడు. వికలమైన మానసంతో తనకు పని వున్నప్పటికీ, ఫ్యాక్టరీ వైపు పోకుండానే ఇంటికి వెళ్ళిపోయ్యాడు.

పూర్వం కేవల తన జీవితాన్ని గూర్చే తీవ్రంగా ఆలోచిస్తుండేవాడు; ఇప్పుడా దిగులు లేదు. తాను ప్రతి పనీ యాంత్రికంగా చేసుకొని పోతున్నాడు. గడియారంతో పాటే ఒక క్రమవిధానంలో జీవితం సాగుతోంది. అసలు సమస్యలు వేధించడమంటూ లేదు కనుక నిర్లిప్తంగా కాలం గడుస్తోంది.

కొన్నాళ్ళుగా లలితను గూర్చి తీవ్రాలోచనల్లో పడ్డాడు. ఇప్పుడు తన జీవితానికి ఆమే ప్రముఖ సమస్యగా తయారైంది. ఆమె భావాలు, ఉద్దేశాలు ఏమిటి ? దిగజార వలసినంతవరకూ దిగజారిందని చూస్తేనే అర్థమౌతోంది. పతనమైన వ్యక్తి, తిరిగి ఆధారమంటూ దొరగ్గానే పైకి పాకేందుకు విశ్వప్రయత్నం చేయటం సహజమే! కాని లలిత తాను చేయూతనిచ్చేందుకు సిద్ధపడినా, తనను అసహ్యించుకునేట్లుగా, నిష్కారణంగా విదిలించి వేస్తుందెందుకని ? తన చెడురోజుల్లో ప్రపంచమంతా తనను విడనాడినప్పటికీ తనకు బాసటగా నిలిచిందామె! అందుకు బహుశా ఆమె ఒక ప్రతిఫలాన్ని ఆశించి ఉండ పోవచ్చు. కాని తన దుర్దినాలలో, సహాయాన్ని నిరాకరించటంలో ఆమె ఉద్దేశమేమిటి ?

పోనీ యీ సహాయమనేది ముక్కూమొహం ఎరుగని వ్యక్తినుంచి రావటం లేదు. అనేక సంఘటనల్లో తన రక్త బంధువుకన్న అధికానురాగంతో ప్రవర్తించిన లలిత, యీ నాడు తనకు ఏమీ కాదనుకునే పతన స్థితికి తానింకా దిగజార లేదు. విశ్వాసం

ఒక్కటే కాదు; స్నేహం పెంపొంది, సఖ్యసీమలోకి వచ్చినప్పుడు ఆత్మలు అనుభవించే ఒకానొక గాఢానురాగం, ఆత్మీయత తాలూకు మాధుర్యం. ఒక్కసారిగా ఆమె యీ ఆత్మీయతకు అతీతురాలై వుంటుందనేది నమ్మలేని సంగతి.

తనకోసమని ఆమె గౌరవాగౌరవాలను లెక్కచేయలేదు. సమాజాన్ని కాలితో తన్ని తనకు సేవచేసి, మృత్యుముఖంలో పడినవాణ్ని బతికించింది. సాహిత్యంలో ఎంతో అండగావుంది. తను సక్రమ మార్గంలో నడిపించింది. చివరకు తన నగ అమ్మయినా సరే తనకు సహాయపడేవరకూ వెళ్ళింది. ఒళ్ళు జలదరించే యీ సంఘటనలు జ్ఞాపకమున్నంతవరకూ లలిత తనకు ఆత్మీయురాలుగాక, కేవలం స్నేహితురాలు మాత్రమేనని ఎలా అనుకోగలడు?

ఇదంతా తనవైపు వాదన. మరి ఆమె మనోభావాలేమిటో? లలిత అభిమానవతి అని తనకు తెలుసు. బహుశా అందుకే తనకు ఇతరుల సహాయపడటాన్ని ఆమె యీసడించుతూ ఉండవచ్చు. కాని ఆ ఇతరుల్లో తాను ఉన్నప్పుడు, తాను ఒక ఆత్మీయుడనే భావనే ఆమెకు ఉన్నట్లయితే, తాను చేసిన తప్పుల్ని మన్నించగల విశాల హృదయం తనకు ఉన్నదని ఆమె నమ్మితే, తనని ఎందుకు దూరంగా నెట్టివేసేందుకు ప్రయత్నించాలి? తనకు తెలిసినంతవరకు తానే అపచారమూ ఆమె పట్ల చేయలేదు. మగువల మనసులోని మర్మమే అలాంటిదా? స్త్రీ హృదయపు లోతులు అంతుబట్టనంతగా ఉండవనే లోకోక్తి నిజమా? ఇదంతా తాను ఎంత తలబద్దలు కొట్టుకున్నా అంతు తేలని విషయాలు; తనంతట తానుగా ఆమె చెప్పవలసిందే కాని, తెలుసుకునేందుకు మరో మార్గం లేదు.

పతనమైనవారు, ఒకప్పటికన్నా తమ పతనాన్ని తెలుసుకొని పశ్చాత్తాపంతో కుళ్ళిపోతారు. కాని లలితలో అలాంటి ఆవేదనా ఛాయకూడా తాను చూడలేకపోయాడు. కొంతమంది మూర్ఖులు, తమ స్థితిని కూడా తెలుసుకోలేని దురవస్థలో ఉండటంవల్ల, ఆ భంగపాటును లెక్కచేయక పోవచ్చు. కానీ ఈడును మించిన తెలివితేటలూ, లోకజ్ఞానం వున్న లలితను మూర్ఖురాండ్రలో తాను జమచేయలేడు; మరి ఆమె ప్రవర్తనకు అర్థమేమిటి?

ఏ కల్లోలం ఆమె మనో నిబ్బరాన్ని కాపాడుతోంది? చిన్న చిన్న వేషాలు వేసేందుకూడా సిద్ధపడిన స్థితికి వచ్చిందంటే ఆర్థికంగా ఆమె ఎంత హీనస్థితిలోవుందో తేలిగ్గా తెలుస్తోంది. విలాస జీవితాన్ని గడపటంలో ఆమె ఉత్సాహం చూపుతోందని కూడా తాను చెప్పలేడు. ఎందుకంటే కృత్రిమమైన ఆమె ముఖకళలు, తన స్థితి ఎవరికైనా తెలిసిపోతుందేమో అనే భయంతో పళ్ళు బిగించుకోవటమే జరుగుతోంది; ఆ ముఖకళల వెనుక, ఒకానొక కల్లోలిత మహాసాగరమే ఉన్నదనే సంగతి, అప్పుడప్పుడు ఆ అలల తాకిడి నిర్మలమైన ఆమె ముఖం మీద తమ ప్రభావాన్ని చూపుతున్నవనే సత్యం తాను స్పష్టంగా చూడగలిగాడు. చివరకు తాను చూపిన సానుభూతిని ఆమె అపార్థం చేసుకుందేమో! లేక సానుభూతివల్ల

తాను మరింత బాధపడవలసి వుంటుందని దూరమౌతోందేమో? ఇలాటి మనోస్థితిని తాను అనుభవించి ఉన్నాడు. తన ప్రియబాంధవి లలిత జేసే సహాయానికి అనేక సార్లు మండిపడ్డాడు; ఒక రకంగా ఆమెను దూరాన ఉంచేందుకే ప్రయత్నించాడు. అదేవిధంగా లలిత కూడా తననుంచి పారిపొయ్యేందుకే ప్రయత్నం చేస్తుందేమో!

ఈ తలంపుకు తాను ప్రాముఖ్యత నివ్వలేక పోతున్నాడు; ఎందుకంటే అది తనను బాధిస్తుంది కనుక; మరొక్క అవకాశం వుంటే ఆమెను తప్పకుండా నచ్చచెప్పి, ఉద్ధరించలేక పోయినా కనీసం శేషజీవితం ప్రశాంతంగా గడిపేందుకు ఒప్పించ వొచ్చనే ఆశవుంది. ఆ ఆశ సఫలీకృత మయేందుకే తాను ఎదురు చూడటం మినహా మరో దారిలేదు.

# 36

ఆశించిన అవకాశాలనేవి అనుకున్నంత తొందరలో వొస్తే జీవితాల్లో నిరాశలంటూ ఉండవేమో! లలితను గూర్చి ఆలోచించే కొద్దీ తాను పిచ్చివాడై పోతున్నాడేమోననే అనుమానం అనేక సార్లు తొలుకుమంటోంది. ఎక్కడున్నా ఏరోడ్డు మీదనో కనిపిస్తుందేమోననే ఆశతో అనేక సార్లు గమ్య స్థానం లేకుండానే, ఎంతో జాగర్తగా నడిచిపోయే జనాన్ని చూస్తూ, నగరంలో కారులో వందల వేల మైళ్లు ప్రయాణం చేశాడు. ప్రమాదాలనేవి సంభవించటం కద్దుకాని కావాలన్నప్పుడు వొచ్చీ, అక్కర్లేదన్నప్పుడు రాకా ఉన్నట్లయితే, అవి అనుకున్న సంఘటనలే అయేవికాని ప్రమాదాలు మాత్రం అయేవి కానేరవు. ఇక ప్రమాదాలు చెప్పి వొచ్చేవి కావు; అలా అయినట్లయితే మానవుడు అనేక ప్రమాదాలకు గురికాకుండా హాయిగా ఉండగలిగేవాడు. అందుకనే తాను చేసిన ప్రయత్నాలు దాదాపు అన్నీ వ్యర్థమైనవి.

ఒకనాడు సినిమా హాలుబైట వలపన్నిన జాలరి చూపుల్తో లలిత నిలబడివుంది. తానామె దగ్గిరికి వెళ్ళాలనుకునేటంతలోనే ఎవరో ఇద్దరు యువకులు ఆమెను వెంట పెట్టుకొని వెళ్లిపోయారు. మనస్సు చివుక్కుమంది; యీ ముక్కు మొహం తెలియని మొగపురుగుల కత్తో శిక్షల్ని భరిస్తూ ఆమె ఎలా కాలం వెళ్లబుచ్చుతోందో! క్రిందటిసారి బస్ స్టాప్‌లో చూసిన దానికీ, ఇప్పటికీ ఆమె ఆరోగ్యం ఎంతో దిగజారిందని తాను గ్రహించ గలిగాడు. తానామెను కాపాడే స్థితికూడా దాటిపోయిందనే అనుమానం కలిగిందికాని, చావనున్నాడని తెలిసిన రోగికిసైతం శక్తి వంచన లేకుండా చికిత్సచేసే డాక్టర్ కుండే ఆశల్లాంటివి, సమయానికి ఏదివ్యశక్తుల్లో సహాయపడి గట్టెక్కిస్తవనే ఆశ వొదలటం లేదు.

తానామెను చూశాడు కాని, అదృష్ట వశాత్తు ఆమె తనను చూడ లేదు; చూసినట్లయితే మరింత క్షోభపడి వుండేదేమో! అదొక్కటి కొంతలో కొంత నయ మనిపించింది.

తనమీద తనకే సానుభూతి లేనిస్థితికి లలిత దిగజారిందంటే, ఎంతగా బాధ పడి మొద్దుబారి పోయి వుంటుందో తాను తెలుసుకోగలడు. కాని తనను బాగా అర్థం చేసుకోగల మరొక వ్యక్తి ప్రపంచంలో ఉన్నాడనీ, ఏనాటికైనా ఆ వ్యక్తి తనను రక్షించేందుకు వీలైతే తనను సుఖపెట్టేందుకు ప్రయత్నిస్తాడనీ తెలుసుకో లేక పోయిందా? ఏమో-తాను కూడా మారిపోయానని ఆమె నమ్మకమేమో? ఆమె యీ నమ్మకం ఆధారం లేదని రుజూ చేసుకునేందుకు తాను సిద్ధంగానే ఉన్నాడు, ఆ అవకాశమే రావటం లేదు

ఆత్మహత్యా ప్రయత్నంలో నీళ్లలో మునిగిన వాణ్ని రక్షించబోతే, రక్షించ బోయినవాడు కూడా మునిగి చావ వలసిన పరిస్థితి రావొచ్చు; అదే విధంగా లలితను రక్షించబోతే, తానుకూడా పతనమవలసి వుంటుందనే సద్భావనలో ఆమె తన సహాయాన్ని నిరాకరిస్తోందేమో! ఐతే తానిప్పుడు అతి శ్లాఘ్యుడు! ఐశ్వర్యవంతుడు! తన మాటకు ఎదురాడే సాహసం ఇప్పుడు సమాజానికి లేదు. ముఖ్యంగా తనకు నా అనేవాళ్లు లేక, జీవితపు ఎడారిలో ఒంటరిగా ప్రయాణం చేస్తున్నాడు; తన బతుకు అర్థం లేనిదిగా, వ్యర్థంగా సాగిపోతోంది. కనీసం లలిత—మట్టిలో పడి పోయిన మణిని ఏరుకునేపాటి అదృష్టమన్నా తనకు లేకపోయె!

ఎవర్నని ఏంలాభం? మనుషుల చిత్ర విచిత్ర ప్రవృత్తులు, అనేక సంఘటనల ప్రభావంతో జీవితాలు దొర్లిపోతున్నవి. అవి ఎటుపోతున్నవో, పర్యవసానం ఎలాంటిదో ఎవరికీ తెలియదు. తెలియనట్లు ఊరుకునేందుకు వీల్లేదు. నిజానికి తనకీ స్థాయి వొస్తుందని నాలుగేళ్ల క్రితం ఎవరన్నా అనివుంటే వాళ్ల మొఖంలో నవ్వి, మూర్ఖులని తనే అని ఉండేవాడు! అదే విధంగా లలిత యీ నీచ స్థితికి వెళ్తుందంటే, ఆ అన్న వాడి మొహం పగలగొట్టి ఉండేవాడు. కాని యీ రెండూ జరిగినవి. అలాటప్పుడు జీవితానికీ, సంఘటనలకూ ఒక సమన్వయాన్ని ఏర్పరుచుకొని, స్పష్టమైన ఒక దారిని చూడగలిగేందుకు యీ భౌతిక నేత్రాలు, తెలివితేటలూ ఎందుకూ కొరగాకుండా పోతున్నవంటే ఆశ్చర్యం ఏమిటి?

రోజులు గడిచిపోతూన్నవి: క్యాలెండర్లు మారుతూన్నవి. కాని తన జీవితంలో మాత్రం మార్పేమీ లేనట్లే తనకు తోస్తున్నది; పైవాళ్ళకు మాత్రం తానెంతో కీర్తి గడించినట్లు, ఎంతో ధనం సంపాయించినట్లు, ఎంతో గొప్పవాడై పోయినట్లు కనిపిస్తోంది. యీ ఐశ్వర్యమంతా కూడా తనను సుఖపెట్టలేనిదే అయింది. జీవితమే కొరగానిదిగా తయారైంది.

మానవుడు ఆశించేదేమిటి? ఒకప్పుడు తాను ధన సంపాదన చేయగలుగుతే, కనీసంగా చావకుండా బతికి ఉండేందుకు సరిపడిన డబ్బు మాత్రం ఉంటే, జీవితంలో మరేదీ అక్కర్లేదనీ, అదే జీవిత పరమార్థమనీ నమ్మాడు. కాని యీనాడు లెక్క పెట్టేందుకే బద్ధకించినంత ధనం వుందిగానీ, తాను ఎంతో అసంతృప్తి పాలవుతున్నాడు. ఎందుకని?

-బహుశా ఒక ఆశ సఫలీకృతం కాగానే, దానిపై ఆశనైపు మనసు మళ్ళుతోందా? కావొచ్చు. యీ విధంగా మానవుడు నిర్మించుకొనే ఆశల తాలూకు నిచ్చెనలకు చివరి మెట్లు ఎక్కడ? బహుశా లేవేమో! ఒక్క మృత్యువే అన్ని ఆశలకూ నిర్ణయించబడిన చిట్టచివరి మెట్టుగా విధి నిర్ణయించి ఉండనట్లయితే, యీ మానవుడి గతి ఏమైవుండేదో! ఇంకెంత దుర్మార్గుడుగా తయారయేవాడో!

ఐతే తనకు తోడు నీడ మరొకరుండాలని మనసుపడే ఆవేదనకు యీ ప్రపంచంలో అనేక ప్రక్రియలున్నాయి. ఉదాహరణకు: యీ నాడు తాను 'ఊఁ' అనాలే కాని, లలితకన్నా సౌందర్యవతులు, ఉన్నత వంశజులు, చదువు సంస్కారాలున్న వారు అనేకులు తనను వరించగలరు. కాని తనకు ఎవరిమీదా మనసుపోవటం లేదు. ఎందుకంటే పూర్వపు స్థితిలోనే తాను ఉన్నట్లయితే, వీళ్ళలో ఎవ్వరూ తన మొహం కూడా చూసేవాళ్ళు కాదు; ఇప్పుడు తానొక ఆత్మబంధువే ఐనట్లు, జీవితారంభం నుంచీ తన గొప్పతనాన్ని వారు గుర్తించినట్లే నటిస్తారు. ఇలాంటి కృత్రిమ సానుభూతులు, అనురాగాలు తనకు అవసరం లేదు. తనను తాను మోసగించుకొని, ఇతరుల్ని కూడా మోసగించవలసిన దుస్థితి తనకు అవసరం లేదు. ఏదైతే తనకు కావాలని అలిగే, భీష్మించుకొనే కుర్రాడివలెనే, తాను మిగతా విషయాలన్నిటినీ ఒక పక్కకు నెట్టి, అలిగి కూర్చున్నట్టు తయారయ్యాడు. ఒకవేళ తాను కోరినట్లు జరక్కపోయినా విచారం లేదు; ఎందుకంటే తన కోరిక ముందు, మిగతావన్నీ అత్యల్పాలు; అవి లభ్యమైతేనేమి? కాకుంటేనేమి?

లలిత విషయం ఆమెను కన్న తల్లిదండ్రులే వొదిలేశారు; ఆలాటప్పుడు తనెందుకింత మధన పడతాడు? లలిత పతనంతో పాటు, ఒక విధంగా తానూ పతనమయ్యాడు. లలిత తనకు ఆధారంగా ఉన్నన్నాళ్లూ, కనీసం, అలాంటి ఒక వ్యక్తి తన పక్షాన వున్నదనే నమ్మకం ఉన్నరోజుల్లో; తాను తన ఉత్తమాదర్శాల కోసం ఎంతో కృషి చేశాడు. లలిత దూరమైన నాటినుంచీ తన ఆదర్శాలన్నీ ఏమైనవో? తనను సక్రమమార్గాన నడిపి ఉత్తమసాహిత్య కళాకారునిగా రూపొందించే ఒకానొక దివ్యశక్తి చూపుమేరలో లేకుండా పోయింది. వ్యక్తిగతంగా తనకు కలిగిన యీ విఘాతం లలిత వల్లనేననీ, తిరిగి ఆమె స్నేహాన్ని పొందగలుగుతే తనకు ముక్తి వుండగలదనే నమ్మకమే యీ వేదనకు కారణం కావొచ్చు.

ఒక అసంతృప్తి, మిగతా సంతృప్తుల నన్నిటినీ దిగమింగుతుందంటే, ప్రస్తుత తన వేదనే ఇందుకు తార్కాణం. తమాషా: సమయం మించిపోయిందనే జ్ఞానం కూడా మాయమైంది. ఆమె తిరస్కృతికి కూడా తనకు నిరుత్సాహం లేదు. అర్థం కానిదల్లా ఆమె ప్రస్తుత మనస్తత్వం. ఒక్కటే ఆశ—తనంటే ఆమెకెంతో గౌరవం; తను చెప్పే మాటల్ని కాదన లేదు; ఐతే యీ సమయంలో మాత్రం ఆమెకు కొంత నచ్చచెప్పాలి. ఎప్పుడు? ఎక్కడ? యీ రెండే తేలని గడ్డుసమస్యలు. ఆ శుభ సమయం కోసం ఎదురుచూడ సాగాడు.

# 37

మళ్లీ రెండేళ్ళు గడిచినవి: యీ రెండేళ్లలోనూ తన వయసు పెరగటం, దానితో పాటే బ్యాంకు ఎకౌంట్లలోని నిలవ పెరగటం తప్ప, చెప్పుకోదగ్గ మార్పులేమీ జరగలేదు. లలితను గూర్చి తాను విచారించటం, ఆమె ఎక్కడవుంటుందో ఎలావుంటుందో కనుక్కోవటం, మానేశాడు. ఎప్పుడన్నా కనిపిస్తుందనే గుడ్డి ఆశ వుంది. దాని తీవ్రత కూడా ప్రస్తుతం లేదు. విచారించటంవల్ల సమస్యల స్వరూపం భీకరాకృతుల్ని దాలుస్తుంది—కనుక అందువల్ల లాభం లేదు.

ఇలా వుంటూండగా—ఒక నాడు ఒక కొత్త ఫిలిం కంపెనీతో కాంట్రాక్టు జరిగింది. తనలాంటి శతదినోత్సవ రచయిత దొరకటం గొప్ప అదృష్టంగా భావించిన నిర్మాతలు, ఆ రాత్రి డిన్నర్ పార్టీ సన్నాహాలు చేసి తనను ఆహ్వానించారు. ఇలాంటివి తనకు బొత్తిగా ఇష్టంలేదు. సభలు, సమావేశాలు, విందులు మొదలైన వాటికి వెళ్ళే అలవాటూ లేదు. ప్రజలు తనకు అంటగట్టిన ఆ వెధవ గొప్పతనం తనకు మాత్రమే అర్థం గాకుండా వుంది. యీ విందుకూడా తాను వెళ్ళకపోయేవాడే కాని, తీరా వాళ్ళు సమయానికి ఇంటికి వొచ్చి బలవంతంగా లాక్కువెళ్ళారు.

దాదాపు ఊరిబైటవున్న పెద్ద బంగళా. విశాలమైన గదులు. ఐదారుగురు మాత్రమే అతిథులున్నారు. యీరకం విందులు తనెప్పుడూ ఊహించలేదు కూడాను. టేబిల్ చుట్టూ చేరిన అతిథులకు, బ్రాందీ పోయటంలోనూ, సోడాలు కలపటంలోనూ ఇద్దరు సేవకులు నిమగ్నులై ఉన్నారు. యీ దృశ్యాన్ని చూసేప్పటికి తాను చాలా అసహ్యించుకున్నాడు: తనకు తెలియకుండానే సాలెగూడులోకి ఇరుక్కున్నట్లు తోచింది.

బ్రాందీ వాసనే తనకు గిట్టదు: మధ్యలో లేచివెళ్ళటం బాగుండదు. తనకా అలవాటు లేదన్నాడు: వాళ్లు బలవంత పెట్టగా అవతలికి నెట్టివేశాడు. మిగతావాళ్లు మాత్రం దాహమైనవాడు మంచినీళ్ళు తాగిన విధంగా, తాగేస్తున్నారు. వాళ్ళు మాట్లాడే భాషకూడా తనకు చాలా కొత్తగా వుంది. ఒక వాక్యానికీ, మరోవాక్యానికీ సంబంధం లేదు. నిర్విణ్ణుడై, మతిపోయి, పరమ మూర్ఖునివలె తల తిరిగి నిలబడి పోయ్యాడు. యీ నరకంనుంచి ఎంతత్వరగా బైట పడదామా అని ఆలోచిస్తున్నాడు.

రెండు గంటలసేపు తాగుడు సాగింది; వాళ్ళ ఆనందమేమిటో తెలియదుకాని, భరత నాట్యాలూ, పాటలూ ఆరంభమైనవి. యీ రభసతో తల దిమ్మెక్కుతోంది. యీ రకం మనుషులతో తనకు స్నేహమేమిటి? వ్యాపారం మాత్రం దేనికి?

ఆ తరువాత భోజనాలు. రకరకాల పదార్థాలూ వొడ్డించబడినవి; అందులో మాంసాహారం ఎక్కువ. అదంటే తనకసలు పడదు. మిగతావాళ్ళుముంచుకుంచిన పదార్థాలను చూస్తుంటేనే తనకు వాంతుల పర్యంతమౌతోంది. ఒక పక్క ఆకలివేస్తున్న

ప్పటికీ తానేమీ తినలేక పోయ్యాడు. మానవుల్లో ఇంత నీచులుంటారని తానెప్పుడూ అనుకోలేదు.

భోజనాలు పూర్తయ్యాక, ఇక ఇంటికెళ్లే ప్రయత్నంలో ఉండగా బైట కారు ఆగిన శబ్దమైంది. తన దృష్టంతా ఇక్కణ్నుంచి బైటపడటం మీదనే ఉంది కనుక తాను గమనించాడు కాని, ఇతర అతిధులు వాళ్ళ లోకంలో, మైకంలో ఊగిపోతున్నారు. ఇంతలో ముగ్గురు యువతులతోపాటు ఒక ముసలాడు దిగాడు. ముసలాడు మూలకు వో తిగిలి నిలబడ్డాడు; ఆ యువతులు మాత్రం హాలులోకి వొచ్చి. తమను ఆహ్వానించే వారికోసం వేచి ఉన్నారు.

'రండి...రండి ఇలా కూర్చోండి–' అన్నాడు నిర్మాత దగ్గిర పలుకుబడి కోసం పాకులాడే పక్షీంద్రుడు.

వాళ్ళు సిగ్గుపడుతూ, లేదా సిగ్గు నటిస్తూ, వయ్యారం వొలకబోస్తూ వొచ్చి అల్లంత దూరానవున్న సోఫాలో కూలబడ్డారు. తానిదంతా గమనిస్తూనే ఉన్నాడు; కాని తననెవరూ గమనించటం లేదు; అసలు తానంటూ అక్కడ ఉన్నాడనే విషయమే వారికి పట్టలేదు.

యీ వొచ్చినవాళ్లు ఎవరో, ఎందుకొచ్చారో తనకు తెలియక పోలేదు. మొదటినుంచీ యీ బంగళాలోని వాతావరణాన్ని తాను ఏవగించుకుంటూనే ఉన్నాడు; ఇప్పుడది హద్దులు దాటింది. ఇక ఆ ప్రదేశంలో క్షణంకూడా నిలవలేనని తేల్చుకున్నాడు. ఇందాకటి నుంచీ ఏదో మర్యాదకోసమని భరించాడు కాని; ఇక లాభం లేదు.

'నేను వొస్తాను–' అని లేచి నిలబడ్డాడు.

'ఉండండి కవిగారూ! అమ్మాయిలుకూడా వొచ్చారు. ఇప్పుడు వెళ్తానంటారేమండీ!' అన్నాడు పక్షీంద్రుడు. ఒక చెడుపని చేసేప్పుడు కొంతమంది తోడు ఉండటంవల్ల ఆ పనిలోని చెడుకనిపించకుండా ఉంటుందేమో మరి? కాకపోతే ఇష్టం లేనివారి కూడా నచ్చచెప్పి దురభ్యాసాల పాలుచేయటంలో గురుత్వాన్ని వహించే వారి మనోతృప్తి ఏమై ఉండగలదు?

తాను వినిపించుకోకుండా పోబోయ్యేంతలో, ఒకామె చప్పున మొహం అవతలికి తిప్పేసింది. అతాత్తుగా ఆమె లలితై వుంటుందనితోచి, వెళ్తున్నవాడల్లా ఆగి తేరిపార చూశాడు; లలితేనని నిర్ణయించుకున్నాడు. ఇక యీ సమయంలో ఆమె యీ ప్రదేశ నుంచి తప్పించుకొని పోలేదు. తాను సంవత్సరాల తరబడిగా వేచి కూర్చున్న ప్రమాదం అనుకోకుండానే వొచ్చిపడింది. యీ సమయం దాటితే తిరిగి ఆమెను తాను కలవలేడు. ఇక్కడేవుండి ఆమెతో మాట్లాడే అవకాశాన్ని పొందాలనే నిశ్చయం క్షణంలో కలిగింది. కొన్ని చెడుపనులకు సిద్ధం కావటం, మంచి వాటిని సాధించేందుకే కావొచ్చేమో?

చాలు; ఇకముందు తానందుకు ప్రయత్నించాలి. లలితను బట్టి ప్రపంచంలో అదే స్థితిలో వున్న వారి మీద సానుభూతుల్ని విస్తరింప జేసేందుకు ఇది సమయం కాదు.

పక్షీంద్రుడు 'మీరు పైకిరండి —' అని తనను పైకి తీసుకెళ్ళి విశాలమైన పడక గదిలో కూర్చోపెట్టి ఫాన్ వేసి, 'ఇప్పుడే పంపుతాను—' అంటూ కిందికి వెళ్ళి పోయ్యాడు.

లలిత ఏం మాట్లాడుతుందో, తనతో ఎలా ప్రవర్తిస్తుందో, అభిమానంతో కుంగిపోయి, యీ దుస్సంఘటనకు తల్లడిల్లి పోతుందేమోనన్న బాధ కలుగుతోంది. తన ప్రయత్నం మాట ఎలా వున్నా ఆమె అనవసర వేదనకు గురికాకుండా, చాలా తెలివిగానూ, మెలకువగానూ ప్రవర్తించాలని తనకు తాను హెచ్చరిక చేసుకున్నాడు. ఆ క్షణాలు దగ్గిరవుతూన్నవనే తలపు తన ఆత్రాన్ని హెచ్చించి, భయపెడుతూన్నది.

దాదాపు అరగంటవరకూ తెక తెక లాడి పోయ్యాడు. మెట్ల మీద పాదాల సవ్వడి వినవొస్తుందేమోనన్న ఆశతో చెవులు అటే నురచేసి ఉన్నాడు; క్షణమొక యుగంగా గడిచాక, మెట్ల మీద చప్పుడైంది. ఏదో తెలిసిన దుస్సంఘటనను ఎదుర్కోబోతున్న వాడివలె పిరికిపడ సాగాడు.

గదిబైట వరాండాలో ఇద్దరు వ్యక్తుల గాఢమైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విన వొచ్చినయ్; మాటలేమీ సాగకున్నా, వారు ఒకరినొకరు ప్రతిఘటిస్తున్నట్లు అర్థమైంది. ఏమైవుంటుందో కూడా తాను తేలిగ్గా ఊహించ గలడు. లలిత తనను చూసేందుకే ఇష్టపడటం లేదు. వాడు ఎలాగైనా ఆమెను బలాత్కరించయినా సరే తన దగ్గిరకి పంపేందుకు ప్రయత్నిస్తున్నట్లున్నది. లలిత ఇప్పుడు బోనులో చిక్కిన ఎలుక వలె కొంతలో కొంతగా ప్రతిఘటిస్తున్నట్టు తోచింది.

ఇలాంటి పరిస్థితిలో ఆమెను బాధించడం నిజంగా దారుణమే! ఐతే తానామెను కలుసుకో దలచుకున్నది దుర్బుద్ధితో కాదు. మొదటి మెట్టుమీద కాలు జారిన స్త్రీని ఆమె ఆత్మ బంధువుల దగ్గిర్నుంచీ సమాజం దాకా అందరూ విడనాడుతారు; ఆమెను రక్షించబోతే తాము కూడా ఆ మెట్లమీదనుంచి జారవలసి వుంటుందని వారి భయం! ఐతే తాను ఆమె చివరి మెట్టు దాకా దిగజారినా సరే, ఎలాగైనా తిరిగి పైకి తీసుకొని రావాలనీ, సమాజంలో తిరిగి ఆమెను స్వస్థానానికి జేర్చకపోయినా, కనీసం ఆమె, నిత్యజీవితం సాఫీగా సాగేట్లన్నా చేయాలనే ప్రయత్నంలో ఉన్నాడు. బహుశా యీ సంగతేదీ లలితకు తెలియకనే ఆమె తన ఎదుట పడేందుకు జంకుతూండి వుంటుంది. నేరస్థుడు న్యాయస్థానాన్ని ఎదుర్కొనేటప్పుడు పొందే నరాల బలహీనత్వం, వికారాల్లాటివి ఆమెలో పనిచేస్తూండి ఉండొచ్చు.

ఐతే యీ సంఘటనను ఎదుర్కొనేందుకు ఆమె ఎంత భయపడుతుందో, తనూ అంతే భయపడుతూన్నట్లు తోస్తోంది. న్యాయస్థానంలో న్యాయాధికారులకు దోషి అని తెలిసిన, లేదా భావించబడే వ్యక్తిమీద ఒక గొప్ప అధికారాన్ని చెలాయించే అవకాశం వుంటుంది. అలాటిది ఇక్కడ తనకూ ఉన్నదనే అనుకోవాలి;

ఎందుకంటే ఒక పురుష్యాన్ని సాహసాన్ని సక్రమ మార్గం లోకి లాక్కొచ్చేందుకు కొంత నైతికాధికారాన్ని కలిగి ఉంటాడు. అంతేకాకుండా సామాజికంగా చూసినా లలిత కన్న తాను కొన్ని రెట్లు బలవంతుడు. ఐతే వొచ్చిన ఇబ్బంది ఏమిటంటే తానా ఆధిక్యతను గ్రహించినప్పటికీ, దాన్ని అసలు జరపలేని అశక్తత తనలో బలీయంగా పనిచేస్తుంది. ఎందుకని?

ఒకప్పుడు లలిత తనకన్న అధికురాలు: ఒక విధంగా చూస్తే తన మీద ఆమె పలుకుబడులు తమ ప్రభావాల్ని చూపించి; యీనాటికీ తనకా ఆధిక్యతను దుర్వినియోగం చేయటానికి తన ప్రాణం వొప్పదు. యీ ఆధిక్యత, కేవలం ధనమూలానే ఉండటం ఒక కారణం కావొచ్చు. అంతేకాకుండా పరిసరాల పరిస్థితుల కారణంగా తనకీ అధికారం వొచ్చింది. ఇలాంటి పెద్దవ్యక్తిని లలిత మీద ప్రయోగించటం — దీనావస్థలో వున్న వ్యక్తి పట్ల సానుభూతి చూపటం లేకపోగా, అమానుషంగా ప్రవర్తించినట్టు అవుతుంది. అందుకనే తనకున్న అధికారాలు, ఎంత న్యాయమైనవి ఐనప్పటికీ, తాను వాటిని త్యజించ గలిగాడు. నిజానికి లలిత పట్ల ఎంతో జాలి, సానుభూతి చూపాలనే తాను ప్రయత్నించాలి: అది తాను చేస్తున్నా. ఈ సత్కార్యానికి తానెందుకు భయపడాలి?

ఎందుకంటే— తనవల్ల ఏదో గొప్ప దోషం జరిగినట్లుగా ఆరోపించిన లలిత మాటలు స్ఫురింప జేసినయ్. లేదా యీ పాపిష్టి సమాజంలోని వ్యక్తిగానే లలిత తననూ భావించి వుంటుంది. అన్నిటినీ మించి ఇన్నాళ్ళూ తాను [illegible] ప్రతి తప్పుగా సమర్థించినప్పటికీ, ఆ దోషాలన్నిటినీ తాను [illegible] గానే వున్నాడు. ఆ పాపాన్ని ఏమన్నా సరే, ఆ నిందలన్నిటినీ లలితకు మూలంగా తాను భరిస్తాడు. బహుశా అందుకనే లలిత పొందే కల్పనామాత్ర అనుభూతిలాంటిది తనను కూడా పీడిస్తూండి ఉండొచ్చు. ఒకవేళ ఇది నిజమైతే, ఒక దోషి, మరొక దోషితో మాట్లాడేందుకు భయపడటం విచిత్రమే! కాని ఎవరికి వారు అంతరాంతరాల్లో తాము తీరని అపచారాలు చేశామని తల్లడిల్లటం వల్లనే యీ విచిత్ర మనస్తత్వం తన ప్రభావాన్ని చూపగలుగుతోందేమో? అదీగాక తనకు తెలియకుండానే లలితకు తానేమన్నా అపచారం చేశాడేమోననే అనుమానం కూడా చాలాకాలంగా తనను పీడిస్తోంది; లలిత తనను తప్పించుకోనేందుకు ప్రయత్నించటం, ముఖాముఖంగానూ నిర్లక్ష్యంగానూ ప్రవర్తించటమే యీ అనుమానాలకు కారణం. అందుకని తనేం నేరం చేశాడో తెలుసుకోబోయ్యే నిందితుని బాధ కూడా తనను పీడిస్తోంది.

ఈ ఆలోచనలతో ఎటూ తెగక తల్లడిల్లుతూంటే బైట ఆ నీచుడు లలితను బలాత్కరించటం సాగుతూనే ఉంటుంది. చప్పున మైకం వీడి దుస్సంఘటన జరగకుండా ప్రతిఘటించ వలసిన బాధ్యత మీదపడినట్లు గ్రహించాడు. భయపడుతూ వొణికిపోవటంవల్ల ప్రయోజనం లేదు. తనకు తెలియని నేరాలను తాను చేశానేమోననే వెధవ అనుమానంవల్ల అసలేం లాభం? పురుషునిపలె ఎదుర్కోవాలనే జ్ఞానం కలిగి, తనకు తాను ఎంతో ధైర్యం చెప్పుకున్నాడు.

ఎక్కువసేపు మధనపడకుండానే గది బైటికి తొంగి చూశాడు. లలిత గోడ నానుకొని, పమిటచెంగు నోటికి అడ్డం పెట్టుకొని శిలాప్రతిమవలె నిలబడి వుంది. పక్షీంద్రుడు ఆమెకు నచ్చచెప్పేందుకు ప్రయత్నిస్తున్నాడు; కాదు—బతిమాలుతూ న్నట్లున్నాడు. ఆమె పెంకెతనం చేస్తుంటే, ఎలాగైనా తన వృత్తి ధర్మాన్ని నిర్వ హించేందుకు వాడు సతమత మౌతున్నాడు.

'ఇక నువ్వెళ్ళు—' అన్నాడు తాను; పక్షీంద్రుడు బతికి బైటపడినట్లు సంతోషించి, మెల్లిగా జారుకున్నాడు.

'లలితా! భయపడకు...లోపలికిరా' అన్నాడు తాను.

ఆమె వొంచిన తల ఎత్తనూ లేదు; ఉన్నచోటనుంచి కదలనూ లేదు.

తన అసమ్మతిని ప్రకటిస్తోంది. మళ్ళీ ఏదన్నా అని నచ్చచెప్పటం తన వొంత యింది.

'ఇక్కడ ఎవరైనా చూస్తే బాగుండదు. మనం ఆ గదిలో కూర్చోవొచ్చు. లలితా! రా—' అన్నాడు.

ఆమె ఒక్క క్షణం ఆలోచించి, ప్రతిఘటన లాభం లేదని, తేల్చుకున్నట్లుంది; బరువుగా, మెల్లిగా గదివైపు నడవ సాగింది.

# 38

గదిలో డిమ్మర్ వెలుగుతోంది. ఆ వెలుగు గదినంతటినీ ఆక్రమించుకోలేక పోతోంది. లలిత మాత్రం గది గోడకు అనుకొని తల వొంచుకొని దీర్ఘాలోచనలో వుంది.

తాను పెద్దలైటు వేశాడు. వెంటనే ఆమె తన పమిట చెంగుతో ముఖాన్ని దాచుకొని 'ఆ లైటు తీసెయ్యండి—' అంది. నిందితులు ఆత్మాభిమానం తో కుంగి పోతూ, తమ ముఖాలను చూపేందుకు బాధ పడటం సామాన్యవిషయమే! ఐతే తాను లలితను నిందితురాలుగా భావించటం లేదు: ఆ సంగతి బహుశా ఆమెకు తెలియదు. అందుకని ఆమె ఇష్టప్రకారమే పెద్ద లైటు ఆర్పేశాడు.

'లలితా! ఇలా కూర్చో—' అన్నాడు.

ఆమె అనుమానించి, ఊరుకుంది.

'లలితా! కూర్చో' అన్నాడు తాను; యీ సారి కంఠస్వరంలో ఆజ్ఞను స్ఫు రింప జేశాడు. ఒక్కసారి ఆమె ముఖమెత్తి చూసి, మారు మాట్లాడకుండా, మంచం మీద కూర్చుంది. పూర్వం తానేమన్నా చెపితే, ఆ మాటలమీద గౌరవ భావాన్ని చూపి, శిరసావహించటం తనకు తెలుసు; కాని ఇప్పుడామె, తన మాటల పట్ల భయాన్ని చూపినట్లు తోచింది.

ఆమెకు దగ్గిరిగా కుర్చీ లాక్కొని కూర్చున్నాడు. ఎలా మాట్లాడాలో అర్థం గాక, అసలు లలిత ఎంత మారిపోయి వుంటుందో అంచనా వేసుకునేందుకు వ్యర్థప్రయత్నం చేశాడు. ఆమె తనముఖం కనిపించకుండా పక్కచూపులు చూస్తోంది.

'లలితా.' అన్నాడు తను 'నేను నిన్ను చూడకూడ నంతగా చెడిపోయావా!'

ఆమె ఆశ్చర్యంగా తనవైపు చూసి, తనను తాను సంబాళించుకొని ముఖం పక్కకు తిప్పి 'లేదు' అన్నట్లు తల తిప్పింది.

'లైటు వేయనా?'

'వొద్దు' అందామె.

'లలితా! నువ్వెలా వున్నావో, ఎలా జీవిస్తున్నావో నేను చర్చించను. ఏ సంఘటనలు నిన్ను దూరతీరాలకు తరిమేసి నాశనం చేసినయ్యో కూడా యీ నాడు తెలుసుకున్నందువల్ల ప్రయోజనం లేదు. పీడకలను గూర్చి ఆలోచించటం కన్నా, దాన్ని మరిచిపొయ్యేందుకు ప్రయత్నించటం మంచిది. ఐతే, అవకాశాలున్నప్పుడు కూడా ఇంకా ఆ పాడుకూపంలో కొట్టుకులాడటం దేనికి? నాకు తెలుసు—యీ పాడుబతుకు నీకు కంటకప్రాయంగా వుంది—'

'అందుకని?' అందామె, కఠినస్వరంతో.

'అందుకని... నా దగ్గిరికి వొచ్చెయ్ లలితా! నేను ఎంతో సంపాయించాను. యీ నాడు నా అన్నవాళ్ళెవ్వరూ నాకు లేరు.'

'నాకూ లేరు; నా అన్నవాళ్ళు నాకు అక్కర లేదు!'

అలిగిన కుర్రాడు అర్థం లేని మారాం చేసే ధోరణి లలితలో స్పష్టంగా కనిపిస్తోంది. తాను నచ్చచెప్పగలుగుతే, ఆమె తన మనసు మార్చుకో వొచ్చు.

'అది కాదు లలితా! నీవు సుఖంగా బతకాలనే నేను ఆశిస్తున్నాను.'

'ధన్యవాదాలు... నేను సుఖంగానే ఉన్నాను—'

'లలితా! డబ్బుకోసం యీ నీచజీవితం బతకటంలో సుఖమున్నదంటే, కనీసం నీవామాట నమ్ముతావంటే, నేను నమ్మలేను. ఎన్నాళ్ళిలా బతకగలవు—?'

'ఏమో? నా జీవితప్రమాణం ఎంతో నాకు తెలియదు. నా దగ్గిర ఇంకా యవ్వనం వుంది; అందమూ వుంది. నేను సంపాయించుకో గలను. నాకు ఎవరి సహాయమూ అక్కర్లేదు. మీ గౌరవమర్యాదల్లో కానీ, మీ భాగ్యభోగాలలో కానీ నాకు వాటా అక్కర్లేదు.' అందామె పట్టుదలా, మొండితనమూ కలిసిన కంఠస్వరంతో.

తనను భాగ్యవంతుల జాబితాలో వేసి, ఉన్న భాగ్యంతో చేసే అనేక దుష్టచేష్టల్నీ తనకు అంటగట్టి, తన బీదరికపు వేదనను ధనవంతులమీద ప్రసరింపజేయటంలో లలిత తనను కూడా మినహాయించలేదు. ఐతే తాను మాట్లాడే ధోరణి వేరు; ఆమె ఆ మాటలకు తీసుకునే విపరీతార్థాలు వేరూను. ఈ విషయంలో ఆమె పొరబడటం లేదు; కావాలనే యీవిధంగా ప్రవర్తిస్తోందన్న సంగతి మూర్ఖుడు కూడా గ్రహించ గలడు.

'లలితా! ఒకప్పుడు నేను నిస్సహాయస్థితిలో ఉన్నప్పుడు నాకు ప్రాణదానం కూడా చేశావు. ఒకనాడు నీవు నర్సింగ్ హోంలో ఏమన్నావో గుర్తు లేదా?' అన్నాడు తాను; కనీసం ఆ వెనుకటి సంఘటనల్ని గుర్తు చేయటంవల్లనైనా, ఆమెలో కొంత మార్పు జరుగుతుందేమోనని ఆశతో.

'ఏమో — జీవితంలో అనేక మాటలు మాట్లాడుతాం; అవన్నీ గుర్తుంచుకో వలసినవి కావు!'

'నిజమే!' అన్నాడు తాను 'జీవితంలో అనేక మాటలు విలువలేనివీ, మనిషైన వాడు మాట్లాడకూడనివీ మాట్లాడుతాం. కాని చాలా కొద్దిమాటలు, ఎన్నటికీ మరిచి పోలేనివి, హృదయాంతరాళంలోంచి మానవత్వాన్ని మాత్రమే ఆధారం చేసుకొని బయల్వెడలుతవి. ఒకవేళ ఆ మాటల్ని అన్నవారు మరిచిపోవొచ్చునేమో కాని, ఆ మాటల్ని విన్నవారు, వాటి అర్థాన్ని జీర్ణం చేసుకొని, ఆ సారాన్ని అనుభవించిన వారు మరిచిపోలేరు కదా!'

'మరిచి పొమ్మని ఎవరు బలవంతపెట్టారు? చేసిన సహాయాన్ని మరవకపోవటం కృతజ్ఞతే కావొచ్చు. ఐనా ఇప్పుడా విషయాలెందుకు!' అందామె.

'లలితా! నీవన్నమాటలు నేను జ్ఞాపకం చేస్తున్నాను. నిస్సహాయస్థితిలో పడి వున్న నాకు సహాయం చేయటాన్ని, నీవేదో ధర్మం చేస్తున్నట్లు బాధపడి, నిన్ను అపార్థం చేసుకొని నేను వారించగా, నీవు నాకిట్లు చెప్పావు. ఆనాడు నీవన్నావు: 'మాష్టారూ! సహాయం చేయగలిగివుండి, చేయనివారు మానవులు కారు. వారికి మానవత్వంమీద నమ్మకమూ లేదు; గౌరవమూ లేదు!' అవే మాటలు నీకిప్పుడు ఎందుకు అనువర్తించవు! అందుకనే నేను హృదయపూర్వకంగా నిన్ను ఆహ్వానిస్తున్నాను. నేను చేసే సహాయంవల్ల నాగొప్పతనం పెరుగుతుందనీ, దాన్ని పొందినందుకు నీ తక్కువతనం అధికమౌతుందనే దురూహలు మన ఉభయులకూ ఉండవనే అనుకుంటున్నాను — ఏమంటావు లలితా!' అన్నాడు తాను, ఎలాగైనా ఆమె మనసు కరిగించాలని.

కాని ఆమె మనసు ఏనాడో గడ్డకట్టి శిలారూపాన్ని దాల్చిందనే సంగతి తానిప్పుడు గ్రహించవలసి వొస్తుందనుకోలేదు. తాను సంవత్సరాల తరబడిగా ఎరిగిన లలిత కాదామె! ఆమె శరీరాకృతిలోకి ఒక కొత్త లలిత, తాను ఊహించలేని వ్యక్తిత్వంతో ప్రవేశించింది.

'మీ సహాయం నాకు అవసరం లేదు—'

'నేను నీకేం అపకారం చేశాను లలితా?' అన్నాడు తాను బాధతో కుమిలిపోతూ.

పేలవంగా నవ్విందామె.

'నేనామాట అన్నానా? మీ జీవిత విధానానికి నే నెప్పుడన్నా ఆటంకాలు చెప్పానా? ఐనప్పుడు నన్ను నా బతుకెందుకు బతకనివ్వరు?'

ఎంతకోపం వొచ్చిందో తనకు! లలిత కావాలని నిస్సారమైన చర్చలకు దిగుతోంది.

'బతకు!' అన్నాడు తాను, వికటాట్టహాసంతో 'ఇదీ వొక బతుకేనా లలితా? నీకు నిజంగానే బతుకుమీద ఆశ ఉండటం నేరం కాదు కాని, కుక్కలాగు బతకటం కన్న, చావటం ఉత్తమోత్తమమని నీకు తెలియదా? చచ్చేందుకుగాను ఎన్ని మార్గాలు అందుబాటులో లేవు కనుక!'

ఆమె వెక్కి వెక్కి ఏడ్వసాగింది. తన ఆవేశంలో ఆమెను తాను గాయపరిచాడు. తనకు తెలుసు — ఆమె అభిమానవతి! ఆమె అభిమానం ఎంత గొప్పదంటే, తానున్న హీనస్థితిలో కూడా తనలాంటి మిత్రుని సహాయాన్ని సైతం నిరాకరించింది. తాను ఆ అభిమానం మీదనే దెబ్బ తీశాడు. తానంత కఠినంగా మాట్లాడి ఉండవలసింది కాదు. నోరు జారాక, ఆమెను ఓదార్చటం ఎలాగో తెలియటం లేదు.

'అది కాదు లలితా! నేను పొరపాటు మాట్లాడాను. క్షమించు.' అన్నాడు తాను.

'మీ తప్పేమీ లేదు—' అందామె దుఃఖాన్ని నిగ్రహించేందుకు ప్రయత్నిస్తూ, 'ఎన్నోసార్లు ఆత్మహత్య చేసుకుందామనే తలపు నాకు కలిగింది. పాపపుణ్యాలమీది నమ్మకం వల్ల నేను వెనుకాడ లేదు. ఎందుకు చావలేక పోయానో, భూభారంగా ఎందుకిలా బతుకుతున్నానో, మరో సారెప్పుడైనా అవకాశం వొస్తే చెప్పుకుంటాను.'

ఇప్పుడామె చెప్పేందుకు ఎందుకు సంకోచిస్తోందో తనకు అర్థం కాలేదు. ఇదివరకల్లనే తిరిగి తాను ఆమె తలలో ఆత్మహత్య చేసుకోవటమే మేలనే దురూహను కలుగజేశాడు. పూర్వం వలె గాక, ఇప్పుడీమె నిజంగానే ఆత్మహత్య చేసుకుంటుందేమో ననే కొత్త భయం తనకు కలగటంలో ఆశ్చర్యం లేదు. ఆమె ఎంత పట్టుదల గల మనిషో, తన భావాలకు ఎంత విలువనిచ్చి, సమాజాన్ని సైతం ఎదుర్కొనగల మనోధైర్యంగల వ్యక్తో తనకు తెలుసు. కనీసం యీ దుస్సంఘటన నుంచైనా తానామెను తప్పించ గలగాలి.

'లలితా! ఒక్క వేడ్కోలు—'

ఆమె మాట్లాడకుండా తలెత్తి చూసింది; కంటినుంచి నీరు కారుతోందనే సంగతి, తాను గ్రహిస్తాడని కాబోలు కళ్లు తుడుచుకుంది.

వాగ్దానం చెయ్యి లలితా! ఎప్పుడూ ఆత్మహత్య చేసుకోనని. కనీసం ఆ పని మాత్రం చేయకు

నవ్విందామె; నిస్సారంగా, జీవితంలో మరేమీ ఆశలు లేక, జీవితాన్నే రోసి, దానిపట్ల ద్వేషాన్ని ప్రకటించేందుకు గాను నవ్వే విషపు నవ్వది.

'నేను ఎప్పటికీ ఆత్మహత్య చేసుకోలేను. ఎలాగైనా బతికేందుకు ప్రయత్నిస్తాను. మనిషి బతుకులో గొప్ప ఆశయాలూ, ఆశలూ, సార్థకతా ఉండకపోవచ్చు. అలాంటి వాటి సంగతే తెలియకుండా కేవలం బతకటమే బతుకు అనుకొనే వారు

ధన్యులు! నేనిప్పుడు ఆ స్థితిలోనే ఉన్నాను కనుక నేను ఆత్మహత్య చేసుకోను. అదంత తేలికని మీరు పొరబాటు పడొద్దు!' అందామె.

నిజమే! అదంత తేలిక కాదనే సంగతి తన అనుభవంలో కూడా వుంది. తాను కుక్కకన్న హీనంగా బతికిన రోజులు, అనేక బాధల్ని భరిస్తూ, కనీసం అమ్మకోసమే బతుకుతున్నానని సరిపెట్టుకున్న రోజుల్లో కూడా ఆత్మహత్య చేసుకోలేదు; చివరకు అమ్మ చనిపోయాక కూడా తాను ఆత్మహత్య చేసుకోలేదు; అందుకనే అని ప్రతి మానవుడు చేయగలడనే నమ్మకం తనకు లేదు. ఏదీనావస్థలో లలిత ఇప్పుడు ఉన్నదో, తనుకూడా అలాంటి దీనావస్థలో ఉన్నాడు. భేదమల్లా ఆమె దినబత్యానిక్కూడా ఏదో వొక మార్గాన్ని అన్వేషించాలి. తనిప్పుడు ధనికుడు కనుక తనకా బాధ లేదు. ఉభయుల మనోవేదనా ఒక్కటే!

'లలితా! బతకటమే ఒక సమస్యగా బాధపడుతున్నావు కదా! కనీసం ఆ సమస్య నన్నా నన్ను పరిష్కరించనీ—'

'చెప్పాను కదా, నాకు ఒకరి సహాయం అక్కర్లేదని'

'సహాయం కాదు లలితా! పోనీ నా ఇంటి యాజమాన్యాన్ని వహించు. జీతం తీసుకో—' ఇలాగైనా ఆమె ఆత్మాభిమానాన్ని కాపాడుదామని తన ప్రయత్నం.

'ఊహుఁ, అక్కర్లేదు'

'నీ వింత కఠినురాలి వెందుకయ్యావు లలితా?'

'నా కేలా తెలుస్తుంది?'

'పోనీ— లలితా! నా దగ్గర చాలా డబ్బున్నది. నీవు నీ ఇష్టం వొచ్చిన చోట, నీ ఇష్టానుసారంగా బతుకు. నీకు కావలసినంత డబ్బిస్తాను— తీసుకెళ్లు.' అన్నాడు తను.

'ఒకరి దయాధర్మాల మీద బతకవలసిన స్థితికి నేనింకా రాలేదు. నాకు నేనై సంపాయించుకో గలను. అవసరమైన నాడు మీ సహాయాన్ని కోరుతాను లెండి'

తనమాటల్ని లలిత ఇంత నిర్లక్ష్యం చేస్తుందని ఎప్పుడూ అనుకోలేదు. కనీసం స్వార్థచింతన్నా ఆమెకు లేదు. ఆమె సుఖపడ దలచలేదు. కేవలం కర్మసిద్ధాంతాన్ని నమ్మిన వ్యక్తివలె, తానే నాడో చేసుకున్న పాపాలకు యీ నాడు శిక్షలను అనుభవించటం న్యాయమనీ, తానందుకు విచారించటం కానీ, వేరొకరినుండి సానుభూతిని కోరటం కానీ అనవసరమనే ధోరణిలో వున్నది. తానిక ప్రాధేయపడి ఏం లాభం?

జీవితంలో దిగజారి పోయ్యాక, ఆమెకు ఆత్మాభిమానం కూడా పోయి ఉండాలి. అలాంటి వ్యక్తికి జీవితం తృణప్రాయంగాను, చుట్టూవున్న మనుషులు క్షుద్రులుగానూ, కీటకాలుగానూ తోచటం సహజమే! ఆత్మాభిమాన రహితమైన మొండితనంతో జీవితాన్ని జయించాలని, కనీసం, యీడవాలని ఆమె మూర్ఖంగా

ప్రయత్నిస్తోంది. తన మీద నే తనకు గౌరవం లేని వ్యక్తికి ఇతరుల పట్ల ఆయినప్పటికీ, ఏం గౌరవం వుంటుంది? ఐతే ఆ స్థితిలో కూడా ఆమెకు తాను సహాయపడటాన్ని నివారించిందంటే, ఏమూలనో ఆత్మాభిమానం ఆమెను వారించవచ్చు; లేదా తనంటే ఎంతో ద్వేషం, తన పొడగిట్టని ఆవేశం ఆమెలో గూడుకట్టుకుని ఉండాలి. అందుకు కారణమేమిటో తాను ఎంత ఆలోచించినా గ్రహించలేక పోతున్నాడు.

లలిత చిన్నపిల్లయితే. చిన్నపిల్లల్ని సక్రమ మార్గంలో నడిపించేందుకు పెద్దలు ఉపయోగించే బలిమిని తాను ఉపయోగించే ఆలోచనన్నా వొచ్చి ఉండేది. కాని ఆమె వ్యక్తిత్వం వున్న, వ్యక్తితలు తెలిసిన వ్యక్తి. సర్వ స్వతంత్రురాలుగా వున్నది. ఏమైనా ఆమె ఆత్మ బంధువులకన్న యీమె తనకు దగ్గర కాదు. ఒకవేళ తానీమెను ఆత్మ బాంధవిగా భావించినా, ఆమె దూరదేశానికి వెళ్లిపోతూండటం వల్ల, ఇద్దరి మధ్య వున్న దూరం ఎప్పటి వలనే ఉంటోంది.

తన జీవితంలో కనీసం లలితను ఉద్ధరించలేక పోయినా, చివరకు ఆమెకు సహాయ పడలేక పోవటం కూడా జరిగిందని తెలుసుకోగానే హృదయం భారమైంది. జీవితం చెప్పినట్లు వినేది కాదని తనకు తెలుసు, కాని సాధారణ సంఘటనలు కూడా, ఒక్కొక్కప్పుడు, విశ్వ ప్రయత్నం చేసినా సాధించలేక పోవటం జరుగుతూనే వుంది. అందుకనే ఎంతవున్నా జీవితం వెగటుగానూ, అసంతృప్తికరంగానూ పరిణమిస్తోంది.

'లలితా! నువ్విలాగే బతుకుతానంటే కాదనేందుకు నేనెవర్ని? మన మధ్య వున్న స్నేహాన్నీ, ఒకప్పుడు నీవు నాపట్ల చూపిన సానుభూతి నన్నూ, తిరిగి నీకు అప్పగిద్దామని ప్రయత్నించాను. కాని... కాని ఇంతకన్న మంచి జీవితం అందుబాటులోకి వొచ్చినా, దాన్ని తృణీకరించేటంత మూర్ఖత చూపుతే, నేనేమనగలను? ఆలోచించు.' అన్నాడు తను, ఇంతకన్న విపులీకరించ వలసిన అవసరం లేదన్నట్లుగా.

'ఆలోచన కేమీ లేదు. మనిషికి ఇష్టా యిష్టాలనేవి ఉంటవి. అయిష్టమైనది, ఎంత సుఖాన్నిచ్చినా, దాన్ని కోరలేం కదా!' అందామె.

లలిత తెలివి తక్కువగా మాట్లాడుతోందనుకోవటం, తన తెలివి తక్కువని తేలిపోయింది. తనంటే, తన చుట్టూవున్న వాతావరణమంటే, లలితకు అయిష్టత ఏర్పడిందన్న మాట! తల్లి దండ్రుల్నీ, ప్రపంచాన్నీ కాలదన్ని, తన స్నేహంకోసం తహతహలాడుతూ, చివరకు తాను వారించినా, తన చుట్టూ తిరగాలని విశ్వప్రయత్నాలు చేసిన లలిత, తమమధ్య ఏ వివాదాంశమూ అపార్థాలకు దారితీయలేదని తనకు తెలిసిన పరిస్థితుల్లో కూడా—యీనాడు తనంటే ఇష్టంలేదని మొహాన అన్నదంటే, స్త్రీ హృదయం తెలియరానిదని కవులన్న మాటల విలువ గ్రహించటం జరుగుతోంది.

ఇది నిజమైనప్పటికీ, ఇష్టంలేని అనేక పనుల్ని చేసుకొని, బతుకులు వెళ్ళబుచ్చుకోవలసిన పరిస్థితుల్లో ఎంతమంది ఎన్ని విధాలుగా తంటాలు పడటం లేదు? చిత్రాలకు చెత్తంతా పోగేసి, సాహిత్యానికే తాను ద్రోహం చేయటం లేదా? పరిస్థితుల వొత్తిడికి లలిత అతీతురాలనుకోవాలా? లేక ఇప్పుడు తాను గడుపుతూన్న జీవితమే ఆమెకు ప్రియమైనదనుకోవాలా?

'ఐతే నీ ప్రస్తుత జీవితం అయిష్టమైనది కాదన్నమాట?' అన్నాడు తను, చిరాకుతో.

'ఊహుఁ. నేను ముష్టిదాన్ని కాదు. ఎవర్నీ అర్థించటం లేదు. సర్వ స్వతంత్రంగా జీవిస్తున్నాను!' అందామె.

ఆ కంఠస్వరంలో మొండితనంతోపాటు, గుడ్డిగా నమ్మిన విశ్వాసం కూడా ధ్వనిస్తోంది. మొండివాడు రాజుకన్నా బలవంతుడనే సామెత తనకు తెలియందికాదు. పోతే మానవుడు తాను చేసిన తప్పుల్ని ఒకపక్క సమర్థించుకోవటం కూడా తనకు తెలుసు; అలా సమర్థించుకోనట్లయితే అతను ముందుకు సాగలేడు. ఐతే యీ సమర్థనలోని లోపం కూడా అప్పుడప్పుడు గ్రహించుకుంటూ, తాను దిగజారుతున్నాననే జ్ఞానం, యీ ఊబిలోనుంచి బైటపడే మార్గమేదన్నా వున్నదా, అనే ఆలోచనా కలుగుతూండాలి; ఎంత దుర్మార్గుడైనా, అజ్ఞానైనా, ఇలాటి అనుభూతిలో దగ్ధమవటమనేది జరగనట్లయితే, అతని మానవత్వంలోనే ఏదో దోషం ఉండి ఉండాలి. లలిత బూకరిస్తూన్నదే కాని, నిజంగా ఆమె అనేమాటల అర్థం, ఆమెకు తెలియటం లేదేమో? లేక కేవలం అబద్ధాలాడి యీ ప్రస్తుత సంఘటననుంచి తప్పించుకుందామని ప్రయత్నిస్తున్నదేమో?

'లలితా!' అన్నాడు తను.

'ఎందుకొచ్చిన చర్చలు? నేనిక్కడికి ఎందుకొచ్చానో, నా విధిని నేను నిర్వర్తించుకోనివ్వండి. ఆ పాత విషయాలన్నీ తవ్వి మనసు పాడుచేసుకుంటే, చివరకు ఆనందాన్నాశించిన మీకు నిరాశ ఎదురౌతుంది!' అందామె.

లలిత ఇలా మాట్లాడగలుగుతుందని తాను ఎన్నడూ అనుకోలేదు. మానవులు చేసే తప్పులు సమాజాన్ని ఎంత దెబ్బ తీస్తుంటవో, అంతకు తక్కువకాని దెబ్బలు ఆ వ్యక్తికూడా తగులుతూంటవి కాబోలు! లేక తనకెలాగూ అంతా తెలిసిపోయింది కనుక, బరి తెగించిన విధంగా మాట్లాడుతోందా? చేసేది చెప్పుకునేందుకే సిగ్గుపడవలసిన పరిస్థితుల్లో, తాను చేసేపనిని సమర్థించుకుంటూ, తనదగ్గిర వ్యాపార ధోరణిలో మాట్లాడటాన్ని సహించలేక పోయాడు. లలితంటే యీ క్షణాన కలిగిన ద్వేషాగ్నిలో ఆమె భస్మమై ఉండవలసింది, కాని ఎలాగో నిలవ తొక్కుకొన్నాడు.

'నీ ఉద్దేశ్యం ఏమిటి?' అని నిలవదీశాడు తను.

'నా ఉద్దేశ్యంతో పనేమిటి? మీ ఉద్దేశ్యాలను గౌరవించి, మీకు సుఖాన్నిచ్చేందుకు ఇష్టపడి వొచ్చాను. మీ ఆశయాలను నెరవేర్చుకోకుండా, ఆ పాత గాథల్ని తవ్వుకున్నందువల్ల, మీకే నష్టమని హెచ్చరించాను. అంతే కాని నాకు మరో ఉద్దేశ్యం ఉంటుందని మీరు అనుకోకండి.'

లలిత ఏం గురిచూసి బాణం వొదిలిందో స్పష్టంగా అర్థమై పోయింది. తాను ఒకప్పుడు లలితను హృదయపూర్వకంగా ప్రేమించాడు; కాని ఆ ప్రణయం ఒక గగన కుసుమమని గ్రహించి దాన్ని వొదులు కున్నాడు. ఆ తరువాత ఆమె దూరమౌతున్నప్పటికీ, ఆమె మీద అనురాగాన్నీ, అభిమానాన్నీ పెంచుకున్నాడు; ప్రణయమే ఒక గొప్ప సానుభూతిగా పరిణమించింది. అందుకనే ఆమె ఎన్ని దుష్కార్యాలు చేసినా, వాటికి సంజాయిషీ చెప్పుకునే అవకాశాన్ని కూడా జారవిడుచుకొని, మీదు మిక్కిలి తనను తృణీకరించి, తలాయించి నప్పటికీ సహించి క్షమించాడు. ఆమె, పాపపుణ్యాలను విలువకట్టేందుకు తానెవరని కాదు. కేవలం తాను ఆమెకు అండగా వుందామని ప్రయత్నించాడు. కాని ఆమె తన మూర్ఖతతో తనకు దూరమయేందుకే యత్నించింది. అంతతో పోక కావాలని తనను గాయపరిచింది. ఇప్పటికీ ఆమెకూ తనకూ సంబంధం లేదని అనుకో గలిగితే తాను బాధపడక్కర్లేదు. అన్నిటినీ మించి ఒకప్పుడు లలిత తనకు అందని మ్రాని పండను కొని నిరాశ చేసుకొన్న లలిత—యీనాడు చేతుల్లోకి రానే వొచ్చిందనే అభిప్రాయాన్ని ఆమె తనకు అంటగట్టి, తప్పు పడుతోంది. నిజానికి తనకా ఉద్దేశ్యం, నిస్సహాయ స్థితిలో వున్న ఆమెను పరాభవించయినా సరే, ఆనందిద్దామనే కోర్కె ఏ కోశానా లేదు. అసలు లలితంటే తనకు అనురాగం కన్నా అభిమానమే ఎక్కువవటంవల్ల, ఎంత పతితురాలయినా ఆమెను, ఇప్పటికీ గౌరవించాలనే ప్రయత్నిస్తున్నాడు. ఆ స్వల్పవిషయాన్ని ఆమె గ్రహించక, తానుకూడా పతితుడైన మానవుడేననే ధోరణిని వ్యక్తపరుస్తుంటే, సహించలేక పోతున్నాడు.

'లలితా! నీ సంస్కారమంతా మట్టి పాలవుతుందని నేను కలలో కూడా అనుకో లేదు. పాపం! నీవుమాత్రం ఏం చేస్తావు? పరిస్థితుల వొత్తిడికి ఆ సంస్కారమంతా అణగారి పోయింది...నీ దయవల్ల నే నింకా పతితుణ్ని కాలేదు. దుష్టుల సావాసం కూడా నాకు లభ్యమవ లేదు. పొరపాటున యీనాడు ఇక్కడికి వొచ్చినందుకు చాలా పశ్చాత్తాప పడుతున్నాను' అన్నాడు.

'మంచిదేగా! మీరు నైతిక విలువల్ని కాపాడుకో గలిగారు. నేను నైతిక పతనం పొందాను. పోనీండి—ఇప్పుడా సంగతు లెందుకూ?' అంది లలిత. ఎంత గొప్ప విషయాన్ని కూడా తృణీకార భావంతో ఆమె చూడగలుగుతోందంటే, ఎంత మార్పు ఆమెలో వొచ్చి ఉండాలో, ఏ సంఘర్షణల్లో ఆమెలోని మంచి అంతా అంతర్ధానమై, కేవలం ఒక రకం విషం ప్రతి రక్తబిందువుకూ ప్రసారితమై ఉండాలో, తాను అర్థం చేసుకో గలడు. కాని తగిన ఆధారం దొరికి, ఆ తప్పుడు దోవలనుంచి

రాజమార్గాల నడిచే అవకాశం దొరికినప్పుడు కూడా, ఆమె మొండిగా తనను తాను సమర్థించుకోవటంతో, తాను చూపే సానుభూతికి పాత్రత తప్పిపోతుంది. అలాంటి వ్యక్తుల పట్ల చూపే ఉపకారబుద్ధికి విలువ లుండవు. అందుకని ఇక యీ లలితతో చర్చించటం వృధా శ్రమ అని తేల్చుకున్నాడు.

'ఇక నేను మాట్లాడ వలసింది కూడా ఏమీ లేదు లలితా! నీవు ఎంత పైకం ఆశించి ఇక్కడికి వొచ్చావో చెపితే, కనీసం వ్యాపారరీత్యా నైనా అంతే ఇచ్చుకొని నేను వెళ్లిపోతాను—' అన్నాడు క్రోధంతో వొణికిపొయ్యే కంఠంతో.

'మీ నుంచి నేనేమీ ఆశించ లేదు; ఆశించిందేదో ఇదివరకే ముట్టింది—' అందామె.

ఈ మెతో మాట్లాడితే తనకు పిచ్చెక్క గలదు. ఇదొక దుర్దినం గానూ, యీ సంఘటనంతా ఒకానొక పీడ కలగానూ తోస్తోంది. ఎంత త్వరగా ఇక్కణ్నుంచి బైటపడితే, అంత మంచిదనిపిస్తోంది. చివరి సారిగా లలితమీద తన కింకా మిగిలిన ఆ కాస్త అభిమానాన్నీ చూపాలని 'లలితా! ఏనాటికన్నా నీకు నా సహాయం అవసర మనుకుంటే, ఈ ఎడ్రస్‌కు రా... నేను వెళ్తున్నాను—' అని ఆమె సమాధానాని కూడా ఆగకుండా చరచరా కిందికి వొచ్చేశాడు.

కింద హాలులో అంతా చిందరవందరగా వుంది. వొళ్లు మరిచిన మత్తులో దొర్లు తున్నారు, అందరూ. ఎంతో అసహ్యం వేసింది. మానవులు ఇంత బురదలో కూడా ఆనందాన్ని అనుభవిస్తున్నారంటే ఆశ్చర్యమే మరి!

ఆ ప్రదేశంలో మరి నిలవలేక పొయ్యాడు; హృదయంలో బద్దలైన అగ్నిపర్వ తాల వేడి తరమగా, చకచకా బైట పడ్డా. మతి పోయినంత పని కావటం వల్ల, ముందు వెనుకలు ఆలోచించకుండానే రోడ్డున పడ్డాడు. అలా చాలా దూరం నడిచిన తరువాతకాని, తనకు కారు ఉన్నదనే సంగతికూడా గుర్తు రాలేదు. తిరిగి ఆ ప్రదేశా నికి వెళ్లేందుకు మనస్కరించక, అలాగే నడిచి దాదాపు తెల్లవారుజామునకు ఇంటికి జేరాడు.

మర్నాడు ఆ ఫిలిం కంపెనీతో జరిగిన కాంట్రాక్టును రద్దు చేసుకున్నాడు.

## 39

సరిగ్గా ఇప్పటికి ఏడాది క్రితం—ఒకనాటి మధ్యాహ్నం స్టూడియో కని బయలు దేరే సమయంలో, ఒక కుర్రవాడు తనకోసమని వొచ్చాడు; గేటులో వున్న ఘూర్ఖా, వాణ్ని లోనికి రానివ్వటం లేదు. చివరకు తాను ఎదురయ్యేటప్పటికి ఆ కుర్రాడు, తాను జనరల్ ఆసుపత్రినుంచి వొస్తూన్నట్లూ, తన నెవరో, చావు బతుకుల్లో వున్న స్త్రీని చూడ దలిచినట్లూ చెప్పాడు. ఆమె లలితే ఐ వుంటుందని తాను భావించాడు.

ఆమె చావుబతుకుల్లో ఉన్నదంటే కంపరమెత్తింది. ఆనాడు అమ్మ చనిపోయిన ఘట్టం; ఆ ఘోర పరిస్థితంతా జ్ఞాపకం వొచ్చింది. ఆ రోజున అమ్మ ఎంత నిస్సహాయ స్థితిలో వున్నదో, తనూ అంతే! కాని యీనాడు తన దగ్గిర లక్ష్మి మూలుగుతోంది. కనుక లలితను బతికించే అవకాశాలున్నవి; మృత్యు దేవతకూడా లంచగొండి కాని కాలమా ఇది?

వెంటనే కారులో బయలుదేరి వెళ్లాడు. ఆకృతి లలితేనని చెప్పినా, కుంగి కృశించి నశించేందుకు సిద్ధ గావున్న ఒకానొక వికృతాకారం, జనరల్ వార్డులోని మంచంమీద మూలుగుతోంది. లలితకు ఇంత దురవస్థ పడుతుందని తానెప్పుడూ అనుకోలేదు. ఏదెలావున్నా, ఆనాడు తాను ఇచ్చిన ఎడ్రెస్‌కు పూర్తిగా మునిగ బొయ్యే సమయంలోనన్నా కబురు చేసింది. ఒకనాడు తనకు ప్రాణదానం చేసిన యీమెకు యీనాడు తాను కృతజ్ఞతను చూపటం కనీస బాధ్యత.

తనను చూడగానే ఆమె దీనంగా, జాలిగా, బాధగా నమస్కరించింది. లలితకు తనమీద పూర్వపు గౌరవం వున్నది; ఆనాడు తల తిక్కగా మాట్లాడిందెందుకో తనకు అర్థం కాలేదు. ఇప్పుడా ఇసుక పాతరల్ని తవ్వటంకన్న జరగవలసిందేమిటో ఆలోచించాలి.

'లలితా! ఎలావుంది?' అన్నాడు.

ఆమె నిట్టూర్చింది; బహుశా మాట్లాడలేక కాబోలు 'అంతా ఐపోతోంది—' అన్నట్లుగా సౌంజ్ఞ చేసింది.

'ఫర్వాలేదు—లలితా! నేనున్నానుగా!' అని ధైర్యం చెప్పాడు తాను.

పెద్ద డాక్టర్లతో మాట్లాడాడు; డబ్బు విరజిమ్మేందుకు సిద్ధపడ్డ తనకు కొన్ని నిమిషాల్లోనే ఆసుపత్రంతా దాసోహం అనేందుకు సిద్ధపడింది. గంటలో ఆమెను జనరల్ వార్డునుంచి ప్రత్యేకించబడిన గదిలోకి మార్చారు.

తాను పెద్ద డాక్టర్‌కు ఎంత నచ్చచెప్పినా 'లాభం లేదు. వ్యాధి ముదిరిపోయింది, ఆపరేషన్ చేసి చూస్తాను...' అన్నాడేకాని, ధైర్యం చెప్పలేదు. దేదీప్యమానంగా వెలుగుతూండే లలిత ముఖంమీద, మృత్యు దేవత ఛాయలు దట్టంగా అలుముకుపోతున్నట్లుగా తనకూ తెలుస్తూనేవుంది. ఆపరేషన్ చేయించటం మినహాగా మరో మార్గమేదీ లేదు.

సాయంత్రందాకా అక్కడే ఉన్నాడు. ఏమేం వాగాడో, మతి చలించినట్లు ఎన్నెన్ని బాసలు చేశాడో తనకే గుర్తులేదు. అన్నీ వింటూ, ఎదురు చెప్పకుండా ఆమె పేలవంగా నవ్వుతోంది.

చివరకు, ఎలాగో కష్టపడి పక్కనేవున్న సంచిలోంచి ఒక కవరు తీసి ఇచ్చింది. ఆమె ముఖంలోకి తాను ప్రశ్నార్థకంగా చూశాడు కాని, ఆమె తన చూపుల్ని ఎదుర్కోలేని అశక్తవలె వేరొకదిక్కు చూడసాగింది.

కవరు చించాడు. లోపల కాగితాలున్నవి. లలిత ఏదో రాసింది. ఏం రాసిందో నని చాలా ఆత్రుతగా చదవ సాగాడు.

'మాష్టారూ!

ఇలాటి దుర్దినం వొకటి వొస్తుందని నాకు తెలుసు. మనిషి మంచితనాన్ని వాడుకొనేందుకూ కూడా సమాయా సమయాలున్నవి. ముఖ్యంగా నేను మీకంట పడ రాదనీ, మీనుంచి తప్పించుకొని తిరగాలనీ, చివరకు ప్రాణంమీదికి వొచ్చినా సరే మీ సహాయం కోరరాదనే నిర్ణయించుకున్నాను. కాని ఇక తప్పనిసరై మీకీ శ్రమ కలిగిస్తున్నాను.

ఆనాడు — మనం బంగళాలో కలుసుకున్న రోజున, మిమ్మ చాలా కష్టపెట్టాను; మీ మనసు నొప్పించాను. ఐనప్పటికీ, ఆ విషయాలన్నీ మీ విశాల హృదయంలో ఒకమూలపడి వుంటవనీ, నన్ను తేలిగ్గా క్షమించగలరనే నమ్మకంతో మిమ్మ పిలిపించాను. మీరు వొచ్చినప్పుడే యీ కవరు అందించటం జరుగుతుంది కనుక, మీరు నన్ను మన్నించినందుకు కృతజ్ఞురాల్ని.

ఆనాడు బంగళాలో నే నెందుకు ఆత్మహత్యా ప్రయత్నం చేయలేదని అడిగారు. విజ్ఞులూ, అభిమానులూ తప్పక ఆత్మ హత్య చేసు కుంటారు; కాని నేను కేవలం మానవ మాత్రురాల్ని; మూర్ఖురాల్ని; అదృష్టహీనను. అంతకన్నా మరేమీ కాను. బతుకు ఎలాటిదైనా దాన్ని భరించాలంటే, అది కేవలం నాకోసమే కాదు.

నాకో చిన్నారి కూతురు వుంది; అది పుట్టటం నాకు ఇష్టం లేదు. మన ఇష్టం లేని అనేక సంఘటనల వలెనే అదీ జరిగింది. నా పాపపంకిలానికి చిరస్థాయిగా, పతాకం వలెనే ఆమె సమాజంలో నడిచింది. ఒక్కో సమయంలో దాన్ని చంపేసి, దాని బాధనూ, నా బాధను కూడా తీర్చుకుందా మనిపించేది. కాని కన్నకడుపు తీపిని గూర్చి రాయగలిగేటంత సమర్థురాల్ని కాను.

ఆ బిడ్డ నా ఖేదానికీ, మోదానికీ కూడా కారణం. దాన్ని పెంచటమే నాకో విషమ సమస్య. ఉన్నంతలోనే దాన్ని పెంచాను. దాని చిన్నతనమన్నా గడవకుండానే, నేనీ ప్రపంచం నుంచి వెళ్ళిపోబోతున్నాను.

ఇప్పుడామెను ఎవరిచేతుల్లో పెట్టను! పాపమంతా నాది; తప్పులన్నీ నావి; నేను అనుభవించవలసిన శిక్షల్ని సమాజం నా చిన్నారికి విధిస్తుంది. ఆమెను పెంచి పెద్దదాన్ని చేయగల విశాలహృదయులూ, సమర్థులూ, మీరుతప్ప నాకీ ప్రపంచంలో మరెవ్వరూ లేరు.

ఇప్పుడే మృత్యువు నన్ను తరుముకొని వొస్తుందని అనుకో లేదు. ఒకవిధంగా అదీ మంచిదే నేమో ననిపిస్తుంది. ఎందుకంటే నా చిన్నారి జయకు బుద్ధి తెలిసి, తన తల్లి బతికే బతుకు ఎలాటిదో తెలుసుకొని కుమిలి పోతుంది; లేదా తన తల్లికి అంత కన్నా మార్గం లేదని గ్రహించినట్లయితే, తనకూ అదే దారని నమ్ముతుంది. నేనింకా

జీవించి ఉండటం, దాని జీవితాన్ని పాడు చేసేందుకేగాని, బాగు చేసేందుకు మాత్రం ఉపకరించదు.

ఒకవేళ యీ బాధ్యతను మీరు స్వీకరించకున్నా, జయ నాగతికే దిగుతుంది. నేను ఉంటున్న ఇంటామె జయను పెంచుతుంది; చాలా జాగ్రత్తగా దాన్ని సాకుతుంది. కాని తాను వధించబోయ్యే జంతువు బలంగానూ, కొవ్వు పట్టి ఉండాలనీ కసాయివాడు ఎంత జాగ్రత తీసుకుంటాడో, ఇంటామె పెంపకంలో కూడా అంత శ్రద్ధ వహిస్తుంది. జయ బతుకు మీ చేతుల్లోనే వుంది.

ఈ విషయాలన్నీ ఏదో వొకనాడు మీ ముందు వెళ్ళబోసుకోవాలనే అనుకున్నాను. ఆ రోజు కోసం ఎదురు చూస్తున్నాను. ఐతే యీ సంగతులన్నీ నేను నేనుగా మీకు చెప్పుకోలేను; లేదా ఆ చెప్పుకొనే శక్తి కూడా లేనిపరిస్థితి రావొచ్చు. అందుకే మిమ్మ అర్థిస్తున్నాను. మీరు నా ప్రార్థనల్ని తోసిపుచ్చక, జయను పెంచుతానని మాట ఇస్తే, మృత్యుముఖంలోని సుఖాన్ని మాత్రమే చూడగలుగుతాను.

— లలిత,

ఉత్తరం చదువుతూన్నంతసేపూ, గుండెల్లో విమానాలు ప్రయాణంచేసినయ్. లలిత ఇంత దీనావస్థకు దిగుతుందనీ, తనను ఆజ్ఞాపించగల లలిత అర్థిస్తుందనీ ఎన్నడూ అనుకోలేదు. ఆమె పరిస్థితి చూసి ఆమెకు తన సహాయం ఉపయోగపడదేమోననే భయం కలిగింది; కాని ఇప్పుడు తానే జయ పోషణ భారాన్ని స్వీకరించటం ద్వారానన్నా, లలిత పట్ల కృతజ్ఞత చూపగల అవకాశం ఏర్పడుతోంది. తడయిన కళ్ళను తుడుచుకున్నాడు. హృదయం ద్రవీభూతమై పొంగుకుండా చిక్కబట్టుకునేందుకూ, తనను తాను ఓదార్చుకునేందుకూ గట్టి ప్రయత్నం చేసి, ఎలాగో తట్టుకోగలిగాడు.

ఇదేమంత గొప్ప విషయమని లలిత ఇంత దీనంగా అడిగింది? ఆమెను తనదగ్గిరికి రమ్మని ఆహ్వానించిననాడు కాలదన్నిందెందుకని? బహుశా తనకా అర్హత లేదని భావించి ఉండాలి. గదిలో చీకట్లు కమ్ముకుంటున్నయ్. ఆ చీకటికి భయం వేసేపర్యంత మౌతోంది; చప్పున లైటు వేశాడు. లలితమాత్రం అటు తిరిగి పడుకొని ఉన్నది. భయంకరమైన సంఘటనేదో తాను చూడవలసి వొస్తుందని అనుకున్నదేమో?

చేతితో కదిపి 'లలితా! లలితా! ఇటుచూడు' అన్నాడు.

లలిత మెల్లిగా కళ్ళువిప్పి తన ముఖం లోకి చూసింది.

'లలితా! అధైర్య పడకు. జయను నేను తండ్రివలె పెంచుతాను. ఇదే నా వాగ్దానం!' అన్నాడు.

ఆమె ముఖం వికసించింది; ఆ ఆనందంలో లేచి కూర్చునేందుకూడా ప్రయత్నించింది; కాని తానే వారించాడు. కృతజ్ఞతగా కళ్ళు మూసుకొని భగవంతుని

ధ్యానించినట్టు ధ్యానించి, తనకు నమస్కరించింది. పిచ్చి లలిత ఇలా అవుతుందని తనెప్పుడన్నా అనుకున్నాడా?

'జయ ఎక్కడ లలితా?' అన్నాడు.

'వొస్తుంది—' అందామె.

బొత్తిగా మాట్లాడే శక్తికూడా లలితకు లేదేమో ననుకున్నాడు తాను. కాని ఆమె కావాలనే మాట్లాడటం లేదు. మాట్లాడినందువల్ల తనస్థితి పెరగదు. చర్చలకు దిగవలసి వొస్తుందని కూడా భయపడి ఉండాలి. ఐనా ఇప్పుడు లలితతో మాట్లాడవలసిన విషయాలు మాత్రం ఏమున్నవి కనుక!

చాలా సేపటిదాకా తామిద్దరూ ఒకర్నొకరు చూసుకొన్నారు. ఒక్కమాట కూడా మాట్లాడకుండానే, తమ తమ జీవితాలను, ఆ కొద్దిసేపట్లోనూ సింహావలోకనం చేసుకొని ఉండాలి. దీర్ఘంగా ఆలోచిస్తే ఏం జీవితం—ఎంత జీవితం! అనుభవం ఎంత గొప్పదైనా, చివరికి చూసుకుంటే దానిద్వారా లభ్యమైన సారం విలువ ఏమిటి? ఎంత వెగటు వేసినా యీ జీవితాన్ని వదిలించుకోవాలనే ప్రయత్నంకూడా జరగటం లేదు కదా!

రాత్రి ఏడు గంటల ప్రాంతంలో ఒక ముసలామె, మరో ఐదేళ్ళ పిల్లా గదిలోకి వొచ్చారు. వొస్తూనే, తనను చూడగానే వారు భయపడి, పొరపాటున వేరొక గదిలోకి వొచ్చామనుకున్నారేమో, వెనక్కు తిరిగి వెళ్ళే ప్రయత్నంలో ఉండగా లలిత 'జయా!' అని పిలిచింది.

ఇద్దరూ వెనుదిరిగి ఆమె మంచం దగ్గిరికి వొచ్చారు.

'ఏమమ్మ! మాకు తెలియకుండానే గది మార్చుకున్నావ్; అదంతా వెదికి వెదికి దుంప తెగింది!' అందా ముసలిది.

జయ మాత్రం తల్లి దగ్గిరికి జేరింది. లలిత కళ్ళు మూసుకొని జయ తల నిమురుతోంది. మాటలకు లొంగని అనురాగమేదో ఆమె హృదయంనుంచి వెలువడి, కన్నీరుగా బయల్వెడలుతోంది. ముసలిది మాత్రం తనను విచిత్రంగా పరిశీలిస్తోంది.

రెండు మూడు నిమిషాలయ్యాక తనే 'జయా! ఇలారా!' అన్నాడు. లలిత కళ్ళు తెరిచింది; మొహం తుడుచుకుంది. జయమాత్రం తన దగ్గిరికి రావటమా, మానటమా అని సందేహిస్తుండగా 'వెళ్లు జయా! వెళ్లి నమస్కరించు—' అంది. జయ తనకు దగ్గిరగావొచ్చి నమస్కరించింది. ఆమె చిన్నారి చేతుల్ని పట్టుకొని ఎత్తుకున్నాడు.

కొత్త మనిషి తన దగ్గిర అంత చనువు తీసుకునేప్పటికి, ఆ పిల్ల భయపడ్డట్టుంది, బలవంతంగా తన చేతుల్లోంచి గుంజుకొని, అమ్మ దగ్గిరికి పరుగెత్తింది.

'భయం లేదు జయా! ఆయన...ఆయన...' అని ఆతరువాత ఏం చెప్పాలో తెలియక గదిలో దూలాలవొంక చూసింది లలిత.

లలిత మనసులోని అభిప్రాయం తనకు తెలుసు. ఏదో విధంగా ఒక బంధు త్వాన్ని కలుపుతేనే కాని ఆ చిన్న పిల్లకు తాను దగ్గరవ లేడు.

'చెప్పు లలితా! నేను ఎవర్ని?' అన్నాడు తాను.

లలిత సంకోచిస్తూండగా 'నాన్నేనా?' అంది జయ.

తా మిద్దరి సమస్యలనూ ఆ పిల్ల పరిష్కరించింది. తాను తండ్రివలెనే జయను సంరక్షించాలి. అంతకన్న దగ్గరి బంధుత్వం తనకు మరి దొరకదు.

లలిత తనవొంక చూసింది; తన సమ్మతికి ఆమె ఎదురు చూస్తోంది, తనదృష్టికి మాత్రం ఇదెంత అల్ప విషయమో ఆమెకింకా అర్థం కాలేదు.

'ఔను జయా! నేను నాన్నను!' అన్నాడు తాను, గది గోడలు ప్రతిధ్వనించేట్లుగా.

లలిత యీసారి లేచి కూర్చుంది; తన పాపాలన్నిటినీ ధరించేందుకు వొచ్చిన అవతార మూర్తిని ధ్యానించినట్లుగా కళ్ళుమూసుకొని ప్రణమిల్లింది. తనకైతే నవ్వొచ్చింది కాని, లలితకు మాత్రం ఆ ఆనందసాగరంలో ఊపిరాడటం లేదనిపించింది.

'నాన్నగారమ్మా!' అన్నది లలిత ఆశ్చర్యంగా చూస్తున్న జయాలో.

'నానాన్నా! నాన్నా!' అంటూ, నాన్నకోసం మొహం వాచివున్న జయ తన కాళ్ళకు చుట్టు కుంది.

ఈదృశ్యంలోని ఒక్క అణువుకూడా అర్థంకాని ముసలిది మాత్రం మెల్లిగా లలిత దగ్గరికి జేరి రహస్యంగా 'ఎవరమ్మా అయన?' అంది. లలిత జవాబు చెప్పలేదు. ఇప్పటికీ ఈఅనుభూతిలోని ఉద్రేకాలకు తట్టుకోలేక, అలసిపోయి ఆమె వొణుకుతున్నది.

'ఎవరంటే మాట్లాడవేమే?' అన్నది ముసలిది అధికార స్వరంతో.

తనకు భయం ఉన్నది. ఈ ముసలిదాని సంరక్షణలోనే లలిత జీవిస్తున్నప్పటికీ, ముసలిది కేవలం వ్యాపారరీత్యా ఏర్పడిన అనురాగాన్నీ, అధికారాన్నీ చలాయిస్తోంది.

'ఏయ్!' అన్నాడు తను. 'లలితను మాట్లాడించకు. నేను యీ పిల్లకు తండ్రిని... తెలిసిందా?'

'ఏయ్!' అన్న దామె నోరు సగానికి తెరిచి 'ఎవరయ్యా నీవు? ఈ పిల్లకు తండ్రేమిటి? ఎక్కణ్నుంచి దిగావంట? పైన ఏయ్ అంటున్నావే.' అన్నదా ముసలిది.

ఇక మాట్లాడి లాభం లేదని వార్డు బోయిస్‌ను పిలిచి, ముసలిదాన్ని సెంట్రల్ స్టేషన్ వరకూ నెట్టి రమ్మన్నాడు. ముసలిదానికి అప్పటికాని తా నెవరో తెలియ లేదు. అది తన ఇల్లను కుంటోంది. ఆ దురభిప్రాయం పొయ్యేందుకు, ఆమె తిట్టు కుంటూన్నా, శపిస్తూన్నా లెక్క చెయ్యకుండా వార్డు బోయిస్ కొంచెం అమర్యాదగానే ఆమెను బైటికి పంపారు.

ఎంతో బరువు తలమీదినుంచి తొలిగిపోయినట్లు లలిత నిట్టూర్చింది. జయ మాత్రం తాను జీవితంలో మొట్ట మొదటి సారి కలుసుకో గలిగిన తన తండ్రి నుంచి, తాను పొందవలసిన అనురాగాన్నంతటినీ ఒక్క సారే లాక్కోటేందుకు విశ్వప్రయత్నం చేస్తోంది.

ఆ చిన్నారి పాప చూపే అనురాగంతో తన హృదయం పొంగి పొరిలింది. నిజంగానే తాను కన్న కుమార్తె పట్ల చూపవలసిన ప్రేమంతా యీ ఒక్క క్షణం లోనే చూపలేక తల్లడిల్లి పోతున్నాడు. కణ్వుడు పెంచిన శకుంతల పట్ల ఎంత అను రాగాన్ని వర్షించి వుంటాడో, తాను పెంచబొయ్యే ఈ జయపట్ల తనకు కలిగిన యీ అనుభూతే తెలియ చెపుతోంది.

చాలా రాత్రి గడిచి వుంటుంది. ఆ గదిలోని ముగ్గురూ ఎవరి ఆలోచనల్లో వారే నిద్రకు ఉపక్రమించారు. ఒక రాత్రివేళ తనకు మెళుకూ వొచ్చింది. జయ తన రొమ్ములమీద పడుకొని హాయిగా నిద్రిస్తోంది. ప్రపంచమంతా గాలించినా తన కీమాత్రం స్థానం దొరకదన్నంత సుఖంగా, ప్రశాంతంగా ఆ పాప కలలు కంటోంది. ఆరాత్రి ఎవరికీ భోజనం లేదు; అసలు ఆకలే అనిపించ లేదు.

లలిత మాత్రం నిద్రిస్తూన్నట్లు తనకు తోచ లేదు. ఆమె ఏమేమో ఆలోచిస్తూ బహుశా గత చరిత్ర నంతనూ నెమరు వేసుకుంటూ, చిత్రవిచిత్రాను భూతుల్లో తల్ల డిల్లుతూండి వుండొచ్చు. తనకు మెళుకూ రాగానే ఆమె చప్పున కళ్ళు మూసు కున్నది కాని, అప్పటికీ కంటినుంచి వొచ్చే నీటిబుగ్గను వారించుకోలేక పోయింది. ఈ పిచ్చి లలిత ఇంకా దేన్నిగూర్చి బాధ పడుతోంది? ఆమెకు తనమీద తనకే నమ్మకం లేనిస్థితి వొచ్చింది; అందుకని యావత్ ప్రపంచాన్నీ, కనీసం తనను కూడా నమ్మలేక పోతోందేమో? ఈమెను వోదార్చి ప్రశాంతంగా ఉంచట మెలాగో మొదట అర్థం కాలేదు.

మెల్లిగా జయను పడక కుర్చీలోనే పరుండబెట్టి, లలిత దగ్గిరికి వెళ్ళాడు. ఆమెను చేతితో కదిపి పేరున పిలిచాడు. ఆమె మెల్లిగా కళ్లు తెరిచి, తన స్థితిని గ్రహించినందు కేమో, కొస్త సిగ్గు పడింది.

'లలితా! నీకు విశ్రాంతి ఎంతో అవసరం. అనేక అవకాశాల్ని జారపడుచు కున్నావు; అందుకే ఇన్ని బాధలూ పడ్డావు. అదంతా జరిగిపోయిన సంఘటనలు కనుక తిరిగి రావు. వాటినిగూర్చి ఆలోచించకు. జయ విషయంలో నేను ఎన్నడూ ఏ లోటూ రానీను. నాకుమాత్రం ఇంకెవరున్నారు లలితా?' అన్నాడు.

ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది; బహుశా తన ఒంటరి తనానికిగాను ఆమె చూపే సానుభూతేమో అది?

కాస్సేపయాక, తన రెండు చేతులూ పట్టుకుంది. 'మాష్టారూ! నేను లేచే స్థితిలో లేను; ఇవే కాళ్లు. మీ నుంచి నేను అనధికారంగానూ, అన్యాయంగానూ

పొందుతూన్న యీ ఉపకారానికి యీ జన్మలో కృతజ్ఞత చూపలేనందుకు క్షమించండి' అంది.

'ఎందుకొచ్చిన మాటలు లలితా! మానవత్వమంటే ఏమిటో నా కొకనాడు అనుభవపూర్వకంగా చూపావు. దాన్నే నేను తిరిగి యీనాడు ప్రదర్శిస్తూంటే భరించలేనంతగా భయపడి పోతున్నావు...ఇక నిద్రపో లలితా!'

ఆమె ఇంకేమీ మాట్లాడ లేదు; నిద్రాదేవితో ఒంటరిగా పోరాడి ఆమె ఒడిలో స్థానాన్ని సంపాదించుకునేందుకుగాను అటు తిరిగి పడుకుంది.

ఎంతెంత వారికి ఎంతెంత దుర్గతి పడుతుంది! జీవితంతో హోరాహోరీగా పోరాడి, దానికి లొంగక, చివరి రక్త కణం సజీవంగా ఉన్నంతవరకూ ఆమె ప్రతి ఘటించింది. ఇక లాభం లేదని తేల్చుకోగానే ఆమె దిగజారి పోయింది.

పిచ్చి లలిత! ఒక పక్క తన గొప్పతనం, హోదా ప్రతి కదలికలోనూ కన బరుస్తూ, మరోపక్క మానవత్వ మనేదానికి అనుభవ పూర్వకమైన రూపాన్నిస్తూ కాలం గడిపిన లలిత, యీనాడు దీనాతిదీనంగా తనను ప్రాధేయ పడవలసిన పరిస్థితుల్లోకి జారిపోతుందని ఎవరు మాత్రం కలలు కని వుంటారు?

మర్నాటి ఉదయం ఆపరేషన్ జరుగుతుందనీ, పెద్ద డాక్టర్ గొప్ప ఆశల్ని చూపకపోతూన్నా, ఏ అదృశ్య దేవత కరుణవల్లనన్నా తిరిగి లలిత, మరికొంత ప్రశాంత జీవితాన్ని గడుపుతుందనే నమ్మకంతో, ధైర్యంతో కునుకు తీశాడు. తెల్లవారింది; పెద్ద డాక్టర్ వొచ్చాడు. తనకు కానీ మరెవ్వరికి కానీ శ్రమ ఇవ్వకుండానే, లలిత శాశ్వత ప్రశాంతి పొందిందని ప్రకటించాడు.

మానవుడు నిర్మించుకునే ఆశాసౌధాలు ఎంత వేగంగా రూపురేఖలు దిద్దుకుంటవో, అంత వేగంగానూ కూలిపోతూండటం కూడా జరుగుతూనే వుంటుంది. ఇలాటి సంఘటనలకు సంసిద్ధుడు కాకుండా ఉండటం వల్లనే భరించరాని విషాదం కమ్ముకుంటూంటుంది.

ఇంతకూ తాను దురదృష్ట వంతుడు; అదృష్ట మనేది తనను కన్నెత్తి చూసి, పిలిచి స్వాగతించుకుంది కాని, తాను కోరిన రూపంలో కాదు. అందుకనే ఆ అదృష్ట దేవత తన కొక భూతంగానే తోస్తూ వుంటుంది.

వెంత దుఃఖించి ఏం లాభం? తన జీవితానికి వికాసాన్నిచ్చి, తన నొక సత్పథంలో నడిపించేందుకు సహాయపడిన రెండో స్త్రీని కూడా తన చేతులమీదిగా యీ ప్రపంచం నుంచి సాగనంపాడు. లలిత తన కొక బాధ్యతను ఇచ్చి, కలకాలం తనను గుర్తుండేట్లు చేసుకుంది; కనీసం ఆమె ఆత్మకు శాంతి వుండగలదనే దొక్కటే తన కున్న కొద్ది తృప్తీను.

జయను ఇంటికి పంపి లలిత శరీరాన్ని దహనం చేసి వొట్టి చేతుల్తో ఇంటికి వెళ్ళాడు. 'అమ్మ ఏదీ?' అని జయ అడిగే లక్ష ప్రశ్నలకు ఏవేవో కుంటి గుడ్డి సాకులు చెప్పాడు.

జీవితమంటే వెగటేసింది; సముద్రంలో ఎంతదూరం వెళ్ళినా ఉప్పునీరు తప్ప మంచినీరు దొరకనట్లే, ఎన్నాళ్ళు బతికినా తనకు సుఖపడే రాత లేదు. తన కష్టసుఖాలను హృదయపూర్వకంగా పంచుకునేవారా లేరు. కేవలం తనకొక్కడికే యీ జీవితం పర్వతసాదృశ్యంగా వుంది. ఐనప్పటికీ జీవితం తన ఇష్టానుసారం సాగుతూంటే, దాని బలిమికి తాను కేవలం నామమాత్రుడుగా లొంగిపోతూ, ఆ ప్రవాహంలో కొట్టుకు పోతున్నాడు. అందుకనే జయ పోషణ విషయంలో కానీ, ఆమె శిక్షణ విషయంలో కానీ తాను ఎక్కువ శ్రద్ధ వహించకుండా, ఇతరులమీద ఆ బాధ్యతల్ని వొప్పించాడు. తాను లలితకు చేసిన అపచారం సంగతి యీ నాడే తెలిసి వొచ్చింది.

# 40

జీవితంలో తనకు అర్థం కాని అనేక కొత్తవిషయాలు యీ నాడు—పుష్కరమయాక కాని తెలిసి రావటం లేదు. జీవితం దారం తెంచుకున్న గాలిపటంవలె పయనించింది: ఆ తెగిన కొస, యీ నాడు లలిత స్వహస్తాలతో తనకు రాసిన ఉత్తరం చదివాక కాని, అందలేదు.

లలిత జీవితాన్ని తారుమారు చేసింది ఒకవిధంగా చూస్తే తనే! ఐతే తాను మాత్రం కావాలని చేశాడా? కేవలం యాదృచ్ఛికంగా అది జరిగి పోయింది. లలిత తనను మనసిచ్చి ప్రేమించింది; ఐతే ఒక్క మాటలో, ఒక్క చేష్టలో కూడా ఆమె తన కావిషయాన్ని సూచించ లేదు. లలిత తన పక్కన ఉన్నట్లయితే సకల ప్రపంచాన్నన్నా జయించే శక్తి సామర్థ్యాలు తనకుండేవి. కేవలం ఒక్క ప్రమాదం జరిగినందువల్లనే తన జీవితం కూడా పర్వతాగ్రం మీది నుండి దొర్లింది.

ఆ లలిత యీ నాడు ప్రపంచంలో లేనప్పటికీ, ఆమె ఒకప్పుడు హృదయపూర్వకంగా తనను ప్రేమించిందన్న సంగతి తన కెంతో ఆనందాన్నిస్తోంది. తాను పొరబడ్డానేమోనని అనుమానించటం కేవలం తన అల్పత్వం. లలిత తన ప్రణయాన్ని అర్పించటమనేది, యీ నాడు సమన్వయ మౌతోంది.

తన నొక మనిషిగా చేసిన ఆ రెండు వ్యక్తిత్వాలూ—అమ్మా, లలితా—యీ నాడు తనకు దూరమై పోయినా, తన సంస్కారం మీద వారి పలుకు బడులు పోలేదు. లలిత తనపట్ల చాలా తల బిరుసుగానూ, లెక్కచేయనట్టు ప్రవర్తించిందంటే ఆమె ప్రణయాన్ని తాను కాల తన్నానని గ్రహించిన స్త్రీ మనస్తత్వమే ప్రతిఫలించింది. ఆమె కందుకు తగిన కారణం వుంది. ఎవ్వరూ అనుకోని ఒకే ఒక్క సంఘటనతో జీవిత స్వరూపాలే తారుమారైనవి.

—మెల్లిగా కళ్లు తెరిచాడు. దూరాన వున్న గోడ గడియారంలో పది దాటింది. తాను చాలా సేపటినుంచీ జీవిత సింహావలోకనం చేసి, జరిగిపోయిన విషయాల నన్నిటినీ కలలుగా కని, ఇప్పుడే వాస్తవిక జీవితంలోకి పడ్డాడు.

చప్పున జయ గుర్తొచ్చింది. ఆమె తనసంసారంలో వేగిపోయి, అలసి, రబ్బరు బొమ్మను రొమ్ములమీద నిద్రపుచ్చుతూ తానుకూడా నిద్ర పోయింది.

*తనకు తల్లీ, లలితా లేదని అనుకున్నది వొట్టి భ్రమ! జయ ఆ తల్లి కాదా? లలితకు ప్రతిరూపం కాదా?*

ఒకనాడు అమ్మ తాను చేస్తున్న చాకిరికి ఋణం తీర్చుకునేందుకు, తన కడుపున పుడతా నన్నది. ఆ మాటలే నిజమైనట్లు, జయ రూపాన ఆమె తనను చేరినట్లు తోచింది. మానవులు యీ ప్రపంచవాసం చాలించినా, వారి సంస్కారాలు, వారి ఉన్నత భావాలు, అనేక రూపాల్లో నిలిచి ఉంటవనేది నిజమైతే, యీ జయ అందు కొక ఆధారం!

ఈ కొత్త తలపు రాగానే జయపట్ల ఆపేక్ష—తాను అమ్మమీదా, లలిత మీదా వర్షించలేని అనురాగం కట్టలు తెంచుకుంది. జయ నిజంగానే తాను కన్న కుమార్తె కన్నా కూడా గొప్పది!

తన జీవితానిక్కూడా జయ ఒక ప్రయోజనాన్ని కల్పించింది. లేనట్లయితే ప్రపంచవిధానాన్ననుసరించి తానుకూడా బతికేవాడు;మృత్యువాత పడేవాడు. నిజంగా మానవత్వాన్ని రుజువు చేసే ఒకే ఒక్క సత్కార్యం కూడా చేసి ఉండేవాడుకాదు. తాను రాసిన సాహిత్యం, కేవలం సాహిత్య రూపంలోనే కొన్నాళ్లుండేదేమో కాని, దాని సారాన్ని తానే జీవితంలో ప్రవేశపెట్టే అవకాశం కూడా ఉండేది కాదు. జయ జీవితాన్ని తీర్చి దిద్దటమే తన జీవితాశయం! అప్పుడే తన తల్లికీ, లలితకూ ఇప్పటి కన్నా న్యాయం చేకూర్చిన వాడౌతాడు.

ఆమె నిద్రకు భంగం రాకుండా మెల్లిగా పక్కమీద జేర్చి, తాను పొందిన అనుభూతులను తలచుకుంటూ, రాజారావు; తన కళ్ళ ముందు జయ ఒక వెలుగుగా రూపొందటాన్ని తలుచుకుంటూ, అత్యంత తృప్తితో పడక కుర్చీలో వాలాడు.

— ఐపోయింది —

ముక్కోటి ఆంధ్రులకు మూడు పత్రికలు

# జ్యోతి

[సచిత్ర కథల పత్రిక]

ఆధునిక సాహిత్యంలోని అన్ని శాఖలూ ప్రతి నెలా ఉంటాయి. సాహిత్య ప్రియులందరూ చదువ తగ్గది.

# అభిసారిక

[వైజ్ఞానిక మాస పత్రిక]

శారీరక, మానసిక శాస్త్ర వ్యాసాలు, వైద్య విజ్ఞానం, ఉత్తమ కథలు, నెలనెలా అందించే ఏకైక మాస పత్రిక.

# చిత్రసీమ

[సినిమా మాస పత్రిక]

సినిమా పరిశ్రమకు సంబంధించిన వార్తలు, వ్యాఖ్యలు, వ్యాసాలు, సాంకేతిక విషయాలు, నటీనటుల జీవిత చరిత్రలు, సచిత్రంగా ప్రకటించే సినిమా పత్రిక.

విడి ప్రతులు 0—8—0 సం॥ చందా 6-0-0

వివరాలకు:

## జ్యోతి కార్యాలయం

మద్రాసు-17.

